# సమర్పణ

అభ్యుదయము అధునాగరికమనే ఆడులో శృంగార శబ్దాడంబర మోజులో సృష్టిలోని ప్రకృతిసిద్ధమైన యదార్థ సత్యాలను యెగరగొట్టి అమాయకులను మభ్యపెట్టుటకు గొంతుచించుకుంటూ కాగితాలను ఖరాబుచేస్తున్నవారికి యెదురునిలిచి అభ్యుదయనిరోధకులుగా పరిహాసాలపాలవుటకయినా వెరువక ప్రకృతిలోని నిగూఢరహస్యాలను, యుగయుగాలకు స్థిరమైన ప్రత్యక్ష పరమసత్యాలను ప్రకటించుటకు కంకణబద్ధులైనవారికి—

పి. రామమూర్తి

## నా మాట

ఈ పుస్తకాన్ని పతితులు అనేపేరుతో ప్రారంభించాను. అర్థభాగం వ్రాశాక 'శిథిలాలయం' అనే నామకరణంచేశాను. పుస్తకరచన పూర్తిఅయ్యాక 'ధర్మదానము' అని నిర్ణయించాను. కాని మిత్రులు 'రక్తసింధూరము' అంటే బావుంటుందన్నారు గనుక స్థిరంజేశాను.

ఒకప్రక్క అస్వస్థత, మరోప్రక్క వూపిరిసలుపని స్టూడియోపనులలో వుంటూకూడా శ్రమయనుకోక అతిఉదారతతో ఆదరంతో యీ పుస్తకాన్ని చదివి తమ పరిచయ వాక్యాలు వ్రాసిపంపిన శ్రీమతి భానుమతీ రామకృష్ణ గారికి హృదయపూర్వక ధన్యవాదాలర్పిస్తున్నాను.

పి. రామమూర్తి

10·7·13
7 4 ·5

3

# అనుక్రమణిక

5

# రక్తసింధూరము

## 1 త్యాగఫలితం

వికసితహృదయానికి విజ్ఞానభరితబుద్ధికి విరాట్‌రూపం లోని వుదాత్తత, త్యాగము ఆహ్లాదాన్నికలిగిస్తూ హత్తుకు పోతవి. ఉదాత్తత త్యాగము మానవహృదయంలో పొంగి పొరలినపుడే మానవపరిపూర్ణత్వం ప్రకటితమవుతుంది. ఉదాత్తత, త్యాగముముకుళించినపుడే పీరత్వం పుట్టిపడుతుంది. పీరత్వంలో సుఖసంపదలు లభ్యమవుట, మధుమయజీవితా న్నందుట సుసాధ్యాలు. ఉదాత్తత త్యాగములో సర్వస్వాన్ని కోల్పోయిఅడుగడుగున యమయాతనలకు గురిగానటంసంభ విస్తుంది. మానవనీతి, ధర్మము, లక్ష్యాలు, ఆశయాలు అనే హారాలను ధరించిన సాధుహృదయాలు వుదాత్తత, త్యాగా లకు వూటబావులులాంటివి. వారు త్యాగాలతో కల్పించు కున్న నరకబాధలలోకూడా మానసికానందాన్ని, తృప్తిని పొందగలుగుతారు. సామాన్యహృదయాల కది సాధ్యమైన సాధనకాదు. కాని, అమృతభరితమైన సంగీతంవలె అది అన్నిహృదయాలను ఆకర్షింపజేస్తుంది, కరిగిస్తుంది, కన్నీను కార్పిస్తుంది. అలాంటి త్యాగనిధియైన ప్రసాద్ తన సర్వ స్వాన్ని కోల్పోయి జ్ఞానాన్ని మరచి, సుఖసౌభాగ్యాలను విడచి నాగరికాన్ని కాలదన్ని, నేడు విరాగిరూపంలో తనలో తానే తన్మయుడవుతూ, చిరునగవును చిలికించుకుంటూ,

మర్మరధ్వనిని ప్రకటించుకుంటూ, కుప్పిగంతులు వేసుకుంటూ ధూళిధూసరితమై చిరిగి చీలికలై దుర్గంధాన్ని విరజిమ్ము దుస్తులతోను, జడిగాడ్పులకు రేగిన జీబును మరపించు శిరోజాలతోను జడలుగట్టుకున్న గడ్డముతోను తప్పటడుగులు వేసుకుంటూ అనంతఆకాశాన్ని చూసి విస్తుపోతూ, పృథ్వీమాతను చూసి పరిహాసించుకుంటూ, తనపై రాళ్ళను రువ్వుతూ కేరింతలుకొడుతూ వెంటాడు బాలసమూహానికి ఆహ్లాదాన్ని కల్పిస్తూ, వారు తనను పిచ్చివాడని కేకలుపెడుతున్నపుడు, యీ లోకమే పిచ్చిదో తానే పిచ్చివాడో అర్థంకాక వికటాట్టహాసంతో నవ్వుతూ పయనిస్తున్నాడు. తన ప్రయాణానికి గమ్యమంటూ లేదు. తిరిగినరోడ్లమీదే తిరుగుతుంటాడు. రాళ్ళతో వెంటాడిన పసివారే తిరిగి వెంటాడి, మనోరంజనను తనివితీర పొందుతుంటారు. తాను ఆ పేట అంతటికీ చిరపరిచితమైన పిచ్చివాడు. పిచ్చివాడనే తన పేరు అందరికీ పరిచితం. ఆయన అసలు పేరు యీ ప్రసిద్ధ నామధేయంముందు మరుగునపడిపోయింది. ఆక్సఫర్డు యూనివర్సిటీలో సాహిత్యమందు డాక్టరేట్ బిరుదాన్ని పొందిన శివప్రసాదే యీ పిచ్చివాడు అంటే యెవరు విశ్వసించగలరు? ఆ చెప్పేవారినికూడా పిచ్చివారని గోలపెట్టి క్షణంలో చుట్టుముట్టి పిచ్చివారినిచేయగలరు. ఆరోజుల్లో ఆయనశీలానికి, యోగ్యతకి, సమాలోచనశక్తికి మెచ్చి ఆక్సఫర్డుయూనివర్సిటీవారు బహుమతులనిచ్చారని చెబితే, యీనాడెవరు నమ్ముతారు? కాలచక్రగతిలో అభివృద్ధి యెంత తథ్యమైందో వినాశంకూడా అంతే యదార్థమైంది.

7

# 2 దొంగపిల్ల

శివప్రసాద్ విజయపురి యశపాల్ కాలేజీలో ప్రొఫెసర్. పెద్దపెద్ద డిగ్రీలుపొంది లండనునుంచి వచ్చిన పుడు ఆయన ఏదో గొప్పపదవిని పొందుతాడని అందరూ వూహించారు. ఏవుద్దేశ్యంతో, కాంక్షలతో ఆయన్ను సీమదేశం పంపాడో, ఆ తండ్రి తనబిడ్డ తిరిగిరాకముందే పర లోకవారంటుమీద పయనమయిపోయాడు. దేశాంతరాన వున్న తనను పితృవియోగబాధ విచలితుని జేసింది. తత్ఫ లితంగానే జీవితానికి నిర్దిష్టకార్యక్రమమంటూ నిర్ణయించు కోలేకపోయాడు. రాజకీయపార్టీలు అందలియెత్తులు జిత్తులు తనకు నచ్చవు. కాని ప్రజారంగంలో పనిచేయాలని వాంఛ. నిస్వార్థ కర్మిష్టిగా పనిచేసే రామకృష్ణమిషన్ తనను ఒక విధంగా ఆకర్షించింది. కాని అందుకూడా తనకు విపులంగా అర్థంగాని సంకుచితాలేవో తనను కొంత చీకాకుపరిచేవి. ఆ తరువాత యశ్‌పాల్‌కాలేజీలో ప్రొఫెసర్‌గా ప్రవేశిం చారు. కాని అంతటితోనే తృప్తిజెందేస్వభావంగాదు. థియ సాఫికల్‌సొసయిటీలో సభ్యుడుగా జేరి, అందు ప్రాముఖ్యాన్ని పొందాడు. ఇక అవివాహితుడుగానే వుండిపోతాడేమోనని కూడా బంధువర్గం శంకిస్తున్నది. న్యూయార్కులో జరిగిన అంతర్జాతీయ థియసాఫికల్ మహాసభలకు హాజరయిన శివ ప్రసాద్ విమానప్రయాణంచేసి, హైదరాబాద్‌లో దిగి, విజ యపురికి టాక్సీలో పయనిస్తున్నాడు.

సంధ్యాసమయ మది. దివాకరుడు పశ్చిమహద్దులను పునీతంచేస్తున్నాడు. దినమెల్ల తీక్ష్ణశ్వేతదృక్కులతో పయనించినవిసుగుతో గాబోలు గేవారంగు సులోచనాలను ధరించి, ప్రపంచాన్ని శీతలదృక్కులతో పరికిస్తున్నాడు. తరంగాలతో నిండిన సాగరంవలె దొంతరలుదొంతరలుగా సజ్జింపబడినదానివలెవున్న మేఘగుచ్ఛాలతో నిండిన దిగంతం కెంపురంగుతో పులకితమవుతున్నది. బహువర్ణశోభితమైన ప్రకృతివక్షస్సులో దినకరుని నూత్నధారితదృక్కులు దూరి పునీతంజేస్తున్నవి. శ్యామల గిరిశృంగాలమీద నర్తిస్తున్న ఆ వసంతక్రీడలు ఆత్మగ్లానినికలిగిస్తున్నవి.సమానత్వము,సౌభ్రాతృత్వము అనే భావనలను యీ పామరులు మరువకుండునట్లు గుర్తుజేయుతలంపుతో గాబోలు, నిత్యమూ తన ఆఖరి క్షణాలలో అన్నిరంగులను తనరంగులోముంచి ఏకరంగును ప్రకటితపరుస్తుంటాడు దివాకరుడు. శీతల మలయమారుత పవనాలను కోసుకుంటూ పోతున్నది కారు.

విజయపురి యింకెంతోదూరం లేదు. అది పెద్ద గ్రామము. హైదాబాద్‌నుంచి విజయపురికి వెళుతున్న బస్సు ఆగివుంది. ప్రక్కన పెద్దసమూహం ఏదో వినోదాన్ని తిలకిస్తున్నది. జనంమధ్య పోలీసుపగడలు కనిపిస్తున్నవి. ఇంతసేపూ ప్రకృతిసౌందర్యంలో మునిగి అంతర్గత ఆనందంలో పయనిస్తూవచ్చిన శివప్రసాద్‌కు యీ దృశ్య మేదో మనోరంజనను గల్పించింది. కారును ఆపించాడు. ఆఫీసరన్న ఆదుర్దాలో పోలీసువారు గుమిగూడిన ప్రేక్షకులను వేరుజేసి,ఒక బాలికను, ఒకచిన్నడబ్బాను కారుముందు హాజరుపర్చారు.

శివప్రసాద్:- ఎవరీ అమ్మాయి?

ఒకపోలీసు:- మహా దొంగముండ సార్; అనేకమార్లు పట్టుకున్నాము. రెండుసార్లు జైలుకుకూడా వెళ్ళి వచ్చింది. ఆ డబ్బా చూడండి, రెండువీశల నల్లమందున్నది.

శివప్రసాద్:- వాళ్ళవారెవరూ లేరా?

పోలీసు:- లేరండి, ఎప్పుడూ యీ పిల్ల ఒక్కతే వస్తుంటుంది.

ఆమెచూపులో దైన్యత గనిపిస్తున్నదిగాని, అశ్రువులు ఒలుకుటలేదు. ఆదుర్దా భయకంపనవిహ్వాలత ఆమెముఖంలో అసలేలేవు. సిగ్గుతెరమాత్రం రెప్పపాటు ఆభాసగా కనిపించి మాయమైంది. దుస్తులు చినిగి చీలికలైపోవునరకు మార్చు అలవాటులేదు గాబోలు, పేరిన మురికి మాగి దుర్గంధాన్ని గుబాళిస్తున్నవి. ముదుగు సింధూరపురంగులోనున్న ఆమె పావడా చిన్నిపట్టు ధూళి స్వేదమేళనంలో మాగి నలుపు రంగులోచేరి దళసరి హెచ్చింది. తైలసంస్కారంలేక అస్తవ్యస్తంగావుండి కొనలను జబరైన నూలుతాడుద్వారా బంధించబడి జీబుగా రేగివున్న శిరోజాలు. ఆ కుచుల రూపు రేఖలనుబట్టి కొన్నివందలుగాదు, వేలే పేలు స్థావరాలు జేసుకునివుంటవి. ఆమెచాయ అచ్చమైన పసిడిరంగు. శిశిరఋతువులోని మంచులోమునిగి మెరుపులుగ్రక్కుతున్న దబ్బపండునుచూచి, సృష్టి నోర్చజాలక చెట్టునుంచి వేరుజేసి తృప్తిజెందక హోరుగాలిని గల్పించి, ధూళిలోముంచి విడువబడిన దబ్బపండువలె, నివురుగప్పిన నిప్పునుబోలె అంతర్గత

లావణ్యం ప్రస్ఫుటమవుచున్నది. తీర్చిదిద్దిన ముఖమండలం. బాగా పరికించినపుడు యుక్తవయస్సు ముఖంలో చిందిస్తుంటుంది. ఆ రంగూ, ఆకృతీ, ధారణా కాశ్మీరు ముస్లింయువతిని స్మృతికిదెస్తున్నవి. ముఖం కోలగా మృదువుగా తమలచిగురు టాకుఆకారంలోవుంది. జన్మతః వున్నఆమెఅందాన్ని చిన్న బుచ్చినట్లవుతుందనో యేమో ఏ ఖనిజాలతోనూ ఎక్కడా అలంకరింపబడలేదు. జన్మలోని సుకుమారతను నవనవత్వాన్ని ప్రస్ఫుటంజేస్తున్న ఆ హస్తాలుకూడా దిగంబరంగానే వున్నవి. ఆమె పావడా ధరించివుండకపోతే, నూతనంగా తన అస్తిత్వతను ప్రకటించుకోను వుబుకుతున్న వక్షోజవస్త్రాలు లేకపోతే స్త్రీగా యెవరూ వూహించలేరు.

అమాయకంగా నిర్లిప్తంగా చూస్తున్న ఆమెదృష్టి తనవైపు మరలినపుడు శివప్రసాద్ కేదో అర్థంగానిబాధ కలుగుతున్నది. ఇంత చిన్నవయస్సులోనే లజ్జాభిమానాలను కోల్పోయి, పసులవినోదానికి వింతజీవిగా కావలసిన అవుసరమేమికలిగిందో ఆయనవూహకు తోచటంలేదు. లజ్జాభిమానాల భీతి వెరవు ఆమెలో అంతరించినట్లు, దొంగతనం ఆమెకు మామూలుకార్యక్రమమయినట్లు ఆమెప్రవర్తన ద్వారా ప్రకటితమవుతున్నవిషయం ఆయన్ను మరింత విచలితుని జేస్తున్నది.

"ఆ అమ్మాయిపేరేమిటి?" అని ప్రశ్నించాడు శివప్రసాద్.

"సూర్జహానండి; దీనిపేరు బాగా ప్రచలితమైందే" అని మామూలుధోరణిలో జవాబిచ్చాడు పోలీసు.

ఆపేరు విన్నపుడు శివప్రసాద్ మనస్సు కొంత తేలిక పడింది. ఈ నిర్లజ్జ నికృష్టం తనజాతికి చెందదని కాబోలు. జాతివిలువ తెలుసుకోగలిగినవానికి అంతకుమించిన మానవ విలువ అతీతమయిందిగాదు. వివేకిని విజ్ఞానం వెంటాడుతుం టుంది. విజ్ఞానంలో మునిగినపుడు తనంతటతానే లోక కల్యాణకాంక్షమీద హోమానిచ్చి ఆతరువాత విలపించ టం పరిపాటి.

తన కర్తవ్యం పెరిగినట్లు హృదయభారంతో సూర్జ హాన్‌ను తదేకంగా గమనిస్తూ, కానిస్టేబిలును దగ్గరకుపిలిచి, "నన్ను మీరు ఎవరోఅని ఊహించివుంటారు. కాని నేను యశ్‌పాల్ కాలేజీలో ప్రొఫెసర్‌ని. నా పేరు శివప్రసాద్. మీరు నన్నువిశ్వసిస్తే నా జామీనుమీద ఆ బాలికను విడిచి పెట్టండి. నేను కోర్టులో హాజరుపర్చి, కోర్టువారు విధించు జుర్మానా నేను చెల్లిస్తాను. ఇకమీదట ఆ బాలిక అలాంటి కార్యాలకు పోకుండావుండే సదుపాయంచూస్తాను" అని అడిగాడు శివప్రసాద్. అందుకు పోలీసువారు సమ్మతించారు.

శివప్రసాద్ మధ్యతరగతిలో వున్నతకుటుంబానికి చెందినవాడు. ఆ కుటుంబంలో అయిదారుతరాలనుంచి సంపాదించినవారెవరూ లేరు. వున్నఆస్తిని పోగొట్టినవారూ లేరు. సంవత్సరానికి ఏడువేల నిఖరాదాయం వస్తుంది. విశాలమైన మండువాలోగిలి, ఆ యెదురుగుండాను, పక్కల గోశాలలు, వాములదొడ్లు, ఈ అంతటిని చుట్టి కోటప్రాకా రాలలాంటిగోడలు వున్నవి. ఆ పురాతనభవనం యెత్తయిన ...టిమీాద నిర్మించబడివుంది. తూర్పువైపునయింటిపాడపు...

వెడల్పయిన అరుగులు, ఆతరువాత వసారా వున్నవి. ఈ యింటిలోని అధికారమంతా శివప్రసాద్ మేనత్త గంగా భవానిఅధీనంలో నున్నది. ఆమెఅధికారం ఆ యింటిలోనే కాదు, పొలంలోను తోటలోకూడా సాగుతుంటుంది. ఆమె యింటిలోకూర్చుని పొలంలోనిపనులను పంటలను అంచ నాలువేసి నడుపగలుగుతుంది. ఆమె చిన్నతనంలోనే భర్తను కోల్పోయి అన్న చెంతకు జేరి జీవితంలోరెండుజాములను దాటించి, మూడోజాములో నున్నది. విధవలకు దేవుని యెడల భక్తి, పూజలయెడ శ్రద్ధ, ఆచారాలపట్ల విశ్వాసము వుండుట సామాన్యము. అందు గంగాభవాని విశిష్ట ఆధి క్యత పొందింది. ప్రచండ తుఫానువీస్తున్నా, కృష్ణానది భయంకర వరదపొంగులతో భీకరరూపాన్నిదాల్చి వికటాట్ట హాసంచేస్తున్నా ఆమె పూజాపాటవంలో రవంతలోపంకూడా కలుగకుండా నిత్యమూనలె వేకువఝామున కృష్ణానదిలో మునగవలసిందే. నదివొడ్డుననున్న నీలకంఠస్వామిఆలయ ప్రదక్షిణ చేయవలసిందే. ఇంటిలోని పూజాగదిలో నిష్ట వేసి, యిష్టదేవజపం అరగంటకుతక్కువగాకుండా సలుపవల సిందే. ఆమెపూజాగది దేవిదేవులపటాలతో విరాజిల్లుతుంది. అందుప్రతిష్టింపబడివున్న రాధాకృష్ణులసేవాభారం తనతండ్రి నుంచి తాను పొందింది. ఆ దేవులముందు తననుతాను మర్చి సమయం తెలియకుండా గంటలతరబడి స్తోత్రంలోవుంటుంది. ఆ గదిలోని పూదువత్తుల కర్పూరహారతుల పరిమళాలు యింటినంతటిని ముంచుతుంటవి. నిష్టలోని ఆమెరూపం చండప్రచండమైంది.

శివప్రసాద్ ఎడల ఆమెకు అవ్యాజమైన అనురాగ ముంది. అతనిసుశీలత్వానికి, వినయవిధేయతలకు, హృదయ సుకుమారతకు ముగ్ధురాలవుతూవుంటుంది. ఒకప్రక్క దేవ పూజ మరోప్రక్క శివప్రసాద్ మంచిచెబ్బరలే ఆమెమనస్సుకు ప్రధానకార్యక్రమాలు. ఆయనకు వివాహంచేసి, తనశిరస్సు ననున్న భారాన్ని నవవధువుభుజస్కంధాలమీద మోపి, తను పూజాగదిలోని తన రాధాకృష్ణులపూజలో శేషజీవితాన్ని గడుపాలని ఆమెవాంఛితాభిప్రాయం. తమతో సరితూగు కులీనసంబంధాల నెన్నిటినో, సంప్రదింపులుజరిపి, శివప్రసాద్ ముందు ప్రస్తావించింది.

"*అమ్మా, బంధనమయజీవితం సామాన్యమైనదే. స్వేచ్ఛాజీవిగావుంటూ, ఏదైనా అన్వేషణచేయాలని నా తలంపు. ఒకవేళ నాద్వారా ఏకార్యమూ సాధింపబడక పోయినా, చీకూచింతా లేని సుఖమయజీవితాన్ని గడుపగలను గదా." అన్నాడు శివప్రసాద్.

నీవు వెర్రివాడివిరా నాయనా; వివాహమంటే పారి పోయి సుఖాన్ని వెతకటం పిచ్చితనం. భగవంతుడు బాగా చూస్తే వివాహంలోనే ఆనందమయజీవితముంది" అని ఆమె అన్నది.

ఇలాంటి వాదవివాదాలు వారిమధ్యలోనూ తరచుగా చెలరేగుచుండేవి. వింటున్న నౌకర్లకుకూడా ఆ సంభాష ణలు వినోదాన్ని కల్పిస్తుండేవి.

---

* అత్తను అమ్మా అనటం శివప్రసాద్‌కు అలవాటు

టాక్సీవచ్చి యింటిముందు ఆగింది. పొంగుతూన్న ఆనందంతో గంగాభవాని పేరుపేరున నౌకర్లందరినీ కేకలు పెడుతున్నది. గోశాలనుంచికూడా పరువులెత్తుకుంటూవచ్చి ఒక్కమాటుగా అయిదారుగురునౌకర్లు కారుముందు హాజరయ్యారు, ఒక బెడ్డింగు, సూట్‌కేసుతీయను. భవాని యెదురు రావటం అశుభంగా తలంచి వసారాలో పక్కనుండి,ఆదుర్దా పెడుతున్న ఆనందాన్ని అణచుకున్నది. దళితరూపంలోని నూర్జహాన్ కారునుంచి దిగినపుడు అయోమయంతో భవాని ముఖం వెలవెలబోతున్నది.

అనాలోచితంగా శివప్రసాద్ ఆమెను యింతవరకు తీసుకురాగలిగాడుగాని, ఎదుట ప్రత్యక్షమయిన సిష్టనీమాలతోగూడిన తల్లిని జూచినపుడు, అతనిహృదయం కలవరపడుతున్నది. నూర్జహాన్‌ను కారువద్దనే వుంచి, తాను సరసర యింటిలోప్రవేశించి భవానీనిపిలిచి "అమ్మా, నీకు తెలియకుండా నేనొకసాహసంచేశాను. ఈబాలికయెవరో అనాథ, పెద్దబాధలలో వున్నందున నాకు యేమీ తోచక తీసుకొచ్చాను." అని ఏదో అస్పష్టంగా అన్నాడు శివప్రసాద్.

"శివం! నీవు యింకా పసివాడివై పోతున్నావు. ఎవరో తెలియకుండా, ఏమిటో అర్థంజేసుకోకుండా యుక్తవయస్సువచ్చిన ఆ బిచ్చగత్తెను వెంటతీసుకురావటం యెంత అపరాధమో నీకు తెలియదు. చాలా పొరపాటుచేశావు" అన్నది భవానీ.

"నే నంతగా ఆలోచించే అవకాశంలేకపోయిందమ్మా; నేను ఆమెను విచారించి నిర్ణయంచేసి తీసుకు

రావటం జరుగలేదు. ఆవిడదీనత్వాన్ని చూచినప్పుడు ఆకస్మికంగా నా మనస్సుకుతోచి, ఆవెంటనే తీసుకొచ్చాను. ఆవిడకి ఏదయినా సహాయంజేసి పంపుదాము. అంతవరకు వుంచుమందాము" అన్నాడు.

తన వాత్సల్యాలను చూరగొన్న శివప్రసాద్ ప్రస్తావనను భవానీ నిరోధించలేకపోయింది; కాని తనమనస్సునేదో అప్రస్తుతమైన ఆందోళన చీకాకుపరుస్తున్నది.

ఒక్కరోజులోనే సూర్జహాన్‌స్థితి పూర్తిగా మారిపోయింది. ఎన్ని కుంకుళ్ళు, సబ్బులు అరిగినవోగాని, వికసించీ వికసించని రోజామొగ్గవలె పక్వానికివచ్చీరాని దోరజామపండువలె, మసకమసక మబ్బులలో దాగుడుమూతలాడు జాబిలివలె జన్మతఃపొందిన లావణ్యాన్ని చిందింపజేస్తున్నది. నిన్న మురికిటపాసాలతో కారులోవచ్చిన బిచ్చగత్తె యీమే అంటే యెవరూ విశ్వసించరు. ఈమెరూపు రేఖలలో దేవతలు స్ఫురిస్తున్నారు. తొంగిచూస్తున్న ఆ యవనత్వంలో అయస్కాంతపుఆకర్షణవలె చిమచిమలాడిస్తున్నది. ఆ యింటిలో శివప్రసాద్‌చిన్నతనంలో గతించిన ఆయనతల్లితోనే చీరలు అంతర్థానమయినవి. అదేకారణంగా ఆమె శివప్రసాద్ గ్లాస్కోధోవతి ఆయన యలాస్టిక్‌బనియను ధరించవలసివచ్చింది. ఆ తెల్లటిదుస్తులు ఆమెకు మరింత శోభనిస్తూ పొరపాటుగా స్వర్గలోకంనుంచి దిగివచ్చిన అప్సరసవలె రాణిస్తున్నది. ఈ దుస్తులుధరించిన ఆమెను చూచి శివప్రసాద్ కూడా ఆశ్చర్యాన్వితుడయ్యాడు. ఈమెలోని యింత సుకు

మారత్వం, అపరూపసౌందర్యం ఆ మురికిగుడ్డలలో యెలా దాగివున్నదా అనుకుంటున్నాడు.

భగవంతుడు కొందరిని కేవలం దురదృష్టవంతులుగా పుట్టించి, బాధలను వ్యధలను వారిభుజస్కంధాలమీద వదిలి, వారుపడుతున్న బాధలను ఆలోకంనుంచి వినోదిస్తుంటాడు. పొరపాటుగా కదాచిత్‌గా ఆ దురదృష్టవంతులకు ఆనందం సంప్రాప్తమైనపుడు ఓర్చుజాలక వెంటనే వారిని కూలదోసి పరిహసిస్తూ ఆనందపడుతుంటాడు. దాన్నే భగవద్చిద్విలాసమంటారు. అలాంటి భగవంతుడు నూర్జహాను అలా ఆనందంలో వుండనివ్వగలడా?

నూర్జహాన్ ముస్లింబాలిక అని, ఆమె కాశ్మీరునుంచి రాబడిన కాందిశీకకుటుంబాలలోని ఒక గర్భదరిద్రకుటుంబానికిచెందినదని, జీవనభృతికి బాధపడుతూ ఒక్కొక్కపట్టణాన్ని పరిశోధించుకుంటూ ఆఖరుకు హైద్రాబాద్ జేరిన మూడుసంవత్సరాలలోపల ఆమెను యీ పృథ్విమీద ఏకాకిగా గర్భదరిద్రురాలుగా విడచి, తలిదండ్రులు ఒకరితరువాత ఒకరుగా యీలోకంనుంచి పయనమైపోయారని, అప్పటికి ఆమెవయస్సు 7 సంవత్సరాలని, అప్పటినుంచి కాందిశీకుల లోని ఒకకుటుంబంవారి ఆదరంతో, వారియింటిలోనే వుంటూ, వారిస్తున్నభోజనానికి ప్రతిగా వారుచెప్పినట్లు యీ నల్లమందును చేరవేయు వ్యాపారంచేస్తున్నదని, ఈ సందర్భాలలోనే అనేకమారులు పట్టుబడిందని, ఆ పట్టుకున్న పోలీసువారు మహమ్మదీయులయినందున తన కరుణగాథ విని, కొన్నిమారులు విడిచిపెట్టారని, మరికొన్నిమారులు

డబ్బుతో తన సంరక్షకకుటుంబీకులు విడిపించారని, రెండు మారులు జైలుకువెళ్ళటంకూడా జరిగిందని, మొదలగు వినరాలు భవానీకి తెలిసినపుడు, ఆమె తనజన్మలో యెన్నడూ యెరుగనంత వుగ్రురాలయింది. సింహగర్జనలతో పరవళ్ళు తొక్కింది. తన ఏడుతరాలవారికులం భ్రష్టమయినట్లు, చేసిన పూజలు వ్యర్థమైనట్లు విలపిస్తున్నది. ఆమె ఒకప్రక్క క్రోధావేశాలతో నిందించటం, మరోప్రక్క పెద్దపెట్టున విలపించటం గాంచినపుడు, శివప్రసాద్ భయకంపితుడయ్యాడు. తన బ్రాహ్మణీకంమీద విశ్వాసమూ లేదు, అభిమానమూ లేదు. కాని తనను తల్లివలె పెంచి తన సుఖాన్ని అభివృద్ధిని కాంక్షిస్తున్న భవానీదుఃఖాన్ని భరించలేకపోతున్నాడు. పొరపాటుగా అపరాధంచేసిన బాలకునివలె భీతిజెందుచున్నాడు. కాని నూర్జహాను వైపు తిరిగినపుడు సిగ్గు జాలి అభిమానాలతో క్రుంగిపోతున్నాడు.

అపరాధాలకు పాపాలకు పరిహారమార్గాలుకూడా ఆ పూజాపాటగ్రంథాలలోనే గొప్పగా వివరించియున్నవి. పూజలుచేసి పుణ్యంసంపాదించుకునే భక్తులు పరిహారమార్గాలను ముందే తెలుసుకునివుంటారు. భవానీ పనివాళ్ళందరినీ పిలిచి గోపంచితంతో యింటినంతటిని తుడిపించింది. కృష్ణాజలంతో నేలను గోడలనేగాదు, కప్పుకూడా కడిగించింది. గోపంచితము, ఆతరువాత గంధకము కలిపి కడిగించినా, ఆమెమనస్సుకు వూరటకలుగలేదు. వుదయం ప్రారంభించిన పనివారు సాయంకాలంవరకు పోస్తూనేవున్నారు. ఇంటిని కడిగిననీరు చిన్న ప్రవాహంగా తయారయి, తిరిగి, ఈ

కలుషితాలన్నిటిని దిగమ్రింగే ఆ కృష్ణమ్మతల్లి గర్భంలో కలుస్తున్నవి. అంతటా చందనము పసుపు కలిపిననీటితో ఆఖరిమాటుగా పరిశుభ్రపర్చబడింది. భవానీ తన పూజా గదిని తనస్వహస్తాలతో శుద్ధిచేసుకుని, పచ్చిగంగకూడా ముట్టకుండా పూజలోకూర్చున్నది. రెండోరోజుకూడా ఆమె పూజాపీఠంనుంచి లేవలేదు.

ఈ చీత్కారాలకు ధూత్కారాలకు దూషణలకు అలవాటుపడి అనుభవంపొందిన నూర్జహాన్ నిర్విణ్ణురాలయి, ఇంటిలోనుంచి బయటకు వచ్చి ప్రహరీగోడప్రక్క నున్న వృక్షచాయల జేరి నిలిచింది. శివప్రసాద్ చిక్కు సంకటంలోపడి, ఆకాశవీథిలో విహరిస్తూ, ఆకస్మికంగా చెడిపోయిన విమానంస్టీరింగు చేతబట్టివున్న పైలెట్‌వలె అధీనుడై ఆఖరివినతిగా భగవంతుని ప్రార్థిస్తున్నాడు-'భగవాన్, నీవు యింత జటిలపరీక్షలో నిలిపితే, నాబోటివానికి సాధ్యమా ! అర్భకుడిని, కఠినంగా యెటూ ప్రవర్తింపజాలని వాడిని. మాతృవాత్సల్యాన్ని చవిజూపిన అత్తను దుఃఖపెట్ట జాలను; నా జాలిని కోరగొన్న అనాథబాలికను నిరాధారం చేయజాలకపోతున్నాను' అంటూ తానూ బైట నూర్జహాను న్నచోటికే వెళ్ళి అనభిజ్ఞునివలె వేచివున్నాడు.

భవానీనిష్టలోని పూజ విశిష్టరూపంలో అవిరామంగా సాగుతున్నపుడు మరోవుపాయంలేక గోశాలలోని సామాన్ల గదిలో వుండమని నూర్జహాన్‌ను కోరాడు. నూర్జహాను బాల్యావస్థలోనున్న తన చిన్నవయస్సులోనే అవమానాల మోసేఅలవాటు బాగా పొందినటువంటిది. కాని తనకోర

కని ఒక నవనాగరికుడు గొప్పవంశీకుడు పడుతున్న బాధ తన కర్థంగానివ్యథను కల్పిస్తున్నది. ఆమెజీవితమే ఆమెకు— తనచిన్నిమనస్సుకు వూహతెలిసినప్పటినుంచి అర్థంగాని సమస్య. నేడు తనకు లభ్యమైన గోశాలలోనిగదకూడా గొప్ప గౌరవసూచకమైందే.

భవానీపూజ రెండోరోజుకూడా నిరాటంకంగానే జరిగిపోయింది. శివప్రసాద్ యింత దీర్ఘమైన మనోవ్యథను యిదివరకెన్నడూ వూహించికూడా యెరుగడు. తనయెడల భవానీ యెన్నడూ యింత క్రుద్ధురాలుకానూలేదు. తన కిపుడు భరింపరానిభారంతో మనస్సు క్రుంగిపోతున్నది. పూజాగదిలో యెన్నడూ కాలుమోపని తాను నేడు అనాలోచితంగా ప్రవేశించి, రాధాశ్యాములకు భవానీకి మధ్య మోకరిల్లి శిరస్సును పృథ్వీమాతకు మోది ఏదో అస్పష్టమైనమాటలు అంటూ ఆపజాలని దుఃఖావేశాన్ని వొంతరలుగా ఆక్రందనరూపంలో స్పష్టంచేస్తున్నాడు. భవానీ వులికిపాటుచెంది కనులుతెరచినపుడు కనిపించిన దృశ్యంతో, దేవుడే సాక్షాత్ తనముందు మోకరిల్లినట్లు విభ్రాంతి మనస్కురాలై శివప్రసాద్‌శిరస్సును తనఒడిలోకి లాక్కొని ముద్దుకుంటూ అదురుతున్నఅధరాలతో "ఇంతపని ఎందుకు చేశావు పిచ్చితండ్రీ! మన కులంగాదు, మతంగాదు. స్పష్టమైన ఒక మ్లేచ్ఛబాలికను వెంటదీసుకొచ్చి, ఇహాపరలోకాలను మంటగలిపావు" అంటూ అశ్రుస్రవంతిని వొలికించింది.

శివప్రసాద్ తనశిరస్సును భవానీపాదపద్మాలమీద

వుంచి నొక్కుతూ "అమ్మా, సహజజనితములైన దయ, షమకారము, జాలి, ఆదరాలద్వారా పోయే కులమతాల గురించి నేను బాధపడటంలేదు. మీ మనస్సు కింత నొప్పి కలిగించినందుకు విచారపడుతున్నాను. ఈ పృథ్విలోని సర్వ ప్రాణులను ఒకదేవుడే సృష్టించటం రక్షించటం జరుగుతుందిగాని, హిందువులను ఒకదేవుడు, మహమ్మదీయులను మరోదేవుడు, క్రైస్తవులను వేరొకదేవుడు రక్షిస్తాడనుకోవడం హాస్యాస్పదం అమ్మా, లోకానికంతటికీ దేవుడు ఒకడేనన్నది నగ్నసత్యం. ఏదిఏమయినా నీముందు తర్కించటం నేను చేయజాలనిది. ఏరూపంలోనూ నీమనస్సు కింత కష్టాన్ని కలిగించటం నాకు సహ్యంగానిది. నన్ను క్షమించు అమ్మా. నాకిచ్చిన యీశిక్ష అపరాధంకంటె మించినటునంటిది. రెండురోజులనుంచీ నీవు పూజలో నన్ను మర్చిపోయావు. ఈ రెండురోజులనుంచీ నీతోపాటు నేను కూడా నిద్రాహారాలులేకుండానే వున్నాను. నా శరీరం కంపిస్తున్నది, హృదయఫలకం వూగిపోతున్నది, నేత్రాలు పీక్కుపోతున్నవి, పట్టుదప్పుతున్నవి, కర్ణరంధ్రాలు ప్రతిధ్వనిస్తున్నవి, శిరస్సు దిమ్మెత్తిపోతున్నది" అని కంపిస్తున్నకంఠంతో బరువుగా అన్నాడు.

"శివం, దేవునిగురించిన నిర్వచన నీనోటితో— అలా యివ్వబోకు తండ్రీ. ఏరూపంలో విశ్వసించి కొలిచేవానికి ఆరూపంనుంచే భగవంతుడు ముక్తిని ప్రసాదిస్తాడని, అన్ని రూపాలలోను ఆయనఅస్థిత్వం వుంటుందని, కాని ముక్తికి ఏకాగ్రనిష్ట ఏకస్తోత్రము ప్రధానమని మా నాన్నగారనే

వాడు. మనము ఏరూపంలోని దేవుళ్లను దేవతలను విశ్వసిస్తామో ఆ దేవుళ్లు దేవతలనే పరిహసించేవాళ్లు మనకు మ్లేచ్ఛులు. వారిని మనంఆదరించటం మనదేవవిశ్వాసంలోని అల్పత్వాన్ని తెలియజేస్తుంది. ఏదిఏమయినా నిన్ను యింతగా బాధించటం నా అభిమతంగాదు! పద తండ్రీ" అంటూ దయార్ద్రకంఠంతో, శివప్రసాద్‌శిరస్సునుబట్టి లేవనెత్తి, తనహృదయానికి అదుముకుంటూ ఒక పెద్ద తాపంతో గూడిన శ్వాసవిడచింది.

భవానీ రెండురోజుల నిరసనవ్రతంతో ఏకాగ్ర పూజతో జరిగిన పాపానికి పరిహారం చెల్లించినట్లు, దుర్ఘటన జరుగనట్లు శివప్రసాద్‌ను చెంతగూర్చుండబెట్టి పాలు త్రాగించింది.

సమస్యలలోని జటిలతను, పరిష్కారంగాని చిక్కులను, అర్థంగాని అంతరాత్మలోని అపశృతులను సమయం సరిదిద్దుతుంటుంది. నూర్జహాన్ గోశాలగదిలో స్థిరపడిపోయింది. స్త్రీహృదయం లేతప్రాయంలోనే వికసిస్తుంది; వివేకం జనిస్తుంది. మంచిసెబ్బరలను గ్రహించేశక్తిని పొందుతుంది. తనద్వారా శివప్రసాద్‌లాంటి యోగ్యుడు బాధలు పొందటం నూర్జహాన్ కిష్టములేదు. శివప్రసాద్‌కు భవానీకి మధ్య తప్పటుండునలె నిలచుట తనకిష్టంలేదు. స్థిరపడి ఆనందమయజీవితాన్ని అనుభవించటం తనఅలవాటుకు విరుద్ధంకూడాను. అందువల్లనే నూర్జహాను వెళ్లిపోవాలని శివప్రసాద్‌ను ఎన్నోమారులు ప్రార్థించింది.

నూర్జహాన్:- బాబూజీ, నేను జన్మంతః హీనురాలను,

దీనురాలను. దరిద్రము, నీచత్వం, దుష్టత్వం, అవినీతి పుగ్గుబాలుగా గ్రోలినదానిని. అవే నా పిత్రార్జితాలు. మీరు వేటినిచూసి హేయపడతారో అవి నాకు సుఖప్రద మైనవి. ఏవి మీకు బాధాకరంగా కనిపిస్తనో అవి నాకు ఆనందమైనవి. ఎక్కడ మీరు సిగ్గిలుతారో అక్కడ నేను గర్వపడతాను. దొంగతనము మీకు హేయమైంది, నాకు వీరోచితమైంది. నా పరిస్థితులు నన్నిలా పెంచుకొచ్చినవి. కనుక నన్ను గురించి మీరు విచారపడి జాలిజెందకండి. ప్రశాంతవాతావరణంలోనున్న మీకు మీ అమ్మగారికి మధ్య నేను దుర్గంధపూరిత అఘాతంగా జేరి, మీకు నొప్పికలిగించుటకు నా మనస్సంగీకరించటంలేదు. అడివిలో తిరిగే జంతువును మీరు దొడ్లో బంధించి దానికి యెంత ఆహారంసమర్పించినా యెన్నిసౌకర్యాలుకల్పించినా యెలా మానసికతృప్తిని పొందలేదో, నా స్థితికూడా యిపుడలానే వున్నది. అపారమైన మీ ఆదరంలో నా మనస్సెందుకో తబ్బిబ్బవుచున్నది. నన్ను క్షమించి నా దారికి నన్ను పోనివ్వండి.

శివప్రసాద్:-నీవు ఇంత చిన్నవయస్సులో ఏకార్యాల నైతే చేయగలుగుతున్నావో, వాటి నగ్నస్వరూపాలను వాటిఫలితాలనుకూడా నీవు యీ చిన్నారిచిరుప్రాయం లోనే తెలుసుకోగలుగటంలోనే నీ దోషాలకు పరిహారం వుంది. ఎవరైతే తనదోషాలను, పాపాలను మరొకరిమీదకు నెట్టుటకుగాని, సంక్రమింపజేయుటకుగాని సహింపరో వారికి పరిహారమార్గం తప్పక వుండితీరాలి. ఏదిఏమయినా ఇక

మీదట అలాంటిదొంగతనాలు, హీనకార్యాలు నీవు చేయ టానికి వీలులేదు. నీ వింతవరకు సలిపిన కార్యాలు నీచమైన వయినా, వాటికి నీవు బాధ్యురాలవుగాదు, అవి నీ నిజ బుద్ధిప్రేరితాలుగావు. నీ హృదయం అంత దౌర్బల్యమైంది గాదు. మంచిఫలమైనా చెడ్డప్రదేశంలో పడినపుడు అది పనికిరానిదై పోవచ్చు. చెడ్డప్రదేశంలోపడి స్వయంసిద్ధనీలు వను కోల్పోతున్నపుడు దాన్నిచూస్తూ వుదాసీనతవహించటం వివేకంగాదు. ఏదోఒక గొప్పవుద్దేశ్యంతోనే నిన్ను భగవంతుడు నా వెంట పంపివుంటాడు. కనుక నీ విక అలాంటి దొంగపనులు సలుపవీలులేదు.

నూర్జహాన్:-బాబూజీ, మీరు దయాస్వరూపులు, ధర్మావతారులు. మీ హృదయం దేవత్వంతో నిండినది. అలాంటి మీరు నన్ను సహృదయగా యెంచి నన్ను సిగ్గు పర్చకండి. మీకు నాయడలవున్న దయకు నేను ధన్యు రాలను. కాని, నేను దుష్టురాలనని మరోమాటు విన్న వించుకుంటున్నాను. మీముందు అపశ్రుతులు పల్కి, మిమ్ము మోసగించటానికి నా మనస్సంగీకరించుటలేదు. మీలోనినిష్కల్మషమైన ఆదరాభిమానాలు నన్ను విచారించు రాలిని జేస్తున్నవి, నా హృదయం కంపిస్తున్నది, మిమ్ము చూడను భయంకలుగుతున్నది. నన్ను క్షమించి విడుదల చేయండి. ఇకమీదట నేను దొంగతనంచేయలేను. నేను యెక్కడున్నా దైవసమానులైన మీరు నాయెదుట కని పిస్తూనేవుంటారు. మీరు నా కనులముందు కనిపిస్తున్నంత

వరకు చెడుకార్యాలు చేయలేనని నా అంతరాత్మ చెబుతున్నది.

అని గాద్గదికమైన కంఠస్వరముతో అన్నది.

ఒక అనాగరికదుశ్చరిత్రిని, దుర్గంధదళితావతారిణియైన అల్పబాలికనుంచి వెలువడినమాటలలో పాశ్చాత్యదేశాలలో విద్యాపారంగతుడైన విజ్ఞాననిధి శివప్రసాద్ నుంత్ర ముగ్ధుడై, ఆమెను అపుటకు తనస్మృతిపథంలో క్రొత్తపథకం ఏదో మెదిలినట్లు క్షణికవికసితుడై "నూర్జహాన్, నీమీద ఆనాడు పోలీసువారు పెట్టనున్న కేసుకు నేను జామీనుండి, నిన్ను విడుదలచేయించాను. వారు కోరినపుడు నిన్నుకోర్టులో హాజరుపర్చజాలనపుడు నీవనుభవించవలసినశిక్ష నే ననుభవించవలసివస్తుంది." అన్నాడు. పారిపోయేవ్యక్తులనుకూడా పట్టిబంధించేపట్టులు అన్నివేళలా వుంటవికాని, వాటిని గ్రహించి నొక్కగలశక్తి కావాలి. తనశిక్ష శివప్రసాద్ బాబు అనుభవించవలసివస్తుందని విన్నపుడు స్తంభీభూతురాలయింది. గంభీరవదనంతో "నేను యిక్కడ వున్నందు వలన మీకు కలిగేబాధలను చూడకుండాలని ప్రయత్నించాను; కాని, నేను వెళ్ళిపోయినందునవలన మీకుకలిగే బాధ అంతకంటె కఠినమైనదైనపుడు నేను వెళ్ళనే వెళ్ళను. ఇక్కడే వుండి నా శిక్షను నేను అనుభవింప జైలుకువెళ్ళుతాను." అని స్థిరకంఠంతో అన్నది.

మానవుడు యేదో గొప్పకార్యాన్ని సాధించినపుడు, తనకు నచ్చినవిర్మాణాన్ని పూర్తిచేసినపుడు, తన యిష్ట

సంకల్పం సిద్ధించినపుడు మనోవికాసాన్ని పొందుతాడు, ఆత్మతృప్తితో ఆనందాన్ని అనుభవిస్తాడు. తను సాధించిన దానిసమక్షంలో కూర్చుండి తదేకంగా దాన్ని తనదృక్కులనే కుంచెతో నగిషీచేసుకుంటూ పులకితుడవుతాడు. అదే స్థితి ఇపుడు శివప్రసాద్‌ది. పసివానికి వినోదమైన ఆటవస్తువు దొరికినపుడు దానిఆటలో సర్వాన్ని మర్చిపోయినట్లు శివప్రసాద్‌మనోక్షేత్రంలో నూర్జహాన్ నృత్యంసలుపుచున్నది. నేడాయనలో చురుకుదనం హెచ్చింది. వదనంలో ప్రసన్నం పరవళ్లుత్రొక్కుతున్నది. పొద్దస్తమానం రీడింగురూములో మ్రగ్గుతూ, ఏదోపుస్తకంలో లీనంకాలేకపోతున్నాడు నేడు. ఏ నౌకరూ రాకుండానే తనకుతానే అస్తవ్యస్తంగావున్న పుస్తకాలను సర్ది, శ్రావ్యమైన లోతుకంఠంతో ఏదో రాగాన్ని ఆలాపనచేస్తూ బూజుదులుపుతుంటాడు. రీడింగు రూములో ఎక్కువసేపు వుండబుద్ధిగాదు. ఇల్లంతా కలియదిరుగుతాడు; భవానీని ప్రసన్నంజేస్తూ లాలింపులుజేస్తూ ఆమెకొంగువెంట కొంతసేపు గడుపుతాడు. ఆమె తన యెడల పూర్తిప్రసన్నురాలయినమీదట నెమ్మదిగా జూద మందిరానికరుగు నూతనాభ్యాసివలె గోశాలవైపు వెళ్తాడు. తన కిదివరకు తెలియని మధుమయప్రీతిని ఆ లేగ దూడలలో పొందుతాడు. చిన్నిదూడమాడుమీద చేయివేసి సవరిస్తూ గోశాలగదివైపు తనదృక్కులనుబరపి వెతుకుతుంటాడు. తను యెవరినిచూడాలనివున్నదో వారు తన, నిగూఢ పరిశోధనదృక్కులకు అందనపుడు విసిగి పిల్లిఅడుగులతో గదిచెంతకుజేరి తొంగిచూస్తాడు. అక్కడ ఒక ఆవుదూడను

బట్టి దానిశరీరంనుంచి వెతికివెతికి గోవార్లను తీస్తున్న నూర్జహాన్ను గాంచి, మాధుర్యాలోలుకు కంఠంతో "నీవు యెప్పుడూ యేదోపని చేస్తూనేవుంటావు; పనులను కల్పించు కొనుటలో నీకు విశేష శక్తివుంది" అన్నాడు శివప్రసాద్.

తొట్రుపాటుతో భక్తిప్రపత్తులను ప్రకటిస్తూ "ఎప్పుడూ ఏదో పనిచేస్తుండేవారికి పనిలేనపుడు పనినికల్పించుకునేనేర్పు స్వభావంలోనే వుంటుంది." అని చిరునగవు చిందిస్తూ అన్నది.

"నేను వుదయం బజారునుంచి నీకుయిష్టమైన రొట్టెలు తెచ్చియివ్వమని గంగులుకు చెప్పాను, అందినవా?" అని ప్రశ్నించాడు శివప్రసాద్.

నూర్జహాన్ సిగ్గు నభినయిస్తూ, "అవును, తెచ్చి యిచ్చాడుకాని అది నాకు అలవాటులేనిది. అందువలన శునకరాజుకు విందుచేశాను." అన్నది.

శివప్రసాద్ :- అదేమిటి? నీవు మహమ్మదీయ యువతివై యుండి మాంసం భుజించవా?

నూర్జహాన్ :- నిష్టనియమాలద్వారా నేను అందుకు అతీతురాలనుగాదు. మాబోటి గర్భదరిద్రులకు అలాంటి విలువైనభోజనం లభ్యంగాదు. యెండురొట్టెముక్కలే నాపాలిట మృష్టాన్నము. అందువలన మాంసభక్షణ నాకు అలవాటు లేదు.

శివప్రసాద్ :- అలాంటి విలువైనపదార్థం లభ్యమైనపుడు యెందుకు భుజించవు?

నూర్జహాన్ :- మీ పరిచయంకాకముందు, నా ఊహాలో అది విలువైన, ఖరీదయిన ఆహారం. కాని నేడు మీద్వారా అవకాశం కలిగినా అలాంటివి అంటుకోవ టానికి నా మనస్సెందుకో కించ చెందుచున్నది. నన్ను క్షమిం చండి; మీసన్నిధిలో రక్తమాంసాలు భుజించి, నా మ్లేచ్ఛ తను నగ్నరూపంగా ప్రకటించుకోజాలను.

శివప్రసాద్ :- నీవయస్సులో బాల్యదశస్పర్శ లింకా ముసుగుముసుగుగావున్నవి. అలాంటి నీవు కించ యేరూపం లోనూ చెందవలసినఅవుసరం లేదు. ఇష్టమైనదానిని విసర్జించి నిష్టలద్వారా ఆత్మను క్షోభింపజేయుట మంచిదిగాదు.

నూర్జహాన్ :- అంతరాత్మనుంచివచ్చుపట్టుదలలోనే నిష్ట నిర్మితమవుతుంటుంది. కనుక యిష్టంమీద నిర్మించుకునే నిష్టలలోనే ఆత్మశాంతి వుంటుంది బాబూజీ.

రెప్పపాటులో శివప్రసాద్ నివ్వెరపోయాడు. రోహిణీయెండగాడ్పులకు నెర్రెలఘూతాలనలెపొంది,అడుగు పడితే గలగల మట్టిపెళ్ళ విరుగుతూ వికృతరూపంధరించిన పృథ్వీమాత తొలకరిఝల్లుతోనవనవత్వాన్నిపొంది కమనీయ మైన పరిమళాలను విరజిమ్ముతూ, హరితవర్ణపు వుడుపులను ధరించి పులకితశరీరంతో శోభించినట్లు, వృత్తిదొంగ, అయిన ఒక మ్లేచ్ఛబాలికనుంచి ఒక్కమాటుగా ఆకస్మికంగా యింత ఆత్మోన్నతికిచెందినమాటలు రావటం అతనికి విభ్రాంతిని కలిగించినవి.

శివప్రసాద్ :- నూర్జహాన్, నీవీ మాటలు యెక్కడ నేర్చుకున్నావో అర్థమవుటలేదు. నీనుంచి నేర్చుకోవలసినవి

కూడా యేవో వున్నట్లు నే డనుభూతమవుతున్నది. నీవు మహమ్మదీయ బాలికవు అవునో కాదో అని నా కీనాడు సంశయం కలుగుచున్నది.

నూర్జహాన్ :- బాబూ, ఆగండి, ఆగండి. నన్ను ఒక్కమాటుగా బ్రాహ్మణకన్యనుగా మాత్రం చేయకండి. నేను మా తలిదండ్రులున్నపుడు హిందూఅగ్రజులయింట పాచిపనిచేస్తుండేదానిని. వారు పురాణకాలక్షేపంచేస్తున్నపుడు నేను పనిమాని వింటుండేదానిని.

"బాబుగారూ, పెద్దమ్మగోరు పిలుస్తున్నారు" అన్న గంగులుపిలుపు వారిసంభాషణకు అంతరాయంకలిగించింది.

రెండురోజులవలె రెండు నెలలు గడిచిపోయినవి. మానవుడు వుత్సాహంలోను ఆనందంలోను పరిశోధనలోను ఏదోఒక ఆవిష్కారంలోను, రసవత్తరమైన కావ్యపఠనంలోను, పరీక్షలలోను త్వరితంగా తిరిగిపోతున్నందుకు గడియారాలమీద, దినకరునిమీద వుగ్రుడవుతాడు. శివప్రసాద్‌కు ఎక్కువగా పుస్తకాలందే ధ్యాసవుండేది. నేడు అన్నిటిమీదా ఆసక్తి శ్రద్ధ పెరిగింది. అన్నిటిలోను కమనీయత కనిపిస్తున్నది. ఇపు డాయన క్లాసులోబోధించుటయందు విశిష్టత కనుపిస్తున్నది. నిర్వచనలలో నూతనత్వం గనిపిస్తున్నది. మానవునికి నూతనోత్సాహం కలిగినపుడు హృదయము మనస్సు ప్రఫుల్లితరూపంలో వికసిస్తవి.

నూర్జహాన్‌మీద పోలీసువారు దాఖలుచేసిన సల్లమందు కేసు వాయిదాసమను శివప్రసాద్‌కు ముట్టింది. మ్లానముద్రితవదనంతో "బాబూజీ, నన్నుగురించి మీరు

మరీ కళవళంచెందకండి. నాలో సిగ్గుబిడియాలు ఉదయించాల్సినఅవసరమే లేకుండాపోయింది నా జీవితంలో. కాని, నేడు మీ అపారమైనఆదరంవలన యెక్కడినో నా హృదయ కుహరంనుంచి సిగ్గుబిడియాలు దొర్లుకొస్తున్నవి. నేను మీ కులమతానికిచెందినదాన్ని గాదు, మీ దేశానికిచెందిన దాన్నీ గాదు. అలాంటి నాగురించిన చింత మీ కెందుకు బాబూ? నేను అందరిలోనూ నిలిచి గర్వసహితంగా వాఙ్మూలమీయగలను" అన్నది.

శివప్రసాద్:- నీవు నేరాన్ని వప్పుకోకతప్పదు. కాని అంతమందిసమక్షంలో నీవు దొంగవుగా బోనులో నిలువటాన్ని వూహించినపుడు నా హృదయం కళవళంచెందుతున్నది. నిన్ను కోర్టుకుహాజరుపర్చనందున యెంత జుల్మానా చెల్లించవలసివచ్చినా ప్రసన్నంగా చెల్లిస్తాను.

నూర్జహాన్:- బాబూజీ, మీరు అఖండ పండితులయ్యుండికూడా అమాయకులు. తీగమీదనడిచే సర్కస్ వానికి భయముండదు. అది అతనికి అలవాటే కాని, దాన్ని చూస్తున్నప్రేక్షులకు భయముంటుంది. మీ భయంకూడా అలాంటిదే. నేను అనేకమాయలు కోర్టులకు వెళ్లాను, బోనులో నిలిచాను, జల్మానాలు చెల్లించాను, జైలుశిక్షలు కూడా అనుభవించాను. నాకు భయ మెందుకుంటుంది చెప్పండి ?

ఈమాటలు శివప్రసాద్ హృదయాంతరాళంలో యెక్కడో చిన్ని అయిష్ట రేఖలను గీచివెళ్ళినవి.

తన ఆంతరంగికనౌకరైన గంగులును వెంటబుచ్చి

పంపాడు శివప్రసాద్. నిత్యమూ దొంగకార్యాలుచేస్తూ పట్టుబడిన అనేకమారులు అతినిర్భీకంగా కోర్టులోనిలిచి శిక్ష పొందికూడా గర్వంతో శిరస్సునిక్కించి శిక్షను పురస్కార రూపంగా స్వీకరించిన నూర్జహాన్ నేడు తడబాటు చెందుతూ భీతిలుచున్నది. ఆమెఅంతరాత్మలో విరుద్ధధ్వనులు భీకర రూపందాల్చి అర్థంగాని సంచలనాన్ని కలిగిస్తున్నవి. ఆమెలో యెక్కడలేని భీరుత్వం సంప్రాప్తమయింది. తనను ఒక్కమాటుగా యింత ఆకస్మికంగా పరమాప్తుజేసిన ఆ ప్రకృతిమాతమర్మం తన చిన్నారిహృదయాని కర్థమవుట లేదు.

రెండుసంవత్సరాలశిక్షగాని వెయ్యిరూపాయలజుల్మానాగాని చెల్లించు శిక్ష కోర్టుద్వారా ప్రాప్తమయింది. శివప్రసాద్ఆదేశానుసారం గంగులు జరిమానా వెయ్యిరూపాయలు చెల్లించాడు. కాని ఆవిషయం నూర్జహానుకు అత్యధిక బాధను కలిగించింది. జైలుశిక్షను అనుభవించాలని ఇక ఎన్నటికీ ఎవ్వరికీ కనిపించకుండాపోవాలని ఆమె అభిలాష. కాని, గంగులుద్వారా శివప్రసాద్ చెప్పిపంపినమాటలను త్రోసిపుచ్చటం కష్టమనిపించింది. ఆయనఅనుమతిపొందకుండా, కనిపించకుండా పారిపోవటం మహాఅపరాధంగా ద్రోహంగాతోచింది. కాని సిగ్గుబిడియాలుముంచెత్తుతున్నవి.

సంధ్యారాగసమయ మది. ఆమబైట కట్టివేచిన ఆవులు కలబడి ఆత్రంకొద్దీ పచ్చిగడ్డి మేస్తున్నవి. పాలేర్లు హడావుడిపనులన్నిటినిముగించారు గాబోలు తాపీగా, నిర్మలమైనముఖాలతో కొందరు పాలచెంబులతోను కొందరు

గుగ్గిళ్ళబుట్టలతోను అటుయిటు నడుస్తున్నారు. ఆవుదూడలు ఒకటిరెండు కట్టుగొయ్యలనుంచి ప్రదక్షిణలుజేస్తూ ఘోషిస్తున్నవి. కొన్ని తల్లులపొదుగులను పొడిచిపొడిచి పాలారగిస్తున్నవి.

కాలేజీనుంచివచ్చిన శివప్రసాద్ వెయ్యినేత్రాలతో వెతుకుతున్నాడు నూర్జహాన్ కొరకు. గోశాలగదిముందుగా ఆవుదూడనుబట్టి, పనికల్పించుకుని వేడుకగా రెండుమూడుమారులు తిరిగాడు కాని, ఆమెఆకార మెక్కడా కనిపించలేదు. స్నానంచేయటానికి చంకనుబిందెతోపోతున్న భవానీ "శివం, ఓ శివం" అంటూ పెట్టిన కేకలు శివప్రసాద్‌ను శివుని జేసినవి. పట్టుబడిన అపరాధివలె పిల్లిఅడుగులు వేసుకుంటూ వచ్చి "ఏమిటి అమ్మా?" అని కంపిస్తున్నకంఠంతో ప్రశ్నించాడు.

భవానీ :- ఆ బూబుకు శిక్షపడిందట. ఆవిడ శిక్ష అనుభవించకుండా నీవు వెయ్యిరూపాయలు జరిమానా చెల్లించి విడుదలచేయించావట. ఇది నిజమేనా శివం?

శివప్రసాద్ :- నిజమేనమ్మా, ఆ అమ్మాయి సహచర్యదోషాలవల్ల అలాచేసిందేగాని, వాస్తవికంగా గొప్ప సహృదయిని అమ్మా! ఏరూపంలోనూ ఆధారంలేని అనాథలను ఆపత్సమయంలో రక్షించటం సర్వశ్రేష్టమైన పుణ్యకార్యమని నీవు నా చిన్నతనంలో యెన్నిమార్లో చెప్పితివిగదా!

భవానీ :- అయితే నిన్ను ఒక మ్లేచ్ఛబాలికను రక్షించి, యింట్లోతెచ్చిపెట్టమని నేను నేర్పానా శివం?.

శివప్రసాద్ :- అదేమిటమ్మా, బాధ అందరికీ ఒకే రూపమయిందిగదా! బాధలు కులమతాలను పాటించవు. వున్నవారికి కులమతగౌరవాలుంటవి గాని, ఒక అనాథ దళిత దరిద్రావతార ప్రచండరూపిణికి ఏమివుండగలవు చెప్పు అమ్మా.

భవానీ :- ఒరే శివం, పోనీ ఆ జరిమానా చెల్లిస్తే చెల్లించావుగాని, ఆ బూబును చానట్లోనుంచి వెంటనే పంపివేయి. ఇంతకాలమూ ఆ పిల్ల లేకపోతే, ఆ కేసు మన మీదకొస్తుందన్నావు. పోనీ యికనైనా పంపు బాబూ!

శివం :- వాళ్ళదూరపుబంధువు కాశ్మీరులో వున్నాడట. అతనికి యీరోజే వుత్తరంవ్రాశాను. అతనురాగానే పంపివేద్దామమ్మా.

భవానీ :- ఒరే శివం, నిన్ను పసితనంనుంచీ నాచేతులమీద పెంచాను. నీశరీరమంతా నాచేతులలో పెరిగింది. నీ కన్నతల్లి నీకు పదిసంవత్సరాలు నిండకముందే నిన్ను నాచేతులలో అప్పగించి వెళ్ళిపోయింది. ఆ కొరతను నీకు తెలియనీయకుండా యెలా పెంచానో నాకు తెలుసు. నీ మనస్సు నవనీతంలాంటిది. ఈలోకంలో ఏమిజరిగినా నేను సహించగలను కాని, నీనోటినుంచి టక్కరిమాటలురావటం భరించరానిది. ఈ అవసానదశలో నన్ను బాధించకు నాయనా! నీవు వివాహంకావలసినవాడివి; ఆ పిల్ల యుక్త వయస్సువచ్చినది. ఇక్కడవుండుట ఏమాత్రం మంచిది గాదు. నన్ను మభ్యపెట్టి మోసగించటానికి చూడబోకు నాయనా; అది నీ ఆత్మవంచనకే దారితీస్తుంది.

శివం :- నన్ను శంకిస్తున్నావా అమ్మా? నీముందు నిజంచెబుతున్నాను. నాకు తెలియని అపారమైన జాలి మాత్రం ఆమెయెడ నాకు కలిగింది. ఆ జుర్మానా చెల్లించి నంతమాత్రాన అది ఆమెకు వుపకారం కాజాలదు. అందు కామె సునాయసంగా శిక్షనే అనుభవించేది. ఆమెకు సరి యైనసహకారాన్ని కల్పించి, జీవనోపాధిమార్గాన్ని చూపితే, ఆమార్గంలో పయనిస్తూ ఆదర్శమహిళగా అందరికీ కనిపించ గలదు. అప్పుడే ఆమెకు ఆదరంలభించినట్టు, మనంవుపకారం చేసినట్లు. నేడు నీవుచెప్పినట్లు అవతలకునెట్టితే, ఆమె అంధ కారఅయోమయంలో దుర్గంధపూరితమైన ఏ మురికి కూపంలో పడిపోతుందో చెప్పలేము. జీవితంలో ఒక్క అనాధను రక్షించగలిగినా ఆ జీవితం ధన్యమని నీవు యెన్ని మారులు చెప్పలేదు అమ్మా!

భవానీ :- (అశ్రుధారలద్దుకుంటూ) ఈరూపంలో నామాటలను నాముందుంచుతావనుకోలేదు నాయనా! ఆ బాలిక యే హిందువో అయివుంటే, నేను చింతించను కాని, స్వచ్ఛమైన ఒక మ్లేచ్ఛకన్య యిక్కడవుండటాన్ని నే నెలా సహించను? ఏమైనాసరే, పంపాల్సిందే; నీవు బాగా ఆలో చించుకో, అంటూ సమాధానంకొరకు యెదురుచూడకుండా భవానీ స్నానానికి వెళ్ళిపోయింది.

విరుద్ధమైనవి, విచ్ఛిన్నమైనవి, అనిష్టమైనవి అడు గులసవ్వడిలో అనువృత్తులుగా మారుట యదార్థసత్య మైనవి.

నూర్జహా నిపుడు శివప్రసాద్‌నేగాదు, యెవరియెదుట

పడనూ సిగ్గిలుచున్నది. తనకు తెలియని బిడియాభిమానా లేవో అంతరాత్మనుంచి వక్రాలుగా సుడులుదిరిగి, హృదయాన్ని కావుకులతోనింపి వుక్కిరిబిక్కిరిచేస్తున్నవి. తన అపరాధాలను నగ్నంగా తనయెదుటపెట్టి పెద్దపెట్టున శిక్షించను తనఆత్మే తనవైపు గుర్రుగా చూస్తున్నది. నిర్మలము నిస్వార్థము నిష్కామముతో నిండిన స్నేహము, దయ, మమకారములతో వెల్లివిరిసిన స్నిగ్ధరూపంలో యెవరో తన ప్రక్కన నిలిచి, తనను చిన్నబుచ్చుతున్నట్లు వెలవెలబోతున్నది. తలుపులుబిగించి ఆ ధూళి దుర్గంధభరిత గదిలో క్రుగ్గుతూ యెవరికీ తన లజ్జాభరితవదనాన్ని చూపనోల్లక దుఃఖిత శోభారూపంలో తన హృదయకలుషితాన్ని కడిగివేస్తున్నది. దయ మమకారాలతో తనను నిర్బంధించిన యీ బందిఖానానుంచి పారిపోయి విముక్తిపొందాలని ఆమె లోని ఓ ప్రవృత్తి పెరపెరలెత్తిస్తున్నది. పొందినవెలుగును భరించలేక నేత్రాలుమూసి అంధకారాన్ని సృష్టించుకుని తప్పటడుగులు వేసుకుంటూ, అధోలోకానికి దూకి శాశ్వత అంధకారాన్ని కల్పించుకుని ఆత్మద్రోహానికి ఆశ్రితద్రోహానికి గురియై పొందే పాపాన్నిగురించి జడిపిస్తున్నది మరో ప్రవృత్తి.

## 3. అజ్ఞాత పూజారిణి

కృష్ణానదిఒడ్డున శిథిలావస్థలోనున్న నీలకంఠస్వామి ఆలయం పూర్వమొకప్పుడు శివప్రసాద్ కుటుంబీకులు కట్టించినదే కట్టించిన తాము స్వయంగా సమక్షంలో వుంటున్నందు

వలన అవుసరంలేదని గాబోలు, ఆ దేవునిపోషణకుగాని పూజలకుగాని ఆస్థిపాస్తులను యివ్వలేదు. పూర్వీకులు శిలా శాసనాలద్వారా తమ అభిప్రాయాలను స్థిరంజేశారు. ప్రస్తుతం రిజిష్టరాఫీసులద్వారా తమఅభిప్రాయలను స్థిరం జేస్తున్నారు. వాటినే పెడచెవినిబెట్టే యీ వారసులు గాత్రాభిప్రాయాలను యెంతగా పాటించగలరో ఆ నీల కంఠస్వామిఆలయం చూస్తే తెలుస్తుంది. ప్రహారీలు చాలా వరకు పడిపోయినవి. గర్భగుడిగోడలుకూడా పెద్దపెద్ద తొర్రలుపడి తమదీనత నలువైపులనుంచి ప్రకటించుకుంటు న్నవి. ఆ స్వామి తమదర్శనభాగ్యాన్ని అన్నివైపులనుంచి నిరాఘాటంగా యివ్వదలచోయేమో బంధనాలన్నిటినుంచీ విముక్తుడై ఆ శిథిలాలనుంచి తన తేజోమయ విశ్వవిరాట్ రూపాన్ని ప్రదర్శిస్తున్నాడు.

ఆ పడిపోయినగోడరాళ్ళను తీసి, ప్రదక్షిణలకు ఆటం కంలేకుండాచేసుకున్నారు. యే భక్తులో ఆ దేవునిముందు మోకరిల్లుటకు, సాష్టాంగపడుటకుకూడా సముపాయంచేసు కున్నారు. గుడికిప్రక్కగా పెద్ద వెడల్పైన సోపానాలు కట్టి వున్నవి. ఆ రేవులో యెంతమంది యెంత కోలాహలంగా జలకమాడారో! ఏకాదశులందు శివరాత్రులందు మాఘ మాసాలందు యెందరు ఆ సోపానాలమీద జలకమాడి తమ జీవితాలను పునీతంచేసుకున్నారో! నేడు అవి కదలి పట్టుదప్పి దీనమైన జీర్ణావస్థలో నున్నవి. నేడు వాటియెడల శ్రద్ధ ఒక్క భవానీకిదప్ప మరెవరికీ లేదు. నేడు ఆ సోపానాలను ప్రక్క ఆలయాన్ని ఆదరిస్తున్నది ఒక్క భవానీమాత్రమే.

ఆ గుడిని సోపానాలను నిర్మించిన తన పూర్వీకుల మనో వాంఛితఫలితాలను చర్విత చర్వణంచేస్తున్నది భవానీ. ఆమె నిత్యమూ ఆ సోపానాలనుంచే కృష్ణలో మునిగివచ్చి, ఆ జీర్ణాలయప్రదక్షిణలుసలిపి దీనదశలోనున్న నీలకంఠస్వామిని మనసారా పూజిస్తుంటుంది.

అది వేకువజాము. పాలేరులు పశువులను లేపి దిద్దుబాట్లు జేస్తున్నారు. వృక్షాలనుంచి పక్షులు బడలికతోగూడిన కలకలారావాన్ని జేస్తున్నవి. నభోమండలంలోని నక్షత్రకూటమి అలసటతో రొప్పుతున్నట్లు మిణుకుమిణుకుమంటున్నవి. యథావిధిగా భవానీ బిందెచంక నెట్టి నీలకంఠఘాటుకు పయనమయింది. సోపానాలసందుసందులందు గుబురుగా పెరిగిన గడ్డిపోచలు పిచ్చిమొక్కలు పీకివేయబడినవి. కడిగి శుభ్రంచేయబడివుంది. ఈ నిర్జనప్రదేశంలో తానుతప్ప యెవరూ రాని యీచోటు నేడు సోపానాలు శుభ్రమయి వుండుట ఆమెకు ఆశ్చర్యమయింది. అంతేకాదు, ఆ శిథిలాలయంచుట్టూవున్న చిన్ని రాతిముక్కలను యెలుకల మట్టిని చెత్తచెదారాన్ని తీసి, అత్యధిక శ్రమదానంతో బాగుపరిచినట్లున్నది. దేవవిగ్రహం కడిగి పూలతో పూజింపబడింది. ఆ పూజాపుష్పాలనుంచి మంచునీటిబిందువులు యింకా ముత్యాలవలె మెరుస్తున్నవి. ఈ వింతదృశ్యంతో భవానీ విభ్రాంతురాలైంది. ఈ అజ్ఞాతపూజారి యెవరో! ఇంత శ్రమజేసి ఆ దేవుని పూజించినవారి ఆత్మసంకల్పం విశిష్టమైనదయివుంటుంది. పవిత్రహృదయులు అకుంఠితమైన కఠోరదీక్షావ్రతులే యిలాంటి అజ్ఞాతపూజలు సలుపగలరు.

అని, భవానీ ఆదిఅంతాలులేని వూహాలుచేస్తున్నది. ఆ అజ్ఞాతపూజారిని తెలుసుకోను ఆమెమనస్సు కుతూహాలంతో ఆరాటపడుతున్నది.

నేడు నిత్యమూనలె భవానీమనస్సు భగవద్ధ్యానంలో నిమగ్నంకాలేకపోయింది. దేవునియెదుట మోకరిల్లి నేత్రాలుమూసి యెంతప్రయత్నించినా మనస్సు అధీనం లోకివచ్చుటలేదు. అజ్ఞాతపూజారిని మనోనేత్రాలతో వెదుకుతున్నది. విఫలురాలై పూజ ముగించుకుని, ఏదో ఆమె మనస్సుకు అర్థమైనట్లు అంగలు పంగలువేసుకుంటూ ఆగలేని ఆత్రుతతో యింటికిచేరి, శివప్రసాద్‌గదిని పరిశీలిస్తున్నది. ఈ సర్వజగత్తులోనూ అగ్రాసనాన్నివహించి అపారవుదారిణియై నిష్పక్షపాతియై అందరికీ అదేస్థాయిలో మధురాతి మధురమైన సుఖాన్ని ప్రసాదిస్తూ, అందరిలోని అలసటలను హరిస్తూ అవుసరాలను గుర్తిస్తూవుండే ఆ నిద్రాదేవత ఒడిలో శివప్రసాద్ విరాజమానమైయున్నాడు. నిర్మలమైన ఆయన ముఖమండలంలో యెంత వెదికినా గుప్తపూజాముద్రికలు స్పష్టంకాలేదు. భవానీవుత్సాహం వుదాసీనరూపంలో అదృశ్యమైంది. మనస్సులోనిసమస్య సమస్యగానే వుండిపోయింది.

తాను వూహతెలిసినప్పటినుంచి ఆ గుడిని, సోపానాలను చూస్తున్నది. తాను విధవగా యీయింటికి తిరిగివచ్చినప్పటినుంచి ఆ రేవులో జలకమాడుతున్నది. సీలకంఠుని పూజిస్తున్నది. కాని ఆ దేవునిలో దీనత్వం ఆ రేవుసోపానాల లోని జర్జరత్వం ఒకేమాదిరి గోచరిస్తుండేవి. నేటి అజ్ఞాత

పూజారి యెవరో హృదయపూర్వకప్రేమతో సంస్కా-
రాన్ని పులిమాడు. రోజుకోరీతి శృంగారకళ సుశోభితమవు
చున్నది. ఆ అజ్ఞాతపూజారిని పరిశోధించువిషయం వుత్సా
హావురకలను కల్పిస్తున్నది భవానీకి.

అజ్ఞాతపూజారి పూజలు నిత్యము తనకంటె నియ
మానుసారంగా జరుగుచున్నవి. దేవవిగ్రహాన్ని రోజూ జలక
మాడిస్తున్నట్లు నూతనపుష్పాలతో నింపుతున్నట్లు, గొప్ప
స్తోత్రాలను అంకితంచేస్తున్నట్లు ద్యోతకమవుచున్నది. ఆ
దేవునిసన్నిధిలో నిత్యమూ సమర్పింపబడుతున్న పుష్పాలు
తన పెరటిలోనివిగానే తోచినపుడు ఆమె మరింత ఆందోళన
చెందింది. దేవుని అలంకరించిన ఆ పారిజాతపుష్పాలు తమ
పెరటిలోని వే; ఆ త్రివర్ణ దేవగన్నేరుపుష్పాలు తమదొడ్లో
దప్ప మరెక్కడా లభ్యంగావు. భవానీ మరింత విచలితు
రాలయింది.

శివప్రసాద్‌వంశం తరతరాలనుంచి దైవచింతనలో
నిగ్గుతేలినది. అన్నిటితోపాటు వైజ్ఞానికవిషయ సంబంధ
వారసత్వంకూడా శివప్రసాద్‌కు సంప్రాప్తమైంది. రామకృష్ణ
మిషనులో ఆసక్తి యెక్కువ. థియసాఫికల్ సొసైటీలో
ప్రాముఖ్యాన్ని పొందాడు. ఈ శివప్రసాదే అజ్ఞాతపూజారి
యని భవానీవిశ్వాసం.

భవానీ :- శివం, నాదగ్గిరకు రా నాయనా. నేటికి
నీ మనస్సు వికసించింది. దేవపూజకు అంత చాటుతన
మెందుకు బాబూ? నీవు నాతో చెప్పి చేయవచ్చుగదా?

శివం :- అదేమిటమ్మా! నీవనేది నా కర్థమవుటలేదు.

భవానీ :- మన నీలకంఠస్వామిఆలయాన్ని ఊడ్చి బాగుచేసి, రోజూ పూజలుచేస్తున్నది నీవుగాదటరా?

శివం :- నాకు యేమీ తెలియదమ్మా, నీమాటలు నా కగోచరంగానున్నవి.

భవానీ :- అయితే, రోజూ అక్కడ పూజలుసలుపు చున్నది ఎవరు? ఆ పూజిస్తున్నపూలన్నీ మనదొడ్డేవేరా.

శివం :- నేను కాదమ్మా. నాకు తెలియదు. ఆ పుష్పాలు మనదొడ్లోవని యెలా చెప్పగలం?

భవానీ మారుమాటాడగలస్థితిలో లేదు. అర్థంగాని అయోమయంలో అనభిజ్ఞతతో డోలాయమానమవు చున్నది. ఆ అజ్ఞాతపూజారి ఆమెను ఆందోళనపరుస్తున్నాడు. ఆమె కది అరేబియన్ నైట్స్‌లోనో కాశీమజ్లీకథలలోనో ఏదో ఒకసన్నివేశంవలె విభ్రాంతినికలిగిస్తున్నది. ఆమె అనేక రాత్రులు ముందుగా వెళ్ళి తెలుసుకోవాలని ప్రయత్నించింది. కాని విఫలురాలయింది.

నూర్జహాన్ ఇప్పుడు కాస్త స్థిమితాన్నిపొందింది. ఆదుర్దాపడుటలేదు. పనులను కల్పించుకుని, చక్కదిద్దుకుంటు న్నది. కడుపుపంటను కళ్ళముందుంచుకుని ప్రేమదృక్కు లొలికిస్తూ ఆనందానుభూతినొందు వృద్ధమాతవలె గోశాల లోని లేగదూడలమధ్య కూర్చుండి, వాటి కేదో అమృత మయభాషను అలవరుస్తున్నది. మహమ్మదీయబాలికలు ధరించు మంచి విలువైన దుస్తులు ప్రత్యేకంగా బజారునుంచి తెప్పించి, శివప్రసాద్ ఆమెకు పంపాడు. ఆమె కవి యెం దుకో కంపనకలిగించినవి. వాటిని ధరించనని శాబ్దిచేసుకు

న్నదికూడా. పాలేరుద్వారా శివప్రసాద్‌బాబు నడిగి మరొక గ్లాస్కోధోవతిని బనియనును తెప్పించుకున్నది. ఆమె నిత్యము ఆ తెల్లటిదుస్తులతోనే వుంటుంది. ఆమె యెప్పుడు స్నానం చేస్తుందో, ఆ దుస్తుల నెప్పుడు శుభ్రపరచుకుంటుందో యెవరి కంటాపడదు. వికసించినమల్లెపుష్పాలకుప్పవలె, పాలకడలి నురుగువలె రజితశిఖవర్ణంలో చమకులు గక్కుతున్న ఆ దుస్తులలోని సువర్ణప్రతిమలాంటి ఆమె దేవలోకంనుంచి ఏ శాపఫలితంగానో యీ భూలోకానికి వచ్చినట్లు గోచరమవు చున్నది.

శివప్రసాద్‌కు కాలేజీనుంచి క్లబ్బుకెళ్ళి గేమ్సులో పాల్గొనే అలవాటుంది. కాని యిప్పుడాఅలవాటు తప్పింది. కాలేజీలోవున్నా యింటిధ్యాస యెక్కువయింది. కాలేజీ నుంచి నేరుగా యింటికి చేరుతుంటాడు. ఇంట్లోవున్నప్పుడు యెక్కువగా రీడింగురూములోను అక్కడ విసిగినప్పుడు ప్రక్క పెరటిలోను వుండే అలవాటు. కాని యిప్పుడు గోశాల వైపే తిరుగాలనిపిస్తుంటుంది. గోశాలలోజేరి గోవుగోవును పరికిస్తుంటాడు. భవానికి యిష్టమైన కపిలగోవు చాలా బుద్ధి గలది, తెలివిగలది. మనుషులను ఆహ్వానించి తనను గోకుతూ ఆదరించమంటుంది. ఆ గోవునద్ద కెళ్ళి దానితో యేమేమో సంభాషిస్తూ గోశాలగదిని పరికిస్తుంటాడు. ఎవరికొరకు ఆయన దృక్కులు వెదుకుతున్నవో వారికి ఆ విషయం తెలుసు. అందుకే వారు ఆ దృక్కులకు మాటునజేరేది. ఏవస్తువు కొరకు మనస్సు అంతంలేనిఆశలతో అన్వేషిస్తుంటుందో అది అంతగా అంతర్ధానమవటం ప్రకృతిమహిమ. వంటరిపాటు

జేసుకుని శివప్రసాద్ దగ్గరగా వెళ్ళి గదితలుపులు త్రోసివే శాడు. లోపల చాపమీద కూర్చున్న నూర్జహాన్ శిరస్సు వంచి మోకాళ్ళసందునుంచి చూస్తూ ఆలోచిస్తున్నది. గుమ్మ టం ఆకారంలోనున్న ఆమెను ఆ తెల్లటిదుస్తులలో, విరజి మ్మిన మృదువైన శిరోజాలతో గాంచినపుడు తనహృద యంలో అర్థంగాని దౌర్బల్యం జనించింది. నూర్జహాన్ అనే పేరుతో ఆమెను సంబోధించుటకు మనస్సంగీకరించలేదు. ఆ అవ్యక్తమైన బాలికతో యెలా సంభాషణ కుపక్రమించాలో తోచలేదు. తా నేదో చేయరానిది చేస్తున్నట్లు అపరాధినలె తడబాటుతో తత్తరచెందుతున్నాడు.

శివప్రసాద్ :- చూడు! నీ కేదైనా బాధ కలుగు తున్నదా? నిన్ను వెళ్ళనివ్వకుండా నిర్బంధంచేసివుంచానని కష్టంగావున్నదా, చెప్పు? నిన్ను బాధించాలనిగాని, శిక్షిం చాలనిగాని నాకులేదు. నీకు ఏరూపంలోనయినా సహాయ పడి వుద్ధరించాలని నా సంకల్పం. నీకు నా యేర్పాట్లలో వుండుట కష్టమైతే, నీవు స్వేచ్ఛగా వెళ్ళిపోవచ్చు. నీవు ఎక్కడికి వెళ్ళదలచితే అక్కడికే పంపేఏర్పాట్లు చేస్తాను. నీకుకావలసిన డబ్బుతీసుకుని వెళ్ళిపోవచ్చు.

ద్రోహిని క్షమించి, సత్కరించి గొప్ప ఆతిథ్యాన్నిచ్చి తన ఆతిథ్యంలోనికొరవలకు మన్నించమని కోరినప్పుడు ఆ ద్రోహి ఎంత పాషాణహృదయుడయినా పశ్చాత్తాపతపనలో పొగి కన్నీరుకారుస్తాడు. అదేరీతి నూర్జహాన్ ద్రవిస్తున్న హృదయంతో పొగిపోతూ, అశ్రుస్రవంతుల నాపజాలక అద్దుకుంటూ శిరస్సు పైకెత్తి గాద్గదికకంఠంతో "నన్నింకా

చిత్రవధచేయకండి. నాకు చదువులురాకపోయినా, వయస్సు చిన్నదయినా, దేశంమీద దిమ్మరిగాతిరుగుతూ యెంతో అనుభవాన్ని నోరుమెదపకుండానే పొందాను. మీకంటే జీవితంలోనిబాధలు నాకు యెక్కువ అనుభవమైనవి. మీరు చదువులద్వారా అర్థంచేసుకున్న బాధలను మంచిచెబ్బరలను నేను అనుభవంద్వారా అర్థంచేసుకున్నాను. నాకు మీరు చేసిన సహాయం యీలోకంలో మానవులు మామూలుగా చేసేదిమాత్రం గాదు. నాకు మీరు వెలుగును చూపారు. కాని ఆ వెలుగుతో నేను పిరికిదాన్నయిపోయాను. నాలో ధైర్యసాహసాలు నశించినవి. మొండితనం పోయి, సిగ్గు బిడియా లుదయించినవి. మర్యాదలు మమకారాలు, న్యాయము, నీతి నాలో జనించినవి. అందువల్లనే అసమర్థురాలనయిపోయాను. శక్తిఅదృశ్యమైంది. సంఘంలో మర్యాదనుపొందు తత్వాలను కల్పించారు. కాని వాటితో నేను నిరాశ్రయురాలనయిపోయాను. ఇక నేను దొంగవ్యాపారాలుచేయలేను. సిగ్గుయెగ్గులులేకుండా కోర్టులకు వెళ్ళలేను. అలాంటి అబలత్వం నాలో యెలా జనించిందో నాకే తెలియదు. ఇందుకు మీరే బాధ్యులనిమాత్రం నా ఆత్మకు తెలుసు. ఇది నా జీవితానికి మేలో కీడో తెలుసుకోగల విజ్ఞత నాలోలేదు. మత్తువదలిన త్రాగుబోతుస్థితివంటిది నేటి నా స్థితి. మీ రేదో మేలుచేశారని నాహృదయమంతా భక్తితోనిండి తొణికిసలాడుచున్నది. మీరుచూపిన వెలుగులాంటి అంధకారంలో వెదుకుతున్న అనభిజ్ఞురాలనైన నాకు

నిర్దిష్టమైన అవలంబనను కలిగించమని మిమ్మే వేడుకుంటు న్నాను". అన్నది.

వల వేసినపల్లెవానికి జలపుష్పాలకుబదులు వజ్రపుటుంగరము లభ్యమైనపుడు తబ్బిబ్బైపాలుబోక చింతాక్రాంతుడైనట్లు శివప్రసాద్ స్తబ్ధుడైనాడు. అశ్రుముద్రికలు కోమలమైన ఆమెముఖలావణ్యాన్ని ద్విగుణీకృతంజేసినవి. ఆమెలో స్ఫురిస్తున్న నూతననవీనత్వం ఆయన్ను మరింత ముగ్ధుణ్ణిజేసింది. విమూఢునివలె వెలవెలబోతూ "గంగులుచేత నీకు దుస్తులు పంపాను, వాటిని ధరించవెందుకు?" అని ప్రశ్నించాడు.

నూర్జహాన్ :- వాటినిధరించటానికి నా మనస్సంగీకరించుటలేదు.

శివప్రసాద్:- కారణముండాలిగదా?

నూర్జహాన్ :- సిగ్గుగా వుంటున్నది.

శివప్రసాద్ :- నీదుస్తులను నీవు ధరించుటకు సిగ్గెందుకు? నా ధోవతిగట్టుటకు సిగ్గుపడవలసింది.

నూర్జహాన్ :- జీవితంలో చేసేవాటన్నిటికి సహేతుకమైనకారణాలను చెప్పగలసామర్థ్యం అందరికీ వుండదు.

శివప్రసాద్ :- ఆరోజు నీకు తగినగుడ్డలు యిచ్చుటకు లేక నా ధోవతి, బనీను యిచ్చాను. కాని వాటినే యెప్పుడూ ధరించటం నీకు బాగుండదు.

నూర్జహాన్ :- బాగుండదని నా మనస్సుకు తోచినపుడు తప్పక విసర్జిస్తాను. వేటిద్వారా అనిర్వచనీయమైన ఆత్మానందం లభ్యమవుతుందో వాటిని విడనాడటంకూడా సులభసాధ్యంగాదు.

"అమ్మగారు పిలుస్తున్నారు శివబాబుగారూ" అన్న గంగులు కేకతో శివప్రసాద్ తోట్రుపాటు చెందుతూ వెళ్ళి పోయాడు.

భవానీని రెండురోజులనుంచి 'ఫ్లూ' వెంటాడు తున్నది. ఆమెది మామూలుగా ఓటమిని అంగీకరించే స్వభావం కాదు. 'ఫ్లూ'ను నిర్లక్ష్యంచేస్తూ తన కార్యక్రమా లను నిర్విరామంగా సాగిస్తున్నది. కాని అంతర్జాతీయ కార్మికబలంగలకమ్యూనిజంవలె ఫ్లూకూడా అంతర్జాతీయశక్తి కలిగినటువంటిది. భవానీని స్పృహలేకుండా పడవైచింది. నాలుగురోజుల అవిరామపోరాటంతో తన ఓటమిని అంగీ కరించింది 'ఫ్లూ'

భవానీపట్టుదల శివప్రసాద్‌కు విదితమైందే. ఎవరు యెంత చెప్పినా, ఆమె నీలకంఠునిపూజకు పోకమానదు. శిర స్నాన కృష్ణోదకాన్ని చల్లుకుని నెమ్మదిగా నీలకంఠఆలయం వైపుకు వెళ్ళింది. ఆ మసకమసకచీకట్లో యెవరో దేవసన్నిధి నుంచి తుర్రున వెళుతున్నట్లు భవానీ గమనించింది. ఎవరో తెల్లనిదుస్తులలోనున్న వనితఅనిమాత్రం వూహించగలిగింది. తనకంటపడగూడదని అదృశ్యమవుతున్నట్లు ఆ పోవువైఖరి ద్యోతకమవుచున్నది. నిస్త్రాణలోనున్న భవానీ వెంటాడ నశక్తురాలు. దేవవిగ్రహం మారేడుదళంతో మునిగివుంది. ప్రక్కన యింకా మారేడుదళాలు రెమ్మలసహితంగా వున్నవి. ఎవరోచేస్తున్న లక్షపత్రిపూజ సగంలోనే ఆగిపోయి నట్లు సుస్పష్టమవుచున్నది. భవానీ విభ్రాంతితో మేలి ముసుగువెళ్ళినవైపే చూస్తున్నది. తనకంటె కొంచెం యెత్తు

తక్కువమనిషని ఆ ముసుగును అర్థంచేసుకున్నది. తన పరిచయంలోని స్త్రీలందరూ మనస్సులో మెదులుతున్నారు. ఇంత అజ్ఞాతంగా ఆరాధిస్తున్న ఆమెమనోకామనలగురించి వూహిస్తూ, పూజారిణికోర్కెను మన్నించి ఆమె నుద్ధరించమని భగవంతుని మనసా కోరుకున్నది. అలాంటి భక్తిపిశ్వాసాలుకలిగిన యువతి తనయింటికి కోడలుగావస్తే తనఅదృష్టం యెంత అద్భుతంగా వుంటుందో వూహించుకుంటూ పూజలు ముగించుకుని వెళ్ళిపోయింది.

భవానీ :- శివం, మన గుడిలోని అజ్ఞాతపూజారిణిని తెలుసుకున్నావా, నాకు అందకుండా సరసర వెళ్ళిపోయింది కాని, గుర్తించాను.

శివం :- ఎవరమ్మా?

భవానీ :- కాంట్రాక్టు జేసే బద్రీనారాయణ ద్వితీయపుత్రిక అయివుండాలి. దాని పేరు రోహిణి గాబోలు. కాస్త దైవభక్తి వుంది ఆ పిల్లకే. వాళ్ళు మన బ్రాహ్మణులై వుంటే, ఆ పిల్లను నీకు చేసివుండేదాన్ని.

శివం :- అదేమిటమ్మా, దేవపూజలుచేసేపిల్ల బ్రాహ్మణి అయితే నీకు కోడలుకాగలుగుతుందన్నమాట.

భవానీ :- అవునురా, గాఢమైన దైవభక్తివున్నపుడే స్త్రీలో స్త్రీత్వముంటుంది, వినయవిధేయతలూ వుంటవి.

## 4 వీలునామా

ఆకస్మికంగా యింటిముందు జట్కా ఆగింది. బండి నుంచి భరద్వాజశాస్త్రిగారు ఆయనపుత్రికారత్నం లలిత

దిగాదు. లలితకు 16 సంవత్సరాలవయస్సు. బొద్దుశరీరం. చామనచాయ. గాలితోనిండిన రబ్బరుట్యూబువలె ఆమెశరీరం వుబికి మృదువుగావుంటుంది. వెన్నముద్దవలె గుండ్రని ముఖము. ముఖంలో గంభీరమైన ఆకర్షణవుంది. పరిచయమైనకొద్ది ఆ ముఖంలోనిఅందం మధురముద్రికలను వేస్తుంటుంది. నడకలోను మాటలోను ప్రతి కదలికలోను కొద్ది మాంద్యముంది. పెద్ద యెత్తరిగాదు. భ్రమరమువలె నల్లని నునుపులుగలిగిన ఆమెకురులు గొగ్గులతో శోభిస్తున్నవి. బొద్దుశరీరంగల స్త్రీలకురులకు గొగ్గులు స్వాభావికం. కాటుక రంగు కనుఫలకాలలోనున్న మీననయనాలు చంచల దృక్కులతో జిగిజిగిగా మెరుస్తున్నవి. లలాటము విశాలమైనదిగాదు. కర్ణలుకలుకలు (లోలాకులు) అటుయిటు కదులుతూ ఆమెలోని చంచలత్వాన్ని చాటుతున్నవి. ఆమె పూర్తివిగ్రహాన్ని పరికించినపుడు సనాతనాధునికసమ్మేళనంగా దృగ్గోచరమవుతుంది. తన కేశరాసిని రెండుగా విభజించి రెండుజడలుగా కొద్దికొద్ది అల్లికతో కుచ్చులవలె వదలిన ఆ జడద్వయం నవనాగరిక నారీచిహ్నలను చాటుతున్నవి. ఆమె తండ్రిచెంత అడుగులోఅడుగువేస్తూ సిగ్గుదొంతరలలో కుంచించుకుంటూ, కోణదృష్టితో పరికిస్తున్నది.

భరద్వాజగారు మరెవరోగాదు, శివప్రసాదుమేనమామ. శివప్రసాద్తల్లి మరణశయ్యమీదనుండి అందగూ తనకొరకు విలపిస్తున్నపుడు, తనపతిని చెంతకుపిలిచి తన ఆఖరివినతిగా తనఅన్నపుత్రిక లలితను తనఇంటికి కోడలుగా స్వీకరించగోరి వీలునామాగా తనభర్త చేత

చేతిలోచేయి వేయించుకుని అంతిమశ్వాసను విడచింది. కాని ఆ మాటను నెగ్గించుకోగల అవకాశం కలుగకముందే శివ ప్రసాద్ తండ్రి పయనమయి, ఆలోకంలోని తనసతివద్దకు వెళ్ళిపోయాడు. ప్రమాణంచేయించుకున్నవారు, చేసినవారు అదృశ్యమైపోయినందున వారికోర్కె వారితోనే మరుగున పడిపోయింది. శివప్రసాద్ తలిదండ్రులకోర్కె ఒక్క భర ద్వాజహృదయంలోమాత్రం మొండిగా శిలలువేస్తూ వున్నది. ఆఫలితంగానే దీర్ఘకాలానికి యేదో సందేశంతో యిక్కడికి వచ్చాడు.

"ఇంతకాలానికి మేము గుర్తుకొచ్చామా బాబాయి! పోనీ, యిప్పటికయినా మామీద దయగలిగినందుకు సంతోషం. అందరూ కులాసాయేనా?" అంటూ భవానీ పరామర్శిస్తూ, లలితను వెంటతోడ్కొని వెళ్ళింది. శివం మామకు నమస్కరించి లలితను వోరగంటచూస్తూ వెళ్ళిపోయాడు.

నాలుగురోజులు గడచిపోయినవి. లలిత భవానీతో బాగా కలిసిపోయింది. వంటశాలలో ఆమెసలహాల కెక్కువ ప్రాముఖ్యముంటున్నది. భవానీకి పూజాదికాలను సమ కూరుస్తుంటుంది. భవానీహృదయాన్ని కొంతవరకు చూరగొన్నది లలిత. శివప్రసాద్ కు భోజనపుయేర్పాట్లుకూడా భవానీప్రోత్సాహంతో లలితే సమకూరుస్తున్నది. తనప్రతిభను నింపుచున్నది. కాని అది శివప్రసాద్ ను ఆకర్షించుటలేదు. వెగటుగా తోస్తున్నది. లలితకు యెక్కువగా శివ ప్రసాదుసమక్షంలో వుండాలనిపిస్తున్నది. ఆయనలోని అని

ర్వచనీయమైన అనుభూతి ఆమెకు తన్మయత్వంకల్గిస్తున్నది. ఆయనతో సంభాషించాలని కుతూహలముందిగాని, అవకాశం కలుగుటలేదు.

శివప్రసాద్ యిప్పుడు యింటివద్ద యెక్కువగా వుండుటలేదు. కాలేజీలోను, క్లబ్బులోను గేమ్సుతో కాలక్షేపం చేస్తున్నాడు. గోశాలకు దూరమయ్యాడు.

"భవానీ, ఒక్కవిషయం నీ చెవినివేసి వెళదామని వచ్చాను. లలితకు ఆ మూడుముళ్ళూవేసి నా బాధ్యతను పూర్తిజేసుకోవలసిన సమయం వచ్చింది. ఇది జన్మించిన నాటినుంచి దీన్ని శివంతల్లి తనకోడలుగా తలచింది. అందరకు ఆవిషయం తెలియజెప్పింది. మరణసమయంలోకూడా వాగ్దానంతీసుకుని ప్రాణం విడచింది. కాని ఆవిషయం శివం ముందు ప్రస్తావించటానికి నా మనస్సెందుకో సంకోచిస్తున్నది. అందువలన ఆమెవాంఛితాన్ని నిర్వర్తించుభారాన్ని నీమీద మోపుతున్నాను." అని ప్రస్తావించాడు భరద్వాజశాస్త్రి.

"అవును, ఆవిషయం మీద్వారా ఒకప్పుడువిన్నాను. కాని శివానికీవిషయం తెలియదు. లలిత యోగ్యురాలు. వీళ్ళిద్దరికీ వివాహంజరిగితే, చిలకాగోరింకలవలె ముచ్చటగా వుంటుంది. మీరు వచ్చినప్పటినుంచి ఈవిషయమే నా మనస్సులో దొర్లుతున్నది. ఈవిషయం నేడే తప్పక శివానికి చెపుతాను" అని సమాధానరూపంగా అన్నది భవాని.

ఆరోజు ఆదివారం. శివం చాలా ప్రొద్దెక్కి నిద్ర మేల్కొన్నాడు. దినకరుని లేతకిరణాలు అరుణ శ్వేతమిళిత రూపంలో కిటికీగుండా అనధికారప్రవేశంచేస్తున్నవి. శివ

ప్రసాద్ ముఖమండలంమీద పడుతున్న ఆ కిరణకాంతి మధు భరితమైన పుష్పాన్ని కల్పిస్తున్నవి. బడలికతో లేనబుద్ధిపుట్టక నేత్రఫలకాలను వదులుచేసి అర్ధనిమీలితరూపంలో చూస్తు న్నాడు. ఆ వెలుగులో సప్తరంగులు జిగిజిగిగా కనిపిస్తు న్నవి. ఆ సప్తవర్ణ కూర్పు అత్యద్భుతంగా కని పిస్తున్నది. అం దనుభూతమవుచున్న ఆనందాన్ని చెదర్ప జాలక తననేత్రఫలకాలతో దోబూచులాడుచున్నాడు.

"శివం, ఓ శివం, ఇంకా లేవలేదా నాయనా!" అంటూ వచ్చిన శ్రావ్యమైనధ్వని ఆయనఆలోచనల కంత రాయం కల్గించినది. "ఆదివారమేగదా అమ్మా, లేవాలని పించటంలేదు." అని సమాధానంవచ్చింది. "నీవు యెన్నడూ యింతప్రొద్దెక్కేవరకు పక్కమీదవుండలేదు. నీకొరకని ప్రత్యేకంగా లలిత టిఫినుతయారుచేసి గంటనుంచి యెదురు చూస్తున్నదిరా." అన్నది ఆమె.

ఆయనమనస్సు మరింత అయిష్టంతోనిండింది. "నాకీ పూట ఏమీ తినాలనిలేదమ్మా, పాలుత్రాగుతాను అంతే" అని సమాధానమిచ్చాడు.

భవానీ శివంపక్కమీద కూర్చుని కుడిహస్తంతో అతనిశిరస్సును సవరిస్తూ, వ్రేళ్ళను తలలోదూర్చిదువ్వుతూ "ఒకే అబ్బాయ్ శివం, నీకొరకని వేకువనుంచి శ్రమపడి లలిత చేసిన పుష్మా తినకపోతే, పాపం ఆ పిచ్చిపిల్ల యెంత బాధపడుతుంది! లలిత చాలా మంచిదిరా, నీవంటే దానికి అమితయిష్టం" అంటున్న ఆమెమాటలకు శివం

కాస్త విసుగును ప్రకటిస్తూ "అబ్బ! వుండమ్మా, కాసేపు నన్ను ప్రశాంతంగా పడుకోనివ్వు" అన్నాడు.

భవానీ :- ముందు నీవు లేచి స్నానాదులు ముగించుకురా, దానిచేతిమీదుగాచేసిన వుప్మా తిని, పాలుత్రాగి, 12 గంటలవరకు నీయిష్టంవచ్చినట్లు నిద్రపోదువుగాని.

శివం :- వద్దన్నపుడు నన్ను విసిగించబోకమ్మా.

భవానీ :- నీ కొక మంచిమాట చెప్పాలి. ఇవ్వాళ చాలా శుభదినం గనుక, ఆవిషయం నీకు తెలియ జేయాలని వుంది. అందువలన త్వరగా లేచివస్తే, ఆతరువాత నీ కా విషయాన్ని తెలియ జేస్తాను. అపుడుగాని, నా మనస్సు కుదుట పడదు.

శివం :- నిన్ను ఆందోళనపర్చేవిషయ మేముందమ్మా?

భవానీ :- భయపడబోకు. మానవహృదయాన్ని ఆందోళనపర్చేది దుఃఖఘట్టాలేగాదు, ఆనందఘట్టాలుకూడా నన్నది మర్చిపోకు.

శివం :- పోనీ, ఆ ఆనందాన్నయినా ఏమిటో తెలియ జెప్పమ్మా,

భవానీ :- అందుకే నీవు తొందరగా లేవాయనా.

శివం :- ఓ అమ్మా, నీవు చెప్పందే నేను లేవనే లేవను.

భవానీ :- ఇంతచదువులు చదివినా, నీలో యింకా మొండితనముందిరా.

శివం :- నేను యెన్నిచదువులు చదివినా, యెంత

పెద్దయినా నీముందు పసివాడినేనమ్మా, చెప్పవూ? నీ పాదాలుపట్టుకుంటాను, చెప్పమ్మా.

అనునయంగా అంటూ తనశిరస్సుపైనున్న ఆమె చేతిని తనహస్తాలలోకి తీసుకుని, తనముఖమండలంమీాద వేసి అదుముకుంటున్నాడు.

భవానీ :- మీా మామగారిని మర్యాదపూర్వకంగా పలుకరించ వెందుకు చెప్పు? నీతో యెన్నోవిషయాలు మాట్లాడాలని ఆయన ముచ్చటపడుతున్నాడురా.

శివం :- ఇదేనా ఆ గొప్పవిషయం అమ్మా? (అని దిగజారినకంఠంతో అన్నాడు)

భవానీ :- విషయ మది గాదనుకో. అయినా, ముందు యీాప్రశ్నకు సమాధానంచెప్పు.

శివం :- ఈమాటలడిగేది నీవేనా అమ్మా? మా నాన్నగారు చనిపోయినపుడు మన ఆస్తంతా తనచేతిక్రిందే వుంచుకోవాలని, మనలను ఆయన కబళించాలని ప్రయత్నించి, విఫలుడై నీతో యెన్నో పోరాటాలుజరిపి యెంతో కాలంవరకు మనలను సాధిస్తూనేవచ్చాడని, కవుళ్ళు యెగగొట్టించి, దావాలువేయించి, మనమీాది కెందరినో రెచ్చగొట్టించి మనకు గొప్ప నష్టాన్నికల్పించాడని, నేను పాశ్చాత్యదేశాలువెళ్ళినపుడు నేను క్రిష్టియనునైపోయానని ఒక మాలదాన్ని వివాహంచేసుకోబోతున్నానని, యూరపులో త్రాగితందనాలాడుతున్నానని పచ్చిబూటకాలను కల్పించి ప్రచండమైన ప్రచారంసలిపి మనయింటికి సగోత్రీకు లెవరూ రాకుండాచేశాడని, రేయింబవలు మనను సాధిం

చుతే మనఆస్థిని సర్వనాశనంచేయుతే తన ఆశయమైనట్లు శనిగ్రహంవలె మనవెంటబడ్డాడని, మనపశువులను దొంగలకు తోలిపెట్టాడని, మనకుప్పలను పరశురామప్రీతిచేయించాడని నీవు యెన్నోమారులు చెప్పావు. నేను పాశ్చాత్య దేశంలో వున్నపుడుకూడా జరిగిన దురంతాలను వరుసగా వుత్తరాలలో వ్రాశావు. వాటిలో నేను యేఒక్కటీ మరువలేదమ్మా! ఆయనచేసినప్రచారాలతో మనయింటికివచ్చే బంధువులు, కులస్తులు లేకుండాపోయారు. అందువలన మన హృదయాలు మరింత ధృఢమైనవి. ఒంటరితనంతోనే నిలచి, కాలానికికట్టుబడి నిశ్చలతపొంది ఆనందాన్ని సృష్టించుకోవటం నేర్చుకున్నాము. బంధువులను స్వీకరించే అలవాటుగాని, ఆదరించే అలవాటుగాని లేకుండా ఆయనగారిచర్యలే చేసినవి. నేడు ఆకస్మికంగా ఆయన్ను ఆదరించగలఅలవాటు నా కెలా వస్తుందమ్మా?

భవానీ :- గతించిన దుఃఖంతో మధురత్వం వికసిస్తుంది. స్మృతిపథంలోని దుఃఖంద్వారా ఆనందానుభూతి నందుటకూడా విశేషనైపుణ్యం శివం. దుఃఖాన్ని స్మరించి దుఃఖాన్నిపొందుట వివేకలక్షణంగాదు నాయనా. ఆయన కల్పించిన సర్వకష్టాలను ప్రత్యక్షంగా అనుభవించినదాన్ని నేను. అయినా, నా కీనాడు ప్రతీకారవాంఛలేదు. ఎవరి క్రూరకృత్యాలు వారి వెంటనంటివుంటవి, వాటిఫలితాలను వారే అనుభవిస్తారు. ఎదుటివారి అపరాధాలను సహించటంలోను అంతకుమించి క్షమించటంలోనే మానవపరి

పూర్ణత్వముంది నాయనా; అక్కడే మానసిక శాంతి లభిస్తుంది. కనుక గతాన్ని విస్మరించు నాయనా.

శివం :- అందుకే ఆయన్ను నేను యెన్నడూ యేమీ అనలేదు. ఆనాడు అన్నిచేసి నేడు యిక్కడకుచేరి నీ ఆతిథ్యాన్ని పొందుతున్నా నేను పట్టించుకోనుటలేదు. అంతకుమించి నన్నేమిచేయమంటావమ్మా.

భవానీ :- ఆయన మన కెంతద్రోహంచేసినా, లలిత నిరపరాధినిరా. దానిమనస్సు చాలా మంచిది. తండ్రికంటె మనయడల దానికి మమకార మెక్కువ. నీయడల అమిత అభిమానముందిరా. చాలా అణకువ మెలకువగల పిల్ల కూడాను.

శివం :- అయితే నన్నేమిచేయమంటావమ్మా? ఆమెచేసినప్పుడ్మా తినమంటావు అంతేనా. సరే, నీమాట కాదనట మెందుకు? అలాగే తింటానులే.

భవానీ :- అదిగాదురా, నీ చిన్నతనంలో లలితపుట్టినపుడు మీఅమ్మ కొండంత వేడుక జేసిందట. మీ అమ్మ పంచప్రాణాలూ లలితమీదే వుండేవట.

శివం :- ఆమెకు పసిపాపలంటే యిష్టంగాబోలు.

భవానీ :- అదిగాదురా, లలితపుట్టినపుడు నీకు భార్యజన్మించిందనే మీ అమ్మ అందరితోనూ చెప్పిందట. అంతేగాదు, ఆమె అంతిమసమయంలో నీవు లలితనుచేయు నట్లు మీనాన్నగారిచేత ప్రమాణంచేయించుకుని ప్రాణం విడిచిందట.

శివం :- (విభ్రాంతుడై) అదేమిటమ్మా, నా వివాహాన్నిగురించి తనవీలునామాను ప్రకటించిపోయిందా?

భవానీ :- అవునురా. తన అంతిమకోర్కెగా చెప్పిపోయింది.

శివం :- ఆమె యేలోకంలోనున్నదోగాని, నాకు అనంత భక్తివుంది కాని, ఆమెవీలునామాను పాటించుట నాకు శక్యంగానిదమ్మా.

భవానీ :- మీ తల్లి మహా యోగ్యురాలు; ఆమె కోర్కెను వుల్లంఘించటం మంచిదిగాదునాయనా, అయినా, తన తండ్రిదుష్కార్యాలకు లలిత బాధ్యురాలుగాదు. అది చాలానమ్రతగలది, సుశీల, సద్భావాలుగలది. నీకు చక్కగా అతికిపోతుంది. నా మన స్సెందువల్లనో ఆ పిల్లయడల శ్రద్ధ ప్రేమలతో నిండిపోయింది. మనయింటిలోనే వుంచుకొని, నేను విశ్రాంతిపొందాలనిపిస్తున్నది. నీ బాగోగులను చూడగలనేర్పు ఆమెలో నిండి నిబిడీకృతమైయున్నది.

శివం :- భూమిలోనిస్వభావం యెక్కడ యేరూపంలో వుంటే అక్కడి నీటికి ఆయాప్రభావాలు కలిగివుంటవి. క్వినైన్‌తో తయారయే నవాక్వైన్ అయినా, హెమోజిన్ అయినా మరేదయినా ఆ స్వభావంతోనే వుంటుంది. కూతురులో తండ్రిస్వభావం లేదని నీ వెలా చెప్పగలవమ్మా! అయినా, యీవిషయంలో నన్ను వత్తిడిపెట్టవద్దని ప్రార్థిస్తున్నాను. నామనస్సులో వీరి కేమాత్రమూ స్థానంలేదు. మనలను కులభ్రష్టులుగా సృష్టించినవారిని మనలోకలుపుకుని వారికులాన్ని మట్టిపాలుచేయటం మర్యాదగాదు. ఏదిఏమ

యినా, ఇప్పుడు నేను వివాహంచేసుకోబోనటంలేదు. ఆ సమయమొచ్చినపుడు నా మన స్సెలావుంటుందో అప్పుడు విచారిద్దాము. నన్ను మరీ వత్తిడిపెట్టి, నాకు బాధ, నీకు చీకాకు కల్పించక క్షమించమ్మా.

భవానీ :- శివం, నీకు ముక్కుసూటిగాపోవట మే తెలుసు. కాని, ఇది లోకం. ఇక్కడ అనుభవం అవుసరం, మురుగులో జనించిన కమలానికి మురుగుస్వభావముం టుందా నాయనా! కటికిచేదయిన వేపపూతలో భ్రమరం మధువును పొందుటలేదా? ఒకరోజు హేయమయినది మరో రోజు మధురమవుట స్వాభావికం. హేయపురోజులనాటి దృశ్యాలనుస్మరించి పొందనున్న ఆనందాన్ని విస్మరించటం అవివేకం నాయనా. నామాట విని లళితవిషయంలో సమ్మ తించు బాబూ. నేను దానికి మనసా మాటయిచ్చాను. మీ అమ్మమాటను నెగ్గించటం మన అందరికర్తవ్యం.

శివం:- (నేత్రాలను నులుముకుంటూ ఒళ్ళువిరుచు కుంటూ కాళ్ళనుతన్నిపట్టి, ఆవలింతతో, కాస్త మత్తునువద లించుకుని) అబ్బ! ఏమిటమ్మా, నీవు యింతప్రొద్దున్నే నాదగ్గరకొచ్చింది యీ తికమకలకేనా? నీ పాదాలుపట్టు కుంటాను, నన్ను ప్రస్తుతానికి క్షమించు. మా అమ్మపీలు నామాను నీ వాగ్దానాన్ని ప్రస్తుతానికి వాయిదా వేయండి.

అని శివప్రసాద్ లేచి వెళ్ళిపోయాడు.

నదీస్నానానికని వెళ్ళినశివం తిరిగిరాలేదు. పదిగంటలు దాటింది. భవానీ భయవిహ్వాలురాలై విలపిస్తూ పాలేళ్ళ నందరిని నదివైపు పంపింది. వారికి ఆచూకీ తెలియక విఫలురై తిరిగివచ్చారు. ఈ వార్త విన్నపుడు భరింపజాలక

భవానీ మూర్ఛితురాలైంది. ఆమెకు సపర్యలుచేస్తున్నది లలిత. భరద్వాజ యెప్పుడూ ఏ పాలేరుతోనో మరేరైతు తోనో సంభాషిస్తూ విషయసేకరణచేస్తూవున్నాడు.

అరగంటతరువాత భవానీ తేరుకున్నది. ఆమెమన స్సంతా అంధకారంతో కల్లోలితమవుతున్నది. తాను ప్రస్తా వించిన వివాహవిషయంలో క్రోధావేశుడై తనముందు యెక్కువ చెప్పజాలక, శివం పరితపనతో నదికి వెళ్ళినట్లు తననిరోధంనుంచి తప్పించుకొనుటకు ఆయన నదిలోలీన మయినట్లు, ఆయన నిర్మలమైన ముద్దుమొఖం తనవైపు జాలిగా చూస్తున్నట్లు తనపొరపాటుకు రాక్షసులు తన మీదికికూడా దూకుతున్నట్లు— ఈ దృశ్యాలన్నీ చూచి భరద్వాజ వెకిలిగానవ్వుతున్నట్లు, వ్యంగ్యంచేస్తున్నట్లు ఆమె స్మృతిపథంలో సినీరీలువలె నడుస్తున్నది. భరింపరాని దుఃఖంతో విమూఢురాలై పృథ్వీమాతకేసి శిరస్సుమోదు కుంటూ దొర్లిగింతలుబెడుతూ విలపిస్తున్నది.

భరద్వాజముఖంలో నూతోన్నతాసహితముద్రిక లేవో కనిపిస్తున్నవి. దీర్ఘమైన గంభీరాలోచనలేవో ఆయననొసట ప్రస్ఫుటమవుచున్నవి. వివరమైన ఆరాలుతీస్తున్నాడు.

నూర్జహాను కీ వార్త పిడుగుపాటయింది. మతిపోయి నట్లు ఆమెశిరస్సు తిరుగుచున్నది. పాదాలు భూమిమీద ఆనుటలేదు. ఒక్కమాటుగా జ్వాలాముఖిపర్వతం పగిలి పొంగి భూకంపాన్నికలిగించినట్లు ఆమె చిన్నిహృదయం కంప నలతో వూగిపోతున్నది. నేత్రాలు జ్యోతులవలె అయినవి. అంతా అయోమయ అంధకారమయింది. కన్నుపొడుచు

కున్నా కనిపించేస్థితిలో లేదు. నరములలో నిస్త్రాణ కలిగింది. అగాధ జలరాశిలోమునిగినట్లు వూపిరిసలుపక వుక్కిరిబిక్కిరిఅవుతూ జ్ఞానహీనురాలై అజ్ఞాతశిశువువలె తప్పటడుగులు ఒక్కటొక్కటిగా వేసుకుంటూ అశ్రుస్రవంతిని అద్దుకుంటూ పెల్లుబుకుతున్న దుఃఖాన్ని అణచుకుంటూ భవానీ చెంత కొచ్చింది. రోదనలతో ఆక్రందనలతో విలపిస్తున్న భవానీ యెవరినీ గమనించేస్థితిలో లేదు. ఆమెదుఃఖాన్ని సాదృశ్యంగా చూసినపుడు నూర్జహాను దుఃఖం హద్దులను అధిగమించింది. దుఃఖాన్నిచూసినపుడు దుఃఖితహృదయం పొంగిపొరలుతుంది. మొదలుత్రెగినమ్రానువలె నూర్జహాన్ పడిపోయింది.

ఈ దృశ్యం భవానీకి సపర్యలుచేస్తున్న లలితకు వెగటును కలిగించింది. తనతండ్రి చెప్పినమాటలన్నీ ఇపుడామె స్ఫురిస్తున్నవి. ఆమె మరీమరీ నూర్జహాన్ ముఖమండలాన్ని, ధరించినవస్త్రాలను పరికిస్తున్నది. చూచినకొద్దీ ఆమె ఆలోచనలకు అంతరాయంకలుగుచున్నది. తను యెంత పరిశీలించినా ఆ ముఖమండలంలో యెక్కడా మహమ్మదీయ లక్షణాలు కనిపించుటలేదు. తనకంటె ఆ ముఖంలోనే బ్రాహ్మణతేజస్సు వున్నది. ఆమెధరించినదుస్తులు తనను మరింత విచలితను జేస్తున్నవి. పరిశీలించినకొద్దీ ఆ ధరించినది శివప్రసాద్ ధోవతి, బనీను అని అర్థమవుతున్నది. ఈమెను గురించి తనతండ్రిద్వారా విన్న వికారవిషయాలు అనృతాలేమోనని శంకకలుగుచున్నది. ఆమె మహమ్మదీయకన్యాగాదు, అందవిహీనురాలు అంతకంటే కాదు. బుద్ధిహీను

రాలూం అయివుండదు అని, దొంతరులవలె మనస్సులో వొర్లు తున్నవి.

నూర్జహాను విమూఢురాలివలె భవానీపాదాలపై పడి, తనముఖాన్ని ఆమెపాదాలకద్దుకుంటూ "బాబూజీ, నీవు పరమపవిత్రుడవైన దయానిధివి. ఇంత చెడువార్త వినటానికే నన్ను యిక్కడవుంచావా?" అని వాపోతున్నది.

నూర్జహాన్‌లోని విలాపప్రలాపన భరద్వాజను చకితుని జేసింది. ఆయనవూహాలలోని నగ్నసత్యాలు ఒక్కమాటుగా బయటపడినట్లు, తనవాంఛితసత్యాలు అనాలోచితంగా అర్థమయినట్లు మరింత వుత్సాహితుడై, రివ్వున నూర్జహాన్‌పడి దొర్లుతున్న చోటుకొచ్చి హూంకరిస్తూ, "యే, బూబుపిల్లా, నీకు బుద్ధిలేదూ? నీవేమయినా చుట్టానివనా పక్కానివనా, నీదంతా పోయినట్లు యేడుస్తున్నావు! పో, నీవు యేడువదలచితే, బజారులోపడియేడువుగాని, యీ మాలతరహా యేమిటి? ఇది బ్రాహ్మణయిల్లు; ఇదికూడా నీ సాయబులకొంపచేయాలనా?" అని గర్జిస్తూ తనపాదాలతో ఆవిడను ఆవలకు నెట్టప్రయత్నించాడు. కాని అది ఆమె గమనించేస్థితిలో లేదు. తనను ఆయన పాదాలతో ఓదారుస్తున్నట్లు భావించి, మరింతగా విలపిస్తున్నది. భరద్వాజగారి క్రోధావేశాలు పెరిగినవి. ప్రక్క మూలనున్న గొడుగు చేతబట్టి గొడుగుకొంకిని ఆమె కేశరాశిగుండాదూర్చి "ఛీ, భడవా, ఇంట్లో జేరి అందరిని మ్లేచ్ఛులను చేయదలచావా? ఈ దొంగయేడ్పు బయటకు వెళ్ళి యేడువు, నీచురాలా" అని గర్జిస్తూ, బటబట బయటకు యీడ్చుకుపోయాడు.

అంతదుఃఖంలోవున్నా భవానీ క్రీగంట ఆ దృశ్యాన్ని పూర్తిగా చూడగలిగింది. మూలిగేవానిమీద మరో మోటుదెబ్బ పడినట్లు భవానీ కిది భరింపరానిదైంది. క్రోధావేశాలతో నిండిన రుద్ధకంఠంతో, "భరద్వాజ్, దాన్ని నదులు, ఆ అభాగ్యురాలిమీద అంత క్రూరత్వం చూపుతా వెందుకు?" అన్నది భవాని.

భరద్వాజ్ :- భవానీ, మర్యాదగా మాట్లాడు. నాది క్రూరత్వమో నీది నీచత్వమో బాగా తెలుసుకో, ఒక మ్లేచ్ఛురాలిని యింట్లోచేర్చి యీ యింటికులప్రతిష్టను సర్వనాశనంచేయదలచావు.

భవానీ :- నీవూ నీ కూతురూ వచ్చి నా బిడ్డను మాయంచేశారు. మీరు యెప్పుడూ మాకు శత్రువులే. నీఅంత క్రూరబుద్ధి యెక్కడా వుండదు. గతాన్ని విస్మరించి, నీకూతురును నాబిడ్డకు చేయాలని వెర్రిప్రయత్నంచేసి, నా ప్రాణప్రదమైన బిడ్డను దూరంచేసుకున్నాను. నేడు నీ రాక్షసత్వం నగ్నరూపంలో దృగ్గోచరమవుచున్నది. నీవు ఆ పిచ్చిదాన్ని విడచి, నీ కూతురుతో బయటకు నడువు, జన్మలో మళ్ళీ యిటు రాబోకు రాక్షసుడా.

భరద్వాజ్ :- భవానీ, జాగ్రత్తగా మాట్లాడు. ఈ యింటిని మ్లేచ్ఛమయంచేసేఅధికారం నీకు లేదు. నేను బ్రతికుండగా అలా కానివ్వను. ఈ యింటిమర్యాదలను నిలబెట్టవలసినబాధ్యత నామీద వున్నది. ఈ యింటిలో నీకెంతో నాకూ అంతే హక్కున్నది. ఇపుడుగాకపోతే రేపయినా

నిన్నే బయటకు నడిపిచూపుతాను. మితిమించి మాటాడక, నోరుమూసుకు కూర్చో.

ఎవరికోరకు వీరంతా యింతగా విలపిస్తున్నారో ఆ శివప్రసాద్ వచ్చి భరద్వాజమాటలు వింటూ బయటనే నిలిచిపోయాడు. భరద్వాజప్రదర్శిస్తున్న తన నగ్నత్వాన్ని, ఇటు భవానీ యెవరినైతే హేయంగా హీనంగా చూసేదో వారిమీద చూపుతున్న ఆదరం, యెవరికోరకు తను యీఉదయమే యెంతగా వినతిచేసిందో వారియెడల యిపుడు చూపుతున్న తృణీకారం చూసినపుడు స్థంభీభూతుడైనాడు.

లోకం యెంత విచిత్రమైంది! పైకికనిపించేవన్నీ యదార్థసత్యాలు కావు. సత్యమైనదానికే ఆఖరివిజయం. నూర్జహాన్ యడల భవానీకికలిగిన కరుణ తనను ముగ్ధునిచేస్తున్నది. నిండుహృదయంలో కరుణ నిండివుంటుంది.

భరద్వాజ కటువైనఆఖరిమాటలు శివంహృదయం మీదకత్తిపోటులవలె గుచ్చుకున్నవి. ఆయననెత్తిన యెవరో మొట్టినట్లు వులికిపాటుతో ఒక్కఅంగలో వెళ్ళి భవానీ పాదాలుపట్టి నేత్రాలకద్దుకుని ఆమెను లేవనెత్తాడు. భవానీ ఆయన్ను తనహృదయానికి హత్తుకుని, నేత్రాలు మూసి, దీర్ఘమైన శ్వాసనువదలుతూ అశ్రుస్రవంతిని కొంగుతో అద్దుకుంటూ శివంశిరస్సును దువ్వుతున్నది. నెమ్మదిగా శివం లేచి నూర్జహాన్వద్దకెళ్ళి ఆమెను లేవనెత్తాడు. ఆమెఅధరాలు దంతాలమధ్యపడి పగిలినవో లేక ఆమె భరించరానిబాధతో కొరుకున్నదో గాని, రక్తస్రావమవుచున్నది. అగాధజలరాశినుంచి యేదేవతో లాగి బయట

వేసినట్లు దీర్ఘమైన చల్లటిశ్వాసను విడచింది. ఆమె అధరాలనుఅంటి చెదిరిన రక్తముద్రికలు, మొఖమంతటా పులుముకున్న అశ్రువులు చెదిరి ముఖంమీందికొచ్చి కుచ్చులవలె వక్రాలతోనున్న కురులు ఆమెశోభను అద్వితీయంచేస్తున్నవి. ఆమెనేత్రాలలో జాలితోగూడిన భయమింకా తొంగిచూస్తున్నది. అధరాలెందుకో మృదువుగా అదుకుతున్నవి. ఆమెశరీరంలోని వణుకు శివప్రసాద్‌హస్తాలకు అనుభూతమవుచున్నది. ఆమెను నెమ్మదిగా గోశాలగదిలోనికి పంపి, తిరిగి భవానీవద్ద కొచ్చాడు. వనపూల్-మానదండలోని ఏదోదృశ్యంవలె చూస్తూ నిర్ఘాంతపోతున్నాడు భరద్వాజ. లలిత తనకుతానే చిన్నబుచ్చుకుంటూ తండ్రివైపు చూస్తున్నది. జరిగినదంతా ఒక విచిత్రమైన స్వప్నంగానో చూచిన సినిమాదృశ్యంగానో అనిపిస్తున్నది ఆమెకు. రోహిణియెండతీవ్రతకు బీటలిచ్చిన పృథ్వీమాతపై కుంభవర్షము కురిసినట్లు భవానీహృదయం ఆనందంతో నిండి తొణికిసలాడుచున్నది.

"నాయనా, నా పొరపాటుకు తగినశిక్ష ననుభవించాను. నీవు అమాయకుడవనుకున్నాను కాని, నేనే వెర్రిదాన్నయినాను. ఈలోకంలో గోముఖవ్యాఘ్రాలను గ్రహించుటకూడా ఒక గొప్ప నేర్పని నేడు అర్థంచేసుకున్నాను. నాయనా, నా జీవితంలోని యెక్కువభాగం భరద్వాజ కల్పించిన బాధలనే అనుభవించాను. ఆయనకృత్రిమ కర్తృత్వాలతో ఎంత ఆస్తి యెంతో హరించింది. మనలను మనఆస్తిని కబళించాలని ఆయనచేసిన ప్రయత్నాలన్నీ

విఫలమై నేడు యీరూపంలో చేరి, మనలను నాశనంచేయ జూచాడు. నీవు జాగ్రత్త నాయనా! ఇలా నాదగ్గరకు రా" అంటూ చేతులుచాపింది భవాని.

"అలా ఖంగారుపడతావెందు కమ్మా, ఎవరి పాప కృత్యాలు వారినే పతనోన్ముఖానికితీసుకెళతవి. వారిని రోజూ నీవు పూజించే భగవంతుడే తగినంతగా శిక్షిస్తాడు." అని వోదార్పుమాటలంటూ తీక్ష్ణమైనచూపులతో భరద్వాజ వంక చూశాడు. కన్నములోదొరికిన దొంగవలె నిశ్చేష్టుడై తనదృష్టిని బయటవైపుకు మరల్చాడు.

"మామయ్యా, నిన్నుగురించి నాకు నూతనంగా కలిగిన క్రోధావేశాలేమీ లేవు. వుండవలసినవేనో శాశ్వతమైనఅభిప్రాయాలు వుండనేవున్నవి. అపశ్రుతులలోని నీ నాటకాన్ని దయతో యిప్పటికయినా ముగించి వెళ్ళమని వినయపూర్వకంగా ప్రార్థిస్తున్నాను. నీలోని విషతత్వాన్ని పాపం! అమాయకురాలైన లలితలోకూడా నింపి సర్వనాశనంచేయబోకని గుర్తుజేస్తున్నాను". అని స్పష్టమైనకఠిన శబ్దాలలో అన్నాడు.

లలితమనస్సుకీ మాటలు మబ్బుతెరను తొలగించినట్లయి, ఒక్కటొక్కటిగా వూహిస్తున్నది. గతించినవి నేటివి ఆమెమనస్సులో దొర్లినపుడు అందలి తనతండ్రి విషభరితనాటకదృశ్యాలు విశదంగా కనిపించినవి. ఆమెముఖమండలం మ్లానమైంది. నూర్జహాన్ యడల తనతండ్రి చూపిన ప్రవర్తనకూడా ఆమెకు హేయంగా కనిపించసాగింది. తన తండ్రి తనదృష్టికే యిపు డేదో మాయలపకీరువలె గనిపిస్తు

న్నాడు. మరో ప్రక్కనున్న శివప్రసాద్ త్యాగమూర్తి యోగమూర్తివలె కనిపిస్తున్నాడు. తను గమనించినకొద్దీ పవిత్రమైన తేజస్సు అతనిముఖంనుంచి ప్రకాశిస్తున్నది.

క్రూరుడు చతురుడు కార్యసాధకుడు అయినవాడు దురాక్రమణతో విఫలుడైనపుడు పాదాలంటి ప్రార్థించుటలో నిపుణతకలిగివుంటాడు. యెత్తులు జిత్తులు అతనికి పావులాటలలాంటివి. భరద్వాజ వెంటనే లేనిదుఃఖాన్ని తెచ్చిపెట్టుకుని ముఖకవళికలను దీనత్వంతో నింపుకుని, అధరాలను వణికిస్తూ కంఠాన్ని రుద్ధంచేసుకుని రెండడుగులలో శివందగ్గరకు జేరి ముఖానికి చేతులుచాటుచేసి "నాయనా శివం, నీవు దేవునివంటివాడవు. నేను అంధుడనై చేయరానివి చేశాను. ఎన్నోరకాల అపకారాలు కల్పించాను. నేడు నా తెలివితక్కువతనం నన్ను క్రుంగదీస్తున్నది. నాలోని అంధతెర తొలగింది. నన్ను క్షమించు నాయనా. నా అపరాధాలఫలితంగా లలితకు శిక్షనివ్వబోకు. దానికి నీ యడల విశిష్టమైన శ్రద్ధాభక్తులున్నవి. అది నిరపరాధి. నన్ను క్షమించి దాన్ని స్వీకరించు శివం." అని విలాపరూపంలో విన్నవించాడు.

నిర్మలమైన ప్రశాంత స్నిగ్ధత్వంతో "నాకు మీ యడల యీనాడు క్రొత్తగాకలిగిన భావనలేమీ లేవు. ఆదరమూ లేదు, అనాదరమూ లేదు. కులాన్ని కోల్పోయిన యీ మ్లేచ్ఛునికి దేశదిమ్మరికి మీరు ఆధిక్యతనిచ్చి, మిమ్మే మీరు న్యూనతపర్చుకోకండి. నాకు అప్రస్తుతమైన ఆధిక్యతనిచ్చి మీవంశానికి మచ్చతెచ్చుకోకండి. మీలాంటి

యోగ్యులైనవారిని వెతికి వారిచేతిలోపెట్టి ఆమెను వుద్ధరించండి. మీరు మమ్మల్ని పూర్తిగా మర్చిపోతే మా కదే పదివేలు" అన్నాడు శివం.

ఈమాటలువింటున్న భవానీకి యెక్కడలేని ఆవేశం కలిగింది; అగ్నిలో ఆజ్యంపోసినట్లు హృదయం భగభగమంది. "నీ మోసాలు యిక నాదగ్గిర సాగవు. ఇంకా నక్కవినయాలు నటించకు. భగవంతుడు మా మంచినిగోరే నీ నిజరూపాన్ని మరోమాటు ప్రదర్శింపజేశాడు. నీవు కర్రతో శిరస్సుమీద మోది, కాళ్ళుపట్టి ప్రాధేయపడగల గోముఖ వ్యాఘ్రానివి. నీ సుపుత్రికనుకూడా బాగానే అర్థంచేసుకున్నాను. నన్నూ నా బిడ్డను యిక మోసంచేయలేరు. వెంటనే మర్యాదగా బయటకు నడవండి." అని చెప్పుతూ పెద్దగళంతో ధూత్కారరూపంలో అన్నది.

భరద్వాజకు పట్టరాని ఆవేశంకలిగింది. నాసికారంధ్రాలు వుబుకుతున్నవి, అధరాలు అదురుతున్నవి, శరీరంలో నరాలు తన్ని తానంచేస్తున్నవి. లలితకుకూడా పట్టరాని కోపమొచ్చింది. తండ్రిని చేయిబట్టి లాక్కొని బయటకు వెళ్ళిపోవాలనుకుంటున్నది.

శివం అనునయంగా భవానీహస్తాన్నిబట్టి సవరిస్తూ, "ఎందుకమ్మా, అంత వుగ్రురాలవవుతావు. యెవరిపాపం వారినే హరిస్తుందని నీవే అంటావుగదా; యెవరికృత్రిమాలు వారినే సమూలంగా కృశింపజేస్తవని నీవే అంటావుగా. కష్టాలను సహించటం ద్రోహులను క్షమించటం అన్నిటికంటె గొప్పవని యెన్నోమారులు నాకు వుపదేశించావు;

అలాంటి నీవు యీనాడు యింత ఆవేశపడతావెందుకమ్మా."
అన్నాడు.

భరద్వాజలోని క్రోధావేశాలు కొంచెం మందగించినవి. లలిత తిరిగి స్థిమితపడి శివాన్ని పరికిస్తున్నది. అందని ఆనందడోలికవలె ఆమెకు శివం కనిపిస్తున్నాడు. ఆమెమనస్సు అతనినిచూడాలని, చూస్తున్నకొద్ది అతనినిచేరాలని, ప్రక్కనున్న తండ్రినుండి దుష్కార్యాలదుర్గంధం దొర్లుకొస్తున్నట్లు అనిపిస్తున్నది.

కొంచెం కుదుటపడిన మనస్సుతో స్థిమితతను ప్రకటించుకంఠంతో "నీకు తెలియదు నాయనా, బాధలు అనుభవంలోగాని అర్థంకావు. ద్రోహంచేసినవారు, బాధలు కల్పించినవారు, హింసించినవారు ఆతరువాత సునాయాసంగా మరువగలరు. వాటిని విన్నవారు చూచినవారుకూడా పోనీ లెమ్మనగలరు కాని, స్వయంగా అనుభవించినవారు మరచుట సాధ్యంగాదు నాయనా. వీరిముందు బంధుత్వాలకు గాని, మనుష్యుల మంచిచెబ్బరలకుగాని విలువలేదు. వీరికి డబ్బే ప్రధానం. వీరు చెప్పేవి, నటించేవి ధర్మాలు, న్యాయాలు, పేరు ప్రతిష్టలు, కుల గోత్ర వంశప్రతిష్టలే కాని వీరిలోఅవిమచ్చుకుకూడా లేవు. వీరికంటె యెవరైనతే మ్లేచ్ఛ బాలికఅంటున్నామో ఆ చిన్నదానిలోకూడా మానవత్వము మమకారము విశ్వాసము వున్నవి. పదినిమిషాలకుముందున్న వీరివైఖరినిచూస్తే నీవే తేటతెల్లంగా గ్రహించేవాడివి. దుఃఖానికిబదులు వీరు ఆనందంతో మనయింటిని ఆక్రమించుకుని కబళించేవూహాలతో వుక్కిరిబిక్కిరిఅయ్యారు. నీయడల

ప్రచ్ఛన్నరూపంలో వున్నవిశ్వాసం ఆ మ్లేచ్ఛబాలికలో ప్రస్ఫుటమయింది. నీకొరకు దుఃఖంభరింపజాలక విలపిస్తున్న ఆ బాలికను కిరాతకునివలె బయటకు బటబటలాగాడు. నీవు రాకపోతే ఆతరువాత నాగతీ అంతేఅయ్యేదన్నవిషయం నేను విస్మరింపజాలను. ఇక నీవు అనవసరమైన శ్రమతీసుకోకు. —భరద్వాజ్, వెంటనే యింటిబయటకు నడువు. నీముఖం మళ్ళీ జన్మలో యిటు చూపబోకు," అని నిష్కర్షగా అన్నది.

"క్రోధంలో తొందరపడకమ్మా. పెద్దదానివి అన్నీ తెలిసినదానివి, అనాలోచితంగా అన్నీ యేకరువుపెడితే యేంప్రయోజనమమ్మా! ఈ ఉదయం నీకున్నఅభిప్రాయా లకు యిప్పటి నీఅభిప్రాయాలకు యెక్కడ పొంతన అమ్మా! స్త్రీలు యెంతతొందరపడతారో అంత పశ్చాత్తాపపడతారు, తిరిగి మర్చిపోతారు. పురుషుడు అన్నిటిని మిళితంజేసుకుని జీర్ణించుకుని హృదయకుహరంలో అణచివేస్తాడు. అది అవు సరమైనపుడు దిక్సూచీనలె పనిచేస్తుంటుంది. తేడా అంతే నమ్మా. నీకు తెలిసిన విషయాలన్నీ నాకు తెలుసు. వేటినీ మరువలేను. వాటిని స్మరించి వాటి ఆయుర్దాయాన్ని పెంచి చీకాకుపడదలచలేదు. అందుకే ఉదయం నీవుతెచ్చిన ప్రస్తా వనను నిష్కర్షగా నేను నిరోధించింది" అని అన్నాడు శివం.

భవానీ పొంగిపోయినహృదయంతో ఆనందబాష్పా లను అద్దుకుంటూ శివప్రసాద్‌శిరస్సును తనవైపుకువంచి ముద్దిడుకుంటూ, "నేను పిచ్చిదాన్ని నాయనా, ఇక యెన్నడూ

అలాంటిపని చేయను. నే నేదో అశుభంతలపెట్టినట్లు దాన్ని నీవు నీ తెలివితో భగవంతునికృపతో తప్పించుకుని, శుభం పొందినట్లు నా మన సిప్పుడు తేలికపడింది నాయనా! లోపలికి పద నాయనా, దిష్టితీసి వేస్తాను" అంటూ శివాన్ని వంటయింటివైపు లాక్కెళ్ళి చేటనిండా మిరపకాయలు వుప్పూ వెండు్రికలను నింపి, శివానికి దిష్టితీసి మంటలోపోసి, మెటికలిరుస్తూ యేదో మంత్రించింది. ఆ కోపహారులో భరద్వాజ పుత్రీసమేతంగా పలాయనంచిత్తగించాడు.

# 5. దేవుని మైల

రాత్రి రెండుజాములు గడిచిపోయినవి. నిద్రకొరకు శివప్రసాద్ చేసిన విశ్వప్రయత్నాలు విఫలమయినవి. అంతంలేనిఆలోచనతో మనస్సు అలసటచెందటానికిబదులు వుత్సాహాన్ని పొందుతున్నది., ఆలోచనలు యెక్కువయినపుడు రక్తప్రసారం యెక్కువయి, చెమటలుగ్రమ్మట సహజము. ఆలోచనలదొంతరులలో మధురత మరింత హెచ్చినపుడు వూపిరిసలుపక పడుకున్నవారు కూర్చోవటం, కూర్చున్నవారు నిలుచోవటం, నిలుచున్నవారు అటూయిటూ పచార్లుచేయటం పరిపాటి. ఇష్టోన్ముఖియై పోతున్న కుక్కపిల్లను బాలకుడు యెంతప్రయత్నంతో యెటుతిప్పినా పోదలచినవైపుకే తిరిగి పయనించినట్లు, శివప్రసాద్ తనఆలోచనలను యెటుతిప్పినా మరుక్షణంలో మళ్ళీ ఆ నూర్జహాన్ వైపుకేపరువెడుతున్నవి. ఆమె భవానీదయను చూరగొన్నం

దుకు తనకుతాను మహదానందాన్ని పొందుతున్నాడు. కీచకునివలె, కంసునివలె, రావణునివలె, మాయలపకీరువలె, మాంత్రికునివలె ఘృణితరూపంలో గోచరిస్తున్నాడు భరద్వాజ. ద్రౌపదివలె సీతవలె పవిత్రమూర్తియై తనవైపు దీనత్వంతో చూస్తున్నట్లు, తనను దయాభిక్ష వేడుతున్నట్లు కనిపిస్తున్నది నూర్జహాన్.

యావజ్జీవరాసులూ నిద్రామతల్లి ఒడిలో బుసలు గొడుతూ విశ్రాంతినొందుచున్నవి. అది కాళరాత్రి. గగనమండలంలోని చిరపరిచితమైన నక్షత్రమండలం మిణుకు మిణుకుమంటూ దోబూచులాడుచున్నవి. మందగమనపవనాలకు నటనృత్యరాజదళాలు కరతాళనృత్యంచేస్తున్నవి. కృష్ణాతీరంనుంచి గాబోలు, మార్జాలపుకూతలు చిన్నచిన్నగా వినవస్తున్నవి. తూముదగ్గరనుంచి గాబోలు, యిలకోడి ఏకతానంలో విరామంలేకుండా గానం చేస్తున్నది. గోడనున్న గడియారం టిక్ టిక్ మంటూ సమయాన్ని ఖండఖండాలుగా ఖండిస్తున్నది. తీతువుపిట్ట వేపచెట్టుఅగ్రాన్నుండి వ్యర్థప్రలాపనలేవో చేస్తున్నది. మలయమారుతం నదీలోయగుండా మందగమనంతో శీతలమాధుర్యాన్ని మోసుకొస్తున్నది. నిద్రలోనిపశువులను దొంగమాటుగా కుడుతున్న దోమలను కుక్క-కాటుకు చెప్పుదెబ్బ అన్నట్లు తమ చెవులతో తపతప బాదుతున్నవి. గగనకుసుమంవలె ఒకనక్షత్రం ఆకాశం అంచునుండి వూడి పెద్ద తోకమెరుపుతో పృథ్వీమాతనాలింగనంచేసుకున్నది. రోడ్డుకావలనున్న వణిక్ప్రముఖుని యింటి కిటికిసందులగుండా వెలుగుకిరణాలు అతిప్రయాసతో

బయటకొచ్చిపడుతున్నవి. కొబ్బరిచెట్టుమట్టలు ఆకులు వుండివుండి కదులుతున్నవి.

శయ్యమీద వుండజాలక నెమ్మదిగా లేచివచ్చి ఆరు బయట అరుగుమీదకూర్చున్న శివప్రసాద్ మనోనేత్రాలకు మరేవో కనిపిస్తున్నవి. అవి అతి మృదుమధురమైనవి. నూర్జ హాన్ నుగురించి వినూత్నంగా నేడు భవానీఅన్నమాటలు, ప్రత్యక్షంగా తాను గాంచిన ఆ దృశ్యము, తనయడల ఆమె కున్నవిశ్వాసము, ఆమెను అవమానించి హింసించిన భర ద్వాజచర్యలు తనమనస్సులో చర్వితచర్వణంగా పదేపదే దొర్లుతున్నవి. అనభిజ్ఞుడై, అంతర్వాణిప్రేరితుడై అడుగులో అడుగువేసుకుంటూ, గుండెదడను అణచుకుంటూ, దిశ లను గజదొంగవలె శోధించుకుంటూ గోశాలలోని నూర్జ హాన్ గదిగుమ్మంవద్దకు చేరాడు. భయము బాధ అంటే పుట్టుకనుంచీ తెలియని ఆ అబల ద్వారం తెరచే నిర్భీతిగా నిశ్చింతగా పవళించివుంది. శివప్రసాద్ లోపలకుప్రవేశించి నెమ్మదిగా దొంగవలె తలుపు గట్టిగా బిగించి, నూర్జహాన్ చెంత కెళ్ళి కూర్చున్నాడు.

ఆమెశిరస్సుదగ్గరగా కిరోసిన్ దీపం మిణుకుమిణుకు మంటూ వెలుగుతున్నది. ఆ లైటు ఆమెనేత్రాలమీద యెక్కువగాపడితే బాధఅనో యేమో గ్లాసుపైభాగమంతా పొగతో కాటుకవేసింది. ఆ సన్నటివెలుగులో సూర్యకిర ణంతో చంద్రుడు మెరిసినట్లు, వజ్రాలగనిలో వజ్రం ప్రకా శించినట్లు ఆమె ముఖమండలం ప్రఫుల్లిత చంద్రబింబంవలె అత్యంత శోభాయమానంగా మెరుస్తున్నది. ఆ అమాయక

చిన్నిముఖాన్ని యెంతచూసినా తనివితీరుటలేదు. చూసిన కొద్ది ఆకర్షణ అధిగమిస్తున్నది. నిద్ర ఆమెముఖానికి మరింత అందమిచ్చిందనుకుంటున్నాడు. తనకు తెలియకుండానే ఆమె తనమనస్సులోచేరి నిద్రపోనీకుండా తికమకపెడుతున్నది. కాని తాను స్వయంగా నిశ్చలమైనమనస్సుతో నిర్మలమైన హృదయంతో ప్రశాంతంగా నిద్రిస్తున్నది. ప్రకృతి యెంత విచిత్రమైంది! ఒకేవిషయంలో ఒకరికి వెర్రినికలిగిస్తుంది, మరొకరికి నిర్మలమైన శాంతిని కల్పిస్తుంది. తనధోవతిలో తనబనీనులో వుండి చమకులతో మెరుస్తున్న ఆమెశరీరం తనను మరింత పరవశంచేస్తున్నది. చెల్లాచెదరుగానున్న ఆమె కేశరాశిని తనవ్రేళ్ళతో అతినైపుణ్యంగా సరిదిద్ద ప్రయత్నిస్తున్నాడు. చెక్కిలిమీద గుంగురులుగావాలిన ఆ కురులను నెమ్మదిగా తొలగిస్తున్నాడు. మొహమంతా స్వేదంతో చెమ్మగిలివుంది. స్ఫటికంలాంటి ఆ చెక్కిలిలో తనప్రతిబింబం లీలగా కనిపిస్తున్నది. ఆమె పవళించినది కటికిచాప మీద. తలగడగా తన యెడమహస్తాన్ని మడిచి వుపయోగించింది. ఆయనపంపిన పక్క వగైరాలన్నీ వోప్రక్కన అతి జాగ్రత్తగా వుంచబడినవి. ప్రశ్నిస్తే 'కటికినేలమీద పరుండటమే నాకు అలవాటు. మీకు పరుపులు దిండ్లు యెంత హాయో, నాకు కటికినేల అంతేహాయిని చేకూరుస్తవి' అని ఆమెనుంచి సమాధానమొస్తుందని ఆయనకు తెలుసు. దోమ కాటు, వుక్కవలన, అటుయిటు పొర్లుటవలన గాబోలు

ఆమెధరించినధోవతి అస్తవ్యస్తంగా మోకాళ్ళపైవరకు తొలగిపోయింది. ఆ సన్నటివెలుగులోకూడా ఆమెకాళ్ళు అరటిస్తంభాలవలె అరుణవర్ణంలో మెరుస్తున్నవి. ఆమె పాదాలు కాళ్ళు చూస్తున్నకొద్దీ మృదుత్వం మధుర రూపంలో దృగ్గోచరమవుచున్నది. ప్రతి అవయవంలోను, శరీరప్రతిపక్షంలోనూ కోమలత్వం వుట్టిపడుతున్న ఆమెను కష్టజీవియని యెవరనగలరు? అనభిజ్ఞతతో ఆమెకుడిహస్తాన్ని తనచేతిలోకి తీసుకున్నాడు. అనిర్వచనీయమైన ఆనందాను భూతి ఆయననరములలో కరెంటువలె పరువులెడుతున్నది. ఆమెముఖంమీద పొడచూపుతున్న చిరుచెమటబిందువులు ఆమెనిద్రలోని గాఢత్వాన్ని ప్రకటిస్తున్నవి. చెదరిన ఆమె ధోవతిని సరిచేయను వంగి పాదాలవైపు నెట్టాడు. కాని ఆ వూపును ఆపుకోజాలక కూర్చున్న తాను ఒరిగి ఆమెమీదకు వాలిపోయాడు.

ఆమె వులికిపాటుతో తత్తరపడి మేల్కొని, ఆయన్ను చూచి బిత్తరపోయి లేచి కూర్చున్నది. వదిలీవదలని నిద్ర మత్తుతో, కంగారుతో, బరువైనకంఠధ్వనితో "బాబూజీ, మీరు యిక్కడున్నారేమిటి? ఎందుకొచ్చారు?" అని ప్రశ్నించింది.

తెలియని అంధప్రవృత్తిప్రేరణతో రాగలిగాడుగాని, ఆమెప్రశ్నతో తన మత్తు వదిలింది. సిగ్గుబిడియాలతో కుంచించుకుపోతూ అజ్ఞానివలెవణుకుతున్నకంఠంతో "ఏమీ లేదు; నిద్రపట్టలేదు. వుక్కపోస్తున్నది. ఏమీతోచక వచ్చాను. మధ్యాహ్నం నీ అధరములనుండి రక్తస్రావమయి

నట్లు చూశాను. బాగా దెబ్బతగిలిందేమో అడిగిపోదామని వచ్చాను. కాని నీవు గాఢనిద్రలో వున్నావు, అందుకని నీ అధరాలను పరిశీలనచేసిపోదామని కూర్చున్నాను. అంతే" అన్నాడు.

నూర్జహాన్ :- కాస్తంత రక్తంకనిపిస్తేనే మీరంత భయపడ్డారా బాబూజీ. అలాంటిదెబ్బలు యెన్ని తగిలినా నాకు నొప్పిగాని బాధగాని వుండదు. పోలీసులు నన్ను కొట్టి కొట్టి వాళ్ళే విసిగిపోయేవారు. ఒకమాటు నావీపున కొట్టిన దెబ్బలతో చర్మం చిట్లి, నా గుడ్డలన్నీ రక్తంతో తడిసినవి. చూసినవాళ్ళు భయపడ్డారు కాని, నాకు నొప్పికలిగినట్లే లేదు. (అని ఒక గొప్ప వుత్సాహకరమైనవిషయాన్ని చెప్పి నట్లు చెప్పింది.)

శివం :- తగిలినదెబ్బవలన కలిగే నొప్పికంటె అవమానం మానసికంగా బాధిస్తుంది. నిన్ను మా మామయ్య అంతక్రూరంగా బయటకుయీడ్వడం నాకు చాలా బాధను కలిగించింది. అందుకు మరేమీ అనుకోక నన్నుక్షమించు నూర్జహాన్.

నూర్జహాన్ :- బాబూజీ, మీరలాంటిమాట లనకండి. నేను హీనురాలను. నన్ను వారు అంతేగాదు, యింకా కొట్టినా తప్పులేదు. నేను బాధపడను. కాని మీరిలాంటిమాటలని చిన్నబుచ్చితే నేను భరించలేను, పారిపోతాను. నేను అవమానాలమధ్య పుట్టి పెరిగాను. నాకు యీనాడు మీద్వారా యేమి సంభవించినా అవి నాకు శిరోధార్యంగా భావిస్తాను.

శివం :- నూర్జహాన్, నీవు వేటినయినాభరించ వచ్చు, కాని నీ కలాంటివి సంభవించినప్పుడు నా మనస్సు యెంతో బాధపడుతుంది. అందువలన నాకొరకయినా నీవు వాటిని సహించగూడదు.

నూర్జహాన్ :- (శివం క్రిందకూర్చున్నవిషయం గ్రహించి విస్తుపోయి నాలుకకొరుక్కుంటూ తాను చివ్వన లేచి ప్రక్కకువచ్చి) బాబూజీ, మీరు క్రిందకూర్చున్నారు. లెండి! ఆ చాపమీద కూర్చోండి.

శివం :- నీవు నట్టిచాపమీద పడుకున్నప్పుడు నేను కటికినేలమీద యెందుకు కూర్చోకూడదు?

నూర్జహాన్ :- బాబూజీ, మీరు పెద్దవారు, అలాంటి ప్రశ్నలు నన్ను వేయకండి. బంగారాన్ని పెట్టెలో దాస్తారు. ఇత్తడిని ఇంటిలో దాస్తారు, ఇనుమును బయట దాస్తారు, యెందుకు చెప్పండి?

శివం :- బంగారాన్ని ఇనుముగా పొరపాటుపడి పారవైచి, ఇనుమును బంగారంగా భ్రమించి పెట్టెలో దాచేవారుంటారు యీలోకంలో, నీకు తెలుసా?

నూర్జహాన్ :- (మాటనుమలుపుయత్నంతో అటు యిటు పరికించి) బాబూ, తలుపులు మూశారెందుకు?

శివం :- ఓహో, అవును తెరవాలనుకుని పొర పాటుగా మూసివుంటాను. నీ నిద్రాభంగమవుతుందేమో వెళతాను (అని లేచాడు,)

నూర్జహాన్ :- ఈరోజు నా కెందుకనో మహదానం దంగా వున్నది, బాబూజీ. బొమ్మగారియేడ్పు విన్నప్పుడు

తత్తరపోయాను వివరాలు విన్నప్పుడు కళ్ళముందు అంధ కారంఆవరించి క్రిందపడిపోయాను. ప్రళయం సంభవించినట్లని పించింది. అదంతా అంధకారం. ఇపుడు నాకీ ప్రపంచ మంతా వెలుగులో ప్రకాశిస్తున్నట్లు మధుమయంగావుంది. మీారు తిరిగిరాకపోతే నేనూ ఆ నదిలోనే కలిసిపోయేదాన్ని. (అంటున్న ఆమెకంఠంలోనిరుద్ధత ప్రస్ఫుటమయింది. ఆమె నేత్రాలలో తొణికిసలాడుతున్న అశ్రువులు శివప్రసాద్ బాబు కంటపడుతవనో యేమో ముఖం మరోవైపుకు త్రిప్పింది.)

పొరపాటుగా కల్లుఅంగడికెళ్ళినవానివలె యెవ్వరికంట పడతానో అనేభయంతో పిల్లి అడుగులు వేసుకుంటూ శివం తనగదిలోకిచేరి, తిరిగి యథారూప ఆలోచనలలో వ్యూహా విహారంచేస్తున్నాడు.

పూజాదికాలు ముగించుకొచ్చిన భవానీ తడిబట్టల తోనే శివంముంచందగ్గరకొచ్చి "ఒరే శివం, చూచావుట్రా ఆ పిల్ల యెవరో మనదేవుడికి యెలా పూజచేసిందో! పెద్ద బుట్టెడుపూలతో పూజించిందిరా. ఆ గుడంతా బాగుచేసిం దిరా. వూడ్చి నీళ్ళుచల్లింది. దేవవిగ్రహాన్ని యెన్నికడవల నీటితో స్నానంచేయించిందో గాని, కాలవలుగట్టిన అరనళ్లు గనిపిస్తున్నవి; ఒకగణ్ణం తప్పిందని, నా బిడ్డను పులినోటి నుంచి రక్షించుకున్నానని దేవునికి పెద్దగా పూజచేదామని చాలా పెందలకడనే వెళ్ళాను. అప్పటికే ఆ పిల్ల పూజచేసి వెళ్ళిపోయింది. ఆ చేసినశుభ్రత, పోసిననీరు, ఆ పూల అలంకారం చూసి విస్తుపోయాను. అంత శ్రద్ధతో చేసిన

ఆమెకు సమానంగా నేను యెన్నడూ చేయజాలనని దేవుని ముందు స్వీకరించి ఆ అజ్ఞాతపూజారిణి పిల్లను మనసా ఆశీర్వదించివచ్చాను. కాని ఇక్కడికొచ్చి చూద్దునుగదా మనదొడ్లోనిపూలచెట్లను ఒక్కపువ్వూ లేదు. మనదొడ్లో నిపూలే అక్కడ కనిపిస్తున్నవి. ఈ పూలు అక్కడ కెలా పోతున్నవో! నా క్కిదంతా ఆశ్చర్యంగావుంది. ఇంతకాలం నుంచి నిత్యము పూజచేస్తున్న ఆ పిల్లను పట్టుకోలేక పోయాను. దైవపూజకు వయస్సు ప్రధానంగాదు, మనస్సు ప్రధానమయింది. ఆపిల్ల యెవరో చిన్నదయినా, నేను గురువుగా స్వీకరిద్దామనుకుంటున్నారా. అంత అజ్ఞాతంగా పూజచేస్తున్న ఆమెహృదయం తప్పకుండా పవిత్రమైనదయి వుంటుంది. కేవలం నిశ్చలమైనభక్తితోనే చేస్తుంటుంది. నా జీవితంలో యింత నిర్మలమైన నిశ్చలమైన పూజారిణిని యిదివరకెన్నడూ చూడలేదురా. తుఫానువీస్తున్న రోజు కూడా ఆమె పూజచేసివెళ్ళినట్లే గుర్తులు కనిపించినవి". అని మమకారాలొలికిస్తూ చెప్పింది.

శివప్రసాద్ ముసుగులోనేవుండి, ఆవలిస్తూ మత్తును వదిలించుకుంటూ "ఎవరో పిచ్చిదైవుంటుదమ్మా", అన్నాడు.

భవానీ :- ఛీ, అలా అనబోకురా. దైవపూజలు పటాటోపాలు లేకుండా, ఆర్భాటాలులేకుండా, ఎవరికంటా పడకుండా నియమంతప్పకుండా చేయటం హృదయపవిత్రతను చాటుతుంది. నిజమైన భక్తురాలయితేగాని, అంత శ్రద్ధాభక్తు లుండవు. అలాంటిభక్తుల సాంగత్యంవలన

సపర్యలవలన, కనీసం దర్శనప్రాప్తంతో కూడా కొంత పుణ్యం లభిస్తుందిరా. అందుకే ఆపవిత్రమూర్తులు యెవరికంటాపడరు. తమభక్తిని పూజలను ప్రకటంకానీయరు. వారికి లోకమన్న నలుగాడు కావలసింది, దైవకృపమాత్రమే.

శివం :- అబ్బ; నన్ను కాస్త నిద్రపోనీ అమ్మా.

భవానీ :- ఒరే పిచ్చితండ్రీ, వారిమాటలను విన్నా కొంత పుణ్యంలభిస్తుందిరా నాయనా!

శివం :- (ముసుగును కాస్త తొలగిస్తూ నేత్రాలు నులుముకుంటూ కాళ్ళుతన్నిపడుతూ) నీవు నట్టి పిచ్చిదాన్ని వమ్మా! ఎవరేదిచెప్పినా నమ్మతావు, అందరినీ పవిత్రు లనుకుంటావు. ఆ శిథిలమైపోయిన ఆలయం మనపూర్వీ కులు కట్టించిందిగనుక, మన గుడిగనుక మనపూర్వీకుల మీాదున్న శ్రద్ధతోను దేవుడనేపేరుమీాదున్న భక్తిప్రపత్తుల వలన నీవు పూజిస్తున్నావు. ఆ దేవునిలో ప్రభావంలేదని కూడా నాకు తెలుసు. అలాంటిదేవుని గుప్తంగా పూజించే వారు వెర్రివాళ్ళుకాక తెలివికలవారా అమ్మా? ఎవరో పిచ్చిదయివుంటుందమ్మా.

భవానీ :- మా తండ్రిగాదూ, అలా అనబోకు నాయనా. దేవునిగాని పవిత్రమైనభక్తులనుగాని పరిహాసిస్తే అశుభం కలుగుతుంది బాబూ. దేవుళ్ళందరిలోనూ శక్తి వుంటుంది. గుప్తపూజారులనుమాత్రం హేళనచేయ గూడదు.

శివం :- నీవే ఎప్పుడో చెప్పినట్లు గుర్తమ్మా. ప్రతి ష్ఠితదేవునిక్రిందవేసిన బీజాక్షరఅంత్రంలోను, ప్రతిష్ఠిత

ముహూర్తంలోను అసలు ప్రభావ ముంటుంది. అవి సరిగ్గా కుదిరినప్పుడే ఆ దేవుని ప్రభావం వైభవోపేతంగా వుంటుందని అంటివిగదా అమ్మా! ఆ ప్రభావాలు మన దేవునిలో లేవనటంలో అపరాధమేముందమ్మా? అలాంటి దేవుని గుప్తంగా పూజించే యితరులు పిచ్చివారుగాక మరెవరమ్మా?

భవానీ :- ఈవిషయాలు నీతో చెప్పటం నాదే పొరపాటుగాని, నోటికొచ్చినట్లు అనకురా. ఆ గుప్తపూజారిణి మాత్రం మహాత్మురాలే. నా మనస్సే అందుకు సాక్షి.

శివం:- ఒక్కమాట చెబుతాను వింటావా అమ్మా, ఒకరాత్రంతా కాచుకునయినాసరే, ఆ పూజారిణిని తెలుసుకోరాదా అమ్మా?

భవానీ :- స్వయంగా నాకేమో నాపనులతోనే సరిపోతోంది. తీరా ఆసమయానికే వెళ్ళగలుగుతాను. యెవరినైనా కాపలాపెట్టటమంటావా, అది మహా దోషం.

శివం :- సరేనమ్మా, ఈరాత్రికి యెలాగయినా ఒంటిగంటకే వెళ్ళి, ఆప్రక్కన దాగి పరిశీలించు.

భవానీ :- అవునురా, యీరాత్రి యెంత బాధయినా వోర్చి ఆ మహాతల్లిని దర్శించితీరుతాను. పది పుణ్యక్షేత్రాలు దర్శించితేకలిగే ఫలితం ప్రాప్తిస్తుంది నాయనా!

శ్రావణమాసపు కృష్ణపక్షపురోజు లవి. మినమిన లాడునయస్సులోని యునతిన లె నుదభరితగమనంలో మేఘాలు గుచ్ఛాలు గుచ్ఛాలుగా ఎక్కడికో పయనిస్తున్నవి. తుఫానుసూచనలిచ్చే యీదురుగాడ్పులు జోరుగా కొడు

తున్నవి. గరగరమనే తేలికయిన గర్జనలతో, జలకగా, మెరుపులతో అనంతాకాశం భీతిని గలిగిస్తున్నది. వటవృక్షంమీది పక్షిజాలం కిసకిసమని యేదో తమలోతాము సంభాషించుకుంటున్నవి. భవానీ కింతవరకు కన్నుమీద కూరుకుపట్ట లేదు. గుప్తపూజారిణిని చూడాలనే నిర్ణయం జరిగినప్పటినుంచి ఆమె మనస్సులో తనకునచ్చిన బ్రాహ్మణ సుశీలబాలికల ముఖాలు ఒక్కటొక్కటిగా పొడ్చుతున్నవి. నేను తాను పూజకుగాదు, పూజారిణిని తెలుసుకోను వున్నిశాలువా భుజాన వేసుకొని పయనమయింది. తన కిదో అగ్నిపరీక్షా యన్నట్లు ఆకాశవీథులన్నీ భయభీతానవహించేస్తున్నవి. భవానీ పట్టుదలగల స్త్రీ. అంతేగాకుండా, లోపలున్నవుత్సాహం ఆమెను పరవళ్ళుత్రొక్కిస్తున్నది. ఒక గొప్ప నాటకాన్ని దర్శించబోతున్నట్లు, సువర్ణసుందరిలాంటి సినిమాచూడబోతున్నట్లు, కోటప్పకొండతిరుణాలకు బోతున్నట్లు వున్నకొద్దీ ఆమెలోనివుత్సాహం హెచ్చుచున్నది. మందిరం ప్రహరీప్రక్కనున్న బోదివృక్షపు మొదలుకు ఆని ఆసనంచేసుకొని నిరీక్షిస్తున్నది. మందిరంలో మూర్తిప్రక్కగా స్పష్టమైన యేడుపు వినిపించి ఆమె వుద్విగ్నురాలైంది. ఆ యేడుపు యింకా పెద్దదయింది. భవానీగుండెలు గుబగుబలాడుతున్నవి. ఆమెలలాటం శ్వేదమయమవుతున్నది. తాను నిత్యమూ చూస్తున్నది మానవమాత్రులుచేస్తున్నపూజ కాదేమో! దేవలోకంనుంచి యెవరయినా వచ్చి చేస్తున్నారేమోనని, అలాంటిదేవత తనరాకను గమనించి దేవునిపాదపద్మాలవద్ద విలపిస్తున్నదేమోనని, తత్ఫలితంగా దేవునికి

ఆగ్రహాంకలగటం, తనశిరస్సు పగలటం జరుగుతుందేమో ననే ఆలోచనలతో విహ్వాలురాలవుచున్నది. ఆమెశ్వాస స్థంభించి ఊపిరిసలుపక వుక్కిరిబిక్కిరిఅవుచున్నది. ఆ యేడ్పు రోదన గుక్కబట్టినట్లు మరింత పెద్దదయింది. భవానీ కిది భరించరానిదై శాలువాకప్పుకుని వృక్షాన్ని పట్టుకుని భగవన్నామం జపిస్తూ తను తెలియక సాహసించినందుకు భగవంతుని క్షమాభిక్ష వేడుకుంటూ తేరిచూస్తున్నది. అదేయేడ్పులో ఒక పిల్లి దేవునిప్రక్కనుంచి ఒక్కదూకుతో పడిపోయిన ప్రహరీమీదకుచేరి భవానీప్రక్కగానే యుక్తితో గూడిన తన వేటఅడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయింది. భవానీ ఒక దీర్ఘశ్వాసను విడిచింది. గగనంనుంచి కూలిపోతున్న విమానం దైవికంగా నెమ్మదిగా తేలియాడుతూ పృథ్విమీద నిరాపదగా వాలినపుడు అందున్నప్రయాణీకుల హృదయాలవలె శీతలశ్వాసతో భవానీ హృదయాన్ని స్థిమితపరుచుకుంటున్నది.

ఆ పిల్లి అక్కడకు యెలుకలవేటకొరకు వచ్చివుంటుంది. ఆ శిథిలగోడలలో పెద్దపెద్ద సర్పాలు తిరుగుతూంటవని విన్నవిషయాలు గుర్తుకొచ్చి, మళ్ళీ వుద్విగ్నురాలయింది. ఆమెప్రక్కగాను వెనుకగాను సర్పాలు తనమీదికి దూకుతున్నట్లు భ్రమించి వులికిపాటుచెందుచున్నది. తిరిగిపోవటానికికూడా ఆమెకు ధైర్యంచాలుటలేదు. ఆమె కిదెవరకెన్నడూ యింత హృదయభీరుత్వం కలుగలేదు. కాలుచేతులు చచ్చుపడిపోయినట్లు భ్యానంచేస్తున్నది. నిరుపాయులకు భగవత్ స్తోత్రానికిమించి మరేముంటుంది.

భవానీ యిక్కడకుచేరి అరగంటేఅయినా క్షణ మొకయుగంగా గడుపుతున్న ఆమెకు దారితెన్నులు ముగిసి నట్లు, తిరిగి తాను యింటికిచేరలేనని, ఇవి జీవితఅంతిమ క్షణాలని, ఆలోచనలతో వుత్పీడుతురాలవుతున్నది. ఇంతలో ఆమెనేత్రాలు చెదిరినట్లు దూరాన తను రోజూ వచ్చు కాలిబాటలో యెవరో శ్వేతరంగులో పాలనురుగువలె మెరుస్తున్న దుస్తులతో నదిరేవువైపు వెళుతున్నట్లు కనిపించి చకితురాలై నేత్రాలునులుముకుని మరీమరీ చూస్తున్నది. ఇంత గాఢాంధకారంలో నిర్భీతిగా పయనిస్తున్న ఆమెవైఖరి, ఆ దుస్తులు గాంచినపుడు ఈమె మానవస్త్రీమాత్రం గాదు. దేవలోకంనుంచి దేవదేవుని ఆజ్ఞానువర్తినియై యిక్కడకు వస్తున్న దేవకన్య అయివుంటుందని, సామాన్య మానవ యువతి అయితే ఈ అర్ధరాత్రిసమయంలో యింత నిర్భీతిగా యెలారాగలుగుతుందనీ ఆలోచిస్తున్నది. ఆ యువతిచేతిలో తెల్లటిఇనుపరేకుల కడవగాబో లున్నది. మరోచేతిలో చీపురు, యింకేదోకూడా వున్నవి. ఆ యువతి మెట్లవద్ద కడవ నుంచి పెద్దపెద్దఅంగలువేసుకుంటూ ఆలయంలో కసవు వూడుస్తున్నది.

భవానీ కిపుడు భయంపోయింది. ఆ దేవకన్యపాదాల ముందు మోకరిల్లి ప్రార్థించాలని మనస్సు ఆరాటపడు తున్నది. ఆమెహృదయములోని ఆలోచన లిపుడు అంతతేలి కగా సాగటంలేదు. ఒకదేవకన్యను కనులారకనిన తనజీవితం ధన్యమైనట్లు ఆమెహృదయం ప్రఫుల్లితమవుచున్నది. ఆనంద బాష్పాలు ముత్యాలవలె టపటప రాలుతున్నవి. రెప్ప

పాటులో ఆ యువతి శుభ్రపరచి, రేవుకు వెళ్ళింది. తిరిగి తలారస్నానంచేసి ఆమె తడిబట్టలతోనే తపతపలాడించు కుంటూ భుజాన నీటికడవధరించి వస్తున్నది. ఆలయమంతా నీళ్ళుచల్లాక ఆ దేవవిగ్రహంమీద అయిదుకడవలజలం గుమ్మరించింది. ఇదంతా సాక్షీభూతివలె చూస్తున్న భవానీకి శ్రావ్యమైన చిన్నిస్వరంలో పాటకూడా వినిపిస్తున్నది.

'సకలలోకపాలితా—సాధుజనరక్షకా' అనే చరణం ఆమెకర్ణరంధ్రాలలో శీతల అమృతంవలె ప్రవేశించినపుడు మరింత తన్మయురాలై, తానూ ఆమాటలను నేత్రాలు మూసి మనస్సులో ఉచ్ఛరించింది.

ఆ దేవకన్య తిరిగి రేవుకెళ్ళి కడవకుబదులు ఒక బుట్టను పట్టుకొచ్చింది. అది పుష్పాలతో నిండివుంది. ఆ పుష్పగుచ్ఛాలను అతినైపుణ్యంగా రెప్పపాటులో అలంకరించింది. ఆ అలంకరణలోని నైపుణ్యం, కొందర జన్మ జన్మాలఅనుభవాన్ని చాటుతున్నట్లున్నది. అలా అంత తొందరగా అలంకరింపజేయటం భవానికి చేతగాదు. అందు వలన మరింత విస్తుపోతున్నది. ఇపుడా దేవకన్య దేవుని సమక్షంలో మోకరిల్లి హస్తాలుజోడించి నేత్రాలుమూసి మధుభరిత మాధుర్యాలొలుకు శ్రావ్యమైనకంఠంతో

పొందిరి నీదుసేవలో యెందరో ముక్తిని
దేవా, లేవు కప్పురకానుకలైన యీ దీనురాలికడ
గ్రోతువో లేదో, నీ కివే నా సర్వసమర్పణల్
సంగ్రహింపుము నా మనోనివేదనలన్.

అని పాడింది. భవానీ కీ స్తోత్రం మరింత మానసికోల్లాసం

కలిగించింది. తనజీవితం ధన్యమైనట్లు, తనజీవితతరణోపాయం లభ్యమైనట్లు ఆనందపడుతున్నది. స్తోత్రంముగిసినపిమ్మట ఆ దేవకన్య తనచేతిస్రేళ్లు దైనపటాన్ని స్పర్శించునట్లు సాష్టాంగ పడింది. ఆమె మనస్సులో యేమిధ్యానిస్తున్నదో, షుమారు గంటవరకు అదేరీతిని నిశ్చలంగావున్నది. ఆ సాష్టాంగరూపం లోని దేవకన్యపాదాలంటినా తనకు ముక్తిలభిస్తుందేమోనని తాపత్రయపడుతున్నది భవాని.

ఆ దేవకన్య గృహోన్ముఖురాలై వచ్చినదారిననుస రించి వెళ్ళిపోతున్నది. ఇప్పటికి భవానీనుంచి మబ్బుతెర వంటిభ్రమ తొలగిపోయింది. సచేతనావస్థకు చేరుకున్నది. వెంటనే సరసర ఆ దేవకన్యననుసరించింది. ఎంత విచిత్రం! ఆ దేవకన్య తనయింటిప్రహరిలో ప్రవేశించింది. అంతే గాదు, తనుగోశాలగదిలో ప్రవేశిస్తున్నది. భవానీ రెప్ప పాటులో నిశ్చేష్టురాలయింది. దేన్నయితే రత్నమనుకుని భ్రమించి ఆదరంతో అభిమానించి శిరోధార్యంగా తలంచి నదో అదే మరుక్షణంలో తనచేతనున్నది గాజుపెంకని తెలి సినప్పుడు యెంత క్షోభను కలుగజేస్తుందో, అంతక్షుమించిన వుత్పాతాన్ని కలిగిస్తున్నది భవానీకి. ఆమెపాదాలు ముందుకు పడటంలేదు. ఇంకా జాముప్రొద్దున్నది. అడుగులోఅడుగు లేసుకుంటూ గోశాలగదిముందు కెళ్ళి నిలిచింది. గదిలోపల నూర్జహాన్ యింకా తడిదుస్తులతోనే వున్నది. జారవిడుచ బడి పిరుదలహద్దులనుదాటిన శిరోజాలనుంచి యింకా జల బిందువులు జారుతూనేవున్నవి. ఆమెధరించివున్న దుస్తుల నుంచికూడా యింకా నీరు కారుతూనేవున్నది. గోడను చిన్న

శంకరునిపటము అంటించివున్నది. అది యే నూతనవస్త్రాల నుంచో వూడబెరికినదయివుంటుంది. ఆ పటంక్రిందవున్న చిన్న గూటిలో కుందివత్తి వెలుగుచున్నది. ఆ పూజారిణి చిత్రంఎదుట నిలబడి నిశ్చలమైనభక్తితో చేతులుజోడించి నేత్రాలుమూసి స్తోత్రంచేస్తున్నది.

దేవకన్యకగాభావించిన భవానీ కిది ఆశాభంగాన్ని కలిగించినందున ఉగ్రురాలైంది. క్రోధాన్నిపట్టజాలక విశ్వరూపాన్నిధరించినట్లు నిప్పులుగ్రక్కుతున్న నేత్రాలతో బుసలుగొడుతున్న నాసికతో బిగబట్టిన అధరాలతో "ఛీ, నీచురాలా! నీకు బుద్ధిలేదు. నన్ను నీవు మర్చిపోయి, పెద్ద భక్తురాలవైకూర్చున్నావు. బ్రాహ్మణివైపోయినావు! మా మందిరంలో అడుగుబెట్టి దేవుని అపవిత్రంచేశావు. దేవాలయాన్ని మురికిహూపంచేశావు. భడవా, నిన్ను యీవాళ బయటకు గెంటిస్తాను చూడు." అని సింహగర్జనలుచేస్తున్నది భవానీ.

ఈ గోలతో శివప్రసాద్‌కు మెలకువవచ్చింది. ఈ తగాదా నూర్జహాను కుసంబంధించినదని తెలిసినపుడు ఆలోచించే అవకాశమేలేకుండా పరువెత్తుకొచ్చి భవానీప్రక్కన నిలిచాడు.

భవానీ కేకలనువిన్న నూర్జహాను చిన్నబుచ్చుకుని, తానేదో నిజంగానే గొప్ప అపరాధంచేసినట్లు, దేవునిఆలయాన్ని అపవిత్రంచేసినట్లు చింతాక్రాంతురాలై, చేస్తున్న పూజను మధ్యలోనే ఆపి, వాకిటివైపుకొచ్చి తనదుష్టముఖాన్ని ఆమెకుచూపనొల్లక అధోముఖంతో భూమిమీద సాష్టాంగపడి

విలపిస్తున్నది. స్వీకరుశక్తి పెద్దదయి పూర్తిసొండులోనున్న పుడు కేడియోను వ్రూపుతూ వణికించినట్లై ఆమె హృదయంలో దొర్లుతున్న దుఃఖం శరీరాన్ని కంపింపజేస్తున్నది. ఆమెదుస్తులనుంచి కేశరాశినుంచి జారుతున్ననీరు పృథ్వి మీద ప్రాకుతున్నది. ఆమె వెలిగించినజ్యోతి దేవునిముందు నిర్విరామంగా ప్రకాశిస్తూ దేవునిప్రతిమను స్పష్టరూపంలో ప్రస్ఫుటపరుస్తున్నది. పాశము వేసి ప్రాణాన్ని లాక్కెళ్ళ వచ్చిన యమధర్మరాజువలె భవానీయెదుట నిలిచివున్నది నూర్జహాన్.

ఈ దృశ్యం శివప్రసాద్‌ను విచలితుని జేసింది. నేత్రాల ముందు అంధకారం ఆవరించింది. తల్లి వైపుతిరిగి నూర్జహాన్ వైపు చూశాడు. భవానీవైపు చూస్తుంటే అతనిబాధ మరింత అధిగమిస్తున్నది. ఆమెయెడల అర్థంగానిక్రోధం జనించింది. తనజీవితంలో ఆమెయడల క్రోధం జనించుట యిదే ప్రథమం.

భవానీ :- శివం, యీ రాక్షసి సర్వనాశనం చేసిందిరా. తిన్నయింటివాసాలు లెక్కించినట్లు, మన ఆలయాన్ని మైలపర్చింది. దేవుని యెందుకూపనికిరానివాణ్ని చేసింది. నీతీజాతీలేని యిలాంటి మ్లేచ్ఛకన్యను యింటిలో వుంచటం తగదురా నాయనా అంటే విన్నావుగాదు. ఇపుడు దానిచేష్టలు బాగా గ్రహించు. ఈ దొంగముండకి స్నానాలు జపాలు పూజలు యెందుకు చెప్పు? దీనిదొంగబుద్ధి యెక్కడికిపోతుంది!

శివం :- (అతిప్రయాసతో అణచుకున్న క్రోధావేశాలతో) అమ్మా, నీ పాదాలంటి ప్రార్థించుకుంటాను. అంత తొందరపడబోకు. దేవునిపూజించటం అపరాధమా అమ్మా. ఏ గుప్తపూజారిణిగురించి నీవు యెంతగా పొగడితివో, యెవరికి దేవతాస్థానాన్ని గురుస్థానాన్ని యిచ్చావో, యెవరిదర్శన భాగ్యంతోనే పుణ్యప్రాప్తికలుగుతుందని రాత్రివరకు అంటూ వచ్చావో, యెవరిని దేవతలతోపోల్చావో ఆమెనే యిపుడు యింత హీనంగా క్రూరంగా నిందించుట నీబోటిపెద్దదానికి తగునా అమ్మా! అంత ఆగ్రహ మెందుకు? ఆగ్రహంలో మర్యాదలను మరచు టేలనమ్మా?

భవానీ:- ఒరే శివం, అన్నివిషయాలూ అందరికీ అర్థంగావు. ఈ భడనవిషయంలో నీ విక వకాల్తాతీసుకోవద్దు. వెంటనే బయటకు గెంటిస్తాను.

శివం :- (వంగి ఆమెపాదాలంటి లేచి, తల్లి హస్తాన్ని చేతిలోకితీసుకొని) అమ్మా, నేను యెన్నడూ నిన్ను యింత అనునయంగా ప్రార్థించివుండలేదు. ఆఖరివినతిగా మళ్ళీ నీకు విన్నవించుకుంటున్నాను. నూర్జహాన్నుగురించి నీ విపుడు యేమీ అనవద్దు. ఇప్పటికే నీవుఅన్నమాటలు సహింపరానివి. నీ వీనాడు అంటున్నమాటలకు నీవు స్వయంగా పశ్చాత్తాపపడేరోజు వస్తుంది. ఆమెచేసింది అపరాధంగాదు. నిద్రావస్థలోనున్న మనలను మేల్కొలిపి వెలుగుచూపింది. మానవులందరూ దైవదృష్టిలోనివారేనమ్మా. మానవనిర్మిత కులగోత్రాలు మతాలు యెన్నివున్నా దేవదేవునిసన్నిధిలో అన్నీ ఒకటేనమ్మా. నీవు

స్వల్పవిషయాలకు ఆగ్రహంబొంది, అంధురాలవవుతావు గాని, నిర్మలమైనమనస్సుతోనున్నపుడు అన్నీ నీవే నాకంటె బాగా ఆలోచించగలవు. భగవంతుడు పాపాలనుహరించేవాడు ముక్తినిప్రసాదించేదాత; ఆయనకు దోషాలంటుతవా అమ్మా! నిష్కల్మషమైనభక్తితో దేవునిపూజించటం దోషమా చెప్పు?

భవానీ :- శివం, యీవిషయాలలో నీవు పట్టించు కోవటం మంచిదిగాదు. నీవు యేదిచెప్పినా వింటానుకాని, దేవునివిషయంలోను పూజలవిషయంలోను సాహసించ బోకు. దేవస్థలం అతి పవిత్రమైంది. ఆ పవిత్రతను కాపాడు భారం పరమభక్తులది. ఆ బాలిక యెంత దీనురాలైనా అభాగ్యురాలయినా బ్రాహ్మణబాలికయివుంటే నేను హృద యానికద్దుకుని ఆ దేవునిభారాన్నేగాదు, యీ యింటి భారాన్నిగూడా ఆమెభుజస్కంధాలమీద మోపివుండే దాన్ని. ఇంత దుస్సాహంజేసే దీన్ని యిక యిక్కడ క్షణం కూడా వుంచడానికిపీలులేదు.

శివం :- (నొసలుచిట్లించుకుంటూ చేత్తోరుద్దుకుంటూ దీర్ఘమైన వేడినిట్టూర్పును విడుస్తూ) విశ్వాసము అందరికీ విశ్వసనీయంగా ఆదరణీయంగా వుండాలిగాని, ఇతరులను నేఘించేది బాధించేది పరిహాసాలపాలుజేసేదిగా వుండరాదు. నిర్మలము నిశ్చలము పవిత్రము అయిన మనస్సుచేసే పూజలవల్ల భగవంతుడు అపవిత్రంగాడు. ఆ సర్వాంత ర్యామిఅయిన దేవునితోకూడా కులమతద్వేషాలుంటే లోకాలు సాగవమ్మా. అపవిత్రులు పవిత్రులుగాను అయో

గ్యులను యోగ్యులుగాను,పాపులను పునీతులనుగాను చేయగలవాడే సర్వశక్తిసమన్వితుడైన భగవంతుడు. కులమతాలు ఆయనదృష్టిలో లేవు. ఈ లోకంలోని యేవీ ఆయన్ను అపవిత్రంచేయజాలవు. ఆయనపేరుతో ఆయనఆడుతో జరిగే అంధకార్యాలకు ఆయన బాధ్యుడుగాడు. కులప్రతిష్ఠలతో భక్తిప్రపత్తులను చాటుకొంటూ రాణించే భరద్వాజకన్నా మ్లేచ్ఛరాలనబడుచున్న ఈ బాలికే యోగ్యురాలు విశ్వాసపాత్రురాలు అని నీ నోటితోనే అన్నావు. ఇంతలో ఈ అభాగినిపై కాలుదువ్వటం సముచితంగాదమ్మా. నీ పాదాలుపట్టుకుంటాను, యింతటితో నీ ఆగ్రహాన్ని విడనాడి వెళ్ళి స్నానంచేసి ఆ దేవునిముందే నిష్కల్మషమైనహృదయంతో ప్రార్థించి వాస్తవాన్ని తెలుపమని వేడుకో. నీకు ఆ భగవంతుడే సరియైనఅభిప్రాయాన్ని కలుగజేయగలడని నా విశ్వాసం. నీవు నేడు యెవరిని నిందిస్తున్నావో ధూత్కారంచేస్తున్నావో ఆమె నా ఆశ్రయంలోనిది. అందువలన ఆ ధూత్కారాలు నిందలు ఆమెకుగాదు నాకు. ఆమెచేసినపని మంచిదో కాదో నీవు నిర్మలమైన శాంతియుతఆలోచనలతో నిర్ణయంచేయకుండానే తాత్కాలికపు ఆవేశంలో ఆమెను నిరాశ్రయురాలినిచేయుటే నీ కర్తవ్యమయితే,నా హృదయం యెంత క్షోభిస్తుందో అది నీకీ ఆవేశంలో అర్థంగాదు.

తలతిరిగిపోతున్నవానిని సాంబ్రాణిధూమ్రంతో ముంచినపుడు మతిపోయినట్లు భవానీ విమూఢురాలివలె భంగుమత్తువదలిన భంగుభాయివలె వెనుదిగిరి చెంగుతో ముఖాన్ని అద్దుకుంటూ గృహోన్ముఖురాలై వెళ్ళిపోయింది.

శివప్రసాద్ అక్కడే నిలిచిపోయాడు. తా నేదో గొప్ప అపరాధంచేసినవానివలె భయకంపితుడవుతూ పృథ్వీమాత ఒడిలో సాష్టాంగపడివున్న నూర్జహానును స్పర్శించలేకపోతు న్నాడు. తదేకంగా ఆమెను, ఆమెవెలిగించిన జ్యోతిని, గోడకుఅంటించిన దేవదేవునిచిత్రాన్ని వరుసగా తిరిగితిరిగి చూస్తున్నాడు. అమాయకంగా భవానీచేసినఅఘాయిత్యం ఆయనహృదయాన్ని నులిమివేస్తున్నది. ఆమెవైపు వంగి "ఆమె ఆవేశంలో తెలియకఅన్నమాటలకు నీవు బాధ చెందకు. ఆడవారికి చిరాకెక్కువ. కొందరపాటు అంత కంటె యెక్కువ; ఆతరువాత అంతకంటెమించిన పశ్చాత్తాపం కూడా పొందుతారు. అందువలన మా అమ్మ మాటలకు కించపడకు నూర్జహాన్. ఆమె అనాదరపుమాటలకు నేను క్షమాపణకోరుతున్నాను." అన్నాడు శివం.

నూర్జహాన్ చివ్వనలేచి ప్రక్కనున్న శివప్రసాద్ పాదాలమీద తనహస్తద్వయాన్నుంచి శిరస్సునుకూడా పాదాలమీద వాల్చి, పవిత్రమైన తన అశ్రుధారలతో ఆయనపాదాలను పునీతంచేస్తున్నది. ఆయనపాదాలమీద పడి పరువులెడుతున్న వెచ్చటిఅశ్రుధారలతో శరీరం జలద రించి కంపిస్తూ తన హస్తద్వయంతో ఆమెశిరస్సునుపట్టి పైకిలేవనెత్తి, రుద్ధకంఠంతో "క్షమించు నూర్జహాన్" అన్నాడు. ఆమె ఆయనముఖాన్ని పరిశీలనగా చూస్తున్నది. తననేత్రాలలో తొణికిసలాడుచున్న అశ్రువుల నెక్కడ ఆమె చూచిపోతుందోననే భయంతోనో సిగ్గుతోనో ముఖం వారగా మరోవైపుకు త్రిప్పాడు.

పెగిలీపెగలని గాద్గదికకంఠంతో "బాబూజీ, మీ రలాంటిమాటలని నా హృదయాన్ని బాకుతోపొడిచినట్లు చేయకండి. మీ మాటలే నా మనశ్శాంతిని హరింపజేస్తు న్నవి. బామ్మగారన్నమాటలకు నాకు రవంతకష్టంకూడా కలుగలేదు. వా రన్నవి యదార్థసత్యాలు. నేను మ్లేచ్ఛ రాలినైవుండి మందిరంలోప్రవేశించటం మహాపరాధమని నా కిపుడు తెలిసివచ్చింది. బామ్మగారు పూజ్యులు; కల్లకపట ములులేని పవిత్రమూర్తి, నిశ్చలభక్తురాలు. నేను యే మత స్తురాలనయినా, నా జన్మ యెలాంటిదయినా వారిఆచార వ్యవహారాలు నన్ను ఆకర్షించినవి. గుప్తంగా మనసా వారిననుకరించాను. వారు నాకు దైవసమానులు. ఆత్మప్రేర ణోత్సాహంలో అంధురాలనై వివక్షతను మరచి, ఆల యంలో ప్రవేశించి అపవిత్రంచేశాను. ఇది నిజంగా ఘోర మైన అపరాధనే. నేను ఆలయఆవరణవెలుపలనుంచే దేవుని సేవిస్తే ఎంతో బాగుండేది. నా అపరాధాన్ని నేను గ్రహించి నపుడు అందుకు ప్రాప్తమయ్యే యెంతటిశిక్షనైనా ప్రసన్న పూర్వకంగా స్వీకరించటం యుక్తంగదా బాబూజీ. బామ్మ గారిమాటలవలన నాకు కించిత్ బాధకూడా కలుగలేదు. వారియడల నాకున్నభక్తి గురుత్వం రవంతకూడా హ్రాస్వం కాలేదు. కాని మీరు దీన హీనురాలైన నన్ను క్షమాప ణలుకోరి చిత్రవధచేయకండి. ఇంతవరకు నాద్వారా మీరు పొందిన బాధలు చాలు. ఇంకా బాధలుకలిగిస్తూ యిక్కడ కూర్చుండి నేను చూడలేను. ఇక నాకు శాశ్వతమైన సెలవు నివ్వండి బాబూజీ. ఎక్కడున్నా ఎన్నిబాధలలోవున్నా

మిమ్మూ బొమ్మగారిని మనస్సులో పూజించుకుంటూ వుంటాను. ఇక్కడినుంచి నేను వెళ్ళగలిగితే నాకు పూజా మందిరాలు విగ్రహాలు అవసరంలేదు బాబూజీ! మిమ్మ లనే దేవుళ్ళుగా తలంచుకుంటాను; పూజిస్తుంటాను. నా జీవితానికి ఒక నూతన వెలుగును చూపారు బాబూజీ. అది నేను యెన్నటికి మరువజాలను'' అన్నది.

ఆమెముఖమండలము శిరోజాలు దుస్తులు మట్టితో ముద్రించుకున్నవి. ఇంకా శిరోజాలనుంచి దుస్తులనుంచి నీటిబిందువులు రాలుతూనేఉన్నవి. తన ప్రతిష్ఠితదేవపటం ముందు దిద్దుకున్నతిలకం యింకా చెరగలేదు. యోగనిష్ట లోనున్న లక్ష్మీదేవివలె ప్రతిబింబిస్తున్న ఆమెను మహామ్మ దీయయువతిఅని యెవరనగలరు! ఈమెతాకితే అపవిత్ర మయ్యేదేవుడు యీలోకంలో యెందుకున్నాడా, అని ఆలో చిస్తున్నాడు శివం. ఈమెద్వారా తన కానందాన్నికలిగించే అనుభూతిని పొందుతున్నాడు కాని, దాన్నిఅర్థసహితంగా చెప్పజాలడు. పసివానికి ఆటవస్తువు లభ్యమైనట్లు ఆయన మనస్సు కీమె పుల్లాసితవస్తువైంది. బాలకుడు బజారులోని కుక్కపిల్లని పట్టుకొచ్చి నులకతాడుతో గుంజకుకట్టివెచి, తనకులభ్యమైనవాటినన్నిటిని దానికితినిపిస్తూ "కూకుకూ"రని ఆడిస్తూ దానితోలీనమై ఆనందపరవశుడవుతాడు. దానికి పెట్టటంలోను ఆడించటంలోను తనక్షుద్బాధనుకూడా మర్చి పోతాడు. నేటి శివప్రసాద్‌స్థితికూడా అలాంటిదే. నూర్జ హాన్ వెళ్ళిపోవడమనేవిషయం ఆయనకు పెనుభూతంవలె కనిపిస్తున్నది. ఆమెలేని తనను ఆలోచించుకుంటే భీతిగలుగు

చున్నది. తన మనోల్లాసితవస్తువైన ఆమెను కోల్పోవటం ఆయనకు భరించరానిది.

"నూర్జహాన్, నీవుఅన్నట్లు మా అమ్మ అన్నమాట లకు నీకు నిజంగా బాధకలుగనపుడు నీ కిక్కడనుంచి వెళ్ళా లనేప్రమేయ మెందుకొస్తున్నది?" అన్నాడు శివం.

నూర్జహాన్ :- కేవలం ఆవిషయంతో నేను వెళ్ళి పోవటంలేదు బాబూజీ. నేను యిక్కడవుండి మీకు యింకా బాధలుకల్పించటం నా కిష్టంలేదు. వెళ్ళుటకు అనుజ్ఞయిస్తా మని ఆఖరివినతిగా ప్రార్థించుకుంటున్నాను.

శివం :- నూర్జహాన్, ఒక్కవిషయ మడుగుతాను నిజం చెప్పు. నీవు ముస్లిమువిగదా, హిందూమతమన్నా గ్రంథాలన్నా హిందూదేవాలయాలన్నా దేవుళ్ళన్నా ముట్ట రానివి తలంచరానివిగా భావిస్తారు ముస్లిములు. మతోన్మా దులకు బద్ధవైరము. అందు నీవు మరీ మహమ్మదీయుల కిర వైన కాశ్మీరునందు ముస్లింగా జన్మించి, నేడు హిందూ దేవుళ్ళను శాస్త్రోక్తంగా ఆరాధిస్తూ స్వచ్ఛమైన ఒక బ్రాహ్మణయువతిగా తయారయినావు. నీకు మా మతం మీద ద్వేషంలేదా? ఈ పూజావిధానాలన్నీ యెక్కడ నేర్చు కున్నావు?

నూర్జహాన్ :- బాబూజీ, మీరు గొప్పకుటుం బీకులు, వున్నవారు. పాశ్చాత్యదేశాలలో చదివారు. కాని మీరు యెప్పుడూ మీలాంటి వున్నవారితోనే, సుఖసంప దలతో తులతూగేవారితోనే స్నేహాలుచేసివుంటారు. కలిసి మెలిసి తిరిగివుంటారు. ఏప్రాంతమువారైనా యేదేశను

వారైనా వున్నవారంతా సుకుమారశరీరాలతోను, విలువైన ఒకేమాదిరిదుస్తులతోను, నాగరికభాషతోను దాదాపు ఒకే అచ్చులో వుంటారు. ఏవిషయాలయినా వాస్తవికం సూరు చదివి తెలుసుకొనవలసిందేగాని, అనుభవంతో తెలుసుకోలేరు. నా వయస్సెంత చిన్నదయినా పొట్టచేతబట్టి రైళ్ళలో టిక్కట్లులేకుండా దేశంమూలమూలల తిరిగాను. నా స్వానుభవం నాకు నేర్పుతుంటుంది. బాబూజీ, మతాలవారీగా మాత్రం మనుష్యులు జన్మించలేదు. కాశ్మీరులోని హిందువులయినా ముస్లింలయినా ఒకటిగానేవుంటారు. కాని యిక్కడి హిందువులు కాశ్మీరు హిందువులుకూడా ఒకేరకమైన పుట్టుకతోవుండరు. ఇక్కడ జన్మించేవారు యేమతస్తులయినా ఒకేరూపాలతోనే వుంటారు. ఆయా ప్రాంతవాతావరణము, నీటితీరు, మట్టిస్వభావాలనుబట్టి అక్కడి ఆహారాదులనుబట్టి మనుష్యపుట్టుకలు స్వభావాలు వుంటవిగాని, మతాలనుబట్టి జన్మవుండదు బాబూజీ. మనుష్యులే స్వయంగా కొందరు గడ్డాలుపెంచి కేశములు ఖండించి, కొందరు పిలకజుట్టును పెంచి, మరికొందరు కత్తి శరీరానికి ఆనకుండా మొత్తంకేశములను పెంచి వివిధరూపాలను కృత్రిమంగా ధరించి, తమతమ మతాచారాలుగా విశ్వసిస్తుంటారు తప్ప మరేమీలేదు. నేనేగాదు, కాశ్మీరులోని యే మహమ్మదీయయువతి నావలె ధరించినా హిందూస్త్రీవలెనే కనిపిస్తుంది. నా నేత్రాలతో నేను యింత తిరిగి చూశాను. ఇదంతా చేసుకునే భేదాలేగాని, పుట్టుకలోని భేదాలు మాత్రం గాదని స్వానుభవంతో చెబుతున్నాను బాబూజీ.

నేను మహమ్మదీయమతంలో జన్మించినా, మా దరిద్రంలో ఏ మహమ్మదీయులూ నన్ను ఆదరించలేదు. వారిద్వారా యెన్నడూ నేను జాలిని దయను పొందలేదు. నాలుగురాళ్లు పనిచేయందే పెట్టియెరుగరు. చిన్నప్పటినుంచి హిందువుల ఆదరం నాకు అనుభవమైంది. అడుగకుండానే వారిదాన ధర్మాలనుపొందే సుయోగం యెన్నోమార్లు సంభవించింది. జాలి దయ హిందువుల హృదయాలలో నిండి, తొణికిసలాడుతుంటవి. మహమ్మదీయహృదయాలు విజ్ఞాన శూన్యమై కఠినత్వాన్ని పొంది కరకరలాడుతుంటవి. పోలెసులలోని మహమ్మదీయులు నన్ను మరింత కొట్టేవారు; నేను మహమ్మదీయకన్యనని తెలిసినపుడు పశ్చాత్తాపపడేవారు. హిందూపోలీసులలో ఆ విచక్షణ వుండదని నా అనుభవం. మహమ్మదీయులంత కాఠిన్యం వారువహించలేరు. అందువల్లనే నాకు హిందువులంటే అభిమానంతప్ప మరే రహస్యమూ లేదు. ఇక మీ దర్శనభాగ్యంతో నా హృదయం పూర్తిగా మారిపోయింది. బాపమ్మగారిదర్శనంతో నా రక్తంలోనుంచికూడా మహమ్మదీయతత్వం పోయింది. మీ ఆదరాభిమానాలు నన్ను మార్చినవి. జైళ్ళు, లాఠీదెబ్బలు, తిట్లు చివాట్లు మార్చలేనివాటిని అపారమైన విశ్వాసంతో గూడిన దయ మమకారాలు మార్చగలవని యిక్కడికి వచ్చాక తెలుసుకున్నాను. మీరు నన్ను ఘనంగా ప్రియంగా విశ్వసనీయంగా తలచుచున్నందువలన, నేను నాకు తెలియకుండానే మారిపోయాను. మీరు విశ్వసించే వాటిని విశ్వసిస్తూ, మీ అడుగుజాడలలోనే నడుస్తూ మీరు

పూజించేవారినే పూజిస్తే నాకు మనశ్శాంతి లభిస్తున్నట్లు గ్రహించి యిచ తప్పకుండా పాటిస్తున్నాను కాని, మీతో కలిసిపోవాలని, అధికృతకావాలని, ఆలయప్రవేశం కావాలని నేను కోరుటలేదు. మీకు నాయందున్న సద్భావనలతో గూడిన విశ్వాసం సడలకుండా యెప్పటికప్పుడు వృద్ధిఅవుతుండాలనే ఆశమాత్రం నన్ను పీడిస్తున్నది బాబూజీ. దీనికికారణాలను చెప్పగల సామర్థ్యం నాలో లేదు. నేను ఆచారయుక్తంగా పూజిస్తున్నానని మీకు ఆశ్చర్యంగావుంది లాగుంది. పూజించేవారి భృత్యురాలిగావున్నపుడు వారి పూజలను చూచినపుడు నా కెంతో ఆనందంకలిగేది; ఆకర్షించేది. నేనూ అలాంటి బ్రాహ్మణకుటుంబంలో జన్మించితే నిద్రాహారాలులేకుండా అలా పూజలుచేసేదాన్నిగదా అని వూహించేదాన్ని. వారు నన్ను అతిప్రీతిగా చూసేవారు. అందుకే నా మనస్సులో ఆ ప్రభావాలు నిలిచి స్థానాన్ని పొందినవి. ఆరూపంలో ఆనాడు నా హృదయంలో నాటుకున్నవి వృద్ధిబొంది, వృక్షాలై నేడు మీసమక్షంలో మీ మెరుగులతో వినూత్నరూపందాల్చినవి. ఈ శిఖరాగ్రం నుంచి నేను జారిపడకుండా హృదయపవిత్రతతో భగవద్భక్తితో వుండేట్లు ఆశీర్వదించి యిక్కడినుంచి పోను అనుజ్ఞ యివ్వండి బాబూజీ.

శివం :- (మూడుఅడుగులజాగా దానమడిగిన వామనమూర్తిని చూచి, నవ్వుకున్న బలిచక్రవర్తి ఆకాశానికంటు పెరిగిన ఆ వామనమూర్తినిగాంచిబిత్తరచెందినట్లు శివం తత్తరపాటుచెందుతూ) నూర్జహాన్, భగవంతుడు ఏదో

రిష్టమైన ప్రదేశంలోనే అమూల్యమైనవజ్రాన్ని నా కంటించాడు. సానబట్టినకొద్ది వజ్రంలోని మెరుపులు మరింత మెరుగెక్కుట సహజం నీ చిన్నిహృదయంలోని యిన్నివిషయాలను చెప్పి, నాకనువిప్పుచేశావు. కనుక నేను నిష్కల్మషమైనహృదయంతో నీముందు శపథంచేసి చెప్పుతున్నాను మా అమ్మగాదు, నన్ను నేను నష్టపోవలసివచ్చినా లెక్కించను. నిన్నుమాత్రం నేను పోగొట్టుకోజాలను. జన్మతః నీలో కొంత విజ్ఞానబుద్ధి వున్నది. నీవు సామాన్యస్త్రీవి కాదనిమాత్రం నేడు అర్థంచేసుకున్నాను. నీద్వారా యీ లోకాని కేదో ఒక గొప్ప విశిష్టప్రయోజనము ఒకరోజున కలుగుతుందని నామనస్సు చెబుతున్నది. కనుక నిన్ను నేను పోనివ్వను. నామాట వినక నీవు నిర్లక్ష్యంచేసి వెళ్ళితే మాత్రం నాప్రాణాన్ని హరించి వెళ్ళినదానవవుతావు. నా మరణవార్త వినాలనివుంటే నీవు నిరభ్యంతరంగా వెళ్ళిపోవచ్చు. (అని ఆవేశంలో అన్నట్లు అన్నాడు)

నూర్జహాన్:-(ఆత్రతగా చెంతకుచేరి తనకుడిహస్తంతో ఆయననోటిని మూస్తూ) బాబూజీ, ఈ అభాగ్యురాలైన మ్లేచ్ఛురాలికొరకు అంత ఘోరమైన మాటలనటం మీకు తగదు. మీరు నాయెడల అంత కృపవుండుట నా అదృష్టంగా భావిస్తాను. నన్ను గొప్పగా యెంచకండి. ఆతరువాత మీరే పశ్చాత్తాపపడవలసివస్తుంది. నన్ను క్షమించి వెళ్ళనివ్వండి; మీరు బాధలనుండి విముక్తులవుతారు. (అంటూ గడ్డం పుణుకుతున్నది.)

శివం:— (ఆమెహస్తాలు రెండూ పట్టుకుని అనునయం చేస్తూ ఆనందాశ్రువులనొలికిస్తూ) నూర్జహాన్, నేను వినయంగా బ్రతిమాలుతున్నాను. నానుంచి కఠినోక్తులు రాకముందే, పోనని ప్రమాణంచేయి. (అంటూ ఆమె గడ్డాన్ని పుణుకుతూ తన శిరస్సును ఆమె ముఖంవైపుకు పూర్తిగా వంచాడు.)

నూర్జహాన్:— (గాబరా చెందుతూ వారిశిరస్సును పైకెత్తుతూ) బాబూజీ, అబ్బ! మీ రీ తుచ్ఛురాలికొరకు యిన్నిబాధలు కొని తెచ్చుకోవట మెందుకు? సరే, మీ అనుజ్ఞలేకుండా నేను వెళ్ళను లెండి.

అది దశమిరోజు. చాలా శుభదినం. తెల్లవారకముందే పట్టణంలోని అనేకమంది పౌరోహితులు వచ్చి భవానీని సంప్రదిస్తున్నారు. వంటబ్రాహ్మణులు సామగ్రిని లెక్కలుజూడకుండా గబగబలతో కూలీలనెత్తి కెక్కిస్తున్నారు. నీలకంఠశిథిలాలయఆవరణేగాదు, చుట్టూ చాలా దూరంవరకు జనం గుంపులుగుంపులుగా జేరి పెద్దపెద్ద ప్రయత్నాలు చేస్తున్నారు. దృష్టిదోషం తగులకుండా చుట్టూ గుడ్డతెరలు అమర్చబడినవి. నేల పరిశుభ్రం చేయబడింది. ఒకప్రక్క వందలమందిబ్రాహ్మణులకు భోజనాదులు ఏర్పాటు చేయబడుచున్నవి.అందుకు జేరిన బ్రాహ్మణోత్తములంతా ముహూర్తసమయంచూసి మంత్రోచ్చారణ ప్రారంభించారు. నదిఘాటునుంచి వరుసగా తెగిపోకుండా కడవలతో నీరు వస్తున్నది. అఖండపారంగతులైన ప్రఖ్యాతిబొందిన పండితులు దేవవిగ్రహంచుట్టూ నిలిచి మరింత స్పష్టరీతిని గుక్క

తిరగకుండా మంత్రోచ్చారణచేస్తున్నారు. దేవునిమీద ఒలుకుతున్న కడవలాదినీరు ఏకధారగా పడుతున్నది. ఆ దేవునిలో నిజంగా ప్రాణముంటే ఊపిరిసలుపక యెగిరిపోయి వుండును. రేవునుంచి దేవునివరకు వరుసగానిలిచి కడవల నీ రందుకుంటున్న బ్రాహ్మణులుకూడా అదేరీతి మంత్రోచ్చారణచేస్తున్నారు. తెల్లవారిందిగాని, దినకరుడు యింకా పడమటికనుమలెక్కి తొంగిచూడటంలేదు. కాని వేదోచ్చారణ మిన్నుముట్టి దేవుని మేల్కొలుపుతున్నవి. దేవలోకంనుంచి యీనాడు దేవతలు ఒక్కమాటుగా నీలకంఠస్వామిఅతిథ్యానికొచ్చినట్లువారిమంత్రోచ్చారణ పట్టణంలో మారుమ్రోగుతున్నది. మామూలుప్రజ కిదో వింతగా తోస్తున్నది. ఎన్నడూలేని యింత ఆర్భాట మీ దేవుని కీనాడెందుకు కలుగుచున్నదో, తన ఆలయం అంత శిథిలమయిపోయినా, యీలోకంవారెన్నడూ పట్టించుకోలేదని తాను స్వయంగా తన బంధుకోటినంతటిని తెచ్చి తనప్రభావాన్ని ప్రదర్శిస్తున్నాడేమోనని జనం పరిపరివిధాల భ్రమిస్తున్నారు. ఆలయం మైలబడిందని అపవిత్రతను దూరంచేయను భవానీ చేయిస్తున్న పూజ లని ఆతరువాత గాని ప్రజలకు తెలియలేదు. ఎందుకు మైలపడింది, యెవరి ద్వారా అపవిత్రమైంది అనే విషయం పాపం అక్కడచేరి పూజలుసలుపుతున్న వందలమంది బ్రాహ్మణులకే తెలియదు.

పాపం! ఆ దేవుని నెత్తినపోస్తున్న నీరు వృషనదిగా తయారయి, తిరిగి కృష్ణలో కలుస్తున్నది. కొందఱుమంత్రా

98 రక్తసింధూరము

లకు మరికొందరిమంత్రాలకు పొంతనకూడా కనిపించుట లేదు. దూరదూరాలనుంచి కేవలం వినోదంచూడను, భోజనాలకు వస్తున్నవారుషడ్రసోపేతంగా భోంచేసి, మహదానందాన్నిపొంది తృప్తిని ప్రకటిస్తూ అపుడపుడు తరచుగా యీదేవుడు యిలా మైలపడుతుంటేనన్నా బాగుండునని దీవించి వెళుతున్నారు. ఇదేరూపంలో మూడురోజులు పూజలుజరుగుతున్నసూఢివార్త తెలిసినతరువాత భోంచేసిన వారు తిరిగి పోవటంకూడా మాని, అక్కడిమైదానంలోనే విశ్రాంతియేర్పాట్లు చూసుకుంటున్నారు. దూరదూరాల నుంచి వచ్చే జనం యింకా అధిగమించింది. వచ్చినవారికి లేదనకుండా భోజనసదుపాయాలుచేయుటే నియమమయినట్లు కూడా ప్రచారమయి బ్రాహ్మణులశాక తైరపిలేకుండా నాగుతున్నది

భవానీవద్ద డబ్బుకొదవలేదు. ధాన్యానికి లోటులేదు. కాని కూరగాయలు, నెయ్యి అపరాలు పట్టణంలోనివి పట్టుకోయాక యేమిచేయటమాఅనే భీతిపట్టుకున్నది భవానీకి. చుట్టుపట్లనున్న అరటితోటలను నూనెగానుగలను గుర్తుజేసి, భవానీకి ధైర్యాన్ని కలిపిస్తున్నారు పాకోషింపెలు. మూడవరోజు ఆఖరిలో సంభావనలిచ్చే యేర్పాట్లున్నట్లు కూడా వచ్చినవారందరికి తెలిసిపోయింది. అందువలన తిరిగిపోయేవారు కనిపించుటలేదు. వంటబ్రాహ్మణులను త్రిగుణంచేయవలసివచ్చింది. వడ్డనచేసేవారిని పదిరెట్లు పెంచవలసివచ్చింది. జిల్లాలోని బ్రాహ్మణులసంఖ్యను యిక్కడ కూర్చొని లెక్కించవచ్చు. నదీతీరమైదానమంతా బ్రాహ్మ

ణులతో క్రిక్కిరిసిపోయింది. పట్టణంలో యెక్కడచూసినా భవానీఅతిథులతో శోభిస్తున్నది. వందల చిల్లరషాపులు వెలిసినవి. ముక్కుపొడుము, బీడీలు, చుట్ట,పొగాకు, సోడాలు విరివిగా అమ్ముడుబోతున్నవి. పట్టణము, అనంత ఆకాశము, నదిఅంతటా మంత్రోచ్ఛాదితమైనట్లు ప్రతిధ్వనిస్తున్నది.

శివప్రసాద్ కిది వింతగా తోస్తున్నది. ఈరూపంలో నైనా భవానీ సంతుష్టురాలవుతుందిగదా అనేభావన చిన్ని ఆనందరేఖలను కలిపిస్తున్నది. ఈవిషయం తెలిసినపుడు నూర్జహాన్ నిర్ఘాంతపోయి, సిగ్గుబిడియాలతో బయటముఖం చూపకుండా వ్రతంబట్టి శివప్రసాద్ కిచ్చిన అభయాన్ని జపిస్తూ మూలకూర్చున్నది.

పాలేర్లందరికీ యివి పర్వదినాలుగా గనిపిస్తున్నవి. ప్రతిసంవత్సరం యిలాజరిపితే చాలా బాగుంటుందని అమ్మగారికి ప్రసాద్ గారికి చెప్పాలని నిర్ణయించుకున్నారు.

అది పూజల తృతీయదినం. దిక్కుదివాణాలులేక వుత్తలపడివుండే ఆ నీలకంఠస్వామివిగ్రహదర్శనం నేడు దుర్లభంగావుంది. వేనకువేల జనాభా కిటకిటలాడుతున్నది. ఆకాశానికంటుతున్న ఆ మంత్రోచ్చారణ అందరినీ ఆవేశపర్చి వంతపలికిస్తున్నది.

దూరదూరాలనుంచి విని వచ్చిన అనేకమంది సాధుపుంగవులు పాపం దేనికీ అవకాశంకలుగక నిస్పృహ నిరాశలతో పూజాదులను దూరుకుంటూ దూరంగా వెళ్ళి కూలబడి వినోదపుతిరుణాలను తిలకిస్తున్నారు.

ఈరోజే సంభావనలిచ్చేది. ఏసమయంలో ఆ పంపిణీ

జరుగుతుందో, ఆ అవకాశం యెక్కడ కోల్పోతామోననే భీతితో అందరూ యిసుక వేస్తేరాలకుండా చేరివున్నారు. మంత్రోచ్చారణ మామూలుగా మరింతవుత్సాహంగా జరుగుచున్నది. భోజనాలకు సమయముంటూలేక యెవరికివారు అవకాశంకలిగినపుడే తమపాలు పంచుకుంటున్నారు. కుక్కలు నిద్రలోకూడా యిలాంటిఅవకాశాన్ని కోల్పోవు. అవి వాటిలోఅవి కోలాహలంచేసి కొట్టుకుంటున్నవి. ఎవరో ఒకరు వాంతులుచేసుకుని పడిపోయారని, ఒకరికి వాంతులతోను విసర్జనలతోను ప్రాణంపోయిందని పిడుగులాంటివార్త బయల్పడింది. అయినా సంభావనలను విడనాడలేక కొందరు పెడచెవినిపెడుతున్నారు. ప్రాణభీతిగలకొందరు చెప్పకుండా పలాయనంచిత్తగిస్తున్నారు.

ఆరోజు అపరాహ్నసమయమది. కల్లోలం పెరిగిపోయింది. ప్రాణాలువిడచినవారెవరో విడువనివారెవరో పరీకించుట కష్టం పృథ్వీమాతమీదపడి, వాంతులు హీనస్వరంలో చేసుకుంటున్నారు కొందరు. కొందరిలో కదలికలు లేవు. ఇపుడు మంత్రోచ్చారణ వినిపించుటలేదు. అటూయిటూ తిరిగేవారుకూడా లేరు. యెక్కడివంట సామగ్రి అక్కడే వుండిపోయింది. నీలకంఠస్వామి నిగనిగ కాంతులు వెదజల్లుతూ, ఘూపీరిసలుపుకుంటున్నాడు. యమధర్మరాజు ఆతిథ్యానికెళ్ళినవారుమాత్రం నోరుతెరచి మార్గంధాన్నివిడచి శాశ్వతంగా కనులుమూసివున్నారు. యేమి కదలను శక్తిచాలక మృత్యుదేవతఒడిలో కొందరు పెనుగులాడుతున్నారు.

భవానీదొడ్లో పాలేరుకుకూడా కలరాతగిలిందన్న వార్తతో యెక్కడిపాలేరు లక్కడే పనులువిడచి పారిపోయారు. ఇది భవానీహృదయాన్ని కల్లోలపరచింది. మంచి కంటె చెడుకు బలమెక్కువ. రెండురోజులలో కలరా పట్టణమంతా వ్యాపించి తాండవనృత్యం సాగిస్తున్నది. ఎవరికివారే భయభీతావహులై పట్టణంనుంచికూడా పారిపోతున్నారు. యమపాశాలకు బలియైనవారిని మోసేటందుకు మనుష్యులుదొరకుటకూడా ఒక పెద్ద సమస్య అయిపోయింది. ప్రాణభీతిలో పరస్పరసహకారాలు ఆచారాలు పటాపంచలై కూర్చుంటవి.

వారంరోజులు గడచినవి. ఉధృతరూపంలోని కలరా యింకా వెనుకముఖంచూడలేదు. కళకళలతో కోలాహలాన్ని వెదజల్లే పట్టణంలో నేడు ఏడ్పులు రోదనలు ఆక్రందనలు ఘోషిస్తున్నవి. దుకాణాలు బందుఅయినవి. బజార్లలో తిరిగే జనంలేదు. భవానీమహాతల్లి తెచ్చిపెట్టిన కలరా అని పట్టణంలో మృత్యువువాతబడినవారికుటుంబాలవారు ఆమెను దూషిస్తున్నట్లు భవానీ చెవినబడినప్పుడు, ఆమె పోయి ప్రక్కమీదపడి దొర్లి గింతలుపెట్టి విలపించింది. భగవంతుడు యింత కఠినశిక్షను తనపైవిధిస్తున్న యెందుకు సిద్ధాడా అని వాపోతున్నది. శాశ్వతమైన పవిత్రతేదో అపవిత్రతేదో మానవునికెంతమాత్రం తెలియదు. పవిత్రకలలుగంటూ అపవిత్రతను పొందటమే లోకానికి పరిపాటి.

భయభ్రాంతిలో ముఖంలో విచలితనేత్రాలైన భవానీని కూడా ఆదరించాలని గాబోలు కలరా ఆమెసన్నిధికి చేరింది.

రాత్రంతా నిద్రలేదు. వాంతులతో హైరానయింది. సాహసంగల పసిపాపాయినలె శివప్రసాద్ ఆమెచెంత చేరి, అశ్రుకణాలు రాలుస్తూ ఆమె యెంతబలవంతంచేసినా వినక హారతేసి పాదాలొత్తుతున్నాడు. తెల్లవారుజామయింది. భవానీ ప్రక్కనే నిద్రను ఆపజాలక నేనువాల్చాడు. నిస్త్రాణతో మూలుగుతున్న భవానీ "నాయనా శివం, నీగదిలోకివెళ్ళు బాబూ" అంటూ తనహస్తాన్ని ఆయన శిరస్సుమీద వేసి నిమురుతున్నది. ఆమెచేయి లలాటంమీద పడినపుడు విస్తుపోయి "అరే బాబూ, ఇదేమిఖర్మంరా, నీకు జ్వరం మండిపోతున్నది. నిప్పులు చెరుగుతున్నది. నన్ను యిలా అన్యాయంచేయకు తండ్రీ. నేను చనిపోయినా బాధలేదు. నీకీ జ్వరంరావటం నా ఖర్మంలాగుంది. భగవంతుడా! నేనేమిఅపచారంచేశానని నా కింత కఠినశిక్ష? నీ పవిత్రత కొరకు నీపూజలు జరిపించుటపరాధమా తండ్రీ!" అని విలపిస్తూ వాపోతున్నది.

మానవస్వభావం యెంత విచిత్రమైంది. సకలశక్తులు కలిగి విశ్వవిరాట్‌రూపుడైన భగవంతుడు అపవిత్రుడవుతాడని, ఆ సర్వాంతర్యామిని తాను పవిత్రంచేయగలనని యీ వెర్రిమానవుడు విశ్వసిస్తాడు. అందుకే ఆ భగవంతుడు వారి వెర్రితనానికి జాలినిబొంది, తన భక్తులనేవారిని పరిహాసరూపంగా శిక్షించి వేరగా చూస్తుంటాడు.

మూలిగేనక్కమీద తాటిపండుపడినట్లు నూర్జహాను కిగో విషమపరిస్థితి వచ్చిపడింది. ఆ దేవుడు యెవరవలన అపవిత్రమయిపోయాడో ఆవిషయం భవానీ, శివం తరు

వాత తనకుమాత్రమే తెలుసు. అది కేవలం తనద్వారా అయిన అపవిత్రతే. అందు కామోహృదయం యెంత క్షోభిస్తున్నదో ఆమెకే తెలుసు. దుఃఖితజీవితానికి దుఃఖం వెతుక్కుంటూ రావంతటదే వస్తుంది. సూర్జహాన్ మనో వ్యథతో కుమిలిపోతున్నసమయంలో కలరావార్త వచ్చి, మరింత కల్లోలితపరిచింది. ఆమెకు మృత్యుభయం అసలే లేదు. కాని యీ మొత్తానికి తానే కారణభూతనునునది భరింపరానిదిగావున్నది. ఆ భయోత్పాతమైన కలరామతల్లి తమదొడ్డిలోనే ప్రవేశించుట, పాలేళ్లు పారిపోవుటతో ఆమె మరింత విహ్వాలురాలయింది. పశువులు గ్రాసం వేసే వారుకూడా లేక అరుస్తున్నవి ఇపుడా దిక్కులేనిపశువు లకు సూర్జహాన్ ఆదరం లభ్యమయింది. అవుసరాలు మనిషికి శక్తినికలిగిస్తవి. ఆమె కట్టిన ధోవతికి గోచీపెట్టి చండికారాణి వలె గ్రాసంతోను, మరోమాటు నీటిబొక్కెట్లతోను పశువుల మధ్య పరుపులెడుతున్నది.

# 6 పురస్కారం

బాధలు సంభవించినపుడు కేవలం కనిపించిపోవు, అంతులేనన్ని బాధలు ఒక్కొక్కటిగా పెనవేసి నరాలను నలిపి పిండి పిప్పిజేసిగాని పోవు. భవానీదీనికూడా కలరా ఆవహించటం, శివబాబుకి జ్వరము ఆమెను అంధకారంలో ముంచినవి. తాను యెన్నికష్టాలనైనాం నిర్లక్ష్యంగా అనుభ వించగల్గును. అవమానాలనెత్తిన పాదాలువేసి పరిహసిస్తూ

పయనించగల్గును. కటికిదారిద్ర్యంలో చిరునగవును చిలికించు కుంటూ శయనించగల్గును. కాని తనకు అపారఆదరాలను చవిజూపి, తనకు నూత్నజీవితాన్ని కల్పించి నూత్నవెలుగును చూపిన శివబాబు, ఆయనతల్లి మంచానబడుట ఆమెను అయోమయం జేసింది. నిరాశ్రయుడైన అభ్యాగతుడు ఆకస్మికంగా లాటరీలోపొందిన అమూల్యసంపద దుర్భాగవశాత్తు జప్తుఅయినపుడు, ఆ అభ్యాగతి పొందు రీతిగా, నూర్జహాన్ అర్థంగానివ్యథలోతహతహలాడుచున్నది.

కళకళలాడు భవానీగృహం నేడు ప్రేతరూపం దాల్చింది. భవానీ లేవగలస్థితిలోలేదు. గది వాంతులతో గలీజయి, దుర్గంధాన్ని గుప్పుచున్నది. నాలుకపిడచగడుతున్నా గుక్కెడునీటిని ఇవ్వగలిగేవారు లేరు. నీలకంఠుని అపవిత్రతనుంచి రక్షించగలిగిందిగాని, తననుగాని తనశివాన్నిగాని యీఆపదనుంచి రక్షించుకో నశక్యురాలయి, నేత్రాలు వేల వేసి నోరుతెరచి పరమాత్మనిధ్యానిస్తూ "భగవాన్, నన్ను నీ ఆశ్రయానికి చేర్చుకోగాని, యీయింటికి యేకైకజ్యోతి అయిన శివాన్ని రక్షించు. వాడు అమాయకుడు. నిష్కల్మషి, నిరపరాధి. అలాంటివానిని నా అపరాధాలకు దండించకు" అంటున్నది. ఆమెలోని ఆఖరిశక్తికూడా అంతరించి అతికష్టంమీద కనులుమాత్రం తెరువగలుగుచున్నది. ఆనోనుంచి కేవలం మూలుగులుమాత్రం వినవస్తున్నవి.

జ్వరంతో శివం ఆమెబలనాశంతో తనగదిలోకి తప్పటడుగులు వేసుకుంటూ వెళ్ళాడు కాని, జ్వరంలోనితపనతో భీతిజెంది కనులయెదుట యెవరూ కనిపించని ఆగదిలో వుండ

జాలక తనపరుపుభవానీగదివాకిటముందు వేసుకుపరున్నాడు. ఆయన దగ్గరపెట్టుకున్న కూజానీరూ అయిపోయింది. తిరిగి తెచ్చుకోగలశక్తిలేదు. సుందుమాకులచింత యిసుపురిలో యెవరికీ లేకుగాని, దాహపుతపనమాత్రం తపింపజేస్తున్నది. మంచినీటికయినా నోచుకోక, మృత్యుముఖద్వారం చెంత జేరి నిట్టూర్పులు విడుస్తున్నారు. జ్వరమైకంలోనున్న శివానికి కూడా భవానీగదినుంచి వస్తున్న దుర్గంధం భరింపరాకున్నది అపుడపుడు ఆమెఅనసానమూలుగులు ఆమెఇంకా యీలోకాన్ని విడువనట్లు తెల్పుచున్నవి. దిబ్బళ్ళు వేసిన భవానీచెవులకు శివంమూలుగులుకూడా వినిపించటంలేదు. పిలువను ఆమెవాక్కు యెప్పుడో పడిపోయింది. ప్రార్థింపను మనోశక్తికూడా నశించి తెలివితప్పివున్నది.

తల్లివద్ద పాలుత్రాగుతున్న ఆవుదూడ పట్టుకోనువ్యక్తురాలవుతున్న నూర్జహాన్‌ను తప్పించుకుని అటుయిటూ పరువులెడుతున్నది. ఈమె యెంత పట్టుకోజూస్తే అది అంత వుత్సాహితమై గంతులు వేస్తూ వుల్లాసాన్ని ప్రకటిస్తూ ఆటలు పట్టిస్తున్నది. పొంచి పట్టుకోవాలని నూర్జహాన్ భవానీగది కిటికీవైపు చెంతగా వెళ్ళి గోడకాని నిలిచింది. ఆ కిటికీగుండా వస్తున్న దుర్గంధం ఆమెకు రోములును కలిగించింది. సన్నటి మూలుగులుకూడా వినిపించినవి. మనస్సు ఆందోళితమై డగమగలాడుతూ ద్వారంవైపుకు తిరిగి వెళ్ళింది. యీయింటిలో అడుగుపెడితే తిరిగి యింటినికూడా అపవిత్రంచేసి నట్లవుతుందేమోనని, సురోమూటు బొమ్మగారిక్రోధానికి

గురికావలసినస్తుందేమోనని సంకోచంతో ఆగి. పాలుబోని ఆలోచనలనుచేస్తున్నది.

మొండినిశ్చయంతో గదిలో ప్రవేశించి భవానీ శివంల స్థితి గాంచిన నూర్జహాన్ శిలాప్రతిమవలె నిలిచిపోయింది. దుఃఖం యెంత సహించరానిది! ఒక్కమాటుగావచ్చి శిరస్సునపడినా శోకాలుపెట్టి విలపించేస్వభావంగాదు నూర్జహాన్‌ది. ఆ చిన్నిహృదయంలో జ్వాలాముఖపర్వతాలు యెన్ని బ్రద్దలయినా అధరాలనుబిగించి నిండుగానిలచి, అంతర్గతవుత్పాతాలను అణుచుకుని కర్తవ్యపరాయణురాలు కాగల సాహసి. దళితరూపంలో చెట్లక్రింద పంచలలోను ధర్మశాలలలోనూ వుంటూ, రోజు కో వూరు మారుస్తూ తిరిగిన తాను దిక్కులేనిచావు లనేకం చూసింది. శవాలను సమాధిచేసేఅవకాశంగాని కాల్చేఅవకాశంగాని లేక పొదల మాటున పారవేయుట, నదులలోవిడచుట మొదలగు దృశ్యాలు ఆమె యెన్నిటినో చూసింది. కాని ఎన్నడూ మనస్సుచలించలేదు. నేడు భవానీ, శివంలస్థితి ఆమెహృదయాన్ని నలిపివేస్తున్నది. "భగవంతుడా, చేతగాని నా చేత యీ సర్కసుఆట ఆడించు టెందుకు! నన్ను ఆ హైళ్ళలోనో దొంగవ్యాపారాలలోనో వుంచి అవమానాలను దుఃఖాలను లెక్కించకుండా వాటిమీదుగా నడిచిపోగలిగిన మొండితనాన్నికల్పించి అభ్యాసపర్చికూడా మళ్ళీ యీ అర్థంగాని చిక్కుసమస్యలలో దించి పరీక్షించుతావెందుకు తండ్రీ? నేను నిన్ను యెన్నడూ నోరెత్తి యేమీ కోరలేదు. నేడు మొదటి ఆఖరివినతిని విన్నవించుకుంటున్నాను. వీరిద్దరినీ

రక్షించి వారిబదులు నా ప్రాణాలను తీసుకో అని మనసా అనుకుంటూ కర్తవ్యపరాయణురాలయింది.

రోగపీడితులైవున్నవారు మనుష్యులనుగుర్తించేస్థితిలో లేరు. అంటుదోషాలను పాటించేస్థితి అసలేలేదు. ఇప్పుడా గదినుంచి దుర్గంధానికిబదులు సాంబ్రాణిధూమము వెడలుతున్నది. శివం యిపుడు ఆ క్రిందపరచిన పరుపుమీద లేడు. తనగదిలో నూర్జహాన్‌సపర్యలు పొందుతున్నాడు. ఆమె యిక్కడ వీవనతో విస్తూ, ఆయనకనుకొలకులనుంచి జాఱు అశ్రుధారలను అద్దుతూ, సాంత్వననిస్తూవుంటుంది. మరోక్షణం భవానీచెంత కూర్చుని తన ముఖాన్ని ఆమెకు కనిపించకుండా ప్రక్కకుపెట్టి పాదాలను వత్తుతుంటుంది. వైద్యులసహాయంకోరకు చేసిన ప్రయత్నాలు సఫలంకాలేదు. కలరా ప్రచండనృత్యాన్ని చూసి ప్రాణభీతినిపొంది వైద్యులందరూ ముందే పలాయనమయ్యారు. రోగాలస్వభావాలు వాటిఫలితాలు బాగా తెలుసుకున్నవారికే భయ మెక్కువ. ఇతరసహకారాలేవీ సందర్భపడనప్పుడు స్వశక్తికి చురుకుదనం సూక్ష్మగ్రాహ్యత కలుగుతుంది.నూర్జహాన్ అనుభవంలో డాక్టర్లమందులకంటె చిట్కావైద్యాలను యెక్కువ చూసింది. నడిసముద్రంలో మునుగుతున్నవాడు చేతికందిన ఆసరా తగిందా కాదా అనే విచక్షణ చూడజాలడు. అదేరీతి నూర్జహాన్‌కు పాలుపోని ఆలోచనలలో దొడ్లోని పొదీనా కంటబడింది. ప్రతిఆలోచనలేకుండా వెంటనే ఆమె పొదీనాఅరకుతీసి శుద్ధిచేసి అంతిముఘడియలను లెక్కిస్తున్న భవానీచేత త్రాగించింది.

మిరియాలు తులసిమిళితకషాయం పొంగించి శివప్రసాద్ కందించింది. క్షణం తీరుబడిలేదు. కనుమూతలేకుండా ఆ గదినుంచి యీగదికి యీగదినుంచి ఆగదికి పరుగుతీస్తున్నది. ఇరువురిలో యెప్పుడు యెవరు కన్నుతెరచి యేమికావాలంటారో అనే ఆదుర్దాలో అటు యిటు తికమకలతో పిచ్చిదానినలె తిరుగుతున్నది.

నూర్జహాన్ సేవలో రెండురోజులు పూర్తిగా గడిచిపోయినవి. ఇపుడు భవానీ పరిశుభ్రమైనప్రక్కమీద పడుకునివున్నది. కాని అది తనగదికాదు, యింటిలోని పెద్ద హాలు. తనపక్క కొద్దిదూరంలో శివంకూడా పరిశుభ్రంగా పరచబడిన పక్కమీద పడుకునివున్నాడు. తాను యీ గదికి యెప్పుడు యెలా వచ్చానా, యీ పక్క యెవరు పరిచారా, యీసాంబ్రాణిధూమ్రం యెక్కడినుంచి యెవరిద్వారా వస్తున్నదా అని ఆలోచిస్తూ, ఆ మనసను తన మొదటిదుర్గంధాన్ని తలచుకొని, శరీరంజలదరించి నేత్రాలు మూసి "భగవంతుడా, నీ మాయ యెవరికీ అర్థంగాదు. ఇదంతా యేమిటో నాకు తెలియుటలేదు. నేను యేమిచేయబోయి యెందులోపడిపోయానో! విచిత్రంగావుంది. నా బిడ్డను నాకిచ్చావు, నా కదే చాలు" అని ఆలోచిస్తూ కను మోడ్చింది.

శివం జావత్రాగి, ప్రశాంతంగా కనులుమూసి ఆనందమయమైన ఊహాలోకంలో విహరిస్తున్నాడు. తాను పరధ్యానతతో పయనంచేస్తున్నట్లు, హఠాత్తుగా సంధ్య పొరపాటుగా తనబాటు తెలిసిగి దారిప్రక్కన పడిపోయి, చూసుకుంటే,

తాను దుర్గంధంతోను, జిగటలుగట్టినమురికితోను యెవరో పారవైచిన ఒక చిరిగిచీలికలైన కంబళిమీద పడివున్నట్లు, శరీరం జలదరించి, ఆ దుర్గంధం తనచేతులకంటిందేమోనని వస్త్రాలు దులుపుకుంటూ లేవబోయినట్లు 'బుజ్' మంటూ ఆ కంబళి తనను గగనమార్గాన మోసుకెళ్తున్నట్లు, తాను విభ్రాంతుడై బిత్తరపోతూ అధోముఖుడై పరికించినపుడు మడిలో జపమాల చేతబట్టి భగవంతుని స్మరిస్తున్న భవానీ తనను కేకలుపెట్టి పిలుస్తున్నట్లు, తాను ఆ కంబళిద్వారా గగనమండలంలోని యేదో ఒక స్వర్గతుల్యమైనలోకానికి చేర్చబడినట్లు, అక్కడ వికృతంలేని ప్రకృతిసౌందర్యంతో శోభిస్తున్నట్లు, విధ్వంసకుల పీడలేక, కోమలమైన వృక్షజాలాలు ఫలపుష్పములతో సుగంధపరిమళాలను వెదజల్లుతూ పిల్లగాలితెమ్మరలకు నృత్యంసలుపుతూ తన్ను ఆహ్వానిస్తున్నట్టున్నవి. పచ్చనికొండ దట్టంగా హరితవర్ణచ్ఛాయ దివ్యమై విలసిల్లుతున్నది. ప్రక్కప్రక్కల కుప్పిగంతులతో సుస్వరధ్వనితో శాస్త్రీయసంగీతాలాపనను లయతానాలతో విరామంలేకుండా సాగిస్తున్నవి సెలయేరులు. చిత్రవిచిత్రమైన అందాలొలికించు పక్షిజాలాలు క్రీడలుసలుపుకుంటున్నవి. భ్రమరరాజములు తమ పాతపాటలకు వినూత్న మెరుగులు కల్పించి, ఆలాపనలుసలుపుతూ పుష్పగుచ్ఛాలలో దూరి దాగుడుమూతలాడుతూ, వలపులలో కైపులుకల్పించి, సుమములలో పుష్పరాజపరాగాలను చుంబించి మధువును గ్రోలుతూ మత్తులో మూలుగులు ప్రకటిస్తున్నవి. ఒక నర్తనప్రియము తన పింఛాన్ని పూర్తిగా వికసింపజేసి ఝళి

పిస్తూ నృత్యప్రదర్శనసలుపుచున్నది. పుష్టిగా పెరిగి కోమలంగా మృదుత్వాలొలుకు తేళ్ళు, తోడేళ్ళు మొదలగు మృగాలు అన్యోన్యంగా కలిసి ప్రేక్షకులవలె నిలచి ప్రదర్శన చూస్తున్నవి. ఈలోకంలో ఒకరిభయం మరొకరికి వున్నట్లు లేదు. అందరిలోను ఐక్యతవున్నట్లు కనిపిస్తున్నది. ఇక్కడ మానవులు కనిపించుటలేదు. అందుకనే యిక్కడ సంపాదనలు, సంపత్తులు. యీర్ష్యలు, ద్వేషాలు, అన్యాయాలు, అక్రమాలు, క్రూరాలు, హింసలు మొదలగు అపశృతులు లేవు.నిర్మలమైన ప్రశాంతత, ఆనందాలతో ప్రకృతి తానం చేస్తున్నది. అందు ఆనంద డోలికలలో వూగుతూ ప్రేమాలాపనచేస్తూ ప్రకృతిహృదయ తానముమీద గోటితో మీటుతున్నారు. ఈ మురికికంబళిమీదినుంచి దూకి ఆ మధుమయప్రకృతిలో లీనమయి శాంతినుబొంది హాయినిగొల్పే సుఖస్వప్నాలను జూస్తూ, నిద్రించాలనిపించి ఒక్కదూకు దూకాడు. మెత్తటి మృదువైనశయ్యమీద నిలిచినట్లు తన పాదాలక్రింద పృథ్వీమాత నాచ్ఛాదించివున్న హరితవర్ణ గరిక గిలిగిలింతలుపెడుతున్నది. తాను యే కంబళిని ఘృణీకరించుకుంటున్నాడో, యే కంబళి తన నింత వృక్షశిఖరాలనున్న జీవితపూర్ణత్వాన్ని చవిచూపను గగనమార్గాన కొనివచ్చిందో, ఆ కంబళి ఇప్పుడు కంబళిగాలేదు. లావణ్యాలొలికించు దేవకన్యగా తనప్రక్క నిలచి చూస్తున్నది. మదభరితమైన ఆమెదృక్కులు తనను లాలిస్తున్నవి. ఆమెధరించినదుస్తులు తనవిగానే కనిపిస్తున్నవి. ఇప్పుడిపుడే ఆమె దేవపూజనుంచి వస్తున్నట్లు గోచరిస్తున్నది. ఆమెశిరో

జాలనున్న తడి యింకా ఆరలేదు. ఆమెముఖమండలంలో నిర్మలమైన ప్రశాంతం దేదీప్యంగా కనిపిస్తున్నది. బాగా పరికించినపుడు ఆ మెముఖం అతిపరిచయమైందిగాతోస్తున్నది. "బాబూజీ, అలా చూస్తారెందుకు? నన్నుగుర్తించలేదా?" అన్నమాటలు తన చెవులకు వినిపించినట్లయింది. కాని ఆమె అధరాలు కదిలినట్లులేవు. ఆ పరిచితమైన ముఖమండలం వుబికి వన్నెలుచిందిస్తున్నది. ఆ నేత్రాలు పొంగి రెప్ప కొట్టచూస్తున్నట్లున్నవి. చూస్తున్నకొద్దీ ఆమెలోని లావణ్యం అద్వితీయమై మనస్సును చలింపజేస్తున్నది. శృంగారదృశ్యం యెట్టయెదుటనిలిచి రెచ్చగొట్టినపుడు మనస్సు యెంత కఠిన మైనదయినా చలించుట స్వాభావికం. వుబుకుతున్న వున్మాద ప్రేరితుడై ఆమెచెక్కిలి పట్టుకోను హస్తంచాచాడు. కాని తనచేతి కేమీ తగులకుండానే ఒక్కమాటుగా తాను ఆకా శంనుంచి రాలు తోకచుక్కవలె అక్కడినుంచి పడ్డాడు. గుండెదడతో పక్కమీద తాను "అమ్మా!" అని పెద్దగా అన్నాడు. "ఏమిజరిగింది బాబూజీ, శిరోభారంగా వుందా?" అని పక్కనుంచి యెవరో ప్రశ్నించారు. ఆయన వెంటనే నేత్రాలు తెరచి చూచి, వెలవెలబోతున్నాడు. తన యెదుట పాలగ్లాసుతో నిలచివున్న ఆమె స్పష్టంగా ఆ దేవలోకంలో తనకుకనిపించిన దేవకన్య. ఇంక ఆశ్చర్యాన్ని అణచుకోలేక తనహస్తంతో ఆమెచేతిని నెమ్మదిగా తాకాడు. ఆపైనదాని పట్టుకుని సవరించి పరిశీలిస్తున్నాడు.

"అలా చూస్తారేమిటి బాబూజీ. ఖంగారుగా కని పిస్తున్నారెందుకు?" అని ప్రశ్నించింది. ఆయనకనుకొలకుల

నుంచి అశ్రువులు స్రవిస్తున్నవి. అమ్మ యెంతపిచ్చిది! ఈమె భగవంతునిచే ప్రసాదించబడిన దేవకన్యఅని గుర్తింపజాలక మ్లేచ్ఛకన్య అంటున్నది. మానవస్వభావం యెంత వెర్రిది! యెదుటకనిపించేది యెంతవుత్కృష్టమైనదైనా, సాక్షాత్ దైవస్వరూపమయిందయినా, దాన్ని నిరాదరంచేసి వూహాలోని దేవునికొరకు వాపోతుంటారు. పొందినదాంతో ఆనందాన్ని అనుభవించటం చేతగాక పొందలేనిదానికొరకు తపిస్తుంటారు. వీరు యేదేవునికొరకు నోచుచింపుకుని చేతులుచాచుకుని నేత్రాలుపొడుచుకుని వెతుకుతుంటారో, ఆ దేవుడు వీరియెదుటపడినపుడు పరిహసించి ఆవలకునెట్టి, మేము మా యిష్టదేవునికొరకు తపిస్తున్నాము, నీవుకాదు పొమ్మ, అని అవహేళనతో భజనలుచేస్తుంటారు. ఎన్నటికీ కనిపించని దేవుడే వీరికి కావలసింది. కనపడిన దేవునిలో మహిమలేదని నెట్టివేసి కనపడని దేవునికొరకు తపస్సుచేయటం మానవులకు పరిపాటయిపోయింది, అని మనస్సులో అనుకుంటూ వెకిలిగా నవ్వి పెద్ద వేడినిట్టూర్పు విడిచాడు.

నూర్జహాన్ ఆదుర్దాతో ఆయనలలాటంమీద చేయి వేసిచూస్తూ మరోచేత్తో తనకొంగుతో ఆయనఅశ్రువులను అద్దుతూ "ఏమిటి బాబూజీ, నాకు భయంగావుంది. చెప్పండి. మీలో మీరే ఏమిటో అనుకుంటున్నారు, నవ్వుకుంటున్నారు, నిట్టూర్పువిడుస్తున్నారు, కన్నీరుకారుస్తున్నారు. ఇదంతా నాకు అగమ్యంగావుంది. మీకు యేమిబాధో వెంటనే చెప్పండి. భగవంతుడు నన్ను కటాక్షించాడనుకుంటున్న యీసమయంలో మీరు గుణంబట్టినవారి

నలె సంచరించుట ఆశ్చర్యంగావుంది. బాబాజీ, నామీద దయవుంచి చెప్పండి.''అని ఆయనగడ్డాన్నిపుణుకుతూ అడిగింది.

శివం:- అమ్మ నిద్రపోతున్నదేమో చూడు.

నూర్జహాన్:- (ఈ ఒక్కప్రశ్నతో ఆమెహృదయం కుదుటపడి, నెమ్మదిగా వెనుదిరిగి భవానీని పరిశీలించి) అమ్మగారు నిద్రపోతున్నారు. ఏమిటో చెప్పండి.

శివం:-(కరుణ పుట్టిపడుతున్నకంఠంతో) నిన్ను నూర్జహాన్అనే మహామ్మదీయపేరుతోసంబోధించటానికి నామనసు నప్పుటలేదు. ఏమనిపిలవాలో తోచుటలేదు. మా అమ్మ యెంత పిచ్చిదో చూడు! ఆమెబ్రతుకుతుందని నేను తలచలేదు. అంత ప్రచండరూపంలో కలరా కాహుతియైనవారెన్నడూ బ్రతికిబయటపడలేదు. కేవలం నీ స్పర్శ ప్రభావాలతో ఆమె బ్రతికిందని నేను ధృఢంగా చెప్పగలను. మాయిరువురను నీవు బ్రతికించావు. నీలోనినిర్మలత్వం స్నిగ్ధతలను గుర్తింపజాలని మా అమ్మ యెంత వెర్రిది! నీ వంటివాతే శవాలకు జీవాలురాగలవని తెలుసుకోజాలక అపవిత్రమవుతాయని వూహించుట యెంత పొరపాటు!

నూర్జహాన్:- బాబాజీ, మీ కింకా జ్వరం పూర్తిగా విడిపోలేదు. యెక్కువగా మాటాడటంగాని, ఆలోచించటంగాని మంచిదిగాదు. ఈ పాలుత్రాగి మీరు ప్రశాంతంగా పడుకోండి. నన్నుగురించి మీరు యేమీ అనుకోకండి. నాకిక యే దుఃఖమూ చింతా లేదు. భగవంతుడు. దయానాయుడు. అసహాయురాలను అబలను దళితజాతిలోని

తుచ్ఛరాలనైన నా మొర విన్నాడు. నన్ను కనికరించి మీాయిరువురను సురక్షితంచేశాడు. బాబూజీ, నాజీవితంలో యింతకుమించిన ఆనందాన్ని యెన్నడూ పొందలేను. ఇంతకు మించి భగవంతుని కోరగలిగిందికూడా లేదు. ఈ సర్వజగత్తును నాచేతికి భగవంతుడు దానంచేసినా, నన్ను యీ తుచ్ఛశరీరంతోనే వైకుంఠానికి తీసుకెళ్ళినా యింతఆనందం నాకు సంభవించదు. మీాకు బాగా ఆరోగ్యంపొందాక నేను భగవంతునికిచ్చిన వాగ్దానం చెల్లించుకుంటాను బాబూజీ. (నేత్రాలగుండా పరువులెడుతున్న అశ్రుస్రవంతిని చెంగుతో తుడుచుకుంటుంది.)

శివం:- దేవునికి యేమివాగ్దానంచేశావు? పూజలు చేయిస్తానన్నావా లేక దేవాలయం నిర్మిస్తానన్నావా?

నూర్జహాన్:- అలాంటి శక్తికిమించినశపథాలు దేవుని యెడ చేయుట అపచారం బాబూజీ. నేను ఆయనకు చేయగల పూజలు మనస్సులో ధ్యానించుటకన్నా మరేముంటుంది. పుష్పాలర్పించేశక్తి, హక్కు-కూడా లేనిదాన్ని.

శివం:- (చిన్నబుచ్చుకున్న మొహంతో జిజ్ఞాసాభరిత దృక్కులతో) అయితే, మరి భగవంతునికి యేమివాగ్దానం చేశావు?

నూర్జహాన్:- మీాయిరువురను బ్రతికించి అందుకు ప్రతిగా నా ప్రాణాలను తీసుకోమని ప్రార్థించాను. నా ప్రాణాలర్పిస్తానని వాగ్దానంచేశాను బాబూజీ.

శివం:- (మృదుకంఠంతో నేత్రాలను వత్తుకుంటూ బుసలుకొట్టినట్లు పెద్ద నిట్టూర్పునువిడిచి) నీవు కాస్త నా

దగ్గరకు రా, (దగ్గరకువచ్చిన ఆమెకుడిహస్తాన్ని తనచేతిలోకి తీసుకుని) ఇక యెన్నటికీ యిలా నిన్ను నీవు న్యూనతపరచుకునేమాటలు నాముందు అననని ప్రమాణంచేయి. నీ ప్రాణం అంత తేలికయిందిగా ఇక యెన్నడూ తలచకు; మేముయిద్దరమూ మరణించటానికయినా నేను యిష్టపడతాను కాని, నీవిషయంలో నేను సమ్మతింపజాలను. నీ ద్వారా మానవసమాజాని కేదో గొప్ప తరణోపాయం లభిస్తుందని నా విశ్వాసం.

నూర్జహాన్:- ఎక్కువగా మాటాడితే మీ శరీరం వేడెక్కుతుంది. ప్రశాంతంగా పడుకోండి బాబూజీ.

శివం:- నీవు చెప్పినమాట నన్ను ప్రశాంతంగా పడుకొనిచ్చేదిగాదు. నీవుఅన్నమాట నిజమేఅయ్యి, నీప్రాణాన్ని భగవంతునికర్పించుటే తథ్యమయితే నీకంటే ముందే నేనూ ఆ దేవునిసన్నిధిలో ప్రాణత్యాగంచేస్తాను.

నూర్జహాన్:- బాబూజీ, మీ పాదాలుపట్టుకుంటాను మాట్లాడకండి. బామ్మగారికి మెలకువవస్తుంది; మీరు పడుకోండి.

శివం:- నీ నిర్ణయమెలాంటిదో నా నిర్ణయమూ అలాంటిదే. (అని పెద్దగా అన్నాడు)

భవానీ నిద్దురచెడి, "బాబూ శివం, యెవరితో మాటాడుతున్నావు?" అని ప్రశ్నించింది.

శివంనోటిమీదచేయివుంచి. అత్యధిక అనునయంతో "నా పేరు చెప్పకండి, యీ ఒక్కమాట నిలబెట్టండి. యింకా వారికి బాగా ఆరోగ్యం కుదుటపడలేదు. నా పేరు

వింటే వారు ఆరోగ్యం తిరిగి కోల్పోవచ్చు. నామీదఒట్టు. మీరుమాత్రం నాపేరు చెప్పకండి" అని తుర్రుమని బయటకు పారిపోయింది నూర్జహాన్.

ఇంతవరకూ భవానీకంటపడకుండానే సేవ జేస్తున్నది. శిరస్సునైపునుండి ఒకొక్కటి అందిస్తూ పనిజరుపుకుంటు న్నది. స్పృహలేనపుడుమాత్రం ఆమెను తనచేతులతో లేపి దుస్తులుమార్చింది, పక్కలుమార్చింది. ఇపుడు అలాచేయ సాహసించలేకపోతున్నది.

శివ:- ఎవరూ లేరమ్మా.

భవానీ:- (లోతుకంఠంతో) మరి నీవు మాట్లాడేది గంగులుతో కాదూ?

శివం:- అవునమ్మా, వాడు బయటకుపోయాడు.

భవాని:-గంగులు మనపాలిటి దేవుడు నాయనా, మన సొమ్ముతిన్నవాళ్ళు వేలమంది వున్నారు. యెంతమంది వాళ్ళుండి యేంప్రయోజనం? చూడు, దుఃఖకాలంలో అంద రూ పారిపోయారు. ఆపత్తులో ఆదుకున్నవాడే ఆత్మబంధువు నాయనా! గంగులులేకపోతే మనమీపాటికిఆలోకంలో యమధర్మరాజు అతిథులంగా వుండేవాళ్ళము.

శివం:-అదేమిటమ్మా, యమధర్మరాజుచిట్టాలో మన ఆయువుఅంతమయితే యెవరైనా యెలాబ్రతికించగలరమ్మా!

భవానీ:- దేవునివిషయంలో నీవు వితండంగా మాట్లాడబోకు నాయనా! యమధర్మరాజు లాక్కెళ్ళిన ప్రాణాలను సావిత్రి తిరిగి తెచ్చుకోలేదట్రా. శాస్త్రాలు నశించినంతమాత్రాన అనుభవంకాదు.

శివం:- ఆయుర్దాయమయిపోయినప్పుడు యేమిచేసినా నిష్ప్రయోజనమని, సప్త సముద్రాలమధ్యమహాలుగట్టుకున్నా యే సర్వరూపధారిద్వారానైనా చావకతప్పదన్నదికూడా శాస్త్రాలేగదా అమ్మా!

భవానీ:- ఒరే శివం, యింకా నీకు ఆరోగ్యం కుదుట పడలేదు. యెక్కువగా మాటాడకోకు. నీకు గంగులుఅంటే యిష్టంలేక యేదో అంటావు. నా ప్రాణంపోయినా నాకు చింతలేదు. నిన్ను బ్రతికించినందుకు వాడు నాపాలిటి దేవుడుగా భావిస్తానురా. నాపేరనున్న నా స్వంతఆస్తి పదెకరాలజామతోట, అక్కడియిల్లు, అప్పనకొండప్రక్కనవున్న యిరవై యెకరాలభూమిని వాడికి యీనాముగా వ్రాసి యిస్తాను.

శివం:- (చిరునగవుతో) గంగులు నా వెంటవుంటాడని, నేను చెప్పినపనులే చేస్తాడని వాడిని యెప్పుడూ తిడుతుండేదానివి. వాడంటే నీకు మహాక్రోధం. అలాంటివాడికి ఒక్కమాటుగా యింత ఆస్తిని సంక్రమింపచేయదలచావా అమ్మా! సేవజేసినవారికల్లా యింతంతఆస్తిని దానంచేస్తే సంవత్సరంతిరక్కముందే మనఆస్తి అయిపోతుందిగదా.

భవానీ:- (చిరాకును ప్రదర్శిస్తూ) ఒరే శివం, నీకు తెలియదు వూరుకో. వాడంటే నాకు కోపంవున్నా వాడు యీ ఆపత్సమయంలో మనయిరువురకు ప్రాణదానం చేశాడు. నన్ను బ్రతికించినందుకయితే నేను యేమీ యివ్వను. నిన్నుబ్రతికించాడు. మనఆస్తి సర్వాన్నయినా తృణప్రాయంగా వాడి కివ్వగలనురా. ఇలాంటిఆస్తులు లేక

పోయినా నాకు దుఃఖం లేదుకాని, నీవు లేకపోతే యీ ఆస్తులు నా కెందుకు నాయనా?

భవానీ కుడివైపుకు తిరిగి పడుకుని మాటాడుతున్నది. యెడమవైపున మంచానికి ఆనిస్టూలున్నది. ఎవరో శిరస్సు వైపుగా వచ్చి, ఆ స్టూలుమీద వేడివేడి జావగిన్నె, చంచా మంచినీళ్ళగ్లాసు పెట్టి వెనుకగా మాయమయ్యారు. భవానీ ఆ చప్పుడువిని "ఒరే గంగులూ, కనపడకుండా పోతావెందుకురా? ఈసమయంలో కూడా భయమెందుకు? శివం వెంట పరమానందయ్య శిష్యుడిన లపడి వాడిని చెడగొడుతున్నావని కోపగించుకునేదాన్ని. కాని నేను నీవు దేవునివలె వాడి ప్రాణం నిలిపావు నాయనా! నీ కింకా భయమెందుకు? నాకు తెలుసు; నా భయంతోనే వీడు నా కంటబడకుండా నా వెనుకనుండి చంచాతో జావ నానోటికందించాడు. ఒరే శివం, వీడు ఒక్కడూ చేయలేక వీడికూతురునుకూడా తీసుకొచ్చాడనుకుంటా. అది నా పాదాలను ఒళ్ళోపెట్టుకుని రాత్రులల్లా ఒత్తుతుండేదిరా.

శివం:- పోనీ, ఆ కాళ్ళువత్తినపిల్లకుకూడా కాస్త యీనాం యివ్వరాదా అమ్మా!

భవానీ:- గంగులుకు వున్నది ఒక్కకూతు రేగదరా; దానికనే గంగులుకు దానముస్తున్నది. నీవు పసివాడివి, నీకు తెలియదులే నాయనా. నేను ఆపిల్లనుకూడా దృష్టిలో వుంచుకునే గంగులుకు దానమిస్తున్నది. పోనీ, ఆ జామీనంతా దాని పేరనే వ్రాసియిస్తాను.

శివం:- అమ్మా, ఒక్క విషయం అడుగుతాను, కోప్పడకుండా జవాబు చెప్పు?

భవానీ:- నీవు అంత భయపడటానికి నేను యెప్పుడు కోప్పడ్డానురా?

శివం:- నీవు ఒక నిరపరాధిని, నిశ్చలమైన పవిత్ర భక్తురాలిని అవమానించినఫలితం, నిర్లక్ష్యంచేసినఫలితంగా, భగవంతుడే యింత కఠినశిక్ష ప్రసాదించాడంటే నమ్ముతావా?

భవానీ:- నీవు యెన్ని దేశాలు తిరిగి చదివినా, చిన్న వయస్సువాడివి. దేవునివిషయంలో అనభిజ్ఞుడవు. నీవు చాలి యదు. ఆవిషయాలలో నీ మొండివాదాలను అడ్డంపెట్టకు. వాగ్వాదంలోను, వాక్చాతుర్యంలోను చూపే ఆధారాలే సత్యాలుకావన్నవిషయం తెలుసుకో. ఒక బూబు మన మందిరంలో ప్రవేశించుట శుభమార్గంగాదు. ఈ కలరా మన పూజాకాలంలోనే రావటమంటూవా, రావలసింది యేదో ఒకరూపంలో రాకమానదు.

భవానీ కిప్పుడు కొంత ఓపికవచ్చింది. కాని బాగా తిరుగగలస్థితిలోలేదు. ఇది సూర్జహాను కో కఠినసమస్యగా తయారైకూర్చున్నది. ఆమెదృష్టిలో పడకుండా కావలసినవి ఆమెకు సమకూర్చాలి. తనే ఈ యేర్పాటు చేస్తున్నట్లు తెలిస్తే, మరో ఘోరంవిపత్తు రావచ్చునన్నభయంలో సతమతమవుతూ, భవానీదృష్టికి దైవసమానుడైన గంగులును పిలువనంపించి, అతనికప్పగించి మొదటినుంచి అతనేచేసినట్లు యేర్పరచాలని, వారు నిద్రలోనున్నపుడు సూర్జహాను

స్వయంగా బస్తీఅంతా తిరిగి, విఫలురాలై వచ్చింది. గంగులు అందరికంటెముందే ప్రాణభీతితో తనకూతురును వెంటనిడుకొని దూరప్రాంతం వెళ్ళిపోయినట్లు తెలిసి, నిస్పృహతో యింటికొచ్చింది. నెమ్మదిగా శివబాబు ప్రక్క జేరి లేపి బయటకు తీసుకొచ్చింది. ఆయన కొంచెం తిరుగ గలుగుతున్నాడు.

**సూర్జ:**– బాబూజీ, యీజన్మలో యిక బామ్మగారి సేవజేసే అదృష్టం నాకులేదు. మీ పాదాలంటి చెబు తున్నాను. దయతో నాపేరు వారియెదుట యెన్నడూ తేకండి. నేను సేవచేసినట్లుకూడా చెప్పకండి. గంగులునింటే తీసుకొచ్చేదాన్నే కాని, దూరప్రాంతం వెళ్ళిపోయాడట. నా దురదృష్టంవల్ల అతను లేడు. నాకు మార్గంలేదు. కనుక మీరైనా నన్ను కాపాడండి.

శివం:– ఏమిటి? నీవు ప్రాణదానంచేసిన దేవతవు! నీవు భయపడటమెందుకు? నన్ను ఏమిచేయమంటావు?

**సూర్జ:**— అనవసరమైనమాటలతో నన్ను మరీ న్యూనతపర్చకండి. వంటయింట్లోపనులు నేను చేస్తుంటాను. మీకు కావలసినవి అక్కడే తీసుకోవచ్చు. కాని బామ్మ గారికికూడా మీచేతులతోనే తీసుకెళ్ళి వారిచేత తినిపిం చండి. నాపేరుమాత్రం వారిముందు రానీకండి బాబూజీ! (అంటూ ఆయన పాదపద్మాలమీద వాలిపోయింది.)

శివప్రసాద్ హృదయం కరుణతో కరిగిపోయింది. ఆమె చెప్పినట్లు చేయటానికి నిశ్చయించుకొని, ఆమె శిరస్సునుబట్టి లేవనెత్తి గడ్డముపుణుకుతూ కుడికంటికొలికి

గుండా జారుతున్న అశ్రుబిందువును గంగోటితో తీసి, తదే కంగా ఆమె ముఖమండలాన్ని పరికిస్తున్నాడు. ఆమె ముఖ ములో గాంధ్యతలుగల పిల్లలతల్లినలె ఏదో దృశ్యం కని పిస్తున్నది.

అది ఉదయం 9గంటలసమయం శివం వంటగది లోనే కాఫీ త్రాగి ఒకగ్లాసులో భవానీకి తెచ్చియిచ్చాడు.

భవానీ :- ఆ గంగులు నాఎదుటకు రాడేంకుకురా?

శివప్రసాద్ :- భయంకొంత, తీరిక కొంతమ్మా. మేత వేసేవాళ్ళులేక పసువులన్నిటినీ ఆనాడే తాళ్ళువిడిచాడట. తేవి నామీఁలోపడి తిని పడుకుంటున్నవిగాని, నీనుపోయు నలసిపస్తుందిగా! అందువలన తీరటంలేదమ్మా.

భవానీ :- అవునురా పాపం! ఎన్నిపనులని చేయ గలడు. ఇప్పటికయినా వాడి తెలివిని గ్రహించావా? ఖైదీ లకు తిండిపెట్టలేనపుడు విముదలచేస్తే వాళ్ళే బ్రతుకుతారు. విముదలచేయక తిండిచూపకపోతే హత్య జరిగియుండును. వాడు మన యిసువురకేగాదు, పసువులకుకూడా ప్రాణ దానంచేశాడు శివం. ఈ జన్మలో వాడి ఋణం తీర్చుకో లేనురా. నా కపిలగోవును దాని మూడుబిడ్డలను వాడికి దానంగా యిచ్చేస్తానురా శివం.

శివప్రసాద్ :- అదేమిటమ్మా, గోశాలనంతటి నయినా దానంచేయగలనుగాని, నీవు నిత్యమూ పూజచేసే కపిలగోవు నివ్వజాలనంటివిగదా!

భవానీ :- ప్రాణదానంచేసినవానికి అత్యధికవిలు వైనదే యివ్వాలిరా.

పగలు 12గంటలసమయమవుతోంది. శివం మాగన్ను నిద్రలోనున్నాడు. భవానీకి ఆకలిఅనిపించి ఎదురుచూసి విసగటచెంది, నెమ్మదిగా అడుగులువేసుకుంటూ వంటశాలవైపు వచ్చింది. ఎవరో ఒకయువతి పనిలో నిమగ్నమై కనిపించింది. గంగులుకూతురు గాబోలునని "గంగులు యేడమ్మా, యెటు వెళ్ళాడు?" అని ఆదరంగా ప్రశ్నించింది. సింహాన్నిచూసి జెదిరిన లేడివలె వణకుతున్నశరీరంతో అదరుతున్నఅధరాలతో జిజ్ఞాసాభరితదృక్కులతో తొట్రుపడుతూ ముఖాన్నిపైకెత్తింది నూర్జహాన్.

భవానీ చకితురాలై బుసలుగ్రక్కుతున్న క్రోధావేశాలతో ముందుకడుగులిడుతూ "ఛీ! నీచురాలా, నీకు బుద్ధిలేదు. మమ్ము ప్రాణాలతోవిడువదలచలేదా. గంగులు అటుపోయాడేమో, నీవు మెల్లిగా ప్రవేశించావా. నీ మ్లేచ్ఛచేష్టలు మనిషిగాని పోవు. మమ్మా మహమ్మదీయుల్నిచేద్దామనా నీ కోరిక, భడవా" అంటూ చంపలమీద తపతప అటూయిటూ వాయించింది. బుద్ధభగవానుడు క్రైస్తుప్రభువు నూర్జహాన్‌లో లీనమయినట్లు ఆమె కించిన్నాస్తిగా మాట పలుకు లేకుండా, ఆ తిట్లులూ లెంపకాయలు తనకు గొప్ప పురస్కారాలయినట్లు యిష్టాన్ముఖియై స్వీకరిస్తున్నది. ఎదురుతిరిగనివారిమీద మరింత దాష్టీకంచేసేవారుకూడా మానవులలో చాలామంది వున్నారు. భవానీ కసిదీరక ఆమె కేశరాశిని చేతబట్టి గుంజి, కవాటాలవైపు ఒకక్రోపు త్రోసింది.

నిద్రాహారాలు మాని, సేవలో యోగినివలె తపస్సు

చేస్తున్న ఆమె మనోబలంతో యింతవరకు అన్నిపనులను సునాయాసంగా చేయగలిగింది, బొంగరమువలె తిరుగగలిగింది కాని, భవానీ కంటపడినక్షణంలోనే ఆమెమనోబలం సడలిపోయింది; నిర్జీవివలె నిలిచిపోయింది; భవానీ క్రోధంతో దూరంగా పోయి వసారాలో బోర్లాపడింది. "బాబూజీ!" అన్న హృదయంద్రవించేపలుకులుమాత్రం బయల్పడినవి. తిరిగి ఆమె లేవనేలేదు. జబ్బుపడి బలహీనత చెందినవారికి కోపమెక్కువవుండుట సహజం. భవానీ కోపమింకా చల్లార లేదు. "బాబూజీ" అన్న నూర్జహాన్ ఆర్తనాదంమాత్రం ఆనాటి గజేంద్రునిమొర వైకుంఠవాసునిచెవినపడినట్లు నిద్ర లోనున్న శివప్రసాద్ హృదయానికి బాణంవలె గుచ్చుకున్నది. అంతజబ్బులోనున్నా హుటాహుటి లేచివచ్చి యీ విచిత్రదృశ్యాన్నిగాంచి నిశ్చేష్టుడయ్యాడు. సున్నితమైన హృదయాలకు కోపంకంటె దుఃఖం ముందు ప్రకటితమవుతుంది. విజ్ఞానహృదయులు అంతర్గతదుఃఖం యెంత భరింపరానిదయినా గొంతుచించుకుని శోకాలుపెట్టరు. అధరాలనుఅదిమి హృదయాన్ని బిగబట్టి సహిస్తారు. వారి బాధ వారిముఖకవళికలలో సుస్పష్టరూపంలో ప్రస్ఫుటమవుతుంది. అలాంటివారికి కాశే అశ్రుధారలకు అంతుండదు.

"గంగులూ, ఓ గంగులూ!" అని కేకవేస్తున్న భవానీ శివప్రసాద్ రావటాన్ని చూచి కొంచెం చిన్నబుచ్చుకుంటున్నది.

కారుతున్నకన్నీటిని అద్దుకుంటూ, రుద్ధకంఠంతో

"ఎంతపనిచేశావమ్మా! వేయిదేవాలయాలను నిర్మించినా కోటిదేవతలకు మొక్కినా ఆత్మదానాలొసంగినా యీ పాపం నుంచి నీవు విముక్తురాలవుకాలేవమ్మా!" అంటూ సూర్జహాన్ చేయిపట్టుకుని లేవదీయప్రయత్నించాడు. కాని ఆ చేయి కట్టెవలె నిర్జీవంగా కనిపించింది. ఆమెముఖమంతా రక్తంతో తడిసిపోయింది. ఆమెనాసికారంధ్రంగుండా స్రవిస్తున్న రక్తం పృథ్వీమీద కాల్వగడుతున్నది. ఈగలు ఆ రక్తంలో జలకమాడుతున్నవి. ఆమెలో యెక్కడా జీవమున్నలక్షణాలు కనిపించుటలేదు. బోర్లగాపడివున్న ఆమెను బలంకొద్దీ పక్కకుత్రిప్పి ముఖాన్ని పైపాటుకు తెచ్చాడు. ప్రాతఃసమయాన బయటకువస్తూవస్తున్న దినకరునివలె ఆమె ముఖమంతా రక్తాచ్ఛాదితమైవుంది. తన కట్టుధోవతిమడతతో ఆమెముఖాన్ని తుడుస్తున్నాడు. తన ధోవతి నవతల పిండితే రక్తంకారుతున్నది గాని, ఆమెముఖంమీదినుంచి రక్తం యింకా పోలేదు. ఆ దృశ్యాన్ని చూడలేక తనధోవతిని నోటినిండా కుక్కుకుని ముఖానికిఅదుముకుని కనులు గట్టిగా మూసుకుని దీర్ఘమైనశ్వాసను వరుసగా వదులుతున్నాడు.

రెప్పపాటు స్థిమితాన్ని పొందిన భవానీ "నీవు సరి పిచ్చివాడివైపోతున్నావుతప్ప మరేంలేదు. ఎవరిహద్దులలో వాళ్ళుండాలనేది నీకు తెలియదు. ఒక మహమ్మదీయపిల్ల దేవాలయాలలోను బ్రాహ్మణవంటశాలలలోను ప్రవేశించుట ఎంతదోషమో నీకు తెలియదు. నీవు వెర్రితనంగా యిచ్చే చనువునల్లనే ఆ భడవ అలాచేయగలుగుతున్నది.

దానికి నీయిష్టమొచ్చినంతడబ్బు సహాయంజేసి అయినా వెళ్ళగొట్టమని నీకు అనేకమాఱులు చెప్పాను. కాని నీకు మతిలేదు. ఆమెను యీ గోశాలలోనయినా వుండనివ్వటం నాదే తప్పు. అది యెన్నోమాఱులు జైలుకువెళ్ళిందట, పోలీసువాళ్ళచేత చావుదెబ్బలుతిన్నదట, దొంగతనమే దాని వృత్తట. అలాంటి దొంగముండనుగురించి నీ కా జాలి ఎందుకు? అది చావాచావదు, మనలను హాయిగా వుండనివ్వదు. వెంటనే ఈ సాయంకాలంలోగా దాన్ని తరిమెయ్యకపోతే నేను గంగాభవానీనిగాదు." అని స్పష్టమైన శబ్దాలలో దుడుకుస్వభావం ప్రస్ఫుటమయ్యేట్లు అన్నది.

ఒక్కొక్కమాట ఒక సూదిపోటువలె శివశంకర్రం ధాత్రిలలో పొడుచుకుంటున్నవి. భరించలేక అంతంలో చేతులతో చెవులు మూసుకున్నాడు. భవానీదృష్టి ఆమెమీద పడటాన్నికూడా భరించలేక ఆమెను అమాంతం తన బాహువులతో తీసుకుని, గోశాలగదికి చేర్చి, ఆమెశిరస్సును తన తొడలమీదవుంచుకుని తన పట్టుచివరతో రక్తాన్ని తుడిచి మొహంమీద బాగా నీళ్ళుచల్లి తుడుస్తూ, అలా యెన్నో మాఱులుచేసి, తన చెంగుతోనే విసురుతున్నాడు. దుఃఖం పట్టజాలక ఆయనహృదయం ద్రవించిపోతున్నది. ఆయనకన్నీటిబొట్లు ఆమెచెక్కిలిమీద బిందుబిందువులుగా రాలుతున్నవి.

బరువైన వుద్రేకంపంతో "దేవుని పేరితో గొంతెత్తి చించుకుంటూ భజనలుసలుపుతూ పూజలుచేస్తూ ప్రదక్షిణాలుతిరిగే యీ భక్తులనబడేవారు నిజమైన భగవద్భక్తులు కాదు; పుణ్యంకొరకు అష్టైశ్వర్యాలకొరకు ముక్తికొరకు

తపనతో నిండిన కటికి పాషాణహృదయులు. వారిశరీరంలోని ప్రతిఅణువు స్వార్థంతో మ్రగ్గుతుంటుంది. దేవుని వారి వాంఛలకు స్వార్థాలకు ముడివేసుకున్నారు; దాసునిచేసుకున్నారు. దేవునికూడా స్వార్థిని, లంచగొండిని, అన్యాయిని చేసివేశారు. దేవునికి ఆలయాలనే జైళ్ళను సృష్టించి, ఆయన్ను అందుబంధించి పెద్దపెద్దతాళాలు వేసి, చెవులను చెంగునగట్టుకుని తిరుగుతూ, తమకు తీరినప్పుడు తోచినప్పుడు అవసరమైనపుడు తాళాలుతీసి ఖయిదీకి చిప్పకూడువలె నైవేద్యం, అర్చన అనేపేర్లతో తమకు యిష్టమైనవి ఆయనకుచూపి తాము కనులుమూసుకు తామే దేవుళ్ళుగా భావించి నోట్లో వేసుకుని తమకోర్కెలను యేకరువుపెట్టి వాటిని వెంటనే సానుకూలంచేయమని, ఆశపెట్టీ, బెదరించీ, మళ్ళీ ఆ దేవుని ఆ కటకటాలలోనే బంధించి తాళపుచెవులను భద్రపరచుకుని, తమచే బంధింపబడిన ఆ దేవుడు తమ చెప్పుచేతలలో వున్నాడని, ఆయన్ను ప్రార్థించను, నైవేద్యమునే చిప్పకూటిని తినిపించేహక్కు తమకేవున్నదని, ఆ దేవుడు తమమాట తమవారిమాట దప్ప మరెవరిమాట వినడని, వినగూడదని, అసలక్కడికి యితరులు పోనేపోకూడదని వారి దృఢనిశ్చయం. నిజంగా దేవుడనేవాడు వుంటే, ఆయన యీ బంధింపబడిన ఖయిదీలలో మాత్రం వుండడు. ఈ ఆలయాలలోని ఖయిదీలను బట్టుకుని పూజించే భక్తులందరిని అతికఠినంగా శిక్షిస్తూవుంటాడు. దేశములోని పాపము అన్యాయము అక్రమము దౌర్జన్యము కుత్రిమము యేకమయి భక్తులనబడేవారిలోనే కరుడుగట్టివుంది. మా అమ్మకుకూడా

ఆ భగవంతుడు కఠినాతికఠినమైన శిక్షవిధించాలి." అంటూం డగా అర్ధంగా నయనాలుతెరచిన నూర్జహాన్ తన కుడి హస్తాన్ని నెమ్మదిగా శివంనోటికడ్డంపెట్టి "బాబూజీ, అలా అనకండి. వారు పెద్దవారు, అమాయకులు, నిష్కపటులు. వారునమ్మినవాటిమీద గాఢమైన విశ్వాసంగలవారు. అది అంధవిశ్వాసం గావచ్చు. కాని అలాంటివిశ్వాసమున్నవారు అంతపట్టుదలతోనే వుంటారు. ఇందులో వారు తెలిసిచేస్తున్నదీలేదు, దోషమూ లేదు. వారు పూజనీయులు. వారిని అగౌరవపరచినా నిందించినా ఆ దోషం నాకే చుట్టుకుంటుంది." అని శోకకంఠంతో ఆపుకుంటూ ఆపుకుంటూ అన్నది.

శివం:- నూర్జహాన్ నిన్ను యింతఘోరంగా శిక్షిస్తున్నా నీవు ఆమెను యేమీ అననివ్వవు, ఆమెయెడల భక్తి విశ్వాసాలతో వుంటావు. ఈలోకంలో యింతకంటె పొందగల అవమానమేమీ లేదు. మాకు కావలసినవారు, భృత్యులు,మానుంచి పొందినవారు మాకంటె వారిప్రాణాల విలువ తెలుసుకుని పారిపోయారు. మృత్యుముఖంలోవున్న మాకొరకు నీవు నీ ప్రాణాన్నిలక్ష్యంచేయకుండా అంటువ్యాధిఅని ఆలోచించకుండా నిద్రాహారాలు మాని, మా యిద్దరినీ బ్రతికించావు. భరించరాని దుర్గంధాన్ని నీహస్తాలతో ఆనందంతో పరిశుభ్రపరిచావు. ఏ పనులు ఒక తల్లికి కన్నకూతురుకుకూడ చేయలేదో, అవి నీవు నీ కర్తవ్యంవలె గుప్తరూపంలో చేశావు. మా యిరువురకు నిష్కామరూపంలో పునర్జన్మనిచ్చిన నీకు మాఅమ్మయిచ్చిన

పురస్కారం నే నీజన్మలో మరువలేను. నాకు ఆమెయెడల నున్న అనంతభక్తి నేడు నాలో వున్నట్లులేదు. ఈ స్థితిలో ఆమె నాద్వారా శాంతినిపొందలేదు. నేను ఇక్కడ వుండ దలచనూలేదు. ఇంత స్వార్థాలలో సంకుచితాలలో అన్యాయాలలో అక్రమాలలో నిండిన యీ తావున నీకు గౌరవం లభించదు. ఎక్కడయితే యిలాంటివి లేవో, కులమతాలంటూ లేవో, పరస్పర ప్రేమాదరాలు అన్యోన్యత సహకారము వుంటాయో, అర్థంగాని రూపురేఖలు స్వభావాలు లేని మానవాతీతమైన అనంతశక్తియే ఆ సర్వాంతర్యామి యని భావిస్తారో, ఆస్తిపాస్తులకు, చదువుసంధ్యలకు, తర్కవితర్కాలకు, పేరుప్రతిష్ఠలకు ప్రాధాన్యతగాకుండా, సద్భావాలకు సత్కార్యాలకు, సత్సాంగత్యాలకు ప్రాముఖ్యముంటుందో, సేవాభావానికి, త్యాగానికి ఆదరముంటుందో అలాంటి చోటుకు వెళ్ళిపోదాము. అక్కడ నీవు జీవితపూర్ణత్వాన్ని పొందగలవు. నిన్నక్కడ అందరూ ఆదరించి సత్కరిస్తుంటే నా మనస్సుకు శాంతిలభిస్తుంది.

సూర్జ:- బాబూజీ, మీ రలా అనకండి. ఆవేశంలో వివేకం నశిస్తుంది. మీ రలా అనకూడదు. అవసరమైతే నా ప్రాణాన్ని యిక్కడే త్యజిస్తానుగాని, మిమ్ము బామ్మగారినుంచి దూరంచేయడం నేను సహించరానిది. అది యెన్నటూ జరుగనిది. బామ్మగారన్న మాటలలో రవంత కూడా నన్నుగురించి అబద్ధంలేదు. నేను మ్లేచ్ఛురాలిని. అదికాదని మీరు అనలేరు. వృత్తిరీత్యా దొంగని; జైలుకు వెళ్ళాను. పోలీసువారిదెబ్బలు, తిట్లు లెక్కకుమిన్నగా

అనుభవించాను. అవమానాలు నాకు అలవాటు. పోలీసు వారితిట్లను అనుభవించిన నాకు భామ్మగారిలాంటివారి నిందలు యెలాంటివయినా హారాలుగా ధరించగలను. నాకు మీరు పూజ్యులు. అందుకని వారియెడల నాకు శాశ్వతమైన చెరగని విశ్వాసము భక్తిశ్రద్ధ లున్నవి. వారు నన్ను వారి పాదాలతో నలిపి చంపినా నా భక్తిలో మార్పుండదు. వారిని మనసా పూజిస్తూనే ప్రాణంవిడుస్తాను. మరో జన్మలోనైనా వారిసేవజేసేయోగ్యత కల్పించమని భగవంతుని వేడు కుంటూ ప్రాణంవదులుతాను. భామ్మగారిలాంటి పవిత్ర మూర్తిపాదధూళి నా శరీరంమీద పడినపుడు నా పాపాలు దోషాలు హరిస్తవి బాబూజీ! అందువల్లనే వారేమన్నా నాకు కోపంరాదు

శివప్రసాద్ గోశాలలోకి నూర్జహాన్‌ను యెత్తుకెళ్ళాక, భవానీ అటూయిటూ గంగులుకోసంకు చూచిచూచి కానక, గోశాలగదిగోడప్రక్కకు నచ్చి పశ్చాత్తాపహృదయంతో పునఃపరిశీలనచేసుకుంటున్నది. లోపలనుంచి శివంఅంటున్న మాటలు వినవచ్చినందున కర్ణరంధ్రాలను మరీ రిక్కించి కొంచెం కిటికీవైపుకు వంగి ఆలకిస్తున్నది. శివంమాటలు వింటున్నపుడు ఆత్మపరిశీలనలోపడింది. నూర్జహాన్ మాటలు విన్నపుడు ఆమెహృదయం పశ్చాత్తాపంతో నూగిపోయి, పరితపిస్తూ కరిగి కంటివెంట కడవపోతవలె అశ్రువులు కారు తున్నవి. నూర్జహానుఆఖరిమాటలు విన్నపుడు తనలోతాను పరవశమై కనులుమూతలుపడి, హృదయం నూగి నిమూంతు రాలై మొదలు నరికిన ప్రమానునలె పడిపోయింది. పడిపోను

న్నపుడు "శివం" అన్న చిన్నిపిలుపుమాత్రం బయల్పడింది. ఆనందము దుఃఖము పశ్చాత్తాపము ఇవి మూడూ హద్దులు అధిగమించినపుడు మానవుడు కొద్దిసేపటివరకు చైతన్యాన్ని కోల్పోతాడు.

ఆ 'శివం' అన్నశబ్దం శివప్రసాద్ సూర్జహాన్ లిద్దరు విన్నారు, కాని శివాని కది ఆందోళనకలిగించలేదు. తనఒడిలోవున్న సూర్జహాన్‌శిరస్సును కదుపనుకూడా యిచ్చలేదు. కాని సూర్జహాన్ వులికిపాటుతో లేస్తూ, విరోధించు ఆయనహస్తాలను ఆదరంగా పట్టుకుని అనునయంతో "బాబూజీ, యెవరో మీపేరు ఉచ్చరించారు. ఆ పిలుపులో యేదో వ్యధాభరితహృదయంతో జిజ్ఞాసాపూరిత అంతిమపిలుపుగానో, ఆప్యాయతలొలికిస్తున్న ఆఖరిపిలుపుగానో, పశ్చాత్తాపంతో పరితపిస్తున్నపిలుపుగానో వినిపిస్తున్నది. బయటకుపోయి చూడండి!" అంటూ ఆమె లేచి శివంహస్తాన్నిలాగి ఆయనఆధారంతో ఆమె బయటకువచ్చి చూసింది. కాని శూన్యం. కిటికీప్రక్కగా పడిపోయివున్న భవానీని చూసి, విస్తుపోయి "అమ్మా!" అంటూ రెండడుగులు వేసి, ఆమెపాదాలమీద పడి సూర్జహాను గ్రుక్కతిరగని రోదనలతో విలపిస్తూ, తనముఖమండలాన్ని భవానీ పాదాలకేసి అద్దుకుంటున్నది. యేడ్పును ప్రదర్శించుట శోకాలతో రాగాలుతీయుట చేతగాని స్త్రీలనుగూడా అందు ప్రవీణులనుచేస్తవి కొన్నిఘట్టాలు.

శివప్రసాద్ నీ దృశ్యం ఏమాత్రం కదల్చలేదు. ముఖమంతా క్రోధావేశాలతోనింపుకుని, యెలాగెలా

చూస్తున్నాడు. నూర్జహాన్‌ను చేయిబట్టి బలవంతంగా లాక్కొచ్చి ఆవిడగదిలో పడవేస్తే బావుండునని అనుకుంటు న్నాడు. అవును, అనాదరంగా గలీజుగావున్న గుడిఆవరణను పరిశుభ్రంచేసి, దేవుని భక్తితో పూజించి ఒక గొప్ప ఆపదను కొనితెచ్చుకున్నది. పోతున్న ప్రాణాలను తన ప్రాణాలనుఒడ్డి నిలిపి, అంతకుమించిన ఆపదను కొనితెచ్చుకున్నది. యిపుడు స్పృహలేకుండా పడిపోయినఆమెకు సేవలు జేసి, ఆమెకు స్పృహకలిగేవరకూ తనసర్వశక్తిని ధారపోసి, ఆమెకు ఆరోగ్యాన్ని చేకూర్చి, ఆమె కనులుతెరచి తనను చూచి గుర్తించాక 'ఛీ! మ్లేచ్ఛురాలా, ఫో, నాయెదుటినుంచి!' అని సూత్కారంచేసి కాలితోతన్ని నెట్టితే కన్నీరు కారుస్తుంది. అంతకుమించి నూర్జహాన్ యీ భక్తురాలికడ పొందగలిగేది శూన్యమని శివానికి బాగా తెలిసిపోయింది. అలాంటిపురస్కారాలకు యింకా పడి ప్రాకులాడట మెందుకని విసుక్కుంటున్నాడు శివం.

నూర్జహాన్ ఆమెశిరస్సును తనఒడిలోపెట్టుకొని తన చెంగును నీటితోతడిపి, ఆ తడిగుడ్డతో ముఖాన్ని తుడుస్తున్నది. భవానీముఖమండలం యోగనిద్రాముద్రలను ప్రకటిస్తున్నది. కన్నబిడ్డను వడిలోపెట్టుకుని జోదాపుస్తున్నట్లు, నూర్జహాను ఆమెకురులను సరిదిద్దుతూ, మరోచేత్తో విసురుతున్నది. శివ మీ దృశ్యంపై పూర్తి అయిష్టంతో చీకాకు చెందుతున్నాడు. యెపుడు భవానీకి స్పృహకలుగుతుందో, కనులముందుకనిపించే నూర్జహానుచెక్కుళ్ళు ఛెళ్ళుమని ప్రతిధ్వనిస్తాయనే భయాందోళనలతో ఆదుర్దాన ఆపుకో

జాలక సమీపంగావచ్చి అటూ యిటూ పరకాయించి "నూర్జహాన్, నీ అంత మూర్ఖురాలు మరెవరూ వుండరనుకుంటాను. మా అమ్మ దెబ్బలు, నిందలు నీకు మహా ఇష్టమనుకుంటాను. ఆమెకు సేవ జేసినందువలన ఆమెకూ సుఖంలేదు. నీకూ సుఖంలేదు. మధ్య నేను అనవసరమైన మనోవ్యధకు గురి కావలసివస్తుంది. నీవు మెల్లిగా లేచి అవతలకు వెళ్ళు. ఆమె విషయం నేను చూసుకుంటాను" అన్నాడు.

నూర్జ:- అదేమిటి బాబూజీ, అన్నీ తెలిసినవారు అలా అంటారు! ప్రతిఫలవాంఛగాని ప్రతీకారవాంఛగాని మానవుని వున్నతస్థాయికి తీసుకెళ్ళజాలవని మీ శాస్త్రాలల్లో వున్నట్లు విన్నగుర్తు. బామ్మగారి సేవకు నేను ప్రతిఫలం కోరటంలేదు బాబూజీ! నా సేవలవలన వారికి ప్రయోజనం లేదంటారా? అది భగవంతునికి తెలుసు, మీకూ తెలుసు. భగవంతుడు నా సేవకు మెచ్చి బామ్మగారికి పునర్జన్మ నిచ్చాడు. బామ్మగారు నన్ను నిందించినా, నిర్బంధించినా కొట్టినా నా మనస్సుకు బాధలేదు. అవన్నీ నాకు అలవాటయినవి. కాని ఈ ఆపదనుంచి బామ్మగారిని రక్షించుకోగలిగామన్న తలంపు నా హృదయాని కెంత ఆనందాన్నిస్తున్నదో మీకు తెలియదు. ఆత్మానందంలో మానవుడు యెన్ని బాధలను అవమానాలనైనా సునాయాసంగా చిరునగవుతో అనుభవించగలడు బాబూజీ. మీరన్నట్లు నిజంగానే బామ్మగారి నిందలు నూంతాళ్ళరాలు నాకు ఆనందాన్నే కలుగజేస్తవి. వారిహృదయం అతి పవిత్రమైంది. నేను యెక్కడ సంహరించినా ఆఖరిక్షణాలల్లో కూడా మిమ్ము స్మరిస్తూ బామ్మ

గారికృప మీా కృప మరోజన్మలోనైనా కల్పించమని, నన్ను హిందువులయింటనే జన్మింపజేయమని ఆఖరివినతిగా భగవంతుని ప్రార్థించుకుంటాను.

భవానీనేత్రాలు మూతబడివున్నవి గాని, ఆమె బాగా స్పృహలోవున్నది. వీరియువురిసంభాషణా పూర్తిగా విన్నది. అర్థంచేసుకున్నది. తనశిరస్సు యెవరిఒడిలోవున్నదో కూడా ఆమెకు తెలుసు. ఆమెమనస్సుకు ఆ ఒడిలో యేదో అనిర్వచనీయమైన ఆత్మగ్లాని కలుగుతున్నది. తన పసితనపురోజులలో తన మాతృదేవిఒడిలో పడుకుని పేదరాలుపెద్దమ్మ కథలు వింటూ, వూంకొట్టినరోజులు స్మృతిపథంలో మెదులుతున్నవి. ఆ స్మృతివొంతరులు చెదరుతవనేభయంతో అలానే పడుకున్నది. నేత్రాలు తెరవాలని అసలేలేదు. శాశ్వతంగా ఆ ఒడిలోనేవుంటే బావుండుననికూడా అనుకుంటున్నది. ఆమెకనుకొలకులనుంచి ఒక్కటొక్కటిగా వేడిఅశ్రుకణాలు జారి నూర్జహాన్‌తొడలమీాద పడుతున్నవి. ఆమె తనచెంగుతో, తల్లి తనబిడ్డయెంగిలిమూతిని తుడిచినట్లు ఆ అశ్రువులను తుడుస్తున్నది.

శివం :– నీముఖంమీాద రక్తపుజిడ్డు యింకా ఆరలేదు. నూతనరక్తం స్రవిస్తూనేవున్నది. నీ దుస్తులన్నీ రక్తంతో తడిసినవి. యెవరిద్వారా యిదంతా జరిగిందో వారినే మళ్ళీ శిరస్సునధరిస్తున్నావు. ఫలితంగా మరోమారు దుష్ఫలితాలను పొందుతావు. నీవు ఆమెను తొలగించి, నీగదిలోకి వెళ్ళి రక్తంతుడుచుకో. మాఅమ్మకు పరిచర్యలు నేను చేస్తాను.

నూర్జహాన్ :- రోగికి సేవ అందరూ చేయగలిగేది గాదు. అందుకు ప్రత్యేకమైన నైపుణ్యంవుండాలి. భగవంతుడు ఆ నైపుణ్యాన్ని కేవలం స్త్రీలయందే నింపాడు బాబూజీ.

శివం :- అవమానాలను సహించటం, దెబ్బలుతినటంకూడా ఆడవారికే అలవాటనుకుంటాను.

నూర్జహాన్ :- బాబూజీ, యెప్పుడూ మీ రలా పరిహాసించకండి. బొమ్మగారిచేతిలో నా ప్రాణంపోయినా, చింతలేదు. ముక్తినిపొందుతాను.

భవానీ మూలుగుతూ యెవరిఒడిలో తనశిరస్సువున్నదో వారిచేతులను తనచేతులలోకి తీసుకుని, తనముఖంమీదవేసుకుని అదుముకుంటూ ముద్దులిడుకుంటున్నది. తిరిగి ఆ హస్తాలనే తనహృదయంమీదవేసి అదుముకుంటున్నది. ఆమెనేత్రాలు మూసుకునేవున్నవి. నూర్జహాన్ హస్తాలు వణుకుతున్నవి. హృదయం దడదడ వణకుతున్నది. ముఖం మ్లానమై వెలవెలబోతున్నది. భవానీ కనులుతెరచి తనను గాంచినపుడు మళ్ళీ ఉద్విగ్నురాలై యేమిచేసి కూర్చుంటుందోననే భీతితో కళవళపడుతున్నది నూర్జహాన్. తనను ఎవరుగానో భావించి, తనచేతుల నలా ముద్దిడుకుంటున్నట్లు తలచింది. "భగవాన్, నన్నిలా బాధించడమెందుకు? మళ్ళీ పుత్పాతాన్నికలిగించబోకు తండ్రీ," అని మనసా అనుకున్నది. ఎవరిద్వారా ఆదరింపబడి, రక్షింపబడి ఎవరిహృదయంలో అత్యున్నతస్థానాన్ని పొందిందో, వారివిశ్వాసాన్ని పూర్ణరూపంలోచూరగొనటం తనకు స్వాభావిక

మైనది. పుష్పాన్నిచూసి ముగ్ధతపొందినపుడు దానినే తదేకంగాచూచుటకంటే దానికిమూలమైనరెమ్మను కొమ్మను మొదలునుపరామర్శించి వాటివునికికి మెరుగులు కల్పించుట వివేకంగలపని. నూర్జహాన్ స్వానుభవంగలయువతి. యెదుటి హృదయాలను సూక్ష్మంగా గ్రహించగలఅనుభవం ఆమెలో వున్నది. శివప్రసాద్ యెడల ఆమెకు అనంత భక్తివిశ్వాసా లున్నవి. ఆయనకు ఏరూపంలోనూ బాధలుగాని నష్టాలు గాని కలుగనీయకుండుటే ఆమెనిశ్చయం. ఆ నిశ్చితాభిప్రాయప్రతిఫలమే భవానీయెడలకూడా భక్తి. భవానీహృదయంలోని నిర్మలత నిష్కపటత, ప్రేమాదరాలు ఆమెకు విదితమే. నియమనిష్టలుగల స్త్రీలహృదయాలు పట్టుదలతో వుండుట సహజమనికూడా ఆమెకు తెలుసు. అందువల్లనే భవానీయెడల ఆమెకు క్రోధావేశాలులేవు. విషయాలను విపులంగా అర్థంచేసుకోగలిగినపుడే సహనం సంప్రాప్తమవుతుంది.

నూర్జహాన్ నేత్రాలనుంచి అశ్రుబిందువులు ముత్యాలవలె టపటప భవానీచెక్కిలిమీదపడి క్రిందికి జారిపోతున్నవి. ఎవరిఅశ్రువులు తనబుగ్గలమీద పడుతున్నవో ఆముఖమండలాన్ని చూడాలని మనస్సు వువ్విళ్లూరుతున్నది. భవానీ వివశురాలై నెమ్మదిగా తననేత్రఫలకాలు తెరచింది. సాక్షాత్ లక్ష్మీదేవి వచ్చి తనకు సేవచేస్తూ తన మొండితనానికి విసిగి విలపిస్తున్నట్లు నూర్జహాన్ ముఖంలో అనిర్వచనీయమైనతేజస్సు ప్రస్ఫుటమయింది. ఆ అశ్రుబిందువులు ఆమెముఖానికి మెరుగులుదిద్దుతున్నవి. భవానీ

యిక భరించలేక ఆమెవడిలోనుంచి లేచికూర్చుని, ఆమెను అమాంతం తనబాహువులతో బంధించి తనహృదయానికేసి అదుముకుంటూ, ఒకచేత్తో ఆమెవీపును నవరిస్తూ స్వాంత ననుకలిపిస్తూ, గాద్గదికకంఠంతో ప్రేమాదరపుబండారాలు దొర్లుకొస్తున్నట్లు "నీవు మా లక్ష్మివి అమ్మా, నేను తెలి యక అజ్ఞానంతో నిన్ను నిందించాను. నీవు మహ్మదీయ కన్యవి కానేకాదు. నీవు నా బిడ్డవు తల్లీ. నిన్నిక నానుంచి యీలోకంలో యెవరూ వేరుచేయలేరు. నీ గతజీవితంతో నాకు అవసరంలేదు, దాన్ని నేటితో విస్మరించు. నేడు నీలో వున్న ఆచారాలలోను, వ్యవహారాలలోను, భావనలలోను స్వచ్ఛమైన బ్రాహ్మణత్వమున్నది. నీవు మహ్మదీయపిల్లవి కావు, నాబిడ్డవని అందరికీ చాటిచెప్తాను. ఇదివరకు నా కున్నది ఒక్క నేత్రమే, యిప్పుడు భగవంతుడు నాయందు దయదలచి, ద్వితీయనేత్రాన్నికూడా ప్రసాదించాడు. శివంతోపాటు నీవుకూడా నా బిడ్డవు లక్ష్మి.

నూర్జహాన్ చేతులు భవానీకవుగిలినుంచి జారుకుని యేనిమిత్తమో వెదుకుతున్నవి. భవానీపాదపద్మాలకొరకు గాబోలు. నూర్జహాన్ తనశిరస్సును భవానీపాదాలమీదుంచి తనహస్తాలతో ఆమెపాదాలను చుట్టివేసి బొలబొలవిలపిస్తూ తనపవిత్రాశ్రువులతో పునీతంచేస్తున్నది. ఇంతగా ఆమె యెన్నడూ విలపించియెరుగదు. సహనము, సాహసము, త్యాగముగల గంభీరహృదయులకు అత్యధిక ఆదరములభించి నపుడు ఆనందం పొంగి హృదయాన్ని వూపుతుంది, కన్నీరు కారుతుంది.

భవానీ ఆమెను శిరస్సునబట్టిలేపి బుజ్జగిస్తూ "వూ తల్లి విగదూ, వూరుకో అమ్మా, యీనాటికి నాకు కనువిప్పు యింది. నిన్ను పూర్తిగా అర్థంచేసుకున్నాను. ఇంట్లోకి పద అమ్మా" అంటూ ఆమెను తనబాహువులమధ్యవుంచుకుని, నడిపిస్తూ యింటిలోపలికి తీసుకెళ్ళింది.

శివప్రసాద్ శివప్రతిమవలె నిలిచి, పౌరాణికకథలలోని యేదో దృశ్యాన్నిచూస్తున్నట్లు చూస్తున్నాడు. ఆనందంతో ఆయననేత్రాలుకూడా అశ్రుభరితాలయ్యాయి. ఇలాజరుగుతుందని యెన్నడూ ఊహించలేదు. ఈ దృశ్యం తనకే అగమ్యంగా కనిపిస్తున్నది.

నూర్జహాన్ ఇపుడు అనాథబాలికకాదు, దళితురాలుగాదు. ఆ యింటిలోను, యింటిలోనివారిహృదయాలలోను పూర్ణస్థానాన్ని పొంది విరాజిల్లుతున్నది. ఆ యింటిలోని సర్వకార్యాలు ఆమెచేతిమీదిగానే జరిగిపోతున్నవి. వంటశాలలోనిభారమంతా ఆమెదే. పూజాగదిపరిశుభ్రత ఆమెదే. నీలకంఠునిపూజ ఆమెదే. గోశాలపెత్తనం ఆమెదే. ఆమె యిపుడు నూర్జహానుగాదు. 'లక్ష్మి' అని భవాని ముద్దుగా పిలుస్తుంది. ఆమెలోని నిర్మలత్వానికి ముగ్ధుడైన శివం "నిర్మలా" అని పిలుస్తుంటాడు. ఇక మనము ఆమెను 'నిర్మలా నూర్జహాన్' అని అందాము. ఆమె 'అమ్మా' అని నోటినిండా పిలిచినపుడు, భవానీ తన్మయురాలవుతుంది. 'ఆ అమ్మాయి యెవరు?' అని యెవరయినా ప్రశ్నిస్తే 'భగవంతునిచే ప్రసాదించబడిన నా వరపుత్రిక, నా ముద్దుల లక్ష్మి' అని సమాధానమిస్తుంది. మాతృత్వమాధుర్యాన్ని

పూర్ణరూపంలో అనుభవిస్తున్నది భవానీ. భవానీ కిపుడు పూర్తి విశ్రాంతిలభించింది. ఈ యింటిజంజాటము, శివం మంచిచెబ్బరలు యెవరయినా నెత్తినవేసుకుంటే రేయిం బవలు తనపూజాగదిలో వుండి, దేవునిలో ఐక్యంకావాలను కునేది. కాని నేడు దేవునిధ్యాసకంటె లక్ష్మి చక్కబెడు తున్నపనులను, వంటశాలలోని ఆమెనైపుణ్యాన్ని, శివానికి తను స్నానాలవిషయంలోను, ఫలహారాలవిషయాలలోను భోజనాలవిషయంలోను ఆమెతీసుకుంటున్న శ్రద్ధ నేర్పు చుకుకుదనంచూడటంలో భవానీ ముగ్ధురాలవుతున్నది. లక్ష్మిచేస్తున్నపనులను తిలకిస్తూ, అపుడపుడు ఆమెచేత "ఇంతేనా అమ్మా, బాగుందా అమ్మా" అనుపించుకొను టలో కలుగుతున్న ఆనందం దైవపూజలో లభించుటలేదు. అందుకనే ఆ పూజాగదివైపుకని బయలుదేరినా తాను లక్ష్మి వున్నచోటికే అజ్ఞాతంగా చేరుతున్నది. "కూర్చో అమ్మా" అని అక్కడ పొందే ఆదరం దేవునిదగ్గర లభ్యమవుటలేదు.

# 7. జాతకచక్రము

విజయపురిలో గణుతికెక్కిన కంట్రాక్టరు బద్రీనారా యణ. ఆయన కాలేజీలలో చదివినవాడుగాదు, కాంట్రాక్టు వ్యాపారానికి తగిన పెట్టుబడులున్నవాడూగాదు, కుటిల నీతుల అనుభవమున్నవాడూగాదు, మాటలలో అధికారు లను తృప్తిపరచకల దక్షుడూగాదు. అయినా, తన చిన్న వయసులోనే అందరిఅభిమానాలను చూరగొని వ్యాపా

రంలో ప్రసిద్ధికెందాడు. జగన్నాథబాబు తన కంట్రాక్టు వ్యాపారంలో భాగస్తుడుగావుండమని తనను నిర్బంధించి నపుడు లాభాలకు ఆశించి తాను సమ్మతించలేదు. స్నేహ ప్రీతితో మొహమోటానకి యిచ్ఛగించాడు. కోరినచోట్లల్లా సంతసంతో సంతకాలుపెట్టాడు. ఫలితంగా సంవత్సరంజర గకముందే జగన్నాథబాబు అంతర్ధానమయ్యాడు. రాగల మొత్తాలన్నిటిని రొక్కం జేసుకుని, యివ్వవలసినబాకీలను బద్రీనారాయణభారానికి వదిలివెళ్ళాడు. లెక్కలలో 30 వేల లాభం తేలుతున్నది కాని, వ్యవహారికంగా 40 వేలు యివ్వ వలసినబాకీలు కనపడుతున్నవి. పితార్జితభూములన్నీ అమ్మినా తీరని ఋణభార మిది బద్రీనారాయణకు. పిల్లల చదువులకని బస్తీచేరినందుకు తగినశాస్తి జరిగిందన్నారు దాయాదులు. ఆ పిల్లలతో వున్నభూమిని బాగుచేసుకోను చేతగాక బస్తీలకెళ్ళితే, యింతకుమించి యేంజరుగుతుంది; అన్నారు యిరుగుపొరుగు. పెద్దమొత్తాలకు దొంగనోట్లు సృష్టించి, ఐ. పి. దాఖలుచేయమని కొందరు సలహాలిచ్చారు. తనపుత్రులచేత నోటీసులిప్పించి, వారిభాగాలను విడదీసి మిగిలిన తనభాగం బాకీలవారి కప్పగించమని వ్యవహార దక్షులు ఆదేశించారు. బద్రీనారాయణ సాక్షిఅయినన్యాయక. తనయెడల ఆదరంగావుండేవారందరిని తనఆప్తులుగానే భావి స్తుంటాడు. ఇతరులయెడ స్నేహభావము, మమకారము, విశ్వాసము ఆయనహృదయంలో తొణుకుతుంటవి. కల్లకప టము ఆయనదృష్టిలో హేయమయినవి. పట్టుదలలకన్న సత్యాసత్యాలకన్నా యితరులమనస్సులకు నొప్పితగిలేటు

యాలు ఆయన్ను వేధిస్తుంటవి. ఆపదలుసంభవించినంత మాత్రాన అపరాధికాగలస్వభావిగాదు ఆయన. జగన్నాథ బాబు చేసిపోయినమోసంకంటె తన కిపుడు పరులుచూపు తున్న చీకటిమార్గాలు తనను మరింత వేధిస్తున్నవి. మోస పోయినవానికే మోసంలోనిబాధ అనుభవమవుతుంది. సుని శితమైన హృదయంలో ఆ బాధ లీనమైనపుడే సంఘక్షేమం కలుగుతుంటుంది.

బద్రీనారాయణ హృదయాన్నిచిక్కబట్టుకుని విధికి సంతానాన్నివదిలి ధర్మానికికట్టుబడి, పిత్రార్జితఆస్తినంతటిని అమ్మి, ఒక్కటొక్కటిగా బాకీలను సర్దుబాటుచేశాడు. ఇపు డాయనకు మిగిలింది యిల్లుమాత్రమే. ఈ ప్రపంచంలో అన్నిటికంటె కటువైనది కటికిదారిద్ర్యమన్నవిషయం అను భవంమీాదగాని అర్థంగాదు.

అధీరతలో దైన్యతా విగళితావేదనలో క్షుభిత హృదయంతో ఆత్మగ్లానిచెంది, ఆవేశాన్నిపొంది తనఅన్యాక్త తకు తనను దూరుకుంటూ, తనకుటుంబానికి యేకైక సం పత్తియైన భూమిని విక్రయించి, బాకీలు తీర్చగలిగాడుకాని, అంధకారంలో ఆవరించియున్న తనకుటుంబభవిష్యత్తును తిల కించి కింకర్తవ్యతావిమూఢుడై క్షోభిస్తూ బయటముఖం చూడనొల్లక రోగగ్రస్తుడై మంచానపడ్డాడు. ఎవరిని చూడనూ యిపు డాయనమనోనేత్రాలు యిచ్చగించుట లేదు ఎవరిమాటలువిననూ ఆయనకిష్టంలేదు. ఎవరితో మాటాడను ఆయనమనస్సు వాంఛించుటలేదు. ఆయనఆత్మ లోని ద్వంద్వాత్మకసంఘర్షణే ఆయన్ను అస్తవ్యస్తంచేస్తు

న్నది. లోకంలో ప్రీతికి నీతికి లభించే ఫలిత మిదేనా అని ఆయన ఆత్మ వాపోతున్నది. దెబ్బతగిలినప్పటికంటే ఆ తరు వాతనే బాధ విశేషమవుతుంది. ఆలోచనలు యెక్కువయి ఆకలి నశించింది.

అమాయకుడుగనుక బస్త్రీవాళ్ళు ముంచారని సాను భూతిని వెల్లడించారు దాయాదులు. వెర్రివాడుగనుక ధర్మా నికికట్టుబడి దరిద్రుడయ్యాడన్నారు యిరుగుపొరుగువారు. ఎవరుచేసుకొన్నఖర్మ వా రనుభవింపకతప్పుతుందా అన్నారు మరికొందరు.

దరిద్రదేవతశక్తి ప్రచండమయింది. తనరూపాన్ని ప్రకటించినచోట నగ్ననృత్యంచేస్తుంది. లోకంలోని అన్ని శక్తులు ఆమెనుండుపరాజితులు. బద్రీనారాయణఆరోగ్యం నానాటికి క్షీణిస్తోంది. డాక్టరు విసిగిపోయాడు. మనోవ్యాధి మీాద మందు లేమిపనిచేస్తవి!

కళ్యాణి ఆర్థికబాధలను అనుభవించియెరుగదు. ఆమె శరీరం యెంతదుర్బలమైందో అంత అనారోగ్యమైంది. పూజలమీాద వ్రతాలమీాద యెంతఆసక్తో మందులమీాద పత్యాలమీాదకూడ అంత శ్రద్ధవుంచుట ఆమెకు అలవా టయిపోయింది. దుర్బలరోగిష్టిశరీరంలో చిరాకులు చిందు గు త్రొక్కుట, సహనం నశించుట సహజమైనవి. కాని ఆమె అందుకుప్రతిగా నిలిచింది. ఆమెకు చిరాకుకలిపించాలని, ఆమెముఖమండలమంతా క్రోధాన్వితమైవుంటే యెలావుం టుందో చూడాలనేభ్రమతో బద్రీనారాయణ ఆమె నవ వధువుగావున్నపుడు చేసినప్రయత్నాలన్నీ విఫలమయిన

రోజు పశ్చాత్తాపహృదయంతో ఆమె తనఅదృష్టదేవతగా స్థిరీకరించుకున్నాడు. అప్పటినుంచి ఆయన ఆమెఅభిప్రాయాలకు ఆధిక్యతనిస్తుండేవాడు.

కళ్యాణి కాపురానికివచ్చినరోజునే యింటియాజమాన్యాన్ని పొందింది. అత్తగారు లేకపోవటం, మామగారికి కూడా తానే సపర్యలుచేయవలసిరావటం తనభర్త బద్రీనారాయణకూడా తనమాటకే ప్రాధాన్యతయిచ్చేవాడు కావటంవలన ఆమెకు ఆ యింటిలో అంతా మమకారాలు దప్ప అయిష్టవాతావరణం తెలియకుండాపోయింది. మామగారు తనయింటికి కోడలు వచ్చినట్లు తలంచలేదు, సాక్షాత్ లక్ష్మీదేవతే వచ్చిందని, ఆమెగుణగణాలను పదేపదే పొగడుకుంటూ పొంగిపోయేవాడు. మామగారి మెప్పుమాటలు ఆమెశరీరానికి శక్తికలిగించేవి. అన్నివైపులా ఆనందాన్ని పొందుతూ హాయినిగ్రోలుతూ, పరమతృప్తితో జీవించేవారిని చూచి, ఆ సర్వశక్తివంతుడైన భగవంతుడు ఓర్చజాలడు. నవ్విస్తూ కవ్విస్తూ ఏడ్పించి మనోరంజనముపొందుట భగవంతునికి పరిపాటి.

ఆమెమామగారిఅస్తమయంతో ఆమెలోనిఫుత్సాహం కుంటుపడింది. మెప్పులతోను ప్రోత్సాహాలతోను వుద్రేకాలతోను మానవులు చేయగలిగినన్ని కార్యాలు కర్తవ్యరూపంలో యెన్నడూ చేయలేరు. ఇపుడు కళ్యాణిచేసేపనులన్నిటికీకూడా కర్తవ్యముద్రలు పడుతున్నవి. బద్రీనారాయణవర్కి కపుత్రసంతానమైనందున త్వరపడివివాహంచేశా

గాని, యింకా వ్యక్తిత్వంరాలేదు. అందువల్లనే నేను ఆ కుటుంబం దర్శకుడులేని డ్రామాలాగుంది.

రత్నాకర్ జననంతో మేఘావృతచ్ఛాయలు ఆ యింటినుంచి విడిపోయినవి. జాతకచక్రంవ్రాయించి జ్యోతిషులన్నవారందరివద్దకు వెళ్ళి కానుకలర్పించి తనముచ్చటకొద్దీ మరీమరీ అడిగి తెలుసుకుంటున్నాడు బద్రీనారాయణ. బాలునిపోషణకంటె అతనిభవిష్యత్తునుగురించిన ఆందోళన యెక్కువయింది. దశమస్థానమందు రవి, కుజ, శుక్ర, శని, బుధుడు, ద్వితీయమందు రాహువు, తృతీయమందు గురువు, చతుర్థమందు చంద్రుడు వుండి, మీనలగ్నజాతకుడయినందున జాతకునిది రాజయోగమన్నారు. రాజకీయ మహా నాయకుడై ప్రధానమంత్రిగాక తప్పదన్నారు జ్యోతిస్సాహితీపరులు. ఈ వాక్కులు బద్రీనారాయణను వేయిని మత్తులో ముంచినవి. "మీరు మరీ పిచ్చివారై పోతున్నారు. వాడు బ్రతికిపెద్దవాడైతే ఏదోఒకటి అవుతాడు; దాన్ని గురించి యింత భ్రమలుపడుతూ మీరు యింటివ్యవహారాలను మరచి, ఆఖరకు స్నానం భోజనంకూడా విడిచి తిరుగుట నాకే సిగ్గుగావుంది వూరుకోండి. వాడికి జాతకచక్రాలూ వద్దు, వూహాగానాలూ వద్దు. మీరింక వాడిజాతకాన్నిగూర్చి ఎవరివద్దా ఏమీ అనకండి." అని నిండు ప్రశాంతకంఠంతో అన్నది కళ్యాణి "నీవు వెర్రిదానివి; వాడిజాతకప్రభావం నన్నలా తిప్పిస్తుంటే, నన్నేంచేయమంటావు చెప్పు? నీవు నిజంగా రత్నాన్ని కన్నావు. అందుకే వాడిని నేను 'రత్నం' అని పిలుచుకుం

టున్నాను. వాడు భారతరత్నంగా ఒకనాడు పిలువబడ తాడు" అని పొంగుతూన్న ఆనందంతో అన్నాడు బద్రీ నారాయణ. "ఎవరిబిడ్డ వారికనులకు అలానే కనిపిస్తాడు. మీరు మరీ పిచ్చివారుకాక, శాస్త్ర పాలేళ్ళు ఏమిచేస్తున్నారో చూడండి" అన్నది ఆమె.

మానవకాంతి ఎండమావులలో నగ్ననృత్యంచేయిస్తుంటుంది. రత్నాకరునిజాతకచక్రం బద్రీనారాయణ జేబులో దినదినాభివృద్ధిపొందుతున్నది. పేరుబొందిన ప్రసిద్ధ జ్యోతిషులవద్దకు యెంతదూరమయినా వెళ్ళి, జాతకునిభవిష్యత్తుని అన్నిదశలలోను అడిగి తెలుసుకుని పెద్దపెద్దకానుకలను సమర్పించి వస్తుంటాడు. కాని ఆ తెలుసుకున్నవివరాల నిపుడు కళ్యాణితో చెప్పటలేదు. చెప్పి ఆమెవిసగటకు గురిగావటం తనకిష్టంలేదు. గ్రామంలో తనకిష్టమైనవారందరి వద్దకు వెళ్ళి ప్రయత్నపూర్వకంగా మాటలలో తనరత్నాకరుని జాతకప్రభావవిషయం తెచ్చి, జ్యోతిష్కులు చెప్పినవి చాలక మరింత హెచ్చింపులతో చిలవలుపలవలుగా అల్లి చెప్పివస్తుంటాడు. వినేవారు వున్నపుడు చెప్పినకొద్దీ తనహృదయం ఉల్లాసంతో పొంగిపోతుంటుంది. ఎవరితో చెప్పనూ వీలుకుదరనప్పుడు తనముసలిపాలేరు నాగులును పిలిచి "నాగులూ, మీఅమ్మగారు పిచ్చిదిరా, నేను మొన్న విజయవాడ వెళ్ళివచ్చాను. ఈమాట యింట్లో అనబోకు సుమా! మహాపండిట్ వైకుంఠశాస్త్రిగారివద్ద కెళ్ళాను. అబ్బ! ఆయన జ్యోతిషంలో అఖండవిద్వాంసుడు. ఎంతమంది పెద్దపెద్దవారు ఆయనవాక్కులకొరకు వేచి

వున్నారు! రాజకీయనాయకులు ఆయనవాక్కులతో తమ భవిష్యత్తును తూచుకుంటున్నారు. వ్యాపారులు ఆయన మాటలతో తమలాభాలు అంచనాలువేసుకుంటున్నారు. విద్యార్థులు ఆయనసలహాలతో కార్యరంగాలను నిర్ణయించుకుంటున్నారు. అలాంటి మహాపండితుడు మన రత్నాకర్ జాతకాన్ని వేయినోళ్ళ పొగడుతున్నాడు. ఈ జాతకానికి రాజయోగముందన్నాడురా, అఖండఖ్యాతితో పరిపాలనాస్థానాన్ని పొందితీరాలన్నాడు. వాడు ఆంధ్రరత్నం దేశరత్నంరా. వాడు మంత్రిఅయినపుడు నీ కొడుక్కు మంచివుద్యోగం యిస్తాడులేరా,"అనేవాడు.

నాగులుఅమాయకుడు, అల్పసంతోషిఅయినా అతని స్వల్పబుద్ధికి అందులోని నగ్నసత్యం స్ఫురించింది. "మా వాడు అప్పటికి ముసలివాడవుతాడు గదండి!" అన్నాడు నిరాశాకంఠంతో. "నాగులూ, నీవు పిచ్చివాడవోయ్. నీ కొడుక్కుగాకపోతే, నీ మనుమడికయినా మా రత్నం మంచివుద్యోగం యిచ్చితీరుతాడురా. వాడిస్వభావం మర్చిపోయేదిగాదు" అని నిశ్చితకంఠంతో అన్నాడు బద్రీనారాయణ. ఈదఫా నాగులుకు నమ్మకంకలిగింది; కృతజ్ఞతతో ముఖం విప్పారింది. అయినా, తనకు అంతా మనుమరాళ్ళే కలిగి, మనుమడు పుట్టకపోతేనో,అనేశంక అతనిని అసందిగ్ధం చేసింది. ఈ అవకాశాన్ని వుపయోగించుకునే అదృష్టం తన కొడుక్కు కలుగుతుందో కలుగదో అనేఅనుమానంతో బాధపడుతున్నాడు.

కళ్యాణి గృహకార్యాలలో లీనమయివుంది. తాలింపు

గింజలలోనిరాళ్ళను యేరుతున్నది. నాగులు తచ్చట్లాడుతూ, బిడియంతోను భయంతోను తొక్కిసలాడుతూ, తనముం దుగా రెండుమారులు వచ్చిపోవటము గమనిస్తూనేవున్నది. తిరిగి వచ్చినపుడు ఆమె వుండజాలక "ఏమిటి నాగులూ, ఏదైనా చెప్పాలా?" అని పిలిచి అడిగింది. "ఏమీలేదు అమ్మా! మన బాబు పెద్దయ్యాక మంత్రిఅవుతాడట, మా మనుమడికి వుద్యోగంకూడా యిస్తాడుట..." అని ప్రేమ లోలుపుకంఠంతో అన్నాడు. "మీ దొరగారేనా యీ మాటలన్నీ చెప్పింది!"అని ఆమె ఆశ్చర్యకంఠంతోఅడిగింది.

నాగులు:- అవును అమ్మగారూ, అయ్యగారు మొన్న బెజవాడవెళ్ళి పెద్ద జోతిష్యులవారినద్ద బాబుజాత కం చూపించారట. రాజయోగముందన్నారట.

కళ్యాణి:- మీ అయ్యగారికి మతిపోతున్నది. నీవు కూడా ఆయనకు తోడుగాబోకు. నీకు ఏనాడో కలుగబోయే మనుమళ్ళవుద్యోగంకొరకు యీనాటినుంచే దేవుళ్ళాడుతూ పిచ్చివాడివి కాబోకు. (అని మందలించింది.)

నాలుగుసంవత్సరాలు గడిచిపోయినవి. ద్వితీయపుత్ర సంతానం కలిగింది కళ్యాణికి. మొదటిఅనుభవాన్ని వుపయో గించి మరింత శ్రద్ధగా వ్రాయించాడు జాతకచక్రాన్ని. పాత పరిచయమున్న పండితోత్తములందరిదర్శనము మళ్ళీ చేసు కున్నాడు, ఈ జాతకుడు.

*    *    *    *    *

పండితయోగంలో జన్మించాడన్నారు. మహాపండి తుడై కాళిదాసువలె కావ్యాలువ్రాసి శాశ్వతకీర్తిని గడి

స్తాడు; తరతరాలకు మాసిపోని కీర్తిని పొందుతాడని అందరూ సెలవిచ్చారు. ఇది మరింత ఆనందమైనవిషయంగా తోచింది బదరీనారాయణకు. తనపేరును తనవంశంపేరును తరతరాలకు శాశ్వతంచేయువాడు గనుక, మరింత మమకారం కలిగింది యీ జాతకునియెడల. అందుకే కాళిదాసని పేరుబెట్టాడు యీ పుత్రారత్నానికి.

ఇలా మూడు నాలుగుసంవత్సరాల కోమాటు జ్యోతిషులవద్దకు తిరుగుతూనేవున్నాడు బదరీనారాయణ. కృష్ణకుమారి పుట్టినపుడు సాక్షాత్ సరస్వతీదేవి తనయింటికి వేంచేసిందని ప్రచారంచేసుకుంటూ పొంగిపోయాడు. ఆ తరువాత రోహిణి జన్మించినపుడు లక్ష్మీయోగజాతకమని, సాక్షాత్ లక్ష్మి తనకనులయెదుట ప్రత్యక్షమయిందని సంబరపడ్డాడు.

ఒక్కొకరు తనను ఒక్కొకవిధంగాఆకర్షిస్తున్న ఆ నలుగురుబిడ్డల విద్యాభివృద్ధులకని విజయపురి చేరాడు బదరీనారాయణ. కొంతకాలానికి విధి ప్రకోపించింది. జగన్నాథం చేతిలో చిక్కుకుని సర్వసంపత్తిని కోల్పోయాడు. ఆ చీకుతో ఆరోగ్యంకూడా అదృశ్యమైంది. సంపత్తి పోగొట్టుకున్న బాధకంటె బదరీనారాయణఅస్వస్థత కళ్యాణిని కలవరపెడుతున్నది. అర్థంగాని జబ్బుగా డాక్టర్లు జవాబుచెప్పారు. మనోవ్యాధికి డాక్టర్ల మందు లేమిపనిచేస్తవి!

వరదనపడి కొట్టుకుపోయేవానిపై తుఫాను కటాక్షించినట్లు, బ్యాంకులో జగన్నాథంచేసిన వోవర్‌డ్రాఫ్టునోటీసు రెండు వేలకు వచ్చిపడింది. విధి వక్రించినపుడు అడుగడుగునా

అఘాతాలు కలుగుతుంటవి. ఆఖరిదమ్మ అంతమయినపుడే నూతన జీవితసోపాననిర్మాణం జరుగుతుంది. కష్టాలు మానవుని కరుడుకట్టించి, యెదురీతకు అలవరుస్తవి.

భగవంతుడు స్త్రీలకు కావలసినంత కన్నీటినేగాదు, అవుసరమైనపుడు కాలానికి ఎదురీదగల కఠినత్వంకూడా యిచ్చాడని రుజువుచేసింది కళ్యాణి. దివాలాయెత్తిన వ్యాపారి లెక్కలపుస్తకాలను ముందెట్టుకుని విలపించటం నిష్ప్రయోజనమని వెర్రితనమని కళ్యాణికి తెలుసు. ఏ నీతి కొరకు ధర్మంకొరకు యావత్తు కోల్పోయారో ఆ నీతిధర్మం విలువదెలిసిన కళ్యాణి కర్తవ్యోన్ముఖురాలయి భర్తకు ధైర్యాన్నినింపి పూతాన్నిచ్చి వున్న యింటినికూడా అమ్మి బ్యాంకుకు చెల్లించింది. న్యాయము ధర్మము, లక్ష్యాలు ఆదర్శాలు అని గొంతుచించిచాటుకునే రాజకీయరంగంలోను కోర్టులలోను అది వాస్తవికశూన్యం. అక్కడ అన్నీ కరుడుగట్టిన కఠినహృదయాలు. అధికారులమనసులు కరిగి, కరుణకలుగటం కద్దు.

స్నేహాన్నినమ్మి, ధర్మానికి కట్టుబడిసర్వస్వాన్నికోల్పోయిన అమాయక బద్రీనారాయణగాథ విన్నపుడు, అక్కడి హైవేస్ యెగ్జిక్యూటివ్ యింజనీర్ నాగార్జునదాస్ మనస్సు ద్రవించింది. తనసానుభూతిని ప్రకటించను స్వయంగా వారి యింటికెళ్ళినపుడు బద్రీనారాయణ అస్వస్థత, బాడిలోనడిచిన పాదముద్రలవలె ఆ యింటినుంచి అదృశ్యమవుతున్న లక్ష్మిచిహ్నాలు; కళ్యాణిలోని తీయని ఆదరసత్కారం, ఒక ప్రక్క, తొంగిచూస్తున్న దీనత్వం, మరోప్రక్క ఆయన్ను

చలింపజేసినవి. జగన్నాథంచేసిన కంట్రాక్టుపనులన్నీ తనకు విదితమే. తా నెన్నోవిధాల ఆయనకు సహకరించాడు. ప్రతిఫలంగా ప్రభుత్వాన్ని అనేక మోసాలుచేశాడు. ఇటు అమాయకుడయిన బద్రీనారాయణనూ సర్వనాశనంచేశాడు.

శిథిలాలమీదజరిగే నిర్మాణం అత్యధిక అనుభవంతో వుంటుంది. నాగార్జునదాస్ అనురోధంతో సర్వసహకారాలతో బద్రీనారాయణ కాంట్రాక్టులకు దిగి, పూర్తిగా పుంజుకున్నాడు. మోసాలూ, తంత్రాలూ లేకుండానే అందరి ఆదరాలనూ పొందుతూనే అభిమానాలను చూరగొంటూనే ఆర్థికాభివృద్ధిని పొందగలిగాడు. తాను విజయపురిచేరక ముందున్నస్థితికంటె నేడు ద్విగుణరూపంలో వుంది. విజయపురిలో ఆధునికహంగులతో స్వగృహనిర్మాణంకూడా జరిగింది.

## 8. వలపులరాణి

కృష్ణకుమారి యిపుడు యశోపాల్ కాలేజీలో ప్రవేశించింది. ఆమెయెడల బద్రీనారాయణకు ప్రత్యేకమైన శ్రద్ధవుంది. ఆమె గొప్ప సాధ్విగా ప్రతీతిబొందే యోగముందని. స్త్రీలలో అంత మంచిజాతకురాండ్రు సహజంగా వుండరని, ఆమెద్వారానే తల్లిదండ్రులకు పేరు, శాంతి లభిస్తుందని జాతకులు చెప్పినమాటలకంటె బాల్యంనుంచి మాధుర్యంచితపలుకులు, లాలింపులతో, అనురాగంతో అర్థమై పులకితంజేసే ఆమె స్నేహదృక్కులు, ఆమెలోని క్రీడాకౌతుకచాంచల్యం, వాత్సల్యోద్వేలమైన ప్రఫుల్లిత

ముఖమండలం ఆయనను ముగ్ధునిచేసేవి. ఆయనమనో రాజ్యంలో యీమెకున్న విహార క్రీడావకాశం అన్నలు గాని చెల్లిగాని పొందజాలకపోయారు. కన్నతండ్రిలోని అనిర్వచనీయమైనప్రేమ ఆమెలోని చిరాకులకు, చీకాకులకు, చంచలతకు కవచమువలె వుంటూ వాటిని విస్తృతం చేయగలిగింది.

సృష్టికర్త కదాచిత్‌గా మానవులను విచలితులను చేయును. తన మనసంతా కేంద్రీకరించి, అతిశ్రద్ధతో మచ్చు ప్రతులుగా అత్యద్భుతఅందంతో చిత్రించి యీలోకంలోకి వదులుతుంటాడు. ఆ మధుభరితమైన అందాలసుందరిని గాంచినపుడు మానవుడు విభ్రాంతిచెంది "బ్రహ్మ పాపం తనకోసమని చిత్రించుకునివుంటాడు, సరస్వతి యెదుటపడి నప్పుడు భయకంపితుడై అధీరతతో యీ లోకానికి జార విడుస్తుంటాడు" అని, ఆ దోషాన్ని ఆయనకే అంటగట్టుట పరిపాటి. అలా చాటుగా బ్రహ్మచే జారవిడువబడిన దీ కృష్ణ కుమారి.

భగవంతుడు పక్షపాతి; నదీజలాలన్నిటిని ఆ అగాధ సాగరగర్భానికే అర్పిస్తాడు. అనంత అంతరిక్షానికి అంటిన ఆ హిమాలయాలనేమంచుతో వాటియెత్తును యింకా పెంచుతుంటాడు. అలానే అందాలవైపే అలంకారాలన్నీ నడుస్తుంటవి. కృష్ణకుమారిగది ఒక చిన్న ఫాన్సీషాపు అన్నా యిబ్బందిలేదు. సినిమానిర్మాణరంగంలోని మేకప్‌గదిఅన్నా యిబ్బందిలేదు. పాపం రోహిణికి ఆ గదిలో అడుగుపెట్టే హక్కేలేదు.

కాలేజీలేనిరోజు కృష్ణకుమారికి ఆనందంగానూ వుంటుంది, బాధగానూవుంటుంది. ఖర్చు పెరిగినపుడు సంపాదన పెరుగుతుందికాని, ముస్తాబు పెరిగినపుడు కాలము పెరుగదు. ఆ బాధ నేడు కృష్ణకు బాగా అర్థమవుతున్నది. ఆమెకు స్నానము మేకప్‌లకు మూడుగంటలు అనివార్యము. 200గాలన్ల నీరు పారబోయనిదే, మైసూరుశాండిల్ ఫ్రెడ్ సోపు సగముఅరుగనిదే ఆమెకు తృప్తివుండదు. సంపత్తిమీద సవారీచేసేవాడు అడుగడుగున అంకణాలు వేసుకుంటూ అభి వృద్ధిపథకాలను అమలులోపెడుతుంటాడు. అదేరీతి యీ లోకంలో భగవంతుడు అందాలను అమృతోదరితంగా ... కిస్తూ ప్రతిమలవలె చిత్రించిన సువర్ణసుందరాంగులు అంతటితో తృప్తిజెందక తమ అందంఅభివృద్ధికొరకు అను క్షణము ఆలోచనలుచేస్తుంటారు.

కృష్ణకుమారి మేకప్‌లూ, వయ్యారాలు, పటా టోపాలు యింటిలోనివారందరికి వెగటుగా నేతోస్తుంటు కాని, బద్రీనారాయణకుమాత్రం ఆనందాన్ని కలిగిస్తుంటవి ఆమె అధునాగరికపు లక్ష్మీఅవతారమని సరస్వతీదేవిస్వరూపమని మనస్సులోనే పొంగుతుంటాడు. పట్టణంలోని నవనాగరిక యువకలోకానికి విద్యార్థిలోకానికి ఆమె ఆకర్షణాదేవత. ఆమెఅలంకారాలన్నీ మెరుగులుదిద్ది అందాన్ని అధికమింప జేయునట్లే తోస్తుంది వారికి. అవును, నవ్వులను ఒలికించి ఆహ్లాదాన్నిచ్చు వివిధరంగుల పుష్పగుచ్ఛాలమీద భ్రమ రము వాలినపుడు అరుణ, కెంపు, సువర్ణ, ... రజిత రంగులలో భ్రమరకాటుకరంగు కలిసి, శోభను ...పొం

నిస్తుంది. ఆపైన అచటనే పంచవన్నెలచిలుక రెక్కలపురుగు చేసినపుడు వెగటుగాక అద్వితీయంచేస్తుంది. అందంపైచేసె అలంకరణలు యేరూపంలోనున్నా అవి అందాన్ని అత్యధికంచేయుట సహజం.

చంద్రబింబంతో అనంత ఆకాశం శోభిస్తున్నట్లు, ఆ బింబంతోనే నక్షత్రమండలం అధిక్యతపొంది గర్విస్తున్నట్లు కైలాసపర్వతంతో భూలోకం శోభిస్తున్నట్లు యశ్‌పాల్ కాలేజీ కృష్ణతో విరాజిల్లుతున్నది. ఏకారణంతోనైనా కృష్ణ కాలేజీకి హాజరుకానిరోజు చంద్రుడులేని నక్షత్రకూటమినవలె కళావిహీనమై వుంటుంది కాలేజీ. ఆమె రాలేదని అందరి మనస్సులు ఆరాటపడుతవి. చంద్రబింబసమాన చిరునగవును చిలికించే ఆమెముఖమండలం అందరిహృదయాల్లోను మెదులుతుంది. ఆమెరానిరోజు ఆమెక్లాసువిషయం వ్రాయనవుసరంలేదు. ఆచార్యునిదృక్కులే ఆమెకొరకు వెదుకుతుంటవి. ఆయనమనస్సు అజ్ఞాతరూపంలో ఆమెను స్మరిస్తుంటుంది. తెరచివున్న క్లాసుపుస్తకంలో చూస్తూనే సుకోమల కుసుమంలాంటి ఆమెముఖాన్ని వర్ణిస్తుంటాడు. పిసినారి విద్యార్థులు కొందరకు వారిపుస్తకంలో అవి కనిపించక, వెలవెలబోతూ బుర్రలేని మిలిటరీసైనికులవలె ఒకొక్కరుగా నిలబడతారు.

ఆమె కాలేజీకి రానిరోజు ఆమెద్వారా పునీతంగా ఆ మార్గం చిన్నబోయి దీనతను ప్రకటించుకుంటుంది. ఆ మార్గంగుండా ఆమెపోనికొరత అచటి అందరిని బాధిస్తుంటుంది. నేత్రాకర్షణలోగూడా అనిర్వచనీయమైన యింత

అనుభూతిని కల్పించిన ఆ భగవంతుని ఆశయం విశిష్టమైంది. అదే సృష్టికి మూలం గాబోలు!

రిక్షా మొదలగు వాహనాలమీంద కాలేజీకి వెళ్ళట కృష్ణ కస లిష్టముండదు. తనఅందంలోని పరిపూర్ణ సౌష్టవాన్ని ప్రదర్శించను వీలుగాదనేమో, ఆమెశరీరచ్ఛాయ మేలిమి సువర్ణ రంగులో స్ఫటికమువలె నునుపులుదేలి చకుకులు గ్రక్కుతూ వెన్నవలె మిసమిసలాడుతూవుంటుంది. వికసితకమలమువలెనుండు ఆమె ప్రఫుల్లితముఖమండలములో విలాసపు చంచలత్వం జిలిబిలినృత్యంచేస్తుంటుంది. వృభిక ఒకిపించునట్లుంటవి నేత్రద్వయము. నుదురు విశాలము, తీర్చిదిద్దిన కపోలాలు, పూర్ణవికసిత గులాబిపుష్ప రేకువలె అరుణఅధరాలు. ఆమె కిలకిల నవ్వినపుడు కారుమేఘాలలో జిగిజిగిగా మెరెసినట్లుంటుంది. కారునలుపయిన ఆమెశిరోజాలు అంత దీర్ఘమయినవిగాదు. అయినా వాటి దీనత్వాన్ని ప్రకటన కానీయకుండా కృత్రిమకురులతో రెండుజడలను వేసుకుంటుంది. నిష్పక్షపాతాన్ని ప్రకటించనో యేమో ఒకజడను మాత్రమె వెనుకవుంచి, రెండోజడను ముందువైపు కుడి వక్షోజంమీందుగా జారవిడుస్తుంది. ఏ ఇంజనీరో శిఖరాగ్రాన్ని కొలువను కొండ శిఖరంమీందుగా వేసి, అక్కడే ఆ కొండకుకలిగిన గౌరవాన్ని పరికించి, తిరిగి తీయబుద్ధిబుట్టక వదలి తదేకంగాచూస్తూ తనకర్తవ్యాన్ని మరచినట్లుంటుంది ఆ జడ. సింధూరరంగులో మెరుపులు ప్రతిబింబిస్తున్న పావడాగర్వాన్ని అణచను వేసినట్లు నీలిరంగువోణీని చుట్టి వక్షద్వయమునే రెండుకొండలమధ్యగా పైకివేస్తుంది. అవి

బెంగాలునో పంజాబునో రెండుగా విభజించి, యూనియన్ పాకిస్తాన్ కొరకు గోడలుకట్టినట్లు రెండువక్షోజాలకు హద్దుల నేర్పాటుచేస్తున్నది. ఆమెధరించిన మఖమలుజాకెట్టు వదనచను కులతో పోటీలుపడుతున్నది. పాదాలకు తొడిగిన తెల్లని స్టాకిన్స్, బూటులు మేకప్‌కు పరిపూర్ణత్వాన్నిస్తున్నవి. ముఖాన్ని ఆలివాయిల్‌తో మర్దనచేసి, సబ్బుతో శుభ్రం చేసి, స్నో రుద్ది టాల్కంపవడర్ కొట్టి పింజపువ్వుతో తుడుచుకోవడంవలన గాబోలు మరింత తేజోవంతంగా వున్నది. ఆమెఅందం పాలకడలినురుగు మెరుగువలె అద్వితీయమై శోభిస్తున్నది.

జన్మతోవచ్చిన అందానికి తన శక్తినంతటిని తోడు చేసి మెరుగులుపెట్టినా యెక్కడ లోపనుంటుందో అనే భయం కృష్ణను విచలితను జేస్తుంటుంది. బద్రీనారాయణ ఆమెచదువునుగురించి ఆలోచిస్తున్నాడు. ఆమె తనఅం దాన్నిగురించే ఆలోచించుకుంటున్నది. అందరూ తనఅం దాన్నిగురించి పొగడాలని, ముగ్ధులుగావాలని ఆమెవాంఛ. విక్టోరియా మహారాజ్ఞి రాజసభకు వెడలినట్లు ఆమె తన కాలేజీకి పయనమవుతుంది. మండుతూన్నవెలుగు రెక్క పురుగులను ఆకర్షించినట్లు అందం మానవులను ఆకర్షిస్తుంది, వెర్రిని కల్పిస్తుంది. అద్వితీయమైన ఆమెసౌందర్యాకర్షణలో కాలేజీ విద్యార్థులెందరో కొట్టుకుపోతున్నారు. అజ్ఞాతంగానే అసంభిజ్ఞంగానే ఆమె అందంతో ముగ్ధులయినవారు కొందరు నేత్రపానంతో తృప్తినందక, ఆమెవెంట జైలరువెంటవెళ్ళే ఖైదీలవలె, హవల్‌దారువెంట వెళ్ళే సిపాయిలవలె, గురు

వుతో వెళ్ళ శిష్యులవలె వెళ్ళుతుంటారు. విసగటం చెంది నిస్పృహపొంది చైతన్యంపొందబోవువారిని తన మృదుమధుర మందహాసపు కొంటెవిసురుతో వారికికావలసిన ప్రోత్సాహాన్నిచ్చి పిచ్చివారినిచేసి ప్రోత్సాహమిస్తుంటుంది.

ఇపుడు కృష్ణకుమారి బాడీగార్డులసంఖ్య ద్విగుణమయింది. వారంతా జీతభత్యాలులేని తన బాడీగార్డులని ఆమె భావన. వారిలో యెవరికివారికే తనను ప్రేమిస్తున్నదని అందుకే ఫలానసమయంలో తననుచూచి ఆదరంగా చిరునగవును ప్రకటించిందని నమ్మిక. ఇలాంటి దోబూచులాటలకు భ్రమలు యెంతప్రేరణనైనా యిస్తుంటవి. ఆమె కాలేజీనుంచి బయలుదేరితే, కొద్దిఅంతరంతో చిన్నగుంపు వెంటాడుతూంటుంది. ఈలలు వేయుట, వ్యంగ్యవాక్యాలను వదులుట, తుమ్ముట, సకిలించి దగ్గుట, కవ్వించే కలహప్రియమాటలనుట, అకారణంగా గొప్ప వికటనగవును ప్రదర్శించుట వారి కలవాటయిపోయింది. అవన్నీ తన కీర్తికి నిదర్శనలయినట్లు, వుత్సాహానికి వూతమయినట్లు, ఆనవ్యతకు హంగులయినట్లు ఆనందభరితురాలవుతున్నది. అది 'డాన్‌క్విక్ సేట్' వ్యూహావిహారమనుకున్నా నా అభ్యంతరం లేదు. ఏకారణాలవల్లనైనా ఆమెను వెంటాడుతున్న బృందం ఒకరోజు అదృశ్యమైతే, ఆమెమనస్సంతా వికలంచెందుతుంది. నక్షత్రకోటి హర్తాళ్ చేసినపుడు వేలనంతో చీకాకుతో వ్యధతో ఏకాకిగా పయనించే చంద్రబింబంవలె ఆమె ఆరోజంతా అన్యమనస్కురాలుగా వుంటుంది. క్లాసులో కన్నుగీటులు, కొంటెచూపులు, వ్యంగ్యబాణాలు లభ్యం

గానపుడుకూడా సత్కారాలు సన్మానాలులేని సభికునివలె చిన్నబోయివుంటుంది. వాటికొరకు ఆమెమనస్సు తహతహ లాడుతుంటుంది. కాని అధీరతలోని దీనత్వం ఆమెఅందాన్ని ద్విగుణీకృతంచేస్తుంది.

క్లాసుపుస్తకాలమీద ఆమెకు అభిలాష తక్కువ. చదువుటలో డిటెక్టివ్‌నవల్సన్నా సినిమాలలో స్టంటుఫిల్ము లన్నా శ్రద్ధ హెచ్చు. చతుర్ముఖపారాయణమన్నా కేరమ్సన్నా మరింత అపేక్ష. భాషావిజ్ఞానంకంటె విజ్ఞానంకంటె ఫ్యాషన్లవైపు అనుకరణలవైపు ఆమెమనోప్రవృత్తి పరుపులెడు తుంటుంది. భారత సంస్కృతీసంప్రదాయా లామె కంత తృప్తినివ్వవు. పాశ్చాత్యభావనలతో మిళితమైన సాంప్ర దాయం ఆమెనుఆకర్షిస్తుంది. 'టాటాలు, గుడ్‌మార్నింగ్లు' అధికప్రీతి. పప్పా, మమ్మా' శబ్దాలు పాశ్చాత్యుల నోటినుంచివచ్చినట్లే వస్తవి.

పురుషులమధ్య మెలగటమే తనకిష్టం. స్త్రీలసాంగత్యము, స్త్రీలతోతిరుగుట ఆమెకు నచ్చదు. పురుషులతో సమ..భ్యాసలేకుండానయినా ఆడగలదు,తిరుగగలదు,సంభాషించగలదు. ఆమెప్రక్కనున్నపుడు మొద్దుఅబ్బాయిలకు కూడా ఆశుకవిత్వం వచ్చేస్తుంటుంది. పద్యరూపంలోపెట్టి ప్రశంసిస్తుంటారు. వాటితో ఆమె పరవశమవుతుంటుంది. ఆమెపరవశం యెదుటివారిని మరింత రెచ్చగొడుతుంది. వారు పంచరత్నాలరూపంలోను, ప్రార్ధనాపత్రాలరూపం లోను రచించి సమర్పించుకుంటుంటారు వాటిని ఆమె పదే పదే చదివి తన్మయురాలయి, పెట్టెలో చీరలఅడుగున అతి

జాగ్రత్తగా పదిలపర్చుకుంటుంది. పేరాశగల వడ్డీవ్యాపారి పెద్దవడ్డీలతో వ్రాయించుకున్న ప్రామిసరీనోట్లను అతి జాగ్రత్తగా దాచుకున్నట్లు ఆమె తనకులభ్యమైన ఉత్తరాలను దాచుకుంటుంది. ఆమె కిపుడు పసిబిడ్డలద్వారాను పుస్తకాలలోపెట్టి యిచ్చుటద్వారాను, ఆమె చూడకుండా ఆమె బల్లమీదే పిడచుటద్వారాను అందుతున్న ప్రేమలేఖల సంఖ్య పెరుగుచున్నది.

"అమ్మా, అక్కనుగురించి చెప్పుకునేమాటలు నేను వినలేకుండావున్నాను. రోజూ మగపిల్లలతో వాలీబాల్ ఆడుతున్నదట. వాళ్ళకు షేక్‌హాండ్‌లిస్తున్నదట. నా క్లాసులోనిపిల్లలు గుచ్చిగుచ్చి అడుగుతున్నారు." అన్నది రోహిణి తల్లియెదుట.

కళ్యాణి :- దాన్ని ఎవరేమి అనగలరే! గడపలో అడుగుపెడుతూనే శివాలూ చిందులూ త్రొక్కుతుంటుంది. కోపమంతా దానినెత్తినే వుంటుంది. ఏమి అనటానికీ ఎవరికీ అధికారంలేదు. దాన్నిఏమయినా అంటే ముందు మీ నాన్నగారు వూరుకోరు.

రోహిణి:- అక్కకు నేనంటే అంత కోపమెందుకో? మొన్న వాళ్ళకాలేజీలో స్పోర్ట్సుజరుగుతుంటే మేమందరమూ చూడబోయాము. అక్క మొగపిల్లలవైపున నిలచివుంది. నేను నాతోవచ్చిన ఆడపిల్లలనందరిని విడచి అక్కవద్దకు పరుగెత్తుకెళ్ళాను. నన్నుచూడగానే ఆమెముఖమంతా కాఠిన్యంవహించింది. నన్ను కొరకొరచూస్తూ చూరానున్న ఒక విద్యార్థిదగ్గరకుపోయి, నవ్వుతూ ఏదో మాట్లాడు

పోంది. నేను చిన్నపోయి తిరిగి నాతోవచ్చిన ఆడపిల్లల వద్దకు వెళ్లానమ్మా!

కళ్యాణి:- రోహిణీ, నా కీ విషయాలు చెప్పి మరీ యెందుకు బాధిస్తావు తల్లీ. దానివిషయంలో నాహృదయం క్షోభిస్తున్నది. మాటఅంటే చిందులుత్రొక్కి యేడుస్తుంది; భోజనం మానేస్తుంది, ఆతరువాత యెంతరాద్ధాంతమైనా చేస్తుంది. మీ నాన్నగారిగారాబం దా న్నలాచేస్తున్నది.

అపరాహ్నసమయ మది. మాఘమాసపురోజు లవి. వృక్షాలను నరికివేసిన అరణ్యంవలె, సరుకుఅంతటిని యెగు మతిచేసివేసిన వ్యాపారి గోడవునువలె, ప్రేక్షకులులేని నిర్జన ధియేటరువలె అనంత ఆకాశమంతా శూన్యంగావుంది. మేఘా లన్నీ యెక్కడికో పలాయనమయినవి. మొండికేసి అక్క డక్క డావున్నవి తెల్లని దూదిపింజలువలె తేలియాడుతూ గగనశోభకు నగలవలె నిలిచినట్లున్నవి. రజితకిరణోజ్వల మైన ఆకాశమూ, ఆ తేలియాడుచున్న స్ఫటికములాంటి చిన్నిచిన్ని మేఘాలు, జీవరాసులకు హాయినిగూర్చె ఆ గగన రాజ తీక్షణదృక్కులు చూచువారికి ఆత్మగ్లానిని కలిగించు నట్లున్నవి. ఆ దిగంతవిస్తృతమైన నీలాకాశంలో తేలియా డుచూ ధరణిమీద జరుగుచున్నదురంతాలను తిలకించి కం పించిగాబోలు, యింకా పైకిపోయి విహరిస్తున్నవి గరుడ పక్షులు. బద్రీనారాయణ రెండోఅంతస్తు బాల్కనీలో యీజీచైరునందు వాలబడి, వారపత్రిక తిరగవేస్తున్నాడు. పెరటిలోని బాదంవృక్షదళాలమీద తన జిలిబిలి నృత్యప్రద ర్శన సలుపుతున్నాడు దినకరుడు. బయటవైపున్న వేపచెట్టు

మీద చేరిన కాకులకూటమి ఏదో ఘర్షణ చెందుచున్నవి. నాగార్జునపర్వతంవైపునుంచి ఏదో సన్నటి శ్రావ్యమైన రాగము శాంతిసందేశాన్ని మోసుకొస్తున్నది. విరామం లేకుండా కర్తవ్యానికికట్టుబడి పరువులెడుతున్న కృష్ణాజలం వినీలకాంతులను వెదజల్లుచున్నది. దూరంగా కనిపిస్తున్న చిమ్నీగుండా వెడలుతున్న దట్టమైన ధూమ్రమేఘము కొంత మలుగా పైకిలేచి, దిగంతంలో లీనమైపోతున్నది. బద్రీనా రాయణదృక్కులు ఆవైపుకే నడుస్తున్నవి. ఆయన హృదయము ఒకక్షణంపాటుకంపించింది, 'ఈసర్వము అలాంటి క్షణికమే గదా!' అని గాబోలు. బహువర్ణశోభితమైన ఆ నాగార్జున గిరులమీద ప్రాచీనముద్రలేవో ప్రకాశిస్తున్నవి. అవి బౌద్ధ భిక్షువుల నిద్రలేమో!

'పప్పా' అన్న పిలుపుతో బద్రీనారాయణఆలోచనలకు అంతరాయంకలిగింది. చిన్ని అడుగులు వేసుకుంటూ వచ్చిన కృష్ణ సంకోచాన్ని సద్దుబాటు జేసుకుని "పప్పా, మా కాలేజీ విద్యార్థులు కొందరు హైద్రాబాద్ యక్స్కర్షనకు వెళుతున్నారు. నేనుకూడా వెళతాను"

బ. నా:- వారిలో యెవరయినా ఆడపిల్లలుంటే అలానే వెళుదువుగాని. అయినా హైద్రాబాద్లో ఏది చూడాలన్నా నేను తీసుకెళ్ళి చూపుతానుగదా తల్లీ!

కృష్ణ:- కాదు పప్పా, ప్రత్యేకంగా వెళ్ళి చూస్తే మజారాదు. పదిమందివిద్యార్థులతో వెళ్ళి చూస్తే ఎంతో ఆనందంకలుగుతుంది.

బ. నా:- అదేమిటమ్మా, అలాఅయితే [illegible]

మంతా కలిసి చూసివద్దాము. రోహిణి పాపము ఎన్నడూ ఏదీ అడుగదు. దానికికూడా చూపవద్దా చెప్పు?

కృష్ణ:- వెళ్ళితే మీరందరూ వెళ్ళి చూడండి. నేను ఎక్స్కర్షన్‌కు వస్తానని చెప్పాను పప్పా, నేను తప్పకుండా వెళ్ళాలి.

బ.నా:- నీకుతోడు అందులో ఆడవాళ్ళేవరున్నా రమ్మా?

కృష్ణ:- అదేమిటి పప్పా! ఆడవాళ్ళెందుకు? నేను తప్ప, మిగతావాళ్ళంతా మొగపిల్లలే. అయితే నాకేం భయం? నేను యెన్నడూ తప్పుచేయను, చేయరానిపని జీవితంలో చేయను. నామీద నమ్మకంలేదా పప్పా?

బ. నా:- (వేదనతోగూడిన నిరాశా గాద్గద్యంతో) అదిగాదమ్మా, నీవిషయం తలపునకొచ్చినపుడు నామనస్సు తొట్రుపాటుచెందుతుంటుంది. నేను తప్పుచేయను, చేయగూడనిపని మనస్సుకే రానివ్వను, అని పదేపదే వుచ్చరించేవారే, తనను పవిత్రంగా సృష్టించుకోను తాపత్రయపడేవారే, ఘోరఅపరాధాలు, పాపభూయిష్టకార్యాలు లెక్కకు మిన్నగా చేసి, తనతోపాటు తనకుసంబంధించిన యావన్మందినీకూడా పనికిమాలినవారినిగాను హీనులనుగాను చేసి రసాతలంచేరినట్లు యింతకుముందే వారపత్రికలోని ఒకకథ చదివినపుడు నీవే నా మదిలో మెదిలావమ్మా.

ఆమె వెంటనే తండ్రిమీదకు ఒరిగి తన కుడిహస్తం ఆయననోటిమీద వేసి కరుణాభరితకంఠంతో "నేనంత అపమృత్యురాలినా పప్పా? నన్ను విశ్వసించవా? మొగ

వారితో చనువుగావుండటం దోషమా? సర్పాలతో చెల గాటలాడేవారిని సర్ప మెన్నడూ కాటువేయలేదు పప్పా! సర్పభీతితో దూరదూరంగా పరువులెత్తేవారే సర్పకాటుకు గురిఅవుతారు. ఈ ఒక్కమాటు నామాట నెగ్గించు పప్పా!" అన్నది.

దైన్యతాపమనస్కుడై విషణ్ణముఖంతో, "సరే నీ యిష్టమమ్మా" అన్నాడు బద్రీనారాయణ.

## 9 విహారయాత్ర

ఎక్స్‌కర్షన్ట్రూప్‌ప్రోగ్రాముకు స్పెషల్ బస్ ఎ.పి.జి. 60 యేర్పాటుచేయబడింది. ప్రబంధకర్త సెకండియ్యర్ స్టూడెంటయిన మంగళ్‌నాథ్ ప్రయాణీకులసంఖ్య 40 మంది. బస్‌చార్జీలు చెల్లించిన ఎక్స్‌కర్షన్‌విద్యార్థులందరూ బస్సులో అనుకూలస్థానాలనుపొందికూడా అటూ ఇటూ నెట్టుకుంటున్నారు ఒక్కరుదప్ప. ఆ ఒక్కరిరాక కొరకే డ్రైవరు కండక్టరు మంగళ్‌నాథ్‌లు యెదురుచూస్తున్నారు. అటూఇటూ చిలిపిగా నెట్టుకుంటున్న విద్యార్థుల మనస్సులలోకూడా బస్సు స్టార్టుకానటంకంటె, యక్స్‌కర్షన్ తాపత్రయంకంటె యింకా రావలసిన ఆ ఒకరికొరకు కళ వళం చెందుచున్నది.

అందరిముఖాలు ఒక్కమాటుగా విప్పారినవి. మంగళ్‌నాథ్ ప్రఫుల్లితుడై ఆఖరిమాటుగా హడావుడిలో సామాన్లు లెక్కించుకుంటున్నాడు. వూసుబోక స్వైరవిహారంచేయను

స్వర్గధామంనుంచి దిగివచ్చి క్రీడాలాపంగా పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ సూర్యచంద్రులను చిన్నబుచ్చను ధరణీ మాతనే వాహనంగా యెంచినట్లు వస్తున్నది కృష్ణకుమారి.

ఎవరికివారే తమప్రక్కగా వచ్చి ఆమె కూర్చుంటే బాగుండుననే తృష్ణతో తనప్రక్క ఖాళీచేయను ప్రక్క వారిని నెట్టుతున్నారు. ఆమెకు ప్రత్యేకస్థానాన్ని యేర్పాటు చేయాలని మంగళ్‌నాథ్ ప్రయత్నించాడుగాని, కమలాకర్ అవరోధంవలన జరుగలేదు. ఫ్రంటుసీటులోనున్న కమలాకర్ మాత్రం తనప్రక్క కృష్ణకొరకని సీటు రిజర్వుచేసివుంచాడు. కాని, అతనికిపోటీగా ప్రతిఒక్కరు తమప్రక్క ఖాళీ చూపను కుంచించుకుని విశ్వప్రయత్నాలుచేస్తున్నారు. ఆ ...తల్లి ఏక్షణంలో యెవరిని వుద్ధరిస్తుందో యెవరికి తెలుసు? ఎదుట లేనపుడు ఆమెదర్శనభాగ్యంకొరకుఅందరిహృదయాలు ఆరాటపడుతుంటవి, సమక్షంలోనున్నపుడు ఎవరికివారే తన చెంతకు చేర్చుకోవాలని యత్నం. ఆ స్పర్శానుభూతులలో ...లేవున్నవో పంటలేవున్నవో యెవరికితెలుసు! గులాబీ పుష్పాన్ని గాంచినపుడు ముగ్ధుడవుతాడు మానవుడు. కాని అంతటితో పరిసమాప్తిలేదు. ఆ పుష్పాన్ని అరచేతుల్లోకి అందుకుంటాడు, ఆఘ్రాణిస్తాడు. నేత్రపానము ఆఘ్రాణముతో అస్వస్తమయి నలిపివేస్తాడు. అప్పటికీ అతనిఅనుభూతి పరిపూర్తని ఎవరనగలరు?

నాట్యరంగంమీదికి ప్రవేశించునర్తకివలె సినిమా సెట్టింగ్సులోకిపోవు సినీతారవలె కృష్ణ బస్సులోప్రవేశించి స్వయంవరహారంచేతబట్టి నలుని పరిశోధిస్తున్న దమయంతి

వలె తీక్ష్ణదృక్కులతో నలుప్రక్కలనింపుచున్నది, ఆమానిని చివరప్రక్క సీటునందున్న చత్రపతికి ఆమెచూపులు కంపన కలిగించినవి. అందరిలో చిన్నవాడు వున్నవాడు. సరస్వతి అతనియెడల కృద్ధురాలు. అందు కతనికి చింతలేదు. వ్యాపారాలు వ్యవహారాలు విద్యాధికులుకానివారినే వరిస్తాయని తన తండ్రిద్వారా విన్నాడు. పురుషుని సర్వవిధాలా వంచించేది స్త్రీ, అనే విషయంకూడా తండ్రిద్వారానే తెలుసుకున్నాడు. అందుకే తండ్రివలెనే తానూ విద్యాధిక్యతలేకుండా వ్యాపారాలుచేస్తూ దృఢచిత్తంతో రాణించాలని అతనివాంఛ. తన ప్రక్కనున్న కొద్దిఖాళీలో కృష్ణ కూర్చొనుద్యుక్తురాలౌతున్నట్లు పసిగట్టిన చత్రపతి చివ్వున లేచి "మీరుకూర్చోండి" అంటూ తనప్రక్కనున్న సంచిని మధ్యనున్నఖాళీలో నెట్టి కూర్చున్నాడు. అందరూ విస్మితులయ్యారు. కమలాకర్ నిరాశతో దీనవదనుడయ్యాడు. సుసజ్జిత పూజామంటపం నుంచి మూలవిరాట్విగ్రహాన్ని చేతబట్టి నోటకరుచుకున్న బాలకునిచేతనుంచి అమాంతం లాగినపుడు ఆ బాలకునికి దుఃఖంపొర్లినట్లు కృష్ణముఖం మ్లానతచెందింది. చెదిరిన మనస్సుతో ఒకమాటు బస్సంతా కలయజూచింది. స్త్రీ మనస్సు తనను నిర్లక్ష్యంజేస్తున్నవైపే మొగ్గుతుంటుంది. బస్సుకదిలింది. తూలునుఆపుకోలేక కృష్ణ చత్రపతిప్రక్కనే కూలబడింది. అప్రత్యాశితమైన యీ ఘటన అతనిని విచలితుని జేసింది. తనవిషణ్ణదృష్టినికూడా ఆమెవైపు బరుపజాలక రెండోవైపుతిరిగి మనస్సులో ఏదో ధ్యానిస్తున్నాడు, అది ఆంజనేయదండకమేమో!

బస్సు అతివేగంగాపోతున్నది. కుదింపులో కృష్ణ శిరస్సు చత్రపతిపీపును చిన్నగా మోదింది. అతను వెను దిరిగి చూశాడు. ఆమెవివర్ణముఖం అతని నేదో గిలిగింతలు పెట్టినట్లయింది. తగిలినచోటే తగలటం పరిపాటి. పరధ్యాస లోనున్న కృష్ణ యీదఫా అమాంతం చత్రపతిమీదకు పోయిపడింది. అనాలోచితంగానే అతను ఆమెశిరస్సును పట్టి నెమ్మదిగా లేవనెత్తాడు. అనిర్వచనీయమైన అత్యద్భుత ఆ సోగనేత్రద్వయసోయగాలనుంచి ఏదో ప్రవేశించింది. మన్నుదిన్న కృష్ణకన్నయ్యనోటిని తెరచి 14 లోకాలనుగాంచి విభ్రాంతి చెందిన యశోదవలె చత్రపతి ఆ నేత్రద్వయంలో అర్థంగాని అనుభూతినిపొందగలిగాడు. ఆమె చెక్కిలినంటిన తనఅరచేతిని మరీమరీ పరిశీలించిచూసుకుంటున్నాడు. పారిస్ సుగంధపరిమళాలు చిందిస్తున్నవి. ఆ సువాసనలలో హాయిని గాలిపీ మత్తు ప్రసారితమవుతున్నది. ప్రకృతితలంపుల ముందు కృత్రిమతలంపులు తుత్తునియలవుతవి.

ప్రయాణప్రారంభంలోవున్న అలజడి పోనుపోను శాంతిస్థాయికిచెందుతుంది. ఎవరోమంత్రించినట్లు అందరి మీందా నిద్రామతల్లి జిలిబిలినృత్యంచేస్తున్నది. కమలాకర్ మాత్రం జూదంలో సర్వమూ కోల్పోయినవానివలె, నిషా దిగినవానివలె ఏదో వ్యథలోనున్నట్లు గోచరిస్తున్నది. చత్ర పతిహృదయంలోని విముఖతలన్నీ సుముఖతలుగా తనకు తెలియకుండానే రూపొందినవి. కృష్ణవైపు తిరిగి ఆమెలావ ణ్యాన్ని తననేత్రద్వయంతో ఆరగిస్తున్నాడు. క్షుద్బాధను మానవుడు శాంతింపచేసుకోగలడుగాని శృంగారంలోని

తృష్ణను చల్లార్పను ఆ సృష్టికర్తకుకూడా సాధ్యంగాదేమో! ఆకస్మికంగా సంభవించిన కుదింపుతో కనుమోడ్పులోనున్న కృష్ణశిరస్సు ఛత్రపతివడిలో వాలిపోయింది. గర్భాకలితో పయనిస్తున్నవానియందు క్షీరసాగరం ప్రత్యక్షమయినపుడు తబ్బిబ్బయినట్లు ఛత్రపతి కింకర్తవ్యతావిమూఢుడయ్యాడు. రక్తం పొంగి స్పందిస్తున్నందున నాళాలు తానంచేస్తున్నవి. స్వేదస్రవంతులు బిరబిరలాడుచున్నవి. అతని బిత్తరిదృక్కులు మత్తులో మునిగినవి. ఆమెను లేవదీయనుద్యుక్తానుకరణలో ఆమెచుబుకంమీద వేసిన హస్తం అలానే వుండిపోయింది. నున్నటి మంచుగడ్డమీద నున్నట్లు అతనిఅరచేయి కొంగగా లెత్తి చైతన్యాన్ని కోల్పోతున్నది. ఆమెఊర్ధ్వ చెక్కులల తనప్రతిబింబాన్ని చూచుకుంటున్నాడు. ఆ చెక్కిలిలోని తనప్రతిబింబం చిన్నిపాపాయివలెనున్నది. ఆమెకర్ణజూకాం లోని కెంపురాయి తనను పరిహసిస్తున్నట్లున్నది. పసి... మంచి ఆటవస్తువు లభ్యమైనపుడు నోటచీకనిదే తాపత్రయం తగ్గదు. అదేరీతి ఛత్రపతిమనస్సు పరువులెత్తు... పక్వంచెంది పండినబంగినపల్లి మామిడిపండువలె నునుపులు చెల్ చమకులు గ్రక్కుతున్న ఆమెచెక్కిలిలో ... సంగ్రహం సర్వస్వము దొంతరలుగా దృగ్గోచరమవుతున్నది. ప్రేమపేరణలలో అన్నిపోయి అంధత్వం మిగులుతుంది తన రెండోహస్తం ఆమెవీపుమీద వేసి ఏదోఆలోచించుచుండగా ఆమె నిద్రమేల్కొని బెదరిన లేడివలె విహ్వలురాలయింది.

ఈలోకంలోని సర్వసంపత్తి ఏకమై తనవడిలోకి వచ్చిపడినట్లు, అదిచూచి అంతా యీర్ష్యాద్వేషాలను

పొందది తనునుంచి దొంగిలించ ప్రయత్నిస్తారో లేక తననే నేలుచేస్తారో అనే భయాందోళనలతో బిత్తరిచూపులను రక్షించి అందరినూ చూస్తున్నాడు. కమలాకర్ ముఖమంతా నిప్పులతో చెలరేగుతున్నది. అతని దంతాలు కటకట మంటున్నట్లు తన కర్ణరంధ్రాలు ప్రతిధ్వని వింటున్నవి. అయినా యీ భయాలు ఛత్రపతిమీద అంతగా పనిచేయ టంలేదు. కవుగిటిలో లభ్యమయిన అమూల్యసంపదను కాల దన్నుకోగల వ్యర్థు లెవరుంటారు. అవసరాలు వుపాయాలను సృష్టించుకుంటవి. ఛత్రపతి ఇపుడు అటుయిటు పరికించటం మానిన అర్ధనిమీలితుడై ధ్యాననిమగ్నుడై కృష్ణకుమారి స్పర్శానుభూతిలోని, ముఖమండల లావణ్యంలోని మాధు ర్యాస్వాదనలో హృదయడోలికలో వూగుతున్నాడు. నేత్రాలు తెరచి అర్థంగా అవలోకించిన ఆమె తనద్వారా అతను పొందుతున్న సుఖాన్ని అతనిద్వారా తనకుకలుగు తున్న ఆనందాన్ని చెదరనివ్వలేక నేత్రాలుమూసి అతని ఒడిలోని తనశిరస్సును పాటుకు అమరికంచేసుకున్నది.

మన విహారయాత్రికులు దర్బారుహోటలులో మకాం చేశారు. కుమారికి ఒక ప్రత్యేకగదిని కేటాయించారు. ఎవ రికివారు స్నానాదులలో హడావుడిపడుతున్నారు. హోటలు వారి పన్నెండుపీటెంగు నిలువుటద్దము యెదుట కుర్చీలో కూర్చొని తన వన్నెలోను కవళికలలోను యెంతఘటించిందో పరీక్షించుకుంటున్నది కృష్ణ. ఎవరో కవాటాలుతోసుకుని లోపలప్రవేశించి తిరిగి బయటవైపు చూస్తూ నిలిచారు. కుమారి నిర్ఘాంతపోయి చూస్తూ "ఓహో ఛత్రపతీ నీవా,

ఏమిటి?" అని ప్రసన్నాన్నీ ఆశ్చర్యాన్నీ మిళితంగా ప్రక టించురూపంలో అధరాలనుంచింది. తెలియక పొరపాటు చేసినవానివలె చిన్నబోయినవదనంతో సతమతలాడుతూ "ఏమీలేదు, మీరు ఏమిచేస్తున్నారో చూసిపోదామని వచ్చాను." అన్నాడు. "అదిసరేగాని మన ప్రోగ్రామేమిటో నీకు తెలుసా" అని ప్రశ్నించింది సుకుమారి. అది ఆలోచింప వలసిన అవుసరంగాని ఆచుర్దాగాని ఛత్రపతి కిప్పుడు లేదు. మంగళనాథ్ అడుగుజాడలలో వీరందరిమధ్య యువకత్వాన్ని వ్యాపిరిసలుపకుండా వినోదవిహారమునే పేరుతో ప్రయోగాలనిపిం చటంలేదు. తన మనస్సిప్పుడు ఒకరితో నేకలిసి కట్టుదిట్టాలు, కంటకాలులేకుండా నిజమైన వినోదవిహారాన్ని సలుపాలని పిస్తున్నది. ప్రకృతి విచిత్రమైంది, కఠోరమైనపట్టుదలనే పటాపంచలుచేస్తుంటుంది. దీక్షతో గూడినధ్యానాన్ని విచ్ఛిన్నం చేస్తుంది. కంచికోటలను బ్రద్దలుకొడుతుంది. ఏధర్మం దానికిదూరంగావాలని అహోరాత్రులు జపిస్తారో అదే ముందునిలిచి మనస్సులో ప్రవేశిస్తుంది. దేనికి దూరంగా వుండాలని వ్రతంసలుపుతారో అందులోనేమునగటం సంభ వించినపుడు లోకాన్ని మరచి తాండవనృత్యంసలుపుట సహజం. అయిదుగంటలప్రయాణంలో ఛత్రపతి గగనలోకం నుంచి భూలోకానికి చేసుకున్నాడు.

"నాకూ బాగా తెలియదు.....గండికోట చూడా లని అనుకుంటున్నారు. నా మనస్సక్కడికి పోవాలనిపించ టంలేదు. ముందు గోల్కొండపోయి భక్తరామదాసును బందీచేసిన పుణ్యస్థలాన్ని సందర్శించడం మంచిదనిపిస్తుంది.

అయినా నాకు మంగళనాథ్ పెడుతున్నకట్టుబాట్లు, నిర్ణయిస్తున్న ప్రోగ్రాములు నచ్చటంలేదు." అని ఛత్రపతి అన్నాడు.

కుమారి :- మంగళనాథ్ యెప్పుడూ అంత సీరియస్‌గా వుంటా డెందుకు? మఠంలోని మహంతో మిలిటరీ కమాండరో నట్లె యెప్పుడుచూసినా భీకరరూపంలో వుంటాడు. వుల్లాసంగా కబుర్లు చెప్పుకోనుగాని, నవ్వుకోనుగాని ఆయన నేమంటాడో అని భయంగావుంటుంది. నిజంగా ఆయన వెంట పోవటం జైలరువెంట ఖైదీలువెళ్ళునట్లు వెళ్ళటంగా వుంటున్నది.

ఛత్రపతి :- (వుత్సాహితుడై మందస్మిత వదనారవిందంతో) మీరు చాలా బాగా అన్నారు. నేను అనుకుంటున్న మాటలనే మీ రన్నారు. చాలా సంతోషం. నేను వచ్చినవిషయం మర్చిపోయాను. మీరు ఏమైనా పోగొట్టుకున్నారా?

కుమారి :- (హృదయంమీద చేయివేసి సవరించుకుంటూ) లేదు. ఏమీ పోగొట్టుకోలేదు.

ఛత్రపతి :- (జేబులోనుంచి చెవిపోగును దీసి ఆమెకిస్తూ) ఇది చూడండి మీదేమో?

కుమారి:- అవును, ఇది నాదే. ఎక్కడో రాలిపోయిందనుకున్నాను. నీ తొడలమీద నా శిరస్సున్నపుడు నెమ్మదిగా చీలదిప్పి తీయలేదుగదా (అని కొంటెచూపును విసిరి, తనచేతిలోకి తీసుకున్నది ఆ పోగును.) మెట్లుయెక్కుతున్నవ్యక్తి కూలిపోయి ఒక్కమాటుగాపడిపోయినట్లు వెల

వెలబోతూ అధోముఖంజేసి "కాదండీ, అలాఅయితే ఇన్వ
టానికెందుకొస్తాను" అని సంకోచ బిడియాలతో అన్నాడు. "పరిహాసంగా అన్నమాటలకు చిన్నబుచ్చుకుంటా రెందుకు? కూర్చోండి ఛత్రపతిగారు." అని ఆప్యాయంగా అన్నది కుమారి.

కూర్చోటానికి సంశయిస్తూ "మీరేదో పనిలో వుండి వుంటారు. నేను మళ్ళ యిపుడే వస్తానులెండి" అంటూ వెళ్ళి పోయాడు.

ప్రక్కనున్న కుర్చీలో తన చిరునామా వ్రాసిన కవరు ఒకటి కనిపించి, సంభ్రమాశ్చర్యాలతో తీసి చించిచూసింది. అది ఒక విచిత్రమయిన ప్రేమలేఖ.

"కఠోరమైన తపోనిమగ్నతలో హృదయానికి నిర్మించుకున్న కంచుకోటలను ఒక్కపెట్టున పటాపంచలుచేసి తపస్వులహృదయాలలో సునాయాసంగా ప్రవేశించి వారిని చిత్తుచేసి వారిహృదయఫలకాలమీద జిలిబిలినృత్యాన్ని చూపగల అపర మేనకా!

నీకీ పరాజితపత్రాన్ని వ్రాస్తున్నందుకు క్షమించు. ఈ విహారయాత్రకు యెందుకు వచ్చితినా, నీ సాంపర్క్యాన్ని ఎందుకు పొందితినా అని పరితపిస్తున్నాను. స్త్రీ సాంపర్క్యంలో మనోదౌర్బల్యం యెంతవరకుపోతుందో అర్థంచేసుకున్నాను. నీవు కనిపించినపుడే భయకంపితుడనై యెవరూ యెన్నుకోని చోటుకెళ్ళి కూర్చున్నాను. విధి బలీయమైనట్లు నీవు నా వెంత చేరి కూర్చున్నావు. దురదృష్టమో. అదృష్టమో నీ స్పర్శలు పొంది నా రక్తం మరిగిపోయింది. నిద్రమత్తులో నీవు నా

నదిలో వరిగిపోయావు. నేను కరిగిపోయాను. నా హృదయం చెదిరిపోయింది, రక్తం మారిపోయింది. నీతో మిళితమయినవి. స్త్రీ పురుష నామమాత్ర సన్నిహితాలైనా యెంతలో యెటు మలుపుతిరో చూడు. నేడు నా పరిస్థితి నాకే చీకాకై తికమకగావుంది. నేడు నాహృదయంలో అగ్నిపర్వతాలు బ్రద్దలై పొంగిపొరలుతున్నవి, ప్రచండతుఫానులు వీస్తున్నవి.

నీవు నా నడిలో వరిగిపోయి నిద్రిస్తున్నపుడు నీ చెక్కిలిని యెన్నోమారులు నొక్కాను. నీ కురులమీద లలాటం మీద చేయివేసినిమిరాను. నీచెక్కిలిలో నాప్రతిను గనిపించినపుడు నివ్వెరపాటుతో ఆ ప్రతిబింబంతోనే నేను సంభాషంచాను. ఆ సమయంలో నేను పొందిన అనిర్వచనీయమైన ఆనందం వ్రాయలేను. నీచెక్కిలిని కొరకాలన్నంత వుద్రిక్తుడనయ్యాను. నిన్ను అమాంతం మ్రింగితే నాహృదయశాంతి కలిగేదేమో! నీచేతులను కసిదీర నలిపాను. అంతమంది మధ్య వుండికూడా నేను అంధుడినై ప్రవర్తించాను. నీకివన్నీ యిష్టమై సహించావా లేక నిజమైన నిద్రమత్తులో వున్నావా అనే విషయం నాహృదయాన్నిపుడు నలిపివేస్తున్నది. నాహృదయాని కిపుడు జీవన్మరణసమస్యగా నిలిచావు నీవు. హృదయంలో పొంగే ప్రవాహాన్నిపుడు యెటుపంపాలో యేమిచేయాలో యెలా శాంతింపచేయాలో అర్థమవుట లేదు. పేరు ప్రతిష్టలమీద వ్యాపారాలమీద వుండే వ్యామోహం పూర్తిగాపోయింది. నాకిపుడు వినోదవిహారాల మీద ప్రకృతిసౌందర్యాలమీదగాని, వింతలువిశేషాలవైపు నాకు మనస్సు పోవుటలేదు. నేను యెటుచూసినా నేమి

చేయాలన్నా నీవే గనిపిస్తున్నావు. నేను నిన్నటివరకు స్త్రీ లోకాన్నే నిర్లక్ష్యంగాచూసినవాడిని. నేడు ఒక స్త్రీముందు యేమిచేయటానికైనా వెరపులేకుండా లోకాన్ని లెక్కచేయకుండా తయారయివున్నాను. ప్రకృతిలో యింత విషమపరీక్షను కల్పించి పరిహసించగల సత్తా వున్నదనుకోలేదు. నేడు నీముందు వినమ్రుడనై చేతులుజోడించి నిలచిన యాచకుడను.

నీ నామస్మరణలో సుధిదప్పి మది పొంగి పొరలన్
అదియేమి జ్వాలలో సుధిదప్పి మింట లేపు మంటలన్
తాళజాలక తపోనిష్ఠలో తేలియాడుచుంటి హేకృష్ణా
ప్రమొక్కుచున్నాడ నిష్ఠతో నీ పాదపద్మంబులన్
"ఛ. పతి."

కృష్ణకుమారి ఆ పుత్తరాన్ని ఒకమాటుగాదు రెండు మాటులు చదివి కుర్చీలోకూలబడి ఒక్కొక్కవిషయాన్ని చర్వితచర్వణం చేసుకుంటున్నది. ఆ స్మరణలో అర్థంగాని అనిర్వాచనీయమైన ఆనందం అనుభూతమవుతున్నది. ఆపుత్తరంమీద, అందలివిషయాలమీద, ఆ వ్రాసిన ఛత్రపతిమీద తెలియనిపుత్సాహం వుత్పన్నమవుతున్నది. అప్రను నిజంగానే అతను నిష్ఠనియమం గలవాడు, ఆతనిహృదయం చపుకపాటుదిగాదు, లోతైనది, నిర్ణీతమైంది, కట్టుదిట్టమైంది. సాధారణస్త్రీలయెడ నిర్లక్ష్యమైంది. అతనిమనస్సు క్షణంలో విభిన్నరూపంచెందుటకు తన విశేషతే కారణం అని మనస్సా అనుకుంటూ పొంగిన హృదయంతో తన పాదపద్మాలను టేబులుమీదవేసి కవాటాలవైపు చూసింది అతని రాక

కోరకు కాబోలు. కవాటాలదగ్గర వొకదు కనిపించి, ఆశ్చర్య సంక్షోమాలతో వెళ్ళి తీసుకొచ్చింది. దానిమీద తనపేరే వున్నవి. ఎవరో తలుపులసందుగుండా జారవిడచివుంటారు.

"నవనారీలోక విదుషీమణి కృష్ణకుమారీ,
శతకోటి నమస్కారాలు.

ఈ విహారయాత్రలో నేను పాల్గొన్నందుకు చాలా విచారిస్తున్నాను. బస్సుబయలుదేరినక్షణంనుంచి నామనస్సు నాలో లేదు. ఎంత చీకాకుచెందుతున్నానో వ్రాయలేను. నీ కోరకు నాప్రక్కన సీటు రిజర్వుచేసివుంచాను. అయినా నీవు అది గమనించకుండా నేకుర్చోరానిచోటకూర్చున్నావు. రాజదర్బారులో మహారాజు సింహాసనాన్ని తిలకించకుండా సామంతులకాళ్ళవద్ద కూర్చున్నట్లున్నది నీ వ్యవహారం. పైపెచ్చు స్త్రీవిలువతెలియని, నాగరికసభ్యత తెలియని ఒక నెర్రివానినడిలోపడి నిద్రించావు. ఆవిషయం తలచుకుంటేనే నా శరీరం జలదరిస్తున్నది. నీవు సర్పాలు,వృశ్చికాలమధ్యపడి పోయినట్లు నామనస్సు యెంతో ఆందోళితమైంది. భరింపరానిది భరించట మెలావుంటుందో నేడు అనుభవమైంది. ఛత్రపతిలాంటి అవ్యక్తులకు అంత చనువిచ్చుట మంచిది గాదు. నీయెడల నాకున్నలక్ష్యము, ఆదరము, అభిమానము ప్రేమ నీకు తెలియనివిగాదు. ఈ విహారయాత్రనాయకుడు మంగళనాథ వ్యక్తిత్వంలేనివాడు. అతని అనామకత్వమే నీ వక్కడ కూర్చోవటానికి కారణం. నాప్రక్క ఖాళీవున్న సంగతి తెలిసకూడా నిన్ను క్రిందకూర్చోనిచ్చుట అతని అప్రయోజకత్వాన్ని చాటుచున్నది. అందువలన ఆయనతో

పాటు యీ మతిలేనివారితో గండికోటపోవుట నాకిష్టం లేదు. అందువలన నేను యేదోసాకుతో యిక్కడే వుండి పోయాను. నీవు నీ అనారోగ్య ప్రస్తావన తెచ్చి రానని చెప్పు. మనమిద్దరము సాలార్ జంగ్ మ్యూజియంకు వెళ్ళి సర్దాగా ఆనందంగా చూడవచ్చును.

ఇట్లు,
నీ కమలాకర్"

వుత్తరమంతా చదివాక ఆమె మనస్సు రవంత వ్యాకుల పాటు చెందింది. తిరిగి మొదటివుత్తరాన్ని తీసి చదువుకున్నది. రెంటినీ జత జేసి మడిచి చేతనుంచి కనులుమూసి వూహావిహారంలో పరువులెట్టి విసిగి దీర్ఘ శ్వాసను విడచింది.

బస్సు ప్రయాణసన్నాహంలో వుంది. ఛత్రపతికొరకు యెంత వెదికినా యెవరికీ కనిపించలేదు. కమలాకర్ తాను నిదివరకే గండికోట చూచానని, అందువలన తాను పట్టణంలోనే వుంటానని నిష్కర్షగా చెప్పాడు. ఎవరుఏమయినా కార్య నిర్వహణలో మంగళనాథ్ ఘటికుడు, వ్యవహార దక్షుడు తలంచిన కార్యాన్ని సాధించుటలో యోధుడు. ఆతను ముఖ మండల మెప్పుడుజూసినా లోతైన ఆలోచనలతో నిండివుంటుంది. మంచి స్పోర్ట్సుమన్. కృష్ణానదిని వంటిచేత్తో ఈదిన ధైర్యశాలి. కాళ్ళు రెండూ తాడుతో బంధించుకొని కూడా కృష్ణను అవలీలగా యీదిన ధీశాలి. విజయపురిలోని యువకులనందరిని ఆకర్షించిన విద్యార్థి నాయకుడు. కులద్వేషంతో ఒక నిరపరాధిని దండించిన శిక్షకొరకు ప్రిన్సిపాల్ తో యెదురు తిరిగి పోరాటంసలిపి రెండుసంవత్సరాలు కాలేజీనుంచి

సన్యాసిందుఅయిన వాడు. కట్టుదిట్టమైన యువకుడని ప్రతీతి. గృహస్థుంటూ వున్నదిగాని ఆ యింటితాళాలు తీయగా యెవరూ యెన్నడూ చూడలేదు. ఆయనకు నా అన్నవారెవరూ లేరని అంటారు. ఆయనతండ్రి బౌద్ధమతస్థుడు. భిక్షువు సంఘాలకే తనజీవితాన్ని అంకితంచేసి ఆ సన్యాసులలోనే తిరుగు అలవాటుపడి యెటుపోయాడో యెవరికీ తెలియదు. తల్లి తన అవసానదశలో తనతండ్రినుంచి పొందిన ధనాన్ని మంగళనాథ్ పేర బ్యాంకులోవేసి మరణించిందట. బ్యాంకులోని లక్షరూపాయలలో సగం యిప్పటికే హరించినట్లు ప్రతీతి. మంగళ్ నాథ్ యెప్పుడూ హాస్టలులోనే వుంటుంటాడు. హాస్టలే నా యిల్లు అంటాడు. జీతంకట్టనందువలన యెన్నిసార్లు పేరు కొట్టివేసినా, తిరిగి మంగళ్ నాథ్ డబ్బుతో చేయుట అలవాటుగా పరిణమించింది. మంగళనాథ్ మాతృవాత్సల్యానికేగాదు, స్త్రీవాత్సల్యాన్నే చవియెరుగడు. అందువల్లనే జీవితానికి స్త్రీలు యెంతఅవసరమో ఆతనికింకా తెలియదు. తలచిన కార్యంలో అత్యధిక పట్టుదల వుంటుంది.

అలాంటి మంగళనాథ్ ఛత్రపతి కనిపించనందున కమలాకర్ నిరాకరించినందువలన కార్యక్రమాన్ని మార్చ టెలా జరుగుతుంది? బస్సు రెడీలోవుంది. కృష్ణకుమారి యింకా రాలేదు. మంగళనాథ్ అందరనూ ఆయత్తపరచి కృష్ణకుమారికొరకు తాను స్వయంగా వచ్చాడు.

చెదిరిన శిరోజాలతో స్వేదోచ్ఛాదిత ముఖమండలంతో, భీతిని ప్రకటిస్తున్న మూలుగులతోనున్న కృష్ణకుమారి నేలమీదగనిపించినపుడు మంగళనాథ్ భయకంపితుడై

"కృష్ణకుమారిగారూ, అలా వున్నారేమిటి? గంటసేపటినుంచి బస్సు ప్రయాణంలోవుంది. మీకొరకని వచ్చాను." అని అన్నాడు మంగళనాథ్.

వణకుతున్న కంఠంతో "మంగళనాథ్‌గారూ, నన్ను క్షమించండి. నా శరీరం బాగుండలేదు. కడుపులో బాగ్గా నుండి తెములుతోన్నది. వాంతులొచ్చు సూచనలు గనిపిస్తున్నవి. మీరంతా వెళ్ళిరండి." అని అన్నది.

మంగళనాథ్ విమూఢునివలె ఇదేదో భయంకర సూచనగా భావించి వెనుదిరిగి అంగలుపంగలు వేసుకుంటూ బస్ కడకెళ్ళి, హడావుడిని ఆదుర్దాను ప్రకటిస్తూ "మీరు బస్సును వెళ్ళనీయండి. నేను ఇక్కడే వుండవలసివచ్చింది. కృష్ణకుమారికి చాలా సుస్తీగా వుంది. కలరాచేష్టలుగా కనిపిస్తున్నవి. అయినా భయపడాల్సిన పనిలేదు. అనుకున్న ప్రకారం మీరు వెళ్ళి రెండురోజులు గడిపి రండి. నేను ఇక్కడవుండి కుమారిని చూస్తుంటాను. మీరు నిశ్చింతగా వెళ్ళిరండి." అని చేయివూపి బస్సును సాగచేయించాడు. ఆయనమనస్సులో యెంత భయమున్నా ఆదుర్దావున్నా తాను పెట్టిన కార్యాలు సాగగలిగినంతవరకు సాగించుట ఆయనకు అలవాటు.

కిటికీసందుల్లోగుండా గమనిస్తున్న కృష్ణకు బస్సు పోవుట సంభ్రమాన్ని కలిగించింది. గాని ప్రక్కన అక్కడే నిలిచివున్న మంగళనాథ్‌నుచూసి విస్తుపోతూ విమూఢురాలివలె వెళ్ళి శయ్యమీదపడి అభినయంలో మునిగింది.

మంగళనాథ్ ఆదుర్దాతో సోడాషాపునుంచి నిమ్మ

కాయతీసుకుని కృష్ణగదికి వచ్చాడు. ఆమెకు పోంగించిన నిమ్మరసమిచ్చి పంకావిసురుతూ ప్రక్కనకూర్చుని "భయపడకు కృష్ణా, మనస్సులో రామనామం జపించుకో, నిన్ను జబ్బు ఏమీచేయలేదు." అని ధైర్యాన్ని పురిగొల్పాడు. ఆమె ఆయాసంతో బాధచెందుతున్నట్లు మూలుగులను నటిస్తూ వంగిధ్వనితో "మీరు బస్సులో వెళ్ళలేదెందుకు మంగళ్ నాథ్ గారు?" అని ప్రశ్నించింది.

"మీరు యిలావుంటే నే నెలా వెళతాను? మీకొకవేళ యేదిసంభవించినా దానిబాధ్యత నాది. మీ అందరను సలక్షంగా నిరాపదగా యింటికిచేర్చేవరకు బాధ్యత నాది. మీ అందరకు వినోదాన్నికల్పించి రక్షిస్తుంటేనే నాకు వినోదం గలుగుతుంది. గండికోటవెళ్ళిరావటానికి వారికేభయంలేదు. భగవంతునిదయవలన నీకు నయమైతే అంతే చాలు" అన్నాడు.

ఆయనమాటలు విన్నపుడు తనకుతానే శంకితురాలై నిజంగానే తన కేదో ఆపదసంభవించినట్లు, అందు రక్షణకు ఆయన నడుంగట్టినట్లు భ్రమనొంది యింకా మూలగసాగింది. కాని ఆయన ఆదుర్దాతో విసురుతున్నపుడు తనమనస్సు యెందుకో నొచ్చుకుంటున్నది. "మంగళనాథ్ గారూ, మీరు పెద్దవారు. ఆవిసనకర్ర అవతలపెట్టండి." అని అన్నది.

రోగానికి పెద్ద చిన్న అను విచక్షణ యెలా లేదో రోగులసేవలోకూడా తారతమ్యాలుండవు కృష్ణా. రోగము యెవనికయినా వస్తుంది. అలానే కష్టంలో సేవ జేయటానికి

స్త్రీ పురుష వివక్షతకూడా వుండరాదు" అని మామూలు ధోరణిలో అన్నాడు.

ఆమాట లామె కొకవిధమైన కమనీయతను కల్పించి నవి. నిష్కామ నిర్మల ఆదరాభిమానా లందు వుట్టిపడు తున్నవి. ఆమాటలుకూడా అతిసరళమైనవి. డంబాచారం లేదు, కల్మషం కనిపించదు. ఈ మాటలలోను, ఆదరంలోను నూతనానుభూతిని పొందుతున్నది. కర్మిష్టిగాను, కర్తవ్య నిష్ఠగాను చెప్పేమాటలలోకూడా విశేషమైన ఆకర్షణ వున్నదని నేడు అర్థమవుతున్నది. ఆయనయడల తనకున్న విరుద్ధాభిప్రాయాలు అదృశ్యమైనవి. ఆ స్థానే భక్తిశ్రద్ధ లుత్పన్నమైనవి. తనమన స్సెపు డెందుకో కించపడు తున్నది. ఆమె నేత్రకోలుకులలో అశ్రువులు మెరుస్తున్నవి. ఆమెమనస్సులో దొర్లుతున్న విరుద్ధధ్వనులతో అలపటకలిగి నిస్త్రాణగా కనిపించింది. తను యింతకుముందు కనపర్చిన అస్వస్థత అంతత్వరలో పోయినట్లు కనిపించుట మంచిదిగా దనిపించి, వుదరాన్ని వత్తుకుంటూ కనుబొమలు చిట్లిస్తూ అధరాలను బిగబట్టి "ఇస్, అబ్బా!" అన్నది.

వీవనతో విసురుతూ ఏదో ఆలోచనలోమునిగి అర్థ నిమీలితంలోవున్న మంగళనాథ్ "ఏమిటి కృష్ణా, కడుపులో నులుముతున్నదా? నా దగ్గర సంకోచించాల్సినపనిలేదు. చెప్పు కృష్ణా" అని అడిగాడు. ఆయన అడిగిన ప్రశ్నలోని సరళతలో వశీకరశక్తి వున్నట్లు అనుభవమవుతున్నది. ఆ పిలుపులో మాధుర్యమున్నది.

"అవును" అని అన్నది కృష్ణ.

మంగళనాథ్ బయటకెళ్ళి అయిదునిమిషాలలో ఒక గిన్నె అంగుళినుంచి త్రిప్పుతూ వచ్చి కృష్ణకుప్రక్కగా శయ్యమీద కూర్చున్నాడు. ఆ గిన్నెలో కలుపుతున్నది మంచిసూనె జలమిళితం. "కృష్ణా, నీ కేమీ భయంలేదు. మంటవలన వేడిచేసినబాధతప్ప మరేంగాదు. మొదట కలరాసూచనలేమోనని భయపడే నేను నీ దగ్గిర వుండి పోయాను. కాని ఇపుడు భగవంతునిదయవలన ఆ భయం పోయింది." అంటూ ఆయన తన యెడమహస్తంతో ఆమె ఉదరంమీదున్న చీరెనుతొలగించి కుడిచేత్తో ఆ గిన్నెలోని జలమిళితనూనెను పోసి మృదువుగా మర్దిస్తున్నాడు. ఆయన గేమ్సులో కాలు బెణికినపుడు చేతిమణికట్టుకు దెబ్బ తగిలినపుడు యెంతోమందికి తనహస్తాలతో మర్దిసరిజేసినట్లు మామూలుకార్యక్రమమువలె, తనస్నేహితునికి తనేదో చేస్తున్నట్లు, ఆమె స్త్రీగా తన కసలు భావనేలేనట్లు వున్నది ఆయన ధోరణి.

కృష్ణకుమారి యెంతోమంది విద్యార్థులతో స్నేహం జేసింది. యెన్నో రకాల పరిహాసాలు జరిపింది. యెంత మందిస్పర్శలనో తను యెరుగు. కాని మంగళనాథ్ స్పర్శ లోనూ మాటలోను మంత్రశక్తివున్నట్లు తనను పరవశంచేసే ఆనందాన్ని పొందగలుగుతున్నది. ఆయన తనచీరెను తొల గించి వుదరంమీద మర్దనచేస్తుంటే గిలిగింతలు కలుగు తున్నవి. ఆమె యెంత బిగబట్టినా ఆ గిలిగింతల జోరును ఆప లేక, వస్తున్ననగవును మ్రింగలేక, నరాలను చిక్కబట్టజాలక, గ్యాస్ అధికమై బిరడాను తన్నివేసిన బాటిల్ వలె బిగబట్టిన

నగవును చిందిస్తూ తనహస్తద్వయంతో మంగళనాథుని కుడి హస్తాన్ని గట్టిగాబట్టి, కనిదీరా వత్తుతూ తనముఖంలో ప్రస్ఫుటించే అలూాయిటూ పూపుతున్నది. మంగళనాథుడు వెల వెలబోతూ "ఏమిటి, ఏమయింది!" అని ప్రశ్నించాడు. ఆయనకుడిహస్తం యింకా ఆమెవుదరాన్ని రుద్దుతూనేవుంది.

కాంత నవ్వును తిరిగి బిగబట్టి "చక్కిలిగిలిగా వుం దండి." అని మరింత నవ్వుతున్నది. ఆయన అనభిజ్ఞునివలె "నీ కడుపునొప్పి ఎలావున్నది?" అన్నాడు. తనపాట్లుసియుచు తున్నందువలనకలిగే ఆనందాన్ని కోల్పోజాలక "కొంచెం తగ్గింది కాని, యింకా కొద్దిసేపు అలాచేస్తే పోవచ్చు." అని తనచేతిలోని ఆయన యెడమహస్తాన్ని తన ముఖమండలం మీద వుంచుకొన్నది. అనాలోచితంగా ఆయన తన హస్తాన్ని నెమ్మదిగా లాక్కోజూశాడు. ఫలితంగా ఆమెముఖం మీదనున్న ఆ మూడుహస్తాలు ఆమె వక్షస్థలంమీదవరకు వచ్చి ఆగిపోయినవి. ఆయన అంగుళీయములు ఆ వక్షో జాన్ని గట్టిగా తాకుతున్నవి. ఆ అంగుళీయముల కొనల నుంచి చిన్నగా ఎలక్ట్రిక్ షాకులాంటిశక్తి తగిలి తనహృద యాన్ని చిన్నగా వూపింది. ఇపుడాయనమనస్సు రంజితమై తన రెండుహస్తాలకార్యక్రమాలను పరికించుచుంటున్నాడు. ఆమెవుదరంమీద రుద్దుతున్నచేయి రుద్దుతున్నవైశాల్యాన్ని పెంపుచేసుకుంటున్నది. ఆ మెబ్లౌజుముడిలోపలవరకు వ్రేళ్ళు దూరుతున్నవి. క్రింద బొడ్డువైపు అడ్డమువస్తున్నచీరను సడల తడవకు నెడుతూ తమకాంక్షను ప్రకటించుకుంటున్నవి. ఆ మెత్తటి నున్నటి మృదుస్వైన, కాంతులు వెదజల్లు ఆమె

ఉషారాను తన దృష్టిని ఆకర్షిస్తున్నది. తన కా ఆకర్షణలో వినూత్న మధురానుభూతి కలుగుచున్నది. ఆపలేని నగవును బిగబట్టుకొన్న ఆమెముఖము, తనయెడమచేతి అంగుళీయములను అంటుతూ, అర్థంగాని శక్తివంతమైన కరెంటును పాసుచేస్తూ, శరీరమనే ధరణిమీద జోడుకొండలుగా నిలిచిన ఆమెవక్షోజాలు, తనస్వాధీనతలోనున్న ఆనగ్నఉదరము తన కర్థంగాని మత్తుపానంలోముంచి నృత్యంచేయిస్తున్నవి. తన హాస్టలుజీవితంలో కర్మిష్టిగా యెన్నెన్నో కార్యాలను చూశాడుగాని, హృదయపరవశంలోని పరిపూర్ణతేమిటో యెరుగడు. నేడు ఒక యువతిసేవలో ఆనందడోలికలలో పరవశుడై మదభరితమత్తులో డోలాయమానమవుతున్నాడు. ఆలోచనలలోపరధ్యాసను పొందితనుచేస్తున్న కార్యాన్ని ఆలోచించజాలక ఆమెఉదరంమీదవున్న చేతిని అలానే వుంచి అంగుళీయములతో గుచ్చుతూ తిరిగి మెలివేస్తూ అరచేతినిండా పట్టుకుంటూ యెడమహస్తంవ్రేళ్ళతో సితారును మీటుతున్నట్లు ఆమెవక్షోజాలమీద మీటుతూ పసిపాపల హస్తాలవలె ఆయనహస్తాలు ఆడుకుంటున్నవి.

కృష్ణకుమారి కిది విచిత్రాన్నిగాని వెగటునుగాని కలిగించలేదు. ఆమెశరీరంలోనిరక్తం పరువులెత్తుతున్నది. నరాలు కొంగములెత్తుతున్నవి. కొంగనలుపో యేటంతగా కవుగిలిబిగించి పటపటమనేటంతబలంగా తన్నిపట్టాలనిపిస్తున్నది. నేత్రాలుమూసి వూహావిహారంలో ప్రయాణం సలుపుతూ తనలోతానే నవ్వుకుంటున్నది. ఆమెనవ్వులో అభిజ్ఞుడై తనచేతులను విడిపించుకుని ఆమె శిరస్సును పట్టి

తన హృదయానికి అదిమి పత్తాడు. ఆమె తన బాహువులతో ఆయన నడుమును బంధించి బలంకొలదిబిగించింది. ఆమె నరములు గాబోలు పటపటమన్నవి. మంగళనాథ్ తిరిగి చిన్నగా ఆమెశిరస్సును యథాస్థానంలో వుంచాడు. బెదరిన లేడివలె బిత్తరిచూపులతో రొప్పుతున్నట్లు త్వరత్వరగా శ్వాసను వదులుతున్నది. పరధ్యాసలో పొరపాటు జేసిన అపరాధివలె మంగళ వెలవెలబోతూ "మీ కడుపునొప్పి యెలావుంది?" అని ప్రశ్నించాడు.

"కొంచెం తగ్గింది, పరవాలేదు" అన్నది.

"అయితే నేను వెంటనే బస్సులో గండికోటవెళ్ళి వారిని కలుస్తాను." అన్నాడు.

"నేను ఒక్కదాన్ని యిక్కడ యెలావుండేది?" అన్నది.

మంగళనాథ్ :- పోనీ నిన్నుకూడా టాక్సీలో అక్కడికే తీసుకెళతాను.

కృష్ణ :- వద్దు వద్దు, ఆప్రయత్నంమాత్రంవద్దు. అబ్బ! చూడండి, మళ్ళీకడుపునొప్పి పొత్తుగావస్తున్నది. నేను రానూ లేను, మీరు వెళ్ళటానికీ వీలులేదు.

మంగళ :- ఒకపని చేద్దాం. ఛత్రపతి యిక్కడే యెక్కడో వుండివుంటాడు. కమలాకర్ కూడా వున్నాడు గనుక వారికి నీ భారాన్ని అప్పగించి వెళతాను. నేను లేక పోతే అక్కడ అందరికీ ఏదోఒక కొరతగా కనిపిస్తుంది.

కృష్ణ :— మంగళనాథ్‌గారూ, నన్ను క్షమించండి. మీరు వెళతారనేమాట వింటుంటేనే నా శరీరం కంపిస్తు

న్నది. మీరులేనపుడు యెవరున్నా నిష్ప్రయోజనం. మీ ధైర్యంతోనే మానాన్నగారు యిక్కడికి రాను అనుమతించారు. ఆతరువాత మీ యిష్టం.

మంగళనాథ్ పాలుబోనివిమూఢుడై నొచ్చుకుంటూ అబ్బ! కృష్ణా "సరే నీయిష్టం. పాపం! వాళ్ళంతా నాకోరతతో విచారపడుతుంటారు." అన్నాడు.

కృష్ణ :— వాళ్ళకు బాధలుకలిగినా భరించగలరు. నీవు నిత్యము వారితో నేవుంటూ వారిపరామర్శలే చేస్తుంటావు. స్త్రీలంటే ఆదరంలేదా మంగళనాథ్‌గారూ?

మంగళ:— స్త్రీలపరిచయం నాకు తక్కువ. అంత మాత్రాన నాలో నిరాదరణ అనీ చెప్పలేను.

కృష్ణ:— మళ్ళీ నాకు కడుపులో బాధగావుంది. తిరిగి మొదటివలె నూనె వ్రాయండి.

మంగళ:— ఇపుడు నీ కేమీ పరవాలేదు. యిదిగో యీ గిన్నెతీసుకుని నీవే వ్రాసుకో కృష్ణా. నీవు స్త్రీవి. నీచేత్తో నీవు చేసుకోవటమే మంచిది.

ఆమె, 'అబ్బా!' అని అభినయంచేస్తూ కనులుమూసి బాధను కనపరుస్తూ ఆయనహస్తాలను పట్టుకుని తనవుదరం మీదపెట్టి అదుముకొన్నది.

బసవ్నబయలుదేరివెళ్ళిన 15 నిమిషాలకు కనులాకర్ నెమ్మదిగా లేచి టాయిలెట్ అయి తనకోరకు యెదురుచూస్తుంటుందనే ఆదుర్దాతో కృష్ణగదిదగ్గరకొచ్చి, ఆమె యేమి చేస్తుంటుందో అనే కుతూహలంతో కిటికీసందులగుండా చూశాడు. ఆమె లోపల శయ్యమీదనుండి మంగళనాథ్ సేవల

నంపుకుంటున్నది. రత్నాలహారప్పెట్టెను తెరచినప్పుడు అందు తేజోమూర్తిఅయిన నాగేంద్రుడు ఫణివిప్పి ఆడుతుండుట గమనించినట్లు విచలితుడై క్రోధావేశాలతో వుక్కిరిబిక్కిరి అవుతూ తా నచట వుండజాలక తనగదికివెళ్ళి శయ్యామీద పడి, తను ఎంతయుక్తితో ఆమెను ఆపినా అది ఎలాపరిణమించినందుకు విచారిస్తున్నాడు. ఛత్రపతిమీదున్న క్రోధం కంటె యిప్పుడు మంగళనాథ్ మీద వేయిరెట్లు వెగటు జనించింది. ప్రారంభంనుంచి తనకీ ప్రయాణము దుఃఖభుట్టంగా తయారయింది.

గండికోట ప్రయాణంనుంచి తప్పుకోనటానికి కృష్ణకు బోధించి తాను వుపాయంపన్ని దొంగదారిని బజారుకెళ్ళి అరగంటవరకు మారుమూల హోటలులో కాలంగడిపిన ఛత్రపతివచ్చి బస్సుపోయినజాడ తెలుసుకుని ఆహ్లాదానంద భరితుడై, కృష్ణ గదికిటికీలు తీసివుంటం గమనించి తనయెత్తు పారి ఫలించిందనుకుంటూ, తనరాకకొరకు ఆమె ఎదురుచూస్తుంటుందనుకుంటూ పెద్దఅంగలు వేసుకుంటూ వెళ్ళి దగ్గరగా ఆ కిటికీగుండాచూసి చకితుడై, సత్యహరిశ్చంద్రుడు కన్నును వేసి దోస్తుండగా చూసినవానివలె మంగళనాథ్ ఆమెను యేదో చేస్తున్నట్లూహించి నిశ్చేష్టుడై విమూఢునివలె వెనుదిరిగి నిలిచిపోయాడు.

తాను ప్లానువేసి గండికోట వెళ్ళకుండునట్లు ఆమెకు వుపాయంసూచించి, తాను విహారబృందాన్ని తప్పుకున్నాడు. కృష్ణతోకలిసి హాయిగా సరససల్లాపాలతో గోల్కొండకొండలమీద తిరుగవచ్చునని యెన్నెన్నో ఆలోచనలు సలిపాడు.

తను నిర్మించుకున్న భవనంలోదూరి యెవడో హాయిగా పవ
ళించినట్లు మంగళనాథ్ దురాక్రమణకు వాపోతూ మంగళ
నాథ్ యింత మాయలమారని యెవరికీ తెలియదు. ధర్మావ
తారమని, సశ్శీలుడని పొగడుతుంటారు. అమాయకురాల
యిన కృష్ణను యెలా మోసంజేస్తున్నాడో చూడు. పాపం
పిచ్చిది, నా వుత్తరం చదివి, నా మాట నమ్మి, నాకోరకని
గండికోటపోకుండా మాని వుండిపోయింది. ఈ మంగళనాథ్
యీ వుద్దేశ్యంతోనే విహారయాత్రను సృష్టించాడుగాబోలు!
అని వుద్రేకంపొందుతూ, పూరించుకుని నెమ్మదిగా తమ
కామన్‌గదివైపు వెళ్ళాడు. విచారసాగరంలో మునకలు
వేస్తున్న కమలాకర్ వెల్లకిలా పానుపుమీద పవళించి
పైవేపు తదేకంగా అక్కడ యెగురుతున్న కీటకాలను మ్రిం
గను వలఅల్లుతున్న సాలీడు, ఆ సాలీడును కబళించ పొంచి
వున్న బల్లి, ఆ బల్లిని కోరలుతెంచి క్రింద మూలనుంచి
చూస్తున్న పిల్లిని చూస్తున్నాడు.

ఛత్రపతి:– కమలాకర్, నీ విక్కడున్నా వేమిటి?
వెళ్ళలేదా?

కమలాకర్:– నాకు వంట్లో అంత బాగాలేదు. నేను
అవన్నీచూసినవే. నీవు యెక్కడనుంచి వస్తున్నావు? వెళ్ళలే
దెందుకని?

ఛత్రపతి:– అయిదునిమిషాలలో వద్దామని బయటకు
వెళితే ఒకస్నేహితుడు కనిపించి, యిప్పటివరకు వదలలేదు.
అందువలన పోలేకపోయాను (అంటూ మరోబెడ్డును ఆక్ర
మించి ఆలోచనానిమగ్నుడయినాడు.)

ఇద్దరూ అంతంలేని ఆలోచనలలో సీరియస్ పోజులు పెట్టివున్నారు. ఇద్దరిహృదయాలలోను ఒకేవిషయం దొర్లి దొర్లి పొర్లుతున్నది, కాని ఒకరిది మరొకరికి తెలియదు; యెవరికివారే రహస్యంగావుంచుకుని మ్రగ్గుతున్నారు.

మంగళనాథ్ అమూల్యసేవలను కోల్పోజాలక, అందు గలుగుతున్న ఆనరీదానుభూతిని విడనాడజాలక ఆయాసాన్ని వాంతిసూచనలను ప్రదర్శింపనారంభించింది. పొరపాటులోపడిన మాయతెర తొలగినట్లు వెలవెలబోతున్న మంగళనాథ్ సందిగ్ధంలో సతమతమవుతున్నాడు. ఆదుర్దాలో భయాందోళనలతో కలరాభీతితో పాలుబోక, అనభిజ్ఞునివలె రోగోపశాంతికొరకు యేమేమో చేయగలిగాడు. సన్నిహితుడై చేస్తున్న సేవలో తా నెంతవరకుపోయాడో తనకూ తెలియదు. అమాంతం నీటిలోమునిగినవ్యక్తిని బయటకులాగువాడు స్త్రీపురుషవివక్షతనుగాని, స్త్రీ అయితే మునిచేయిపట్టి బయటకులాగాలనిగాని తలంచడు. ఆదుర్దాను, వీలునుబట్టి అవి జరుగుతుంటవి. రక్షించేవారు రక్షింపబడేవారిలో పరస్పరస్పర్శానుభూతులశక్తి ప్రభావితంగానటం, ఆ మత్తులో అటేఅడుగులిడటం, ఆతరువాత నిగ్రహంగలవ్యక్తి తన అప్రమత్తతకు నొచ్చుకోవడం కద్దు.

మంగళనాథ్ మనోదార్ఢ్యం గలవాడు. పిసిలిన కాలును కుదుబాటుచేసుకోగల సమర్థుడు. అయినా ఆయన మనస్సు అర్థంగాని సందిగ్ధంలోనున్నది. ఆమెజబ్బునుగురించిన భయం పోయింది. కాని ఆమెఅనురోధాన్ని ధిక్కరించి వెళ్ళలేకపోతున్నాడు. ఒంటరిగా యీబాధలోవదలుటకుసుం

జనంగాదని మనస్సులోని ఒక ప్రవృత్తి ప్రలాపిస్తున్నది. స్త్రీ దౌర్బల్యాన్ని కల్పించి పెంచు అమోనియాలాంటిది. దౌర్బల్యంలో నిన్ను నీవే మర్చిపోగలవు. లోలుడవు హీనుడవు కాగలవు. గనుక వెంటనే దూరంగమ్మనిమరో ప్రవృత్తి చైతన్యాన్ని కల్పిస్తున్నది. ఎన్నడూ యేరూపంలోను యెరుగని యీ మెద్వారా కలిగిన ఆనందానుభూతిని కోల్పోవటానికి వేరొక ప్రవృత్తి తటపటాయిస్తున్నది.

“అబ్బ! మంగళనాథ్ గారూ, భరించరాని బాధగా వున్నదండీ. మీరు వెళ్ళాలని ఆలోచిస్తున్నట్లున్నారు; మీరు నన్ను యీ బాధలో వదిలివెళ్ళితే, తిరిగి నా శవాన్ని తీసుకెళ్ళవలసివస్తుంది.” అని అధరాలుబిగబట్టి నేత్రాలుమూసి ఆయనకుడిహస్తాన్ని గట్టిగా పట్టుకున్నది వెల్లకిలా పవళించి వున్న ఆమె ప్రక్కలకు వూగుతున్నది. ఆ మెజాకెట్టుమీదున్న చీర యెప్పుడో తొలగిపోయింది. ప్రెస్ బటన్‌లు అంతకు ముందే వూడిపోయినవి. ఆ జాకెట్టుపట్టీల విశాలసందు గుండా పెద్ద అర్థదబ్బపండువలెనున్న వక్షోజాలు పీతాంబర రంగులో మెరుస్తూ నేత్రాలను జిగేల్‌మనిపిస్తున్నవి. తన దౌర్బల్యం యెక్కడ పూర్ణత్వాన్ని పొందుతుందోననే భయంతో మంగళనాథ్ తనదృష్టిని అటునుంచి ఆమెవుదరం వైపుకే మరలుస్తున్నాడు. అక్కడా అదే నూపురంగులు కన్నులలో మెదులుతున్నవి. తను నూనెమర్దించినందున ఆ వుదరం మరింత మెరుపెక్కి చముకులతో అత్యద్భుత ఆకర్షణ నిచ్చి హృదయాన్ని చలింపజేస్తున్నవి. తనను తాను మరింత కట్టుదిట్టంజేసుకుని తనదృష్టిని క్రిందికి మరల్చి పాదాలను

కాళ్ళను పరిశీలిస్తున్నాడు. చెదరిన చీర అస్తవ్యస్తంగా వుండి ఒకకాలు నగ్నరూపంలో చాలావరకు కనిపిస్తున్నది. అక్కడా అదేరంగు అదే చమకులు అదేఆకర్షణ మత్తును పూర్తిచేస్తున్నవి. ఇంకా కట్టుదిట్టంకాగలిగి తననేత్రాలను నులుముకుని దృష్టి ఆమెహస్తాలవైపు మరల్చాడు. నగ్నంగా వున్న ఆ చేతులు మరింత మృదుత్వాన్ని లావణ్యాన్ని ప్రదర్శిస్తూ, అదేరంగు అదేఆకర్షణను మరింత తీక్షణ రూపంలో కొడుతున్నవి. కెంపురంగులో అతి మృదుసుందరతలోనుండి తగరపు పెయింటులో సింగారించబడిన ఆ నఖములనుండి చిందుతున్న మెరుపులు కనులను భ్రమింపజేస్తున్నవి. సాగరమధ్యంలో మునిగినవాడు యెటుచూసినా సాగరమే కనిపించినపుడు నిరాశ చెంది ఆకాశంవంక ఆఖరివిసారిగా చూసినట్లు మంగళనాథ్ ఆమెముఖమండలం చూశాడు. బాలకృష్ణునినోటిలో పదునాలుగులోకాలను గనిన యశోద విభ్రాంతిజెందినట్లు ఆయన ఆమెముఖాన్ని చూస్తూనే వుండి పోయాడు. అటునుంచి తనదృష్టిని మరల్చనుకూడా అశక్తుడయ్యాడు. ఆ ఆకర్షణలో లీనమయిన తాను ఆలోచనా శక్తినికూడా కోల్పోయి ఆకర్షణాధీనుడయిపోయినాడు.

స్వభావసిద్ధమైన ప్రకృతిబలం అభేద్యమయింది. మానసకృత్రిమకార్యాలను భావాలను అడుగడుగున ఖండిస్తుంటుంది. మానవుడు ప్రకృతిశృంగారం జూసి విస్మితుడౌతుంటాడు. దాన్ని వినాశమొనర్చి తన కృత్రిమసృష్టిని కల్పించి ఆనందించి ప్రగల్భితుడవుతాడు. కాని, వెనుదిరిగినవెంటనే మరుగునపడిన తనసృష్టికి దుఃఖితుడై ప్రకృతిపై కృతజ్ఞుడై

వెర్రిగా నిలచి యేమేమో చేసి విఫలుడై ప్రకృతిఅంతిమ విజయానికి జోహారులర్పించి 'నే ననభిజ్ఞుడ' నని వినమ్రతను ప్రకటించుకుంటాడు. మహాఋషులను ఓడించి గెలిచింది మేనక మొదలగు దేవకన్యలు గాదు. అది కేవలం ప్రకృతి. దూదిపింజలవలె కనిపిస్తూ గాలిలో తేలియాడు ఆకాశము లోని మేఘరాసులు అతి కఠోరమైనవి. సుత్తెలతో మోదినా పులులతో నరికినా అది ద్రవంకాజాలదు. చల్లటి పవన తెమ్మెరలకు కరిగి నీరుగా కారిపోతుంది. సమ్మెపోటులకు సాధ్యంకానిది చల్లని పవనాలకు సులభసాధ్యము. అదే ప్రకృతిరహస్యము.

అఘాతములో మునిగి జ్ఞానాన్ని కోల్పోయినవాని వలెనున్న మంగళనాథ్ పరాజితుడని యెలా అనగలం? మానవునిలో కొన్ని అధీనప్రవృత్తు లుంటవి. అవి తన ఆజ్ఞానవర్తులయివుంటవి. తననిర్ణయాలను కార్యాలను బల పరుస్తుంటవి. మరికొన్ని స్వేచ్ఛాప్రవృత్తు లుంటవి. అవి మనలను పరాధీనంచేయజూస్తుంటవి. ప్రకృతికి అండగా నిలుస్తుంటవి. విప్రవృత్తులకు బలంకలిగినపుడు నాటివైపుకు నడువగలుగుతవి. ఇపుడా స్వేచ్ఛాప్రవృత్తులబలంలో చిక్కి విమోహునివలె వున్నాడు మంగళనాథ్. ఓప్రక్క జాలి, ఆకర్షణలు లాగుతున్నవి, మరోప్రక్క చైతన్యంలోని వివే కం సందలించుతున్నది.

ఏదో ఒక నుడిచిసకాగితం కిటికీలోగుండా 'టప్' మని పడింది. "ఎవరో ఆ కాగితాన్ని విసిరెసట్లున్నారు కృష్ణా!" అన్నాడు నిర్వేరపాటుతో త్రొట్రుపడుతూ మంగళ.

"ఏదో గాలికి వచ్చిపడివుంటుందిలెండి" అని నిర్లక్ష్యంగా అన్నది కృష్ణ.

"బయట గాలి లేనేలేదు. అయినా అంతకాగితం యెగిరి కిటికీలోగుండా రావటం అసంభవం. యెవరో విసిరి వుంటారు" అన్నాడు.

"పోనీ విసిరేవుండవచ్చు, దానినిగురించి అంత ఆలోచనెందుకు?" అని తేలికస్వరంతో అన్నది ఆమె.

"కాదు కాదు. అది వుత్తరమయివుండవచ్చు" అన్నాడు.

"ఇక్కడ మనకు వుత్తరాల అవుసర మేమున్నది చెప్పండి" అన్నది.

"నా చేయి విడువు, చదివిచూస్తాను" అని చేయి లాక్కో ప్రయత్నిస్తున్నాడు "ఆ పాడుకాగితంలో యేముంటుంది చెప్పండి. దాని కంత ఆదుర్దా అనవసరం. వుత్తరాలన్నా పుస్తకాలన్నా నాకు చాలా నిర్లక్ష్యం. మా పిన్నిగారింటికి నేను వెళ్ళినా, ఆమె మా యింటికొచ్చినా, ఆమె నాతోగాని, నేను ఆమెతోగాని అంత ప్రీతిగా మాట్లాడుకోము. ఆమెను చూస్తున్నంతసేపూ నాకు మహా కోపంగా వుంటుంది. యెప్పుడూ ముటముటలాడుతుంటుంది. వుత్తరాలలోమాత్రం ప్రేమను వలకబోస్తూ వ్రాస్తుంటుంది. సామాన్యంగా సమక్షంలో లేని మమకారాలను భావాలను ఆదరాలను అభిమానాలను వుత్తరాలలో ప్రకటించుట అలవాటయిపోయింది. అందుకే నాకు వుత్తరాలమీద అంత శ్రద్ధవుండదు. అలానే పుస్తకాలలోకూడా. పూసుబోని

వారంతా రచయితలుగా తయారయి, అసంభవాలను అసం దర్భాలను యెక్కరించినట్లు చిత్రిస్తుంటారు. వాస్తవికజీవితంలో అనుభవము ఆనందము పొందలేక చేతగాక పుస్తకాలలో చదివి ఆనందించటం ప్రతివారికి పరిపాటి అయిపోయింది. పెద్దపెద్ద రుద్రాక్షమాలలనుధరించి మహాభక్తుల మని ప్రదర్శించుకుంటూ, చిడతభజనలో సిద్ధిజెంది నృత్యం సలిపి సాక్షాత్ భగవంతునితో మాట్లాడుతున్నట్లు నటించి, తమ భక్తిప్రభావాలను చాటుకుంటూ విప్రనారాయణ లాంటి సినిమాలో కూర్చుని విరహగానం వింటూ తన్మయులై మోకాటిమీద తాళం వేసుకుంటూ శిరస్సుఆడించుకుంటూ మహదానందాన్ని పొందుతుంటారు. అలాంటి నటనలన్నా అవాస్తవికాలన్నా నాకు మహా మంట. అందుకే వృత్తాలన్నా పుస్తకాలన్నా నాకు అయిష్టం. ఆ చిన్ని కాగితంమీద అంత ఆదుర్దా యెందుకు మంగళనాథ్‌గారూ?" అన్నది.

ఆకలితో అలమటిస్తున్నవానిముందు వేదాంతనిఘంటువును పఠిస్తుంటే యెలావుంటుందో అదేస్థితిలో వున్నాడు మంగళనాథ్. "నీవు చాలా పొరబడుతున్నావు. అందరూ కోరేది హాయిగా ఆనందంగావుండాలనే. అందరూ దాన్నే వెతుకుతుంటారు. సంభవమయినంతవరకు దాన్ని ఆశ్రయిస్తుంటారు. పుస్తకాలద్వారాను సినిమాలద్వారాను పొందేదికూడా ఆనందమే. దానిద్వారా ఆనందాన్ని అనుభవించేనైపుణ్యం కావాలి. ఏద్వారా ఒకరికి పరమానందం కలుగుతుందో ఆద్వారానే అందరికి అలాంటిఆనందం లభ్య

మవుతుందనటానికి వీలులేదు. ఒకరికి ఆనందాన్ని సమకూర్చగలిగేది మరొకరికి దుఃఖాన్నివ్వటంకూడా సహజమే. వాటినిగురించి తర్కించగల అనుభవం మనయిరువురికీ లేదు. అలా తర్కించుట దుస్సాహసమవుతుందిగాని, అసలువిషయం చెబుతున్నాను. నీకు కలరా సోకుతుందేమోనని నేను భయపడి ఆగిపోయాను. అదృష్టవశాత్తు నీకా ఆపద కలుగలేదు. ఈ కడుపునొప్పినిగురించి నీ వంత ఖంగారుపడకు. నన్ను కాస్త చేయి వదులు. ఆ కాగితమేమిటో చూస్తాను." అని అనునయంగా మెల్లిగా చేయివదిలించుకున్నాడు.

"మంగళనాథ్ మహాశయా,

మీరు మమ్ము అడవులపాలు జేసి, యిక్కడిహాయిగా వున్నారు. మన బస్సు సిటీబయట మైలుదూరంలో ఆగిపోయింది. ఒక పెద్ద యాక్సిడెంటునుంచి మేము బ్రతికిపోయాము. అందరూ మీకొరకు యెదురుచూస్తున్నాము. కనుక మీరు వెనువెంటనే చిన్నకారులోగాని మామూలు బస్సులోగాని గండికోట చేరగోరుతున్నాము. అందరమూ మీకై నిరీక్షిస్తుంటాము.

ఇట్లు,
విహారయాత్రిక బృందం."

వుత్తరాన్ని పెద్దగానే చదివాడు మంగళనాథ్. గొప్ప అవమానంపొందినవానివలె అతనిముఖం మ్లానమై వెలవెలబోతున్నది. "నేను చాలా పొరపాటుచేశాను. వాళ్ళవిషయమే మర్చిపోయికూర్చున్నాను. పాపం! యెన్ని బాధలుపడుతున్నారో!" అని వుత్తరాన్నిచూస్తూ అన్నాడు.

"వారు పసివారుగాదు. మీ రంత భీతిజెందుతారెం దుకు? బస్సు యిక్కడే ఆగిపోయిందని, యాక్సిడెంటునుంచి తప్పించుకున్నామని మొదటివాక్యంలో వ్రాశారు. ఆతను వాతవాక్యంలో మిమ్ము గండికోటరమ్మంటూ వ్రాశారు. ఇది శుద్ధ తప్పుడువుత్తరమని ఆ విరుద్ధధ్వనులే తెలుపుతున్నవి. ఆ వుత్తరాన్ని చించి అవతలపారవేయండి మంగళ నాథ్‌గారూ" అన్నది కృష్ణ.

కొంచెం చీకాకుతో "నిజంవ్రాసేటప్పుడే పొరపాట్లుంటవి. సత్యాము దాన్నదే ఋజువుచేసుకోగలుగుతుంది. అసత్యము యుక్తిని ఆశ్రయిస్తుంది. అసత్యాన్ని సత్యంగా చలామణిచేయటానికి అపారమైన యుక్తి చాకచక్యము కావాలి. అసత్యాన్ని శంకించను వీలులేనంతగా తర్కించుకునే నిలుస్తుంది. అసలైన సత్యము అనాలోచితంగాకూడా నిలునవచ్చు. అందువలన వుత్తరంలోని విరుద్ధభావవాక్యం వలన మొత్తాన్ని శంకించరాదు. అస లలాంటిది నిజమా వట్టిదా అనే ప్రశ్నే వుదయించగూడదు. నీ మనస్సు కలా మెందుకు అనిపించుతున్నదో. ఏదియేమయినా. నేను వెళ్ళక తప్పదు. నీకు అవుసరమైన సేవచేస్తుండమని కమలాకర్ కు ఛత్రపతికి చెప్పి వెళతాను" అని నిర్దిష్టమైనధ్వనితో అన్నాడు.

"మంగళనాథ్‌గారూ', మీ పాదాలుపట్టుకుంటాను. వారికిమాత్రం నా మంచి చెబ్బరల నప్పగించకండి. వారిలో యెవరికయినా చెప్పి యిటు పంపితేమాత్రం ఆతరువాత మీరు చాలా పశ్చాత్తాపపడుతారు. వారిసహాయాలుగాని

సేవలుగాని నా కవుసరంలేదు. వారిలో యెవరయినా యిటు అడుగుపెడితే, నేను ఆత్మహత్యచేసుకుంటాను. కనుక మీరు విధిగా వెళ్ళదలంచితే, నా ప్రారబ్ధానికి నన్నువిడచి మీరు వెళ్ళిపోండి." అని నిష్ఠూరంగా వ్యక్తపరచి, రెండో వైపుకు తిరిగి పడుకున్నది.

మంగళనాథ్ మనస్సులోనిసంగు వదిలిపోయింది. తనకర్తవ్యం నిర్ణయించుకున్నాడు. ఇక యెనగూ ఆవశ్యకం గాదు. ఆమెను పరికించకుండానే నెమ్మదిగా తలుపులు తెర చుకుని బయటకొచ్చాడు. కమలాకర్‌ను చూడాలని, గదికి చేరాడు. ఛత్రపతి లేచి యెదురుగావచ్చి "మీరిక్కడున్నా రేమిటి మంగళనాథ్‌గారూ?" అని ప్రశ్నించాడు.

"నేను కృష్ణకు వంట్లోసరిగాలేనందున ఆమెకోరకు వుండిపోయాను. నీవు బస్సుపోవునప్పుడు కనిపించకుండా యెక్కడికి వెళ్ళావు?"

"బ్లేడు తెచ్చుకుందామని బయట కెళ్ళాను. ఒక మిత్రుడు కనిపించి, కబుర్లతో ప్రాణంతీశాడు. తీరా వచ్చే సరికి బస్సు వెళ్ళిపోయింది" అని జంకుతున్నకంఠంతో అన్నాడు.

"సరే, కమలాకర్ నిద్రపోతున్నాడా?"

"అవును నిద్రపోతున్నాడు."

"అయితే, నీ వొకపనిచేయి; నేను లైనుబస్సులో గండికోట వెళ్ళబోతున్నాను; నీవు కృష్ణకుమారిని కనిపెట్టి చూస్తుండు. ఆమెఆరోగ్యం బాగానేవుంది. నీవు లోపలికి పోవలసినపనిలేదు. బయటనుంచే ఒకకంట కనిపెడుతూ

వుంటాడు. కమలాకర్‌కుకూడా యీవిషయం చెప్పు. యిద్దరూ కలిసి బయటనుంచి ఆమె విషయాలు తెలుసుకుంటూవుం డండి" అని మందహాసాలొలుకుమాటలతో చెప్పి పీపుసవ రించి వెళ్ళిపోయాడు. మంగళనాథ్.

ఒక పెద్ద శ్వాసవిడచి, మహావిపత్తునుంచిబయటపడిన వాడివలె విప్పారినముఖంతో "ఇప్పటికైనా శనివదిలిపోతు న్నావు పో. మంగళనాథ్! నీవు యెంత తెలివిగలవాడివి! పోతూకూడా నన్ను బయట కాపలావుంచిపోవాలనే నీ కోరిక. కృష్ణ పిచ్చిదిగనుక నిన్ను యింతసేపు అక్కడ వుండనిచ్చింది. ఆమె ఆఖరుకు విసిగి నెట్టినా నీవు కదిలి వుండవు. వుత్తరంతో బయటపడివుంటావు. నన్ను పంపు మని కృష్ణ కోరివుంటుంది. అందుకు ప్రతిగా నన్ను బయట రక్షకునిగా నియమించి పోదలచావు. ధన్యుడవు నీవు. ఇప్ప టికైనా విరగడ అవుతున్నావు." అని గర్వాన్ని ప్రదర్శించే పోజుతో ప్రసన్నంగా గదిలో ప్రవేశించాడు.

కృష్ణ రెండోవైపు ముఖంపెట్టి పడుకునివున్నది. అందువలన వచ్చినదెవరోకూడా తెలియదు. బయటముఖం చూడగానే ధైర్యంసడలీ నిర్ణయం తారుమారై తిరిగి లోపల ప్రవేశించివుంటాడని ఆమెవూహా. తనను క్షణమైనా అల క్ష్యంచేసినందుకు కొంత గంభీరత ప్రకటించాలని నిర్ణ యించుకున్నది. తనముఖాన్ని దిండుకు చాటుచేసుకుని కనులుమూసి మునగదీసుకుని పడుకున్నది. నిద్రలోవున్నట్లు నటించాలని ఆమెతలంపు. అందువలన కాళ్ళవైపు చెదిరి వున్నచీరను సరిజేసుకొన వీలుకలుగలేదు.

పోగొట్టుకున్నవజ్రాలహారం పోలీసువారిద్వారా సంప్రాప్తమైనపుడు పొందినఆనందంలో దాన్ని మింగుతాని వలె చూస్తున్నట్లు కృష్ణను చూస్తున్నాడు ఛత్రపతి. తనకూ ఆమెకూ మధ్య మంగళనాథ్‌కల్పించిన యెడబాటు బాధ వలన పొందిన దుఃఖంతో ఆమె క్రుంగుతూ, చూడగల స్థితిలోగూడా లేదని ఆతనిబాధ.

ఛత్రపతి నెమ్మదిగా తలుపులోపలిగడియవేసి ఆమె ప్రక్కగా ఆని శయ్యమీద కూర్చుండి, వీపుమీద, శిరస్సు మీద తనహస్తంవేసి నిమురుతున్నాడు. ఆమెమెడమీంద కనిపిస్తున్న పుట్టుమచ్చను గోటితో గీకుతున్నాడు. చక్కిలి గింతకలిగి గాబోలు, ఆమె నేత్రాలు తెరువకుండా ఆతని హస్తాన్ని పట్టుకుని నలుపుతూ వ్రేళ్ళసందున వ్రేళ్ళుదూర్చి అటూఇటూ మెలివేస్తున్నది. మధ్య కెంపు, యిరువైపులా వైఢూర్యాలు మెరుస్తున్న ఆమెవ్రేలివుంగరం నొక్కుకొని చాలా బాధకలిగిస్తున్నది. ఆ బాధలో భరింపరాని కఠోరత లేదు. ఆనందం వుత్పన్నమవుతున్నది. ఆ కోమలమైన అంగుళీయములమధ్య తనవ్రేళ్ళు వెక్కిరించినట్లు కనిపిస్తున్నవి.

తనను ముందే చూసి, అలా కనులుమూసి నటిస్తున్నదని, తన ఆలస్యంవల్లనే మంగళనాథ్ పీడ ఆమెకంటుపడి నందుకు క్రుద్ధురాలై అలకనటిస్తున్నదని, మంగళనాథ్ అనవసరమైనప్రశ్నలెన్నో అడిగి చాలా విసిగించివుంటాడు.;ఆఖరకు ఘోరంగా తిట్టి పంపివుంటుంది; ఆ చీకాకులోని బాధ యింకా వుండివుంటుంది. అందుకే ఆమె అంతగా మునగ

దీసుకునివుందనీ, ఆపత్తులో ఆత్మీయులు కంటబడినపుడు దుఃఖంపొర్లుతుంది, ఇపుడు నన్నుచూస్తే ఆమె దుఃఖం ఆగదు. అందుకే కనులుమూసి బిగబట్టివుంది, అని ఛత్రపతి తనలోతానే అనుకుంటున్నాడు.

ఆమె మాట పలుకు లేక కనులుమూసే ఛత్రపతి హస్తాన్ని నలుపుతూ తనముఖంమీదికి తీసుకెళ్ళి చెక్కిలి మీదపెట్టి అదుముకుంటున్నది. మంచుగడ్డమీద చేతిని వేసి అదిమితే కొంగర్లెత్తి నరాలనులాగినట్లు, కరెంటుతీగమీద చేయివేస్తే ఒక్కమాటుగా నరాలన్నిటిని ఝుళిపించి లాగి కుదించినట్లు ఛత్రపతిహస్తంతోపాటు శరీరమూ కంపిస్తున్నది. హస్తము తనవశంలోలేదు. చైతన్యంకోల్పోయిన వానివలె ఆమెవుదరంప్రక్కపాటుమీద తనముఖమండలాన్ని వాల్చివేశాడు. వుండివుండి మంచినూనెవాసనలుగొడుతున్నవి. అతనిఫాలభాగం ఆమెవుదరపొత్తిమీద అంటివున్నది. మంగళనాథ్ ద్వారా సేవించిన నిమ్మరసంవలన గాబోలు ఆమెవుదరంలోని ప్రేగులు అరుస్తున్నవి. ఆ ధ్వనులు, ఆమెవుదరంనుంచితనలలాటంపొందుతున్న క్షణిక వుష్ణము,క్షణిక శీతలముగిలిగింతలను గల్పిస్తున్నవి. తనరెండో హస్తాన్ని తనశిరస్సుకుప్రక్కగా ఆమెవుదరంమీద వేసి నిమురుతున్నాడు. ఆచేతికి తగులుతున్న మృదుత్వము జిహ్వకవ్వించినట్లయి వుదరాన్నిచేతినిండా పట్టి అటూఇటూ వూపుతున్నాడు. మత్తులోమునిగినవానివలె ఆమెవుదరపొత్తిభాగంలో అందినంత నోటకరచి పసిబాలకునివలె చప్పరిస్తున్నాడు. తన

నరాలలోని వుద్వేగం భరింపజాలక గాబోలు దంతాలతో కొంచెం బలంగా కొరికాడు.

లోలోన 'కలియుగకర్మిష్టిమూర్తి' అనుకొంటున్న ఆమె "అబ్బ!" అని ఆయనచేతిని విడచి, ఆయనకురులను పట్టి మృదువుగా లేవనెత్తి తనవైపుకు అతనిశిరస్సు త్రిప్పింది. కనకమనిభావించి దాచి కలలుగంటూ చూచినప్పుడది కంచుగా తెలిసినట్లు ఆమె విభ్రాంతురాలై వెర్రిదానివలె చూస్తున్నది. ఆమెముఖంలో రక్తం గడ్డకట్టుకుపోయింది.

ఆ చూపులోని విభ్రాంతిలోని అంతరార్థమేమిటో అర్థంగాక కుతూహలాన్ని పూరించుకుని "మంగళనాథ్ వెళ్ళి పోయినాడు కృష్ణా. ఇక భయంలేదు. ఆ మాయలమారి యిక రాడు. రెండు ఝాడించి, గదిబయటకు పంపకపోయావా? బయట పెద్దపెద్ద నీతులు బోధిస్తూంటాడు, సర్వులువాని ధర్మావతారమని పేరు. ఎవరూచూడకుండా ఒక అమాయకు రాలిగదిలో ప్రవేశించి బాధించటం ఎంతశోచనీయం! నేను నేనుగా వచ్చి గదిబయటకుపోయి మాట్లాడుకుందా మనుకున్నాను. ఇలాంటివారిని నమ్మగూడదు కృష్ణా! ప్రాణాలను అరచేతిలో అర్పించగలవారినే నమ్మాలి. స్నేహము, అనురాగము, ప్రేమల విలువ తెలియనివారికి చనువివ్వగూడదు; ఆయన నీప్రక్కన కూర్చున్నట్లుగా చూసినపుడు నా శరీరం భగ్గునమండిపోయింది. [illegible] అన్యోన్యత తెలియక, మనప్రేమ అర్థంగాక, పాపం, నన్ను నీగదిలో అడుగుపెట్టకుండా నిన్ను సురక్షితంగా చూస్తుంటా మన్నాడు. అపుడే బయటపెట్టి నాలుగూ అడుగుదామను

కుని, పెద్దవాడని పస్తాయించాను. నిన్ను నాపాలిటిదేవతగా భావించి, నీతోనే వివాహంచేసుకో నిశ్చయించుకున్నాను కృష్ణా! నాహృదయం అతి నిర్మలము నిశ్చలము అయినది. స్త్రీలను నిర్లక్ష్యంగాను హేయంగాను చూసినవాడిని. మన యిరువురకు పూర్వజన్మసాంపర్క్యమేదో వుండివుంటుంది. కానిపక్షంలో నీముందు నా హృదయ మంతగా జారిపోదు. నీముందు నా మనస్సులోనిమాటలను ప్రమాణంచేసి చెబుతున్నాను. ఈజన్మేగాదు, జన్మజన్మాలకు నీవు నన్ను విడువకుండావుండాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను. నదోపనదులుకలిసియేకరూపంతోసాగినట్లు నేనే నీవు, నీవే నేనుగా కలకాలం యేకరూపంగా ప్రవహించాలని నా హృదయ పూర్వకవాంఛ. నీవూ నాకంటె యెక్కువగా వాంఛిస్తున్నావని నాకు తెలుసు. మనమధ్య దుష్టగ్రహంగా తయారయిన మంగళనాథ్ తిరిగి రావచ్చు. అతనిబారినుంచి తప్పుకుని యీ రెండురోజులయినా హాయిగా గోల్కొండ కొండలవైపు నిజమైన వినోదవిహారంచేయవచ్చు. నేను వెంటనే టాక్సీ తీసుకొస్తాను. నీవు మేకప్అయి అంతా సర్దుకో" అని జవాబుకు యెదురుచూడకుండా క్రొత్తగా ప్రవేశించిన డ్రామాలోని పాత్రధారివలె, కంఠస్తంచేసిన వాక్యాలు వల్లించినట్లు, ఆదుర్దా ఆవేశాలలో మనస్సులోనిమాటలు వెల్లడించి కర్తవ్యోన్ముఖుడై టాక్సీస్టాండువైపు నడిచాడు.

గాఢనిద్రలోనున్న కమలాకర్‌కు జిహ్వ పీక్కుపోయే అంత దప్పికయింది. నీరుగా కనిపించినచోటికల్లా పోపిక

కొద్దీ పరువులెత్తాడు కాని, నిష్ప్రయోజనమైంది. తనదంతా యెండమావులలోని భ్రమ. యెటుజూచినా యెడారిగా గనిపించి నిరాశ నిస్పృహలతో కూలబడి కనులుమూశాడు. సమక్షంలో కలువ తామరపుష్పాలతో విరాజిల్లుతూ నిర్మలజలంతో శోభిస్తున్న విశాలకొలను కనిపించింది. ఆ కొలనులో రెండోప్రక్క దూరంగా హంసలు స్వేచ్ఛగా విహరిస్తున్నవి. భ్రమరములదండు పుష్పాలమీద షికారవిహారం చేస్తూ మధురమయగానాన్ని స్తోత్రంచేస్తున్నవి. తనకు సన్నిహితముగావున్న సోపానాలమీద తనుదుస్తులను విడచి సుందరాంగులెవరో జలక్రీడలుసలుపుతూ సరససల్లాపాలాడుకుంటున్నారు. ఆ కన్యలు యీ సామాన్యలోకానికి సంబంధించినవారుగామాత్రం కనిపించుటలేదు. దప్పికతో పీక్కుపోతున్న జిహ్వ కొలనువైపు లాగుతున్నది; దేవకన్యలభీతి వెనక్కుతరుముతున్నది. ఆ దేవకన్యలలో మేటిగా గనిపిస్తున్నది రాజకన్య గాబోలు. ఆమె గమనించి నేరుగా చేతితో నీటివైపు ఆహ్వానిస్తున్నది. పారిస్ కళాకారులు నగ్నరూపంలో చిత్రించిన స్ఫటికపుప్రతిమలవలె వారిశరీర, సౌష్టవాలు అద్దముగుండా కనిపించునట్లు నీటిలోకనిపిస్తున్నవి. ఆ రాజకుమార్తె కనులార్పనిచూపులతో తనను లాలిస్తూ మరింతగా ఆ నీటిలోనుంచే ఆహ్వానిస్తున్నందున ధైర్యాన్ని పూరించుకుని సోపానాలమీద ఒక్కటొక్కటిగా అడుగులు వేస్తున్నాడు. ఆఖరిసోపానంమీద అడుగిడినదే తడవుగా బుస్‌మంటూ నాగసర్పం కాటువేసింది. తాను చైతన్యహీనుడై మొదలుతెగినమ్రానువలె పడిపోయాడు. శిరస్సుకు

పెగ్గ దెబ్బతగిలి "అబ్బా!" అంటూ త్రుళ్ళిపడి లేచాడు. అక్కడ సరోవరమూ లేదు, దెబ్బాలేదు; ఆ దేవకన్యలు అసలే లేరు. అది కేవలం కలమాత్రమే. ఆదుర్దాతో కృష్ణ గదివైపుకొచ్చి కిటికీసందుగుండా పరికిస్తున్నాడు. ఆమె యేకాంతంగా శయ్యమీద అటూయిటూ దొర్లుతున్నది. గాఢనిద్రనుంచి మేల్కొన్నదానివలె బడిలికనుపోగొట్టుకుం టున్నది.

మంగళనాథ్‌కొరకు అటూయిటూ వెతికి, తిరిగి గదిలోపలివైపుచూసి నిశ్చింతుడై "అబ్బ! ఇప్పటికి ఆ గోము ఖవ్యాఘ్రుంబాధనుండి కృష్ణ విముక్తిపొందింది. అందరను గండికోట పంపి, తన నాటక మిక్కడ సాగించాలని ప్రయ త్నించి విఫలుడయ్యాడు. అందుకే నన్నుకూడా వెళ్ళమని బలవంతపెట్టాడు. అయినా నేను వేసుకున్నప్లానును విఘ్నం చేశాడు. కృష్ణ బాగా చివాట్లుపెట్టి తలవంపులుచేసి పంపి వుంటుంది. పాపం; గండికోట ఎక్కడున్నదా అని దారి బట్టివుంటాడు. విఘ్నానికి విఫలంతప్పదు." అనుకుంటూ గదిలో ప్రవేశించాడు.

ఆమెముఖం మరింత మ్లానతచెంది వెలవెలబో తున్నది. "అలా భయపడతావెందుకు కృష్ణా! ఇక నీకు యేభయమూలేదు. అవసరమైతే యిక నేను బయటపడి నిర్భీతిగా యెదుర్కోదలచాను. నిన్నుగురించి నా మనస్సు లోవున్న అభిప్రాయాన్ని వారికి చెప్పాలనుకొంటున్నాను. మనయిరువురకూ యింకా వివాహంకానంతమాత్రాన వేరు కాజాలము. మంగళనాథ్ కీ తభా బాగా బుద్ధిచెప్పాలను

కుంటున్నాను." అంటూ వెళ్ళి ఆమెప్రక్కన కూర్చుని, శిరస్సునిమురుతున్నాడు. అనాలోచితంగా తనహస్తాన్ని అడ్డుపెడుతున్నది. కాని అత నత్యధిక అభ్యాసితతో ఆ హస్తాన్ని ఆవలకునెట్టి, ఆమెకురులలో తన ప్రేళ్ళుదూర్చి దువ్వుతున్నాడు. ఆమె తన అసమ్మతిని తెలియజేస్తున్నట్లు విసుకుగా శిరస్సును రెండోవైపుకు త్రిప్పింది. అధరాలు బిగబట్టిన ఆమెముఖంలో కోపం ప్రకటితమవున్నది. తాను నేరుగావచ్చి మంగళనాథ్‌ను తరుమజాలనందుకు కలిగిన క్రోధమని వూహించి, లాలింపుగా ఆమెబుగ్గలను గడ్డాన్ని పుణుకుతూ యేదో చెప్పబోయాడు. విసురుగా ఆమె తన చేతులను యివతలకు నెట్టింది. అలక టాప్‌గేర్‌లోనున్నదని, ఎలా వినతిచేసుకోవాలో తెలియక ఆమెపాదాలమీద తన ముఖాన్నివుంచి తనహస్తాలతో ఆ అరిపాదాలనునిమురుతూ సవరిస్తున్నాడు. మానవునికి కావలసిన హాయినిగొలిపే స్విచ్ అరిపాదాలలోగూడా వున్నది. ఆమె పట్టరాని చక్కలిగింతలలో "అబ్బ! వుండు కమలాకర్" అని నవ్వును బిగబట్టింది. ఇనుమడించిన ధైర్యంతో అతను అరిపాదాలను ముద్దిడుకుంటూ, ముఖానికి అదుముకుంటున్నాడు. ఆమె వివశురాలయి కిలకిల నవ్వింది. అప్పటికి తనమనస్సు కుదట పడి, ఆమెపాదాలమీదనుంచి లేచి కూర్చుని, ప్రశాంతత పొందిన మనస్సుతో చిన్నగా తనమనస్సులోని వూహాలను యేకరువుపెడుతున్నాడు.

టాక్సీతీసుకొచ్చిన ఛత్రపతిని గదిలోనుంచివస్తున్న మాటలసవ్వడి శంకింపజేసింది. కిటికీవైపువెళ్ళి గమనించాడు.

కమలాకర్ కృష్ణశయ్యమీద స్థిమితంగా గూర్చుని ఏదో చెబుతున్నాడు. కృష్ణ మౌనంగావుంది. ఆమె యేమి చేస్తుంది పాపం! అబల, ఎంతో కష్టంతో మూర్ఖునిబారి నుండి బయటపడితే, మహామూర్ఖుడు మరొకడు తటస్థించినట్లయింది. వీరంతా చేరి, ఆమెను మహా బాధిస్తున్నారు. నేను కాస్త ఆలస్యంచేసినందుకు ఆమె యెంతో శిక్షను అనుభవించవలసివస్తున్నది. నన్ను ఆమె యెంతగానో ప్రేమిస్తున్న ఫలితంగా నా తెలివితక్కువతనానికి నేను యీ దుష్టుల కిస్తున్న అవకాశాలవలన ఆమె అష్టకష్టాలు పడవలసి వస్తున్నది." అని మనసా నొచ్చుకుంటూ' నొసటిమీద చేయివేసి అదుముకుంటూ కామన్ గదిలోకి వెళ్ళి శయ్యమీద బోర్లపడి మనస్సుకుయెక్కుతున్న వేడిని వుపశమింప చేయుప్రయత్నంలో కనుమోడ్చాడు.

గండికోటనుంచి తిరిగివచ్చిన బస్సు ఆగింది. అంతా హడావుడిగా సామాన్లు దించుకుంటున్నారు. మంగళనాథ్ బస్సు ఆగీ ఆగక ముందే దిగి, కృష్ణకుమారిగదికి వెళ్ళబోయాడు. హోటలుమానేజరు ఒకవుత్తరాన్ని ఆయన చేతిలో వుంచాడు.

"మంగళనాథ్ మహాశయా,

నా ఆరోగ్యం బాగుండనందున మీరు రాకముందే యింటికి పోవలసివచ్చినందుకు యెంతో దుఃఖిస్తున్నాను. నిష్కపటులు నిస్వార్థులు మంగళమయులు అయిన మీ ఆదరం నేను యెన్నడూ మరువలేను. నిజంగా మీలో గొప్ప మాంత్రికశక్తివుంది. మీలోని భోళత్వం విశిష్ట

మయింది. మీస్నేహాన్ని పొందినవారుగాని, మీ ఆదరాన్ని చవిజూచినవారుగాని జన్మలో మిమ్మ మరువజాలరు. నా జీవితానికి వెలుగులాంటివారు మీరు. యాత్రలోనుంచి మీరు చెప్పకుండా మీ అనుజ్ఞపొందకుండా యింటికి పోతున్నందుకు క్షమించండి, సెలవు.

కె. కుమారి."

పుత్తరంచదివి తన్మయుడయ్యాడు మంగళనాథ్. "నీవు అమాయకురాలవు కృష్ణా! నీకు దీర్ఘాయువునిచ్చి సర్వసుఖసౌఖ్యాలను కల్పించమని భగవంతుని ప్రార్థిస్తున్నాను." అని మనస్సులో దీవించి, తిరిగి తన కార్యాలలో నిమగ్నుడై పోయాడు.

## 10 మే రీ జా న్

బద్రీనారాయణకు తన ప్రథమపుత్రుడు రత్నాకర్ యెడల ప్రత్యేక శ్రద్ధ ఆశవున్నవి. ఆయనదృష్టి అంతా అనాలోచితంగా అటే మొగ్గుతుంటుంది. రత్నాకర్ జాతకచక్రంలో బ్రహ్మాండమయిన రాజయోగముందని, అతను జీవితంలో అత్యుత్తమస్థానాలను పొంది, పరిపాలనాదక్షుడుగా యశస్సుపొంది దేశమంతటా మన్ననలనందుతాడని, అనేకమందిజ్యోతిర్విద్వాంసులు నుడివారు. ఆయనరూపు రేఖలలో కూడా రాజసం మూర్తీభవించివున్నట్లు బద్రీనారాయణకు గోచరిస్తుండేది. తన ఆస్తికంటె యితరవ్యాపారాలకంటె తన జ్యేష్ఠపుత్రుని కృతార్థునిచేయగలిగితే, అతనితేజస్సుతోనే

అతని ప్రభావాలతోనే మిగిలినవారు కృతార్థులుకాగలరు, తనకుటుంబం విశిష్టస్థానాన్నధిష్ఠించగలదని ఆయన దృఢాభిప్రాయం.

అత్యధిక గారాబంతోనే పిల్లలు చెడతారని, తప్పటడుగులువేస్తారని యెక్కువమంది తండ్రులకు తెలియదు. ఏది మితిమించి కోరతామో, దేనికొరకు పగటికలలు కంటామో అవి అతీతాలుగా, అందరానివిగా తయారవుత వన్నది తథ్యము.

రత్నాకర్ బాల్యదశలో అతిచురుకుగా, చదువులో మెలకువగా అందరనూ ఆకర్షించాడు. కాని కాలేజీలోచేరాక అతను ప్యాసయినసంవత్సరమే లేదు. చదివి పాసవటము తెలివితేటలకు నిదర్శనకాదన్నసిద్ధాంతాన్ని సృష్టించాడు.

మూడుసంవత్సరాలు వరుసగా తప్పినపుడుబద్రీనారాయణలోవున్న వుత్సాహం అడుగంటింది. రేయింబవలు ఆ తప్పటకుగలకారణాలనే శోధిస్తున్నాడు. జాతకచక్రాన్ని తిరిగి నూతన గుణకారాలతో సరిజూపించాడు. ఆ జ్యోతిష్కులు తిరిగి ఆనాటిమాటలనే వల్లించి, యింకా బలపరచారు. ఇది బద్రీనారాయణకు యెటూతోచని బాధఅయింది. కాని రత్నాకర్ తనయెదుట ప్రత్యక్షమయినపుడు తనలోని బాధలన్నీ తుడుచుకుపోతుంటవి. అతనిరూపు రేఖలు కదలిక మెదిలికలు మాటలు ఆ జ్యోతిష్కులమాటలనే ధృవపరుస్తుంటవి. కాని, ప్యాసుగాకపోవటము, మార్కులు అసలే శూన్యమని తెలియుట ఆయున్ను కలవరపరచేవి. రాజయోగమున్నజాతకులకు పరీక్షలు చదువులు ప్రధానం కాజాలవు;

వాటిలేమి ఆ జాతకుని ప్రభావాన్ని కుంటుపరచజాలవని, యోగ్యతాపత్రాలు లేకనే వారిని అనుభవయోగ్యులను చేస్తుందని, వ్యవహారదక్షులను పరిపాలనాదక్షులనుగా జేసి, విజ్ఞానసంపన్నుని చేస్తుందని కొందరు అంతరార్థాన్ని వెల్ల డించారు. ఆకారణంతోనే రత్నాకర్ తప్పినా, అతని మీదున్న అభిమానం బద్రీనారాయణలో తగ్గలేదు. ఆటల కని పాటలకని వినోదాలలో లెక్కలేనంత ఖర్చుపెడుతున్నా అర్థరాత్రులవరకు స్నేహాలలో తిరుగుతున్నా ఆయన మనస్సు నొచ్చుకొనుటలేదు.

ఎఫ్. ఏ. నాలుగోసంవత్సరంకూడా తప్పినపుడు బద్రీనారాయణమనస్సు కొంచెం విసగటచెందింది. ఎంతో మంది ప్రొఫెసర్లను స్నేహితులను సంప్రదించినమీదట రత్నాకర్‌ను మద్రాసు లయోలాకాలేజీలో చేర్చ నిశ్చ యించుకున్నాడు. అక్కడ కట్టుదిట్టంగా చదువునాగుతుం దని, హాస్టలులోవుంచితే చెడుస్నేహాలు పోతవని దారిని పడి బాగా చదువుతాడని వూహించాడు.

ఒక్కనెలలోనే లయోలాకాలేజీహాస్టలంటే మన స్సుకు విసగడ కలిగింది రత్నాకర్‌కు. డబ్బువిషయంలో తండ్రి తనకు తరుగుచేయడు గనుక, ఒపేరాలో ఒక ఆంగ్లో ఇండియన్‌భవనంలోని గదిలోవుంటున్న చంద్రకాంతకు పార్ట్నర్‌గా చేరాడు.

చంద్రకాంత సిటీఅనుభవంలో ఆరితేరినవాడు. ఎక్కువగా ఇంగ్లీషులోనే సంభాషిస్తుంటాడు. భాషలో వ్యాకరణత్రుటులు యెన్నివున్నా వుచ్చారణమాత్రం

ఆంగ్లదేశమునుంచి దిగిన దొరలవలె సుస్పృతిరుగుతుం టుంది. సిగరెట్టును పెదవులమధ్య నోరగాపెట్టి కాలు స్తున్నా, అర్ధనేత్రాలతో కోరగాచూస్తూ స్టైలిష్‌గా మాటాడుతున్నా పాశ్చాత్యులను స్ఫురింపచేస్తుంది. ఇన్‌షర్టు వేసి మోచేతులవరకు మడిచి టైనదులుగా వ్రేలాడవేసి, ఫ్లాన ల్ ట్రౌజరుతో యెపుడు జూసినా, టిప్‌టాప్‌గా ఉంటాడు. నైట్‌క్లబ్బులో బాగా ప్రవేశముంది. శని ఆదివారాలు క్లబ్బులోనే కాలక్షేపంచేస్తాడు. అయిదుసంవత్సరాలఅను భవంలో రాక్ అండ్ రోల్ డాన్సులో ప్రత్యేకనేర్పును పొందాడు. మేరీ జాన్ పార్ట్నరుగా సంభవించినపుడు డ్యాన్సులో తన్మయుడవుతుంటాడు. చంద్రబింబంలాంటి ఆమెముఖంలోని పిల్లినేత్రాలు కోరగా తననుచూస్తూ, జుల పాలు విరజిమ్ముకుని తనఅరచేతులలో తమలపాకుల్లాంటి ఆ అరచేతులు కలిసి తిరుగుతున్నా చేయికిచేయి మెలికవేసి డ్యాన్సుచేస్తున్నా, 'నిను పొందిన నేనే ధన్యుడనూ, పొంది పోగొట్టుకొనని దే తెలియదుగా' అంటూ వంతగా పాడు తున్నా తనలోతానే తన్మయుడవుతుంటాడు. మామూలుగా తాగే అలవాటు లేదుగాని, క్లబ్‌డ్యాన్సులోమాత్రం ఆనం దంకొరకు షాంపైన్ సేవిస్తుంటాడు. మేరీ కాన్వెంటులో హైస్కూలుచదువులు పూర్తిచేసి టెలిఫోన్‌ఆపరేటర్‌గా పనిచేస్తున్నది. అయినా ఆమె చంద్రకాంతభాషలోని తప్పు లను దిద్దుతుంటుంది. ఆమె తనభాషలోని పొరపాట్లను దిద్దుతుంటే, తను ఆమె అధరములను దిద్దుతుంటాడు. ఆమెకు ఉద్యోగడ్యూటీ లేకపోతే తను కాలేజిని పూర్తిగా

విడచిక్లబ్బులోనే కాలక్షేపం చేసేవాడు. ఆమె బునుగురంగు గౌను, తెల్లని హీల్ బూట్లు వేసినపుడు మహా శోభిస్తుంటుంది. ఎప్పుడూ యిలానేవుంటే యెంత బావుంటుంది అనుకుం టుంటాడు చంద్రకాంత.

రత్నాకర్ హాస్టల్‌నుంచి చంద్రకాంతగదికి రావటం జైలునుంచి విడుదలై బయటప్రపంచాని కొచ్చినట్లున్నది. హాస్టలుకట్టుదిట్టా లతనికి నచ్చలేదు. నిబంధనలద్వారా మానవస్వేచ్ఛనరికట్టి నిర్ణీతనియమాలలో నడుపుటద్వారా మానవాభ్యుదయాన్ని మసుగుచేస్తున్నారని అతనితలంపు. అందుకే అతనికి చంద్రకాంతద్వారా అంధకారంనుంచి వెలుగులోకి నచ్చినట్లనిపించింది.

తను చంద్రకాంతగదిలో ప్రవేశించిన ప్రారంభంలో, నారంవరకుమాత్రమే యిద్దరు కలిసి గదికిరావటం జరి గింది. ఆతరువాత కాలేజీఅనంతరం చంద్రకాంత గయా బయి, రేయి 12గంటలకు, 1గంటకు వస్తుండుట జరుగు తున్నది. తిరిగి కాలేజీటైంవరకు నిద్రశయ్యనే ఆరాధించే వాడు. శని ఆదివారాలు అసలే గయాబయివాడు. క్లాసు పుస్తకాలుమాత్రం యెప్పుడూ చేతవుండేవి. ఇద్దరూ కులా సాగా మాటాడుకునేఅవకాశంకూడా కలుగుటలేదు. రత్నా కర్ యెప్పుడూ యింటిలోవున్నా బయటవున్నా యెక్కువ సందిట్లో మొలగినవాడు, వింతజీవితం యెరుగనివాడు. ఈ గదిలో పుస్తకాలనుచూస్తూ నాలుగుగోడలమధ్య టిక్ టిక్ మనే గడియారంధ్వనిమధ్య శయ్యమీద పడి దొర్లుతూ, కుర్చీలో కూలబడుతూ, చదివినపుస్తకాలనే వెదచి కంఠస్థ

మైనవిషయాలనే చదువుతూ, విసిగిపోయి, యిదే అసలు జైలుజీవితమని యిపుడు బాధపడుతున్నాడు. ప్రక్కయింటి లోని రేడియోధ్వని అస్పష్టరూపంలో వస్తుంటుంది. ఆ పిసిని గొట్టువాళ్ళు రేడియోను పెద్దగానయినా పెడితే, కాస్త వినేదునని వ్యాకులుడవుతున్నాడు.

గదిలో విసిగిన రత్నాకర్ నెమ్మనగా సినిమాలకు పోతున్నాడు. మందిలో అలవాటయినవ్యక్తి దృశ్యాలను సినిమాలను, వింతలను విశేషాలను చూచినపుడు మనస్సులో పొంగిన వుల్లాసాన్ని చెప్పుకోవటానికి యెవరూలేనపుడు మరింత వ్యాకులపడతాడు. రత్నాకర్ అదేరీతి విసిగి తిరిగి హాస్టలుకుపోతేనే బావుండుననను నిర్ణయానికివచ్చాడు.

ప్రాతఃసమయ మది. పాలవాళ్ళు వచ్చి పోవటము, వీధులనూడ్చువాళ్లుకూడా తమకార్యాలు చాలావరకు పూర్తిచేసుకోవటము, రేడియోలో వార్తలు, వాయిద్యాలు అయిపోయి, సిలోనుస్టేషన్‌రికార్డులు రావటము, కూర గాయలతట్టలవారువచ్చిపోవటము, స్నానాదులుజేసి, టిఫిను కాఫీలు ముగించుకుని, వార్తాపత్రికలను కొందరు, ప్రత్యేక పుస్తకాలను కొందరు చదువుకోవటం, రైల్వేశాఖలోను టెలిఫోనుశాఖలోను రాత్రిడ్యూటీచేసినవారు రావటము, ఉదయపుడ్యూటీవారు పోవటము, సెంట్రల్‌స్టేషనుకు నలు మూలలనుంచి వచ్చేరైళ్లు చేరటం, వెళవలేబళ్లు పోవటం జరిగింది. దినకరుని తేజోమయకిరణాలు కిటికీలగుండా ప్రస రిస్తున్నవి. శాలువా తనాయించి సుఖమయి నిద్రాదేవివడిలో

సమర్పితమయిన చంద్రకాంతమీూద పడుతున్న ఆ కిరణాలు పనిచేయటంలేదు.

పాలుబోని ఆలోచనలతో నిద్రలేక విసిగి, తెల్లవా రకముందే స్నానాదులు ముగించి గదిలో అటూయిటూ రామకోటివ్రాయువానివలె తిరుగుతున్నాడు రత్నం. చంద్ర కాంతయెడల తనకున్నఅభిమానం పూర్తిగా నశించింది. ఇపుడతనంటే మండుతున్నది. రాత్రులల్లా యెక్కడో తిరిగివచ్చి, యిలా నిద్రపోతున్నాడనే కచ్చతో భరింపజాలక అతను తనాయించికప్పుకున్న శాలువాను అమాంతం లాగి వైచాడు. తన్నిపట్టి శరీరబడలికను దూరంచేసుకుంటూ ఆవ లిస్తూ "అబ్బ! ఏమిటి రత్నాకర్" అంటూ ఒక పెద్ద ఆవలింతను ప్రదర్శించాడు చంద్రం. అది మరింత వుద్రేకో షాన్ని కల్పించింది. రత్నాకర్ పట్టరానికోపం ప్రకటిత మవుతున్నకంఠంతో "చంద్రం! నే నీ సాయంకాలమే యిక్కడినుంచి వెళ్ళిపోదలచాను. నీవు రోజూ యెక్కడుం టున్నావు ?" అని అడిగాడు.

నిద్రమత్తు ఒక్కమాటుగా వదిలిపోయింది. పొర పాటు జేసినవానివలె తత్తరపాటుచెంది "అదేమిటి రత్నాకర్, నీకు యిక్కడ ఏ విషయంలో సౌకర్యంగాలేదు? తిరిగి ఆ జైలుకు వెళతానంటూవెందుకు ?" అన్నాడు.

"నా కిదే అసలుజైలుజీవితంలాగుంది. మాట్లాడే మనిషికూడా లేకుండావుంది. నీ గుప్తవ్యవహారాలు నా కగమ్యంగావున్నవి" అన్నాడు రత్నాకర్.

"నీవు చాలా విచిత్రంగా మాట్లాడుతున్నావు. నీ చదువుకు వంటరితనం బాపుంటుందేమోనని నేను మరింత అవకాశమిస్తున్నాను. లేకపోతే, యెప్పుడూ కలిసేవుందును. రెండోది, నేను ప్రస్తుతం ట్యూషనుచదువుతున్నాను. చదవటానికి బద్ధకమయినపుడు కాస్త ట్యూషనుద్వారాన యినా పాఠాలు బాగా పరిచయమవుతవి. నీవు వెళ్ళవద్దు రత్నాకర్. పోనీ, నీవుకూడా ట్యూషను చెప్పించుకో. నీకు నిజంగా వంటరితనపు బాధ వుందంటే, నేను యెప్పుడూ విడిచే వాడినేకాదు." అని ప్రేమలోలుకుమాట లన్నాడు చంద్రం.

అతనిమాటలు రత్నాకర్‌ను లాలించినవి. వుత్సాహం కలిగింది. "నీవు యింత ఫ్యాషనుగా తిరుగుతావుగాని, వట్టి అమాయకుడవు. పసివారికి ప్రయివేటుగాని, మనకు ప్రయివేటేమిటి చెప్పు? ఈ పాఠాలలోని యెక్కువభాగాలు మనకు చెప్పే ఆ ప్రొఫెసర్లుకూడా తమ విద్యార్థిదశలో కంఠస్థంచేసినవే; వాటిని వారు మళ్ళీ చర్వితచర్వణంగా విని పిస్తుంటారు. ఆ పుస్తకాలలోనిపాఠాలకంటే పాఠాలరచ యితలచరిత్రలు వేయిరెట్లు వల్లించాల్సివుంటుంది. ఆయన జీవితంలోని ఘట్టాలనుబట్టి అభిరుచులను భావాలనుబట్టి ఆ పాఠాలపోకడ వుంటుంది, అర్థమవుతుంది. అందుకని ఆయన జీవితసంగ్రహాన్ని, ఆయన ప్రథమభార్య ఆయన్ను యెందుకు విడనాడింది, ద్వితీయభార్య యెందుకు యెవరితోనో లేచిపోయింది, సాంసారికజీవితంలో యెందుకు విఫలతచెంది, ప్రేమలో యెందుకు భగ్నమయింది మొదలగువివరాలను మనం వల్లెవేయాలి. పరీక్షల్లో అసలుపాఠాలకంటె రచయి

తలగురించినప్రశ్నలే యెక్కువ వస్తుంటవి. ఇది యెంత విచిత్రం! పాఠంలోనివిషయాలను వివరవిశేషాలతో రచయిత అభిరుచులతో అర్థంచేసుకున్నామో లేదో, ఆ పాఠాలలో ప్రశ్నిస్తే తెలుసుకోవచ్చునుగదా. అయినా విని విని విసుగెత్తుతున్న ఆ పాఠాలనే ట్యూషనులోకూడా యెక్కడ వినగలం చంద్రం?" అన్నాడు రత్నాకర్.

నేత్రాలు నులుముకుని తుండుతో ముఖంతుడుచుకుంటూ చిరునగవును చిలికిస్తూ, రత్నాకర్ హస్తాన్ని పట్టి అదుముతూ లాగి కూర్చొబెట్టి "నాకునచ్చినమాటలే అన్నావుగాని, వాటిలో అనుభవశూన్యత కనిపిస్తున్నది రత్నాకర్. నీవు కాలేజీలో మూడుడిగ్రీలేకొట్టావుగనుక, అంతకు మించిన అనుభవం యెలావస్తుంది! నీ డిగ్రీలను మూడు పెట్టి హెచ్చించితే నాకు సరిపోతవి. అంత అనుభవంతో చెబుతున్నాను విను. ఆ పాతపాఠాలను చదవలేక విసుగెత్తే, ట్యూషను చెప్పించుకుంటున్నది. వినటంలోకూడా విసుగెత్తుతుందనుకో; అయినా చదవటంకంటె కూర్చుని వినటం తేలిక. అందుకే ట్యూషను మంచిది. ఇక అసలుపాఠాల కంటె వాటిరచయితలగురించిన ప్రశ్నలే పరీక్షలలో యెక్కువ రావటమంటావా? రాజకీయరంగంలో నిష్కల్మషంగా ప్రజాసేవాకార్యక్రమంలో మునిగినవానికంటె సేవను గురించి వుచ్చన్నేశిలో వుపన్యాసాలిచ్చేవానికి ప్రాముఖ్య మెక్కువ. చేసేవాడు వాలంటీర్గాను, ఆ సేవ అవుసరమని వాగేవాడు లీడరుగానవటం, ఆతనుహాత జరిగినవి జరుగుతున్నవి అతనిద్వారా జరుగుతున్నట్లే ప్రచలితమవుతవి. అట్లే

రచనను విడచి, ఆ రచయితనుగురించి ప్రశ్నించటం సాహిత్యంలోని వుచ్ఛస్థాయిని ప్రకటిస్తుంది. అసలుకంటె ఆ స్థాయిప్రాముఖ్యత హెచ్చుగదా!" అన్నాడు చంద్రం.

"చదవుటకన్నా వినుట తేలికన్నావు కాని, నిర్మల మైన యేకాగ్రమనస్సుతో విన్నపుడే అవి గుర్తుంటవి. అది మరింత కష్టం. మనస్సు చాలా పనిచేయాల్సివుంటుంది. తరువాత రచయితజీవితరహస్యాలు తెలిసినపుడు ఆ రచన తేలిగ్గా అర్థమవుతుందనేఅంశం అన్నావు. కాని ఆ రచనను బాగా చదివి, అందలి నిగూఢభావాలను అర్థంచేసుకున్నపుడు రచయితస్వభావాలను జీవితసఫలాసఫలతను యెందుకూహించలేము ?" అన్నాడు రత్నాకర్.

"నీ వన్నవి నాకు నచ్చినవిషయాలే. పదిపేజీలరచనలోని మర్మాలకొరకు వందపేజీల రచయితజీవితచరిత్ర చదువుట, అందులోనే ప్రత్యేకించి ప్రశ్నలువచ్చుట నిరుద్యోగనిర్మూలనకొరకు నూతనశాఖలను ప్రారంభించి, వ్యయాన్ని మితంచేయటానికి మరికొన్ని పాతశాఖలను యెత్తివేసి వాటికొరతను పూర్తిచేయుటకు యింకేమో చేసినట్లుంటుంది. వినుటకన్నా చదువులే సులభమన్నభావనను వ్యక్తంచేశావు. అది పొరపాటు. హరికథాకాలక్షేపంలో వూసుబోని వారంతా ప్రేక్షకులే కాని, వారిమనస్సులు అక్కడెందుకుంటవి ? వళ్ళోవున్న మనమడిమీద, పండుగకురాని కూతురుమీద, అలిగిపోయిన అల్లుడిమీద, భార్యపక్షంవహిస్తున్న కుమారుని దుష్టత్వంమీద, తనను నిర్లక్ష్యంచేస్తున్న కోడలిగయ్యాళితనంమీద వుంటుంది. 'హరి'గొట్టినపుడు అం

దరూ 'హరి' అంటారు. పాంచాలిపరాభవంమాట విన్నపుడు తమకష్టాలతో పోల్చుకుని కన్నీరుకారుస్తారు; భీముడు గదను ఆడిస్తూ హుంకరించినపుడు తననురక్షించను తన కోడలి గయ్యాళితనాన్ని తనఅల్లుని మూర్ఖత్వాన్ని తన తోడికోడలి సూటీపోటీలను రూపుమాప దూకుతున్నట్లు ఆనందిస్తారు. వళ్లోవున్న మనుమడికి ఆమాటలనే వినిపిస్తారు. ఆ హరికథా కాలక్షేపంలో వారిమనస్సు యెంత అలసటజెందుతుందో చెప్పు? మనమూ యీపాతపాఠాలను అంతకుమించి యేమి వినగలం చెప్పు? ఈ పరీక్షలు పరీక్షాధికారులు వారిప్రశ్నలు తలపుకొచ్చినపుడు వారు నిర్ణయించిన పుస్తకాలు యెంత వుత్సాహకరమైనవైనా చదువబుద్ధిగాదు. అంతకంటె కఠిన మైన పుస్తకాలనుసైతం సిలబస్‌లో లేనివాటిని చదివి నాంటి మీాద మేలైన తర్కంచేయగలము. విద్యార్థులయెడ యిది భగవంతుని శాపమేమో!'' అన్నాడు చంద్రం.

"కాలక్షేపానికో వినోదానికో ప్రయివేటుచదువుట నావల్లమాత్రం కాదు. నీవు నన్ను యిదేరూపంలో పంట రిగాయిక్కడ వదిలి ప్రయివేటుచదవాలంటే నావల్ల కాదు. నన్ను వెళ్ళిపొమ్మనటం మంచిది'' అన్నాడు రత్నం.

"ఇక నేను వెళ్ళను. నీకోర్కెప్రకారమే జరుగు తుంది'' అని అతనిచేతివ్రంతంతో చివ్వున శయ్యనుంచి లేచి భుజాలుతట్టి వూపుతూ స్నానాలగదిలోకి వెళ్ళాడు.

అది వుదయం పదిగంటలసమయం. శనివారము. శని ఆదివారాలలో మేరీజాన్ యెక్కువసమయం క్లబ్బులేడింగు హాలులోనే గడుపుతుంది. పాశ్చాత్యనవలలన్నా డ్రామా

లన్నా మహాయిష్టం. చంద్రకాంత డిస్టర్బెన్స్ లేకపోతే ఆమె పుస్తకాలలో లీనమైపోతుంది. ఆమె తనఆఫీసులో కూడా అవకాశమున్నంతవరకు పుస్తకంపేజీలను తిరుగవేస్తూనే వుంటుంది. అందుకే ఆమెను ఆఫీసులోవారంతా పుస్తకాల పురుగు అంటారు. ఆమెకున్న సాహిత్యవిజ్ఞానానికి ఆఫీసు వారంతా విస్తుపోతుంటారు. మామూలు డిక్షనరీలలో అర్థాలుదొరకని లాటిన్ ఫ్రెంచిశబ్దాలకుసైతం సరియైన భావాలను చెబుతున్నపుడు ఎం. ఏ. లో క్లాసుబొందిన మానిటరు నివ్వెరపోయి, ఆమెను చూస్తూనేవుంటాడు. స్వయంగా ఆమె డిక్షనరీని యెన్నడూవుపయోగించదు. సందర్భాన్నిబట్టి శబ్దార్థాన్ని వూహించి, భావాన్నిగ్రహిస్తూ తానే విజ్ఞానకోశముగా తయారైంది. అందుకే ఆమెయెడల అందరికీ అత్యధిక అభిమానము. ఆమెను పుస్తకా లాకర్షిస్తుంటే, ఆమె అందరినీ ఆకర్షిస్తున్నది. శ్వేతజాతి భారత జాతి సమ్మేళనాజనిత కుసుమరాజమైనందున గాబోలు మిస మిసలాడే గోధుమవర్ణంలో ఆమె బొద్దుశరీరం అత్యధిక అందాన్ని చిందిస్తుంటుంది. ధగధగాయమానంగా కెంపు వర్ణంలో మెరుస్తున్న ఆస్ట్రేలియన్ యాపిలుపండును కన కాంబరరంగు మెరుపుకాగితంలో చుట్టినపుడు మరింత అందాన్ని ఒలికిస్తున్నట్లు ఆమెకు గౌను అతికినట్లు నేత్రాలను మత్తులోముంచుతూ అరుణరిబ్బనుబోర్డరుగల కనకాంబరం జరీచీరె, వైలెట్ ముఖమల్ జాకెట్టుధరిస్తే ఆమె యెంతబావుంటుందో అంచనావేయిస్తుంటుంది. పారిస్ నగరంలోని మహాశిల్పులు అత్యధికశ్రమతో చిత్రించిన పాలరాతి ప్రతిమలు

ఆమెముందు చిన్నబుచ్చుకుంటవి. అవును, శిల్పులను సృష్టించిన ఆ భగవంతుడే తననేర్పును క్రోడీకరించినపుడు దాన్నివర్ణించుట మానవసాధ్యంగాదు. దానిముందు మానవుని విభ్రాంతిమాత్రమే మిగులుతుంది. ఆమె కేశరాశికూడా శ్వేతజాతి పీతాంబరరంగులోమాత్రమే గాక వెలిసిపోయిన నలుపువలె ఆమెశరీరాని కదో శోభను చేకూర్చురూపంలో వుంటుంది. అందమే ఆగర్భశత్రువని అమాయక అంగనలు ఆత్మరక్షణకు వికృతంచేసుకున్నట్లు ఆమె తనశిరోజాలచివరలను కత్తిరింపుచేయించుకున్నపుడు స్త్రీలే నిరసించి తమ కనులకుకలుగు కమనీయతను కోల్పోజాలక అనురోధంగా శిరోజాలకత్తిరింపును మాన్పించారు.

ఆమెకు రష్యన్‌రచనలమీద ఫ్రెంచిరచనలమీద అభిలాష. బెంగాలీవారిరచనలంటే మరింత మోజు. మానవ స్వాభావిక వివిధప్రవృత్తులమీద వాస్తవిక ప్రకృతిసౌందర్యంలోని నిగూఢరహస్యాలమీద, సంభవాలు సమంజసాలు అయి హృదయానికిహత్తుకునే సన్నివేశాల చిత్రణ చదువుచున్నపుడు తననుతాను మర్చిపోతుంటుంది. కఠిన కత్తి పోరాటాలతో యుద్ధరంగాలుగా చిత్రించి, పౌరుషాలను వీరత్వాలను సృష్టించే సన్నివేశాలున్న పుస్తకాలు ఆమెకు నచ్చవు. అలాంటి సన్నివేశాన్ని చిత్రించిన రచయిత మీదున్న అభిమానంవలన చదువవలసివస్తే మహేరియానోగి తప్పక కటికిచేదునుందును కళ్ళుమూసి మ్రింగినట్లు శారిడాన్ సహాయంతో చదువుట జరుగుతుంది. ఒకరపోటుతో కొడితే, రెండోవాడు జాలితో యింకా కొట్టి కోపంతీర్చుకో అన్నట్లు

తననుతాను అర్పించినట్లు ప్రదర్శించుట ఆమెకిష్టము. క్రైస్తుబోధలు ఆమెకు వంటబట్టినవి. టాల్‌స్టాయ్‌రచనేదో చదువుచున్నది.

చంద్రకాంత ముస్తాబై బ్రతిమాలుతున్నవానివలె "నన్ను ఒకగంటసమయానికి క్షమించి వదులు రత్నం. నా పుస్తకాలు ఆ ప్రయివేటుచదివేదగ్గరున్నవి. అవి తీసుకుని గంటలో వస్తాను" అన్నాడు. "నాకోరకని నిన్ను నిర్బంధించుట నా అభిమతంగాదు. నాకు తోచక వంటరిగా వుండలేక అన్నాను. అంతే"అన్నాడు రత్నాకర్. "నేను త్వరగా వెళ్ళివస్తాను" అని మందహాసంజేస్తూ చంద్రకాంత తుర్రున వెళ్ళిపోయాడు.

సంధ్యాసమయమైంది. కాని చంద్రంజాడ లేదు. ఎదురుచూచుటలో విసిగి, తోచక తానూ గ్రాండ్ హైట్సు సెంటర్‌కు చేరి, బసోటాలో కాఫీసేవించి బయటకొస్తున్నాడు. ప్రక్కనున్నగదినుంచి చంద్రకాంతమాటలు వినవస్తున్నవి. అడుగు ముందుకువేయలేక ఆగిపోయాడు. ఆ మాటలధ్వనితీరు స్పష్టంగా చంద్రానిదే కాని, మాట్లాడేవిషయాలేమిటో విపులమవుటలేదు. అక్కడే ప్రక్కనున్న కుర్చీలో కూలబడ్డాడు. అట్టహాసపునవ్వులుకూడా వినవస్తున్నవి. లోపలప్రవేశించిచూడాలని వుద్వేగం జోరెస్తున్నది. కాని, సభ్యసంస్కారాలు వెనక్కు నెడుతున్నవి. ఆ గది కేవలం కుటుంబీకులు లేక స్త్రీలుమాత్రమే ఫలహారంచేయ నిర్దేశించబడినది. చంద్రకాంతప్రక్క స్త్రీలెవరుంటారు? మళ్ళీ

మనస్సు సందిగ్ధంలోపడి చప్పబడింది. ఆగదివైపే నిరీక్షిస్తూ కూర్చుండిపోయాడు.

మిసమిసలాడుతూన్న ఒక ఆంగ్లోఇండియన్ యువతి తలుపునెట్టుకు బయటకొచ్చింది. ఆమెచేతిలో హాండు బ్యాగ్‌కుబదులు గ్రంథరాజమున్నది. లోపలిమనిషికొరకు ఆమె యెదురుచూస్తూ నిలిచింది. ఆమె మొదటితీక్ష్ణదృక్కులు రత్నాకర్ మీద పడినవి. మందహాసముఖంలోని ఆమెపిల్లి కళ్ళచూపులు అతనిని గిలిగింతలుపెట్టినట్లయింది. తనలో తానే చిన్నబుచ్చుకుని చంద్రకాంతమాటలుగా శంకించి నందుకు పశ్చాత్తాపపడుతున్నాడు. మరుక్షణం కర్చీఫ్‌తో చేతులుతుడుచుకుంటూ చంద్రకాంత బయటకొస్తూ "అంత తొందరపడతారెందుకు?" అంటూ రత్నాకర్‌ను చూసి, శిలాప్రతిమవలె నిలిచిపోయాడు.

"ఇక్కడున్నావేమిటి రత్నాకర్?" అని పూరించు కున్నకంఠంతో అన్నాడు. "ఇక్కడికొచ్చేవారంతా ఎందుకో నేనూ అందుకే" అన్నాడు రత్నాకర్. ఈ మాటతో ఆమె నివ్వెరపాటుచెంది వింతగా చూస్తున్నది.

"సరే, మంచిదేఅయింది. వీరివద్దనే నేను ట్యూషన్ చదువుతున్నది. ఈమెపేరు మేరీ జాన్" అని ఆమెనుచూపి, తరువాత ఆమెవైపు చూసి, ఆతన్ని చూపుతూ "వీరు నా మిత్రులు, రూమ్ మేట్, పేరు రత్నాకర్" అని పరిచయం చేశాడు. పరస్పరనమస్కారాలు జరిగినవి.

రత్నాకర్ మరోమారు ఆమెవైపు తేరిపార చూశాడు. 'ఆహా, అమాయకురాలు అబలఅయిన ఈమె

వద్ద ఇతని ట్యూషనా! ఆమెకు పాపం, అసలు పుస్తకాలు అర్థమవుతవో కాదో! నిజంగానే చంద్రం వట్టి వెర్రివాడు. పురుషదర్పంలేనివాడు. సిగ్గుపడటానికి బదులు నేరుగా చెప్పుకోగలుగుతున్నాడు. ఈ చదువులు యోగ్యతలు లేక పోయినా, జీవితం వ్యర్థంగాదు. కాని ఈమెవద్ద ట్యూషను చెప్పించుకుంటున్నాననటం జీవితాన్ని హీనంచేసుకోవటమే గదా! ఛీ,ఛీ,' అని మనసులో అనుకుంటూ, ఒక హేయమైనచూపును యిద్దరివైపూ ప్రసారంజేశాడు. చీరెచిరుగు యెక్కడ బయల్పడుతుందోనని చేతితో క్షణక్షణము తడుముకుంటున్న భయభీతిగల స్త్రీవలె తనను యేమనుకుంటాడోననేభయంతో "మా గదికి వెళ్ళదాం పద, చూద్దువుగాని మిస్ మేరీజాన్!" అన్నాడు చంద్రం.

"క్షమించండి, మరెప్పుడయినా వస్తాను" అన్నది మేరీ. "కాదుకాదు, మా మిత్రుడుకూడా కలిశాడు గనుక, యీరోజే వెళితే బావుంటుంది" అన్నాడు చంద్రం.

"నేను త్వరగా యింటికి వెళ్ళాలి." అంటూ రత్నాకర్‌వైపు చూసింది ఆమె.

ఈ పిలుపులు బలాత్కారాలు రత్నాకర్‌కు మహా మంటను గల్పిస్తున్నవి. శరీరమంతా చీమలుపారుకాడుతున్నట్లున్నది; వెంటనే దూరంగాపోతే బావుండుననిపిస్తున్నది. ఎంతప్రయత్నించినా ముఖంమీదికి కాఠిన్యత వస్తూనే వున్నది. అతనిముఖంలోని కాఠిన్యతను చదువుచున్నట్లు మేరీ తదేకంగా చూస్తున్నది. ఆమెముఖాన్ని నేరుగా చూసినపుడు అతనికి సిగ్గుదొంతరలు దొర్లుకొస్తున్నవి.

చంద్రానికి తోచక "రత్నం! నీవుకూడా మన రూముకు రమ్మని వారిని ఆహ్వానించు" అని బాహువులు పట్టి ప్రతిమాలాడు. కాని రత్నాకర్ దొంగచాటుగా విముఖతను ప్రకటించునట్లు తనబాహువులను లాక్కుంటున్నాడు.

ఆమె క్లబ్ వైపు ముందు నడుస్తున్నది. ఆమెకువినిపించనిస్వరంతో వినతిచేస్తూ అతనిగడ్డాన్ని పుణుకుతు దీనతను ప్రకటించుకుంటున్నాడు చంద్రం. విజ్ఞానంలోని పట్టుదల ప్రాధేయతతోపటాపంచలై పోతుందిరత్నాకర్ లోనికాఠిన్యం అదృశ్యమైంది. వెంటనే చరచర ముందుకొచ్చి "మేరీగారూ, దయతో మీరు మా గదికివచ్చి చూసిపోవాలి. అది జైలు లోని యేతరగతివలె వుంటుందో నిర్వచించి పోవాలి" అని ప్రయత్నపూర్వకమందహాసంతో అంటూ ఆమెదారికడ్డంగా నిలిచాడు. క్రొత్తగా డ్రామాలోచేరి పోర్షన్ కంఠస్థంచేసి, రిహార్సల్ లో సిగ్గు భీతిచెందకుండ నేత్రాలు మూసుకుని పల్లిస్తున్నట్లున్న దామె కా వినతి. కాని తనమనస్సులోని నో ప్రవృత్తిద్వారా ఆ దృశ్యంతో ఆనందమూ సమకూడుతున్న దామెకు.

"కాదుకాదు, మరెప్పుడయినా వచ్చి మీ జైలు విజిట్ బుక్ లో వ్రాయదగ్గ రిమార్కులు వ్రాస్తానులెండి" అంటూ ఆమె తొలగిపోతున్నది. వెనుకనున్న చంద్రం మందస్మితంతో దంతాలుకొరుకుతూ చేతులువూపుతూ నేత్రాలువురుముతూ ఏదో సైగచేస్తున్నాడు రత్నానికి.

రత్నాకర్ పాలుబోక అతనిసైగతో వుద్విగ్నుడై అనభిజ్ఞునివలె రెండడుగులు మళ్ళీ ఆమెముందుకు వేసి, ఆమె

హస్తాన్ని బట్టి "అలాగాదు, ఇప్పుడే మీరు రావాలి. మా గది చూసితీరాలి" అని ముఖమంతా గొప్ప పట్టుదలతో నిండివున్నట్లు ఆకృతిచేసి అన్నాడు.

ఆమెహృదయ మొకమాటు ఝల్లుమని కంపించింది గాని, మరుక్షణంలోనే తన్నొక పసిబాలకుడు ప్రేమాదర పట్టుదలలతో పట్టుకుని, అతని తల్లివడిప్రక్కకు తీసుకెళ్ళ గోరుతున్నట్లు గోచరించింది. మ్లానతచెందిన ఆమెముఖమండలం రెప్పపాటులో మందస్మితమైంది. అడుగు ముందిడను వీలులేక ఆగిపోయింది. తనహస్తాన్ని గట్టిగా పట్టిన ఆ హస్తాన్ని తరువాత ముఖాన్ని చూస్తున్నది. ఆ ముఖంలో వుట్టిపడుతున్న పట్టుదల, అందు మిళితమైన బెరుకుతనం అనిర్వాచనీయమైన ఆకర్షణను కల్పిస్తున్నవి.

మరుక్షణంలో తనహస్తాన్ని చూసుకుని చైతన్యం పొందినవానివలె విచలితుడై చేయివిడిచి రెండడుగులు వెనక్కువేసి, వెలవెలబోతూ ఆమెను చూస్తున్నాడు. ఆమె ఆపాదమస్తకం పరిశీలిస్తూ చిరునగవును చిలికిస్తున్నది.

చంద్రం సైగతో టాక్సీ వచ్చి ప్రక్కనే ఆగింది. చంద్రమే ఆమెను కారుయెక్కమని ప్రోత్సహిస్తున్నాడు. రత్నం సంకోచాలతో సతమతమవుతున్నవానివలె టాక్సీ డ్రైవరువంక చూస్తున్నాడు. ఆమె తనచిరునగవును మరింత వికసితంచేస్తూ, కాదనుభావాన్ని ప్రకటించునట్లు శిరస్సును వూపుతున్నది.

"మీరు రావాల్సిందే, కారు యెక్కండి" అన్నాడు రత్నాకర్. పసివాడు కనులుమూసి యెవరిప్రోత్సాహంతోనో

అన్నట్లున్న దా ధ్వని. ఆమె మాఱుమాటలేకుండా అధరాలు బిగబట్టి, జోరుగా కాఱులోనును తీసి యెక్కి కూర్చున్నది. చంద్రం ఆమెను అనుసరించాడు. కాని రత్నం వెంటనే వెను తిరిగి అడుగులు వేస్తున్నాడు.

"అరెరే, నీవదేమిటి రత్నం! రావేమిటి?" అని ప్రశ్నించాడు చంద్రం.

"నేను కాస్త అటు వెళ్ళి తరువాత వస్తాను" అన్నాడు రత్నం.

"చంద్రం వెంటనే దిగి ప్రాధేయపడుతున్నాడు. కాని రత్నం పరధ్యానములోనున్నవానివలె విముఖత సూచిస్తున్నాడు. మేరీకూడా దిగివచ్చి "మీరు బలేవారు! నన్నింత ప్రోత్సాహంజేసి, మీ జైలుకు నన్ను బంపి మీరు తప్పుకోవాలని చూస్తున్నారా? అయితే నేను రావలసిన అవసరం అసలేలేదు; మీరే పొండి" అన్నది. ఆమెమాటలతో రత్నం మంత్రించినవానివలె నిరుత్తరుడై కారులో ప్రవేశించాడు.

గది గాలి వెలుతురులు ధారాళంగా ప్రవేశించు ఆధునిక పద్ధతులలోనే వున్నది. మంచి విలువైన ఫర్నిచరే వున్నది. అంతటా పుస్తకాలు, విడిపోయిన పాతనోట్సుకాగితాలు అస్తవ్యస్తంగా వున్నవి. టేబులుమీద, అలమరలోను కుర్చీలమీద అంతటా పుస్తకాలే. క్రింద యెక్కడ చూసినా సిగరెట్లనుసి, కాల్చివేసిన సిగరెట్లు, ఖాళీసిగరెట్టుపెట్టెలు అగ్గిపెట్టెలు, గోడలను సిరామరకలు కనిపిస్తున్నవి.

మంచాలమీద పక్కలు అటూయిటూ నెట్టి అలానేవున్నవి. టేబులుమీద పెట్టివున్న కలం, క్యాపు వేరువేరుగావున్నవి.

చంద్రకాంత ముందు గదిలోకి సరసర ప్రవేశించి కుర్చీని టేబులును సరిజేసి మేరీ నాహ్వానించాడు. ఆమె గది అంతటిని దీర్ఘమైన పరిశోధనచేస్తూ, నవ్వునుప్రదర్శిస్తూ నిర్దేశించిన కుర్చీలో కూర్చుని "చంద్రకాంతగారూ, ఈ జైలు లోని ఖైదీలు మహా సోమరులని అగ్భకులని అర్థమవుతున్నది. వీరికి నిర్బంధన కటుతరంచేయవలసిన అవసరమున్నదని నా అభిప్రాయం" అంటూ కిలకిలనవ్వింది.

ఈమె రావటం తన కిష్టంలేనట్లు, తనకుసంబంధించనట్లు రత్నాకర్ తన పుస్తకాన్నొకటి చేతబట్టి, గది రెండో వైపుఅలమరదగ్గరగాకుర్చీ వేసుకుని చదువుకుంటున్నాడు. "నేనిపుడే మీకు టిఫిను, కాఫీ తెస్తాను" అంటూ బయలుదేరాడు చంద్రం. ఆమె యెంత నివారించినా వినేపరిస్థితిలో లేడు. ఆ టాక్సీలోనే ప్లాస్కుతో వెళ్ళిపోయాడు. ఇపుడు గదిలో మిగిలింది యిరువురే. రత్నం శిరస్సు పైకెత్తగూడదని ప్రతినబట్టినట్లు మహాశ్రద్ధతో చదువుతున్నాడు. మేరీ గదిలోని అస్తవ్యస్తస్థితిని, తరువాత రత్నాకరుని, తిరిగిగదిపై కప్పును, తిరిగి అతన్ని, మళ్ళీ గదిలోవున్న గలీజు, సిగరెట్టు పీకలను చూస్తున్నది. మనస్సులోనిభావాలు మహావేగంగా దొర్లుతున్నవి. ఆయన అంత అపరిచితునివలె హీనంగా తన కార్యంలో నిమగ్నమయి తనవంకైనా చూడకపోవుట, కనీస పరామర్శకైనా ప్రయత్నించకపోవుట, ఇంతకుముందే తనను హస్తంపట్టి రమ్మని అనురోధించుట, తను సమ్మతించిన మరు

క్షణం ఆయన వేరుగా వెళ్ళిపోజూచుట మొదలగు విభిన్నమైన విరుద్ధమైన చర్యలు విచిత్రరూపంలో ఆమెను కలవరపరుస్తున్నవి. ఆమె కనులార్పకుండా అతనినే చూస్తున్నది. తనయెడల ద్వేషభావమేమోనని చిన్నబోయింది. తనకరాన్నిబట్టి విధేయునివలె చేసిన వినతి గుర్తుకొచ్చి, అమాయకుడు అనుకున్నది. సభ్యత తెలియని వినయంగల విద్యార్థిగా మనస్సులో అనుకుని, సంతృప్తిచెందింది. సన్యాసుల సాధుమతంలాంటి యిచ్చటికి వచ్చుటే తన పొరపాటేమోనని సంధిగ్ధమనస్కురాలవుతున్నది.

తిరిగి టాక్సీ వచ్చి గదిముందు ఆగింది. చంద్రం కొన్ని పొట్లాలు, ఫ్లాస్కుతో దిగివచ్చి మేరీని సత్కరించాడు.

మేరీ యింటికి తిరిగివచ్చినప్పటినుంచి ఆమె మనస్సు రత్నాకర్ విచిత్రస్వభావాన్ని గురించే ఆలోచిస్తున్నది. ఆమె యెన్నోపుస్తకాలలో రకరకాలప్రవృత్తులుగల వ్యక్తులను చూసింది గాని, యీ రత్నాకర్ స్వభావం ఒకవిధంగా తనకు బాధను క్రోధాన్ని కలిగిస్తున్నది. మరోవిధంగా అతని అసభ్యతఅనో అమాయకత్వమనో అనిపించివుత్సాహితురాలవుతున్నది. తను ఈవిషయంమర్చిపోవాలి, పుస్తకాలలో లీనంకావాలనిఎంతప్రయత్నించినా విఫలమవుతున్నది. ఏదితనకు అతీతంగాను హేయమయిందిగాను వుంటుందో, దానివైపుకే మనస్సు దొర్లటం మామూలువిషయం. ఒకక్షణం అతనిని గురించి మహాక్రోధం జనిస్తున్నది; మరుక్షణం తనకరాన్ని బట్టి వినతిచేసినవిషయం గుర్తుకొచ్చి, జాలినొందుచున్నది. ఆ రాత్రంతా ఆమె ఆ కలలతోనే గడిపింది.

అపరాహ్ణసమయ మది. అనంత ఆకాశంలో పొరలుపొరలుగా దొంతరులవలెనున్న మేఘగుచ్ఛాలు కలిసికట్టుగా తూర్పుదిశకు రైలుపెట్టెలవలె పయనిస్తున్నవి. సాగరుని సమాగమానికో లేక దప్పికాతురతకో, దూది పింజముబోలిన దినకరుని కిరణప్రసారము తీక్షణరూపంలో పృథ్విలోకి చొచ్చుకుపోతున్నవి. మేరీ క్లబ్బుకుపోవలసిన సమయము తప్పిపోయింది. పోవాలనిపించుటలేదు. తెరచి వున్నపుస్తకంలోని పేజీ యెంత చదివినా తరుగుటలేదు. అర్థమవుటాలేదు. విసిగినమనస్సుతో పాలుబోక బస్సు యెక్కి ఒపేరీలో దిగింది. మనస్సు తటపటాయించి వెనక్కుతగ్గింది. కాని అర్థంగాని వుల్లాసప్రేరణతో తిరిగి పిల్లిఅడుగులు వేసుకుంటూ, ఆ గదికే వెళ్ళింది. ద్వారము కిటికీతలుపులు అన్నీ పూర్తిగా తెరచివున్నవి. రత్నా కర్ ఒక్కడే నిద్రిస్తున్నాడు. అతనిహృదయంమీద తెరచి వున్న పుస్తకము, దానిమీద అతని యెడమహస్తము వున్నవి. నిద్రిస్తున్న అతనిముఖమండలంలో నిశ్చింతతో గూడిన నిర్మలత ప్రకాశిస్తున్నది. అతనిగాఢనిద్రను ప్రక టించు స్వేదబిందువులు లలాటంమీద మెరుస్తున్నవి. దొడ్లోని శాల్మలీవృక్షాలనుంచి వస్తున్న పవనసవ్వడి జోల పాటను బోలివుంది. ఆ తీక్షణరూపంలోని యెండలోకూడా సాగరోపరినుంచి వస్తున్న శీతలపవన తెమ్మెరలు హాయినిస్తు న్నవి.

మేరీ గొప్ప పరిశోధకురాలివలె పిల్లిఅడుగులు వేసు కుంటూ నిశ్శబ్దంగా ప్రక్కనున్నకుర్చీలో కూలబడి అతని

ముఖమండలంలోని ముద్రిత పరిభాషను చదువప్రయత్నిస్తున్నది. ఆయనహృదయంమీద పడివున్న గ్రంథరాజమేమిటా అని పరిశీలించింది. 'అశ్వఘోష్ మహాకవి విరచిత ఊర్వశీవియోగ'మని అందున్నది. సంస్కృతభాషలో వారువ్రాసిన గ్రంథాలు మహోన్నతమైనవని ఆమె విన్నది. అనువాదమైన ఆ 'ఊర్వశీవియోగం' యెలాంటిదో చూడాలనిపించింది. ఆ పుస్తకంమీదున్న అతనిహస్తాన్ని తనకుడిచేతో మృదువుగా పట్టి, యెడమచేత్తో గ్రంథాన్ని అతిమెలకువగా తీస్తున్నది. మానవబుద్ధిలో అజ్ఞాతంగాను అప్రత్యక్షంగాను సంచరించుభాగం కొంత వుంది. నిద్రలోనున్నపుడు జరిగే దానికార్యరంగం బాగా అర్థమవుతుంటుంది. ఈగల్నీ గోముల్నీ విదిలించటంలాంటిది.

నిద్రలోనున్న రత్నం తనచేతిలోనున్న కోమల హస్తాన్ని అజ్ఞాతంగానే గట్టిగా బిగించాడు. ఆమె కొంచెం ఖంగారుచెంది పుస్తకాన్ని అలానే వదిలి నెమ్మదిగా తన హస్తాన్ని వదిలించుకో ప్రయత్నిస్తున్నది. "అబ్బ! యేమిటి చంద్రం!" అంటూ ఆ చేతినివిడువకుండానే ప్రక్కకు వత్తిగిలాడు. ఆమె తన రెండోచేత్తో పట్టి మృదువుగా వదిలించుకోవాలని యెంత ప్రయత్నించినా సంభవమవుటలేదు. రత్నానికి నిద్రమత్తు కొంత వదిలిందిగాని, నేత్రాలు తెరువదలచక చంద్రం తననిద్రను చెడుపదలస్తున్నాడని, పరిహాసంలోని కోపంతో తనచేతిని పట్టివున్న ఆ కుడిహస్తాన్ని పట్టి తనవెపుకు ఒక్క గుంజుగుంజాడు. సంకోచ బిడియ భయాలతో కుంచించుకుపోతున్న ఆమె అమాంతం రత్నంమీద

కొచ్చి పడిపోయింది. ఆమెచేతినున్న గడియారంగొలుసు వూడి గడియారంతోపాటు అతనిపట్టుకాలరుప్రక్కగా పడి లోపలకు జారిపోయింది. పగటినిద్రలోని బద్ధకం మరింత గాఢమైంది. నేత్రాలు తెరువకనే పరిహాసకాలలోని క్రోధాన్ని దంతాలతో బిగబడుతూ తనమీదపడినవ్యక్తిని తనబాహువులతో బంధించి అదుముతూ "నా నిద్రనుచూసి నోర్చలేకపోతున్నావా? నీవుపొందుతున్న ట్యూషనుకంటె నా నిద్రే విలువైంది. ఆ మేరీ నాకంటేకూడా చిన్నది. ఆవిడ చదివింది మెట్రికేనట. ఆమెకు నేనే ట్యూషను చెప్పగలను. ట్యూషనుకని ఆ ఆడపిల్లవద్దకెళ్ళటానికి నీకు సిగ్గయినాలేదూ?" అంటూ నిద్రబడలికలో మరింత నొక్కుతున్నాడు. ఆమె నిర్విణ్ణురాలయి ప్రాణాన్ని బిగబట్టి గాబరా చెందుతూ నిరాశ్రయురాలినలె శ్వాసవదులుతున్నది. ఆమె ముఖం రత్నాకరునిముఖానికి సన్నిహితమైవుంది. పాండ్సు స్నో, కూటికూరపవుడర్లు సుగంధం మిళితమై ఘుమాయిస్తున్నవి. నిద్రలోమునిగివున్న మనస్సులోని చైతన్యం సచేతనావస్థ చెందింది. తనబాహువులమధ్యనున్న శరీరంమీది దుస్తులు సిల్కు-నీనాన్‌వలె మృదుత్వాన్ని కల్పిస్తున్నవి. వెంటనే రత్నం నేత్రఫలకాలు వదులుచేసి చూశాడు. పౌర్ణమినాటి చంద్రబింబం తనముఖానికి ఆనివున్నట్లు చూసి, విభ్రాంతిచెంది బెదిరిన లేడివలె బాహువులువదలి ప్రక్కకుతిరిగి లేవబోయాడు. తన షర్టులోగుండా జారిన ఆమెగడియారం చైనుసహితంగా ప్రక్కనుండివృశ్చికంకొండివలె శూలప్రక్కన దిగబడింది.

"ఇస్, అబ్బా," అంటూ తత్తరపాటుతో లేచి నిలిచాడు. ఆమె పులినోటినుంచి బయటపడినదానిసలె దూరంగాపోయి నిలిచి గుండెలలోనిఅదురును, శరీరవణుకుని, పొందిన గాబరాను స్థిమితపర్చుకొంటూ సిగ్గుదొంతరులలో మరో ప్రక్క భీతినిబొందుతూ వోరగా అతనివైపు చూస్తున్నది. అజ్ఞాతంగా చేయరానికార్యాన్ని చేసినవానివలె భీతిలుతూ జాలినిగొల్పు దృక్కులతో ఆమెను తదేకంగా చూస్తూ, ఆమె తనవైపు చూసినపుడు తనదృష్టిని అధో ముఖంచేస్తూ అంతములేని ఆలోచనలతో వుక్కిరిబిక్కిరి అవుతూ, ప్రార్థనాపూర్వకకంఠంతో "క్షమించండి; చంద్ర కాంత అనుకున్నాను. మీరు వంటరిగా యిక్కడి కెలా వచ్చారు? అసలు మీ చేయి నా కెలా దొరికింది? ఇదంతా యెలా జరిగిందో అగమ్యంగావుంది. అతనే అనుకుని మహా పరాధంచేసికూర్చున్నాను, నన్ను క్షమించండి. ఈ విషయం చంద్రానికి చెప్పకండి. నాకు చాలా సిగ్గుగావుంది" అన్నాడు.

అంతకంటె గాబరాచెందుతున్న ఆమెకు యీ సవినయపల్కులు గిలిగింతలుపెట్టినట్లయి ధైర్యంగలిగిఅతనివంక జూసి "అయ్యో, అదేమిటి? మీ షర్టునుంచి రక్తంకారుతున్నది" అన్నది. అతనిమనస్సుచెందిన వికలంలో యీ బాధ కనిపించలేదు. తన శూలభాగానికి ఆమెగడియారం పైను గ్రుచ్చుకున్నచోటినుంచి రక్తంవచ్చి అతని షర్టుమూలను తడిపిక్రిందికి బొట్లుబొట్లుగా కారుతున్నది. తన కుడిహస్తంతో తడుపుకున్నాడు. ఫలితంగా అరచేయిఅంతా

రక్తంఅయింది. అతడు విమోఘునివలె ఆ చేతిని, క్రిందపడు తున్నరక్తాన్ని చూస్తూవున్నాడు. అతనిలో కదలిక మెదలి కలుగాని గాబరాగాని అదనంగా యేమీలేదు.

అతడు దీనకంఠంతో "ఏదో ప్రక్కలో గ్రుచ్చుకుంది" అన్నాడు. అతనినయనాలు అశ్రుపూరితాలయివున్నవి. ఆమె ఆప్రక్కవైపు చూసింది. అంతరక్తాన్ని బలిగొన్న తనగడియారమూ చైనూ విషసర్పమువలె శయ్యమీద మెరుస్తున్నవి. నీటితో పేరిన మంచుగడ్డవలె స్త్రీహృదయం జాలితో నిండివుంటుంది.

అతనిముఖము, ఆ రక్తమూ చూసి, ఆమె విచలితు రాలైంది; మనస్సులోని కరుణ కట్టలు తెంపుకుని పరవళ్ళు త్రొక్కుతున్నది.

రక్తమలా కారిపోతుంటే మీరు చూస్తూ వూరు కుంటారేమిటి?" అని, వణుకుతున్న కంఠంతో అని, ఆమె స్టాండుమీదున్న టవలునుతీసి కూజానీటితో తడిపి, పిండి వెంటనే అతన్ని పసిబాలకునివలె కుర్చీలోకూర్చుండబెట్టి, యెంగిలిచేతిని తుడిచినట్లు అతనిఅరచేతిని శుభ్రపరచి, అతని షర్టుని పైకియెగబట్టి, ఆ తడిగుడ్డతో రక్తాన్నితుడిచి, ఆ గుచ్చుకున్న చోట తడిగుడ్డతో అదిమివుంచి మరోచేత్తో దిండులోని దూదినిలాగి ప్రక్కనున్న గ్లాసులోని నీటిలో ముంచి పిండి, ఆరక్తంస్రవిస్తున్నచోట దూదినుంచి పొడి టవలుతో నడుముచుట్టూత్రిప్పి బ్యాండేజికట్టింది. అతను "మీ గడియారం చెడిపోయిందిలాగుంది"అన్నాడు.

ఆమె మందహాసాలొలికిస్తూ "పోనీండి! మీ రక్తాన్ని

బలిగొన్నందుకు అది యెంత చెడిపోయినా ఫరవా లేదు" అన్నది.

ఆశ్చర్యాన్వితునివలె "మీ గడియారం మక్కడి కెలా పోయింది?" అన్నాడు.

చిరునగవుతో "నే నిక్కడి కెలా రాగలిగానో అదీ అలానే అక్కడికి చేరింది" అన్నది.

అపరాధివలె సిగ్గుదొంతరులతో కుంచించుకుంటూ "మీ చేయి యెందుకు పట్టి లాగానో తెలియకుండా వుంది. నన్ను క్షమించండి మేరీదేవిగారూ" అన్నాడు.

అతని ఆమాటలలోని అమాయకత్వానికి ముగ్ధురాలవుతూ "నేను దేవీదేవతలలో చేరినదాన్నిగాదు. నా పేరు మేరీజాన్" అంటూ ఆయనచేతిమణికట్టునద్దనున్న రక్తపుమరకను తన వ్రేళ్ళతో తుడుస్తూ "మీ చేయిలలా వణుకుతున్న వెందుకు? భయపడకండి. నన్ను వూపిరి సలుపనంతగా బాహువులతో బంధించి, బిగించావు. నిజం చెప్పు, నేనని తెలియకేనా అలాచేసింది?" అన్నది.

"లేదు లేదు; మీరొచ్చినసంగతే నాకు తెలియదు. చంద్రకాంత అనుకున్నాను. నన్ను విశ్వసించండి, క్షమించండి" అన్నాడు.

"పోనీ, మీరు ఖంగారుచెందవలసినఅవుసరంలేదు; మీ దుస్తులంతా రక్తపుమరకలయినవి. ముందు వాటినివిడిచి మంచివి ధరించండి. నే నెవరితోను యీవిషయం చెప్పను. మీరు కోరేది అంతేగా?" అన్నది.

ఆయన కొంచెం స్థిమితపడినవానివలె ఆమెపంక

తదేకంగా చూశాడు.

మేరీజాన్ కొరకు యెదురుచూచి చూచి విసుగుచెందిన చంద్రం క్లబ్‌నుంచి సాయంత్రం 6గంటలకే గదికి చేరాడు. కాని ఏదో కోల్పోయినవానివలె అతనిముఖంలో నుంచి వ్యధ తొంగిచూస్తున్నది.

"ఇవ్వాళ నీ ట్యూషను చాలా తొందరగా అయిపోయింవిలాగుంది, వేళకాకముందే వచ్చావు?" అన్నాడు రత్నం.

దిగజారినకంఠంతో "ఇవ్వాళ ట్యూషనుకు వెళ్ళలేదు. అలా తిరిగివచ్చాను" అన్నాడు.

"నేటికయినా నీ కా జ్ఞానం కలిగినందుకు చాలా సంతోషం. నిజంగా నీకు ట్యూషనుచదవాలనివుంటే, యోగ్యుడైన మగవానిదగ్గర చేరు గాని, ఏమీ తెలియని స్త్రీవద్దచేరి నాకూ తలవంపులు తేవాకు" అన్నాడు రత్నం.

గంటలతరబడి నిరీక్షణలోవుండి విరామంలేనిఆలోచనలతో విసిగి నిస్పృహతో గదికిచేరిన చంద్రంమనస్సుకు ఇప్పుడేవిషయాలూ యెక్కలాగులేవు. శయ్యమీదపడి ఒక దీర్ఘనిట్టూర్పువిడుస్తూ అటూయిటూ దొర్లి బడలికనుపోగొట్టుకుంటున్న అతనికంట పృథ్వీమీదున్న రక్తపుమరకలుపడినవి. ఆశ్చర్యాన్వితుడై మరింతగా పరిశీలించి "రత్నం,యిక్కడ రక్తబింసువులు పడినట్లున్న దేమిటి?" అని ప్రశ్నించాడు.

రత్నం క్షణంపాటు తటపటాయించి "అపరాహ్నసమయంలో యేమీతోచక బ్లేడుతో గోళ్లుకోస్తుంటే చిగురంటి కారింది" అన్నాడు.

"అరే, అంత కష్టమూసుకు యెలా కోసుకున్నావు? చీముపడుతుందేమో మందయినా వేయించాలి. యెక్కడ, నన్ను చూడనివ్వు" అని ఆత్రుతతో లేచాడు చంద్రం.

రత్నం చిక్కులోపడి, తోచక "అది సరే, యేమి జేస్తుందిగాని, మధ్యాహ్నం నీ కేదో వుత్తరంవచ్చింది చూశావా?" అని జేబు తడువుకోసాగాడు రత్నం. ఈ చిక్కునుంచి తప్పుకోను ఆ వుపాయంపన్నాడు. అనుకున్న పని జరిగింది. నిరీక్షణచేసి వచ్చిన చంద్రాని కిది గొప్ప వుత్సాహాన్నిచ్చింది. తను యెవరికొరకు అంత నిరీక్షణచేసి వచ్చాడో, అక్కడినుంచే ఆ వుత్తర మొచ్చివుండవచ్చునని అతని ఆశ. రత్నం తన జేబుతడవి, డ్రాయరుచూసి యెక్కడో వేసి మరచినట్లు నటనాప్రయత్నంచేస్తున్నాడు.

చంద్రం ఆదుర్దా ఆగేదిగాదు. తనస్వహస్తాలతో పరిశోధన ప్రారంభించాడు. డ్రాయరు, అలమరా అంతా వెదికాక, రత్నం విడిచివేసినషర్టుజేబులో వుండేమోనని మూలనున్న కేస్‌బుట్టలో చేయివేస్తుండగా రత్నం అధీరుడై యేదో చెప్పాలని ప్రయత్నించాడు కాని, చంద్రం తొందరగా చొక్కాలాగాడు.

ఆ దుస్తులనిండా రక్తమున్నది; తడి యింకా ఆరలేదు. చంద్రంనేత్రాలు చెదరినవి. విభ్రాంతపోయాడు. నోట మాటా పలుకు లేదు.

ఒక దొంగతనాన్ని కప్పిపుచ్చను చేసే ప్రయత్నాలలో అంతకుమించిన అనేక దొంగతనాలు బయటపడటం కద్దు.

మ్లానముఖావివశతతో బిత్తరపోయిన రత్నాకర్ సరసర చంద్రంకడకు చేరి, ఉదాసీనకంఠంతో "అది నా రక్తమే. తెరచిన పెన్ పక్కమీద వుంది. అదాటుగా నిద్రలో వత్తిగిల్లినపుడు శూలపాత్తిదగ్గిర పొడుచుకున్నది." అంటూ తనకట్టును విప్పి చూపాడు.

రవంత స్థిమితాన్ని పొంది "అయితే రక్తం ప్రక్కలో కారాలి గాని, క్రింద బొట్టులెందుకుపడినవి?" అన్నాడు.

"ఆ బాధకు పడుకోలేక లేచి యేమీతోచక అక్కడ నిలిచాను. అందువలన అక్కడ బొట్టులుపడినవి" అన్నాడు.

రత్నాకరునిమనస్సుకాలేజీలోపనిచేయుటలేదు. ఎంత మరచిపోవాలన్నా, నిద్రలో తానామెచేయిపట్టిగుంజటము, ఆమె తనపై పడిపోవటము, తాను కవుగిలిలో బంధించి బిగించటము, తన కప్పుడనుభవమైన ఆకమ్మనిసుగంధాలు ఆతరువాత సంభవించిన సపర్యలు, కల్పించిన స్వాంతనలు పదేపదే స్మృతిపథంలో దొర్లుతూ అర్థంగాని అనుభూతినిస్తున్నవి. క్లాసులో లెక్చరర్స్ యిస్తున్న పాఠాలనిర్వచనలు పేలవంగా కాకిగోలగా తోస్తున్నవి. ఇంత అనుభవంతో యెన్నో డిగ్రీలతో యిస్తున్న యీ వుపాధ్యాయులబోధనల ముందు ఆ చిన్నియువతి యెంత! అలాంటి ఆ స్త్రీవద్ద ట్యూషనట! యెంత హాస్యాస్పదం! అని మనస్సులోని మరో ప్రవృత్తి అనిపించింది. ట్యూషననేపేరుతో అందమైన ఆ యువతితో సరససల్లాపాలాడు అవకాశాన్ని పొందటమేమో అని మరో ప్రవృత్తి వినిపించింది. ఒకవేళ ఆమె సమర్థురా

లైనా స్త్రీగదా, ఆమెవద్ద ఉట్యాపననుట యెంత అవివేకం? తనను తాను న్యూనతపరచుకోవటంగదా అని వేరొక ప్రవృత్తి ప్రలాపించింది. ఇలాంటి విరుద్ధధ్వనులతో అతని హృదయం చీకాకు చెందుతున్నది. క్లాసులోని పాఠాలు అందరకు జరుగుతున్నవి గాని, రత్నాకర్ మనస్సు అటుపోవుట లేదు. స్వాతంత్రతఆలోచనలలో మునకలు వేస్తున్నది.

ఈ అనవసరమైన ఆలోచలతో యెందుకు, యిక వాటికి స్వస్తిచెప్పాలి, అనుకొంటూ కాలేజీనుంచి గదికిచేరి, పక్క మీద అటూయిటూ దొర్లుతూ, ఆనాటి ఆలోచనలనేచేస్తూ తనలోతానే నవ్వుకుంటూ ఆనందాన్ని పొందుతున్నాడు. ఆనందానికి కావలసిన ఆలోచనలు స్మృతులుకూడా మానవ సంపత్తిలో అతిముఖ్యమైనవి. వేటిద్వారా అత్యధికఆనందాన్ని పొందుతుంటాడో వాటిని హీనంగాను హేయంగాను పరిగణిస్తూ, వాటిలోనే మునిగి ఆనందాన్ని పొందుతుండుట పరిపాటి.

"మీ గదికి వెళదాం పదండి" అని మేరీ ప్రస్తావించినపుడు చంద్రం సంభ్రమాశ్చర్యాన్వితుడయి, కొద్దిక్షణాల పాటు వెలవెలబోయాడు. "అక్కడే కొంతసేపు కూర్చోవచ్చు" అని తిరిగి అన్నదామె.

సాయంసమయం. 6గంటల టయమైంది. బయటంతా విద్యుద్దీపకాంతి ప్రసరిస్తున్నది. కాని తమగది అంధకార నిలయమైవుంది. ఇరువురు గదిముందుకు వచ్చి నిలిచారు. "మీ జైలుపార్ట్నరు లేరులాగుంది" అన్నదామె.

గదితలుపు తీసేవుంది. చంద్రం గదిలో ప్రవేశించి

స్విచ్ వేశాడు. రత్నం ప్రక్కమీదినుంచి నెమ్మదిగా లేస్తున్నాడు.

"స్విచ్ వేసుకోనుకూడా ఓపికలేని సోమరితనంలోని సాక్షాత్తులు. మీరు" అని గలగల నవ్వుతూ ప్రవేశించింది మేరీ. "మా రత్నం నిద్రలో కుంభకర్ణుని కాంకర్ చేయగల విజేత. నిద్రలో గాయపడి దుస్తులంతా రక్తమయమైనా తెలియలేదు" అని ఫుత్సాహితుడై ఆమెవంక చూశాడు చంద్రం.

ఆమెముఖం మ్లానతచెంది వెలవెలబోతున్నది. క్షణంలో అధోముఖంచేసుకున్నది. పాదాలు అదురుతున్నవి.

"మీరలా ఉదాసీనులవుతారెందుకు? ఆ రక్తమెలా కారిందో అడుగనైనా అడుగరేమిటి? (ఈమాటలు వింటున్నపుడు, ఆమెహృదయం మరింత కంపిస్తున్నది.) మా రత్నం తెరచిన పెన్ పక్కమీద పడవేసుకుని మర్చి, నిద్రపోయి అటూయిటూ పొర్లినపుడు శూలపొత్తిలో ఆ కలం పాళీ దిగబాడుచుకున్నదట. గుడ్డలన్నీ రక్తమయం. పైగా నాకు తెలియకుండా దాయాలని ప్రయత్నించాడు." అని మందహాసంతో అన్నాడు చంద్రం.

పెద్ద అవాంతరాలతో ఘాపులతో కుదిస్తూ సురక్షితంగా దిగిన విమానంలోని యాత్రికునివలె మేరీముఖం విప్పారింది. ఆమెహృదయంలోని తత్తరపాటు చెదరిపోయింది. మందస్మితురాలై రత్నాకరుని క్రీగంటచూస్తూ నిర్దిష్టస్థానంలో ఆసీనురాలైంది. ఆమెకుప్రక్కగా కుర్చీ వేసుకు కూర్చున్నాడు. రత్నాకర్ బడలిక ఫుదాసీనత

లతో అరమరలోంచి గీతాంజలిపుస్తకాన్ని చేతబట్టి అర మరయెదుటికే కుర్చీలాగి కూర్చున్నాడు.

"మా రత్నాకరునికి ట్యూషనంటే చాలా చిరాకు. ట్యూషన్ను వినుటవలన మెదడులోని చురుకుదనం పోతుం దంటాడు." అని చిన్నగా నవ్వుతూ రత్నంవైపు చూస్తు న్నాడు చంద్రం.

తనయెడల రత్నాకరునికున్న నిరాదరము నిర్లక్ష్యము తనను బాహువులలో పొరపాటుగా బంధించినపుడు పలికి నపలుకులు వరుసగా మేరీమనస్సులో మెదిలినవి.ఆయనలోని గర్వంకూడా ఆభాసగా ఆమెముందు జిలిబిలినృత్యం సలుపు తున్నది.

"వారిమాటలు యథార్థసత్యాలు. తెలిసినవిష యాన్ని అర్థమయినవిషయాన్ని ఆ రూపంలోనే తిరిగి తిరిగి వినిపించినందువలన వినగడతో బండవారి చురుకుదనం పోతుంది. కాని ఆ విన్నవిషయాన్నే పాతవిషయాన్నే నూతనరూపంలో నూత్నభావ వివర విశేషాలతో వినూత్న త్వాన్ని కల్పించి వివరించునపుడు మనసులోనిచురుకుదనం పోవటానికిబదులు వికసిస్తుంది. అలా విన్నవిషయం హృద యంలో శాశ్వతముద్రికలను వేసుకుంటుంది." అన్నది మేరీ అతి కమనీయమైనకంఠంతో.

రత్నాకర్ పుస్తకం తెరచి పేజీలో దృష్టిపుంచాడు గాని, మనస్సులో ఆమె చెబుతున్నవిషయాలు దూరు తున్నవి. అయినా పట్టుదలతో పుస్తకంవైపే చూస్తున్నాడు.

మేరీ చంద్రంవంక ఒక నవ్వుప్రదర్శనను విసరి,

నెమ్మదిగా లేచి రూమును తేరిపారచూస్తూ అడుగులో అడుగు వేసుకుంటూ, రత్నాకర్ కుర్చీదగ్గరకొచ్చి, ఆయన చేతిలోని పుస్తకాన్ని యెంతో చనువుతో పట్టుకు తీసుకుని, ఆయనచదువుతున్న పేజీలోనుంచే రెండుపద్యాలు ఆమె పెద్దగా చదివింది. అవి గీతాంజలిపద్యాలు. ఆమె చదువు చున్న ఆ వరవడి, ట్యూను, వుచ్చారణలు అత్యద్భుతంగా మాధుర్యాన్నొలికిస్తున్నవి. తా నెన్నోమాయిలు చదివినా అందు తన కెన్నడూకలుగని అనిర్వచనీయమైన ఆనందాను భూతి గలుగుతున్నది. నూతనభావము, వుద్బోధ, వెలుగు అందు గోచరమవుచున్నవి. మంత్రముగ్ధునివలె మేరీవైపే చూస్తున్నాడు రత్నాకర్. ఆమె అతనివైపుచూసి, మంద హాసాలొలికిస్తూ వినయాన్నిప్రకటిస్తూ "గీతాంజలంతా మీరు చదివారా? నేను మీకంటె తక్కువ చదివిన దాన్ని అయినా, చనువుతో అడిగినందుకు మరేమీ అనుకో కండి. ఠాగూర్ రచనలలో అత్యుత్కృష్టమైంది గీతాం జలి." అంటూ ఆమె కవిస్వభావాన్ని అనుభవాన్ని జీవిత రహస్యాన్నీ సంక్షిప్తరూపంలో అతి నైపుణ్యంగా వివరించి ఆతనుపరి ఆ గ్రంథపరిచయాన్ని అందలి తత్వరహస్యాన్ని సమూలంగా సవివరంగా అతిరమ్యంగా ఆహ్లాదాన్నిగొలుపు మధురశైలిలో వినిపించింది. రత్నాకర్ తనను తాను మరచి అనభిజ్ఞపసివానివలె అధరాలువదులుచేసి నేత్రాలుపెద్దవి చేసి యేకాగ్రంగా వింటున్నాడు. ఆయనమనస్సు ఆయన అధీనంలో లేదు. మేరీ అభిప్రాయప్రవాహంలోపడి కొట్టుకు పోతున్నాడు. ఆమె గొప్ప వేదాంతివలె, మహాపండితురాలి

వలె, అనర్ఘళమైనవక్తవలె, మహాతపస్వివలె, యోగినివలె, ఒక ప్రవక్తనవలె, జ్ఞానివలె గోచరిస్తున్నది. కఠినాతికఠినమైన భావాలుకూడా ఆమెనోటిగుండా అతిసరళంగా సునిశితమైన శబ్దాలతో హృదయానికిహత్తుకొనునట్లు మధురరూపంలో ప్రవహిస్తూ ఆకర్షిస్తున్నవి.

ఆమె తన నిర్వచనను సమాప్తంజేసి, గలగల నవ్వుతూ పుస్తకాన్ని తిరిగి రత్నంచేతికిస్తూ "నా భావాలు నేను చెప్పటము, మీకు నచ్చలేదు గాబోలు. తప్పులను వెతికి గేలిచేయకూడదు సుమా! నచ్చినదానిని స్వీకరించి, మిగతదాన్ని విసర్జించి మర్చిపోవాలి. నేను కాలేజీలలో చదివినదాన్ని కాదుగదా !" అన్నది.

రత్నాకరుని కిప్పటికి మనస్సు మనస్సులోకి చేరింది గాబోలు, వ్యాకులపాటుతో ఆ కుర్చీలోంచి లేచి ఆదరాభిమానాలొలికిస్తూ "ఇక్కడ కూర్చోండి, మీ మాటలఝరిలో నన్ను నేను మర్చిపోయాను, ముందు మీరు కూర్చోండి." అన్నాడు.

"మీకు మర్యాదచేయు లేదని కించపడేస్వభావంగాదు నాది. ఎక్కువ మర్యాదచేయాలని ప్రయత్నిస్తేమాత్రం నాకు బాధకలుగుతుంది. అయినా, మాటలలో చాలా టయము గడిచిపోయింది. యిక నేను వెళ్ళివస్తాను." అంటూ ఆమె, బయలుదేరింది. మంత్రముగ్ధునివలె మాఱుపలుకజాలక బజారువరకు ఆమెను అనుసరించాడు.

రత్నాకర్ అటూయిటూదొర్లుతూ, తలగడను అనేక కోణాలలో మారుస్తూ, నేత్రాలుమూసి మీద చేతులుం

చుకుని, నిద్రకొరకుచేస్తున్న ప్రయత్నాలు విఫలమవు తున్నవి. ఆలోచనలవుద్ధృతంలో మనస్సు వేడెక్కి నేత్ర ఫలకాలు వాటంతటవే తెరచుకుంటున్నవి. తను యెవరిని నిర్లక్ష్యంచేశాడో, నిరాదరంగా చూశాడో, హాస్యాస్పదంగా తలంచాడో, ఘృణీకరించుకున్నాడో ఆమె తనమనస్సుమీద సవారీచేస్తున్నది, తనను మంత్రించి నృత్యంచేయిస్తున్నది. ప్రభావవాహినిలో పడదోస్తున్నది. యోగ్యతాపత్రాలలోనే విజ్ఞానసంపత్తి లేదని, అనుభవంలోనే వికాస ప్రభావాలు లేవనీ, బుద్ధివికసితవిజ్ఞానం విశేష శక్తివంతమైందని, అది విద్యానిధులందరిలోకూడా ఆవిర్భవించదని నేడతని కవగత మయింది.

తనకు గీతాంజలిలోని అనేకపద్యాలు కంఠస్థమేగాని, నేడు వాటిలోనిమాధుర్యం తనను పరవశంచేస్తున్నది. ఆమె వాటికికల్పించినపరిభాష అమోఘమైంది. ఆ పరిభాష అతని బుద్ధిమీద చెరగని మధురముద్రలను చిత్రించింది.

ఇంతకుముందు ఆమెనుగురించి తా నూహించిన న్యూనభావాల కిపుడు సిగ్గిలుతున్నాడు. రాళ్ళలో పుట్టునదే రత్నముకూడా. కాని రత్నమువిలువ విశిష్టమైందని తెలి యక రాయిగా భావించట మెంత అపరాధము! అని ఆత్మ గ్లాని పొందుతున్నాడు రత్నాకరుడు.

రాత్రల్లా నిద్రలేక తెరపిలేని ఆలోచనలలోమునిగి గడిపినందున తెల్లవారి నేత్రాలు యెర్రనిజ్యోతులవలె మెరు స్తున్నవి. తెల్లవారి 8 గంటలయినా అలసినవానివలె బడలిక నిస్త్రాణలవలన శయ్యమీదే వుండిపోయాడు. టాయిలెట్

అయిన చంద్రం ఒకమాటు తిలకించి "నీ కళ్ళు అంత యెర్రగావున్న వేమిటి?" అని ప్రశ్నిస్తూ అతనిహస్తాన్ని పట్టి "అబ్బ! చాలా జ్వరంగావున్న దిలాగుంది రత్నం! ఈ రోజు నీవు కాలేజీకి వద్దు. విశ్రాంతితీసుకో. కాఫీమాత్రమే తీసుకుని వూరుకో" అని చెప్పి వెళ్ళిపోయాడు.

రత్నం మంచంమీదవుంటూనే వారంరోజులు గడిచి పోయినవి. జ్వరం తగ్గలేదు. శూలపొత్తివద్ద తగిలినగాయం బరువుచేసింది. చీముపట్టి నొప్పిగా వుంటున్నది. చంద్రం యేర్పాటుచేసిన డాక్టరు రోజూ వచ్చి పరిశీలనచేసి పెన్సిలిన్ యింజక్షన్‌యిచ్చి పోతూనేవున్నాడు.

ఈ గాయపుబాధను జ్వరబాధను మరపించి అనుక్షణమూ ఆనందాన్నిగల్పించు తారకమంత్రమొకటి లభ్యమైంది రత్నాకరునికి. అతని కీ జబ్బు,పడకవాంఛనీయమైంది గానే వున్నది. ఇంత తీరుబడిగా హాయిగా ఆ తారకనామస్మరణలో ఆనంద్యాన్నిపొందే అవకాశం ఆ పాడుకాలేజీకి పోతే లభ్యంగాదుగదా అని అతనినిశ్చయము. అతనుజపించే తారకనామము మరేమీగాదు. మేరీ తనకు పరిచయమైనప్పటినుంచి సంభవించిన ఆమెసంపర్కఘటనలు, తనవిశుద్ధభావాలు మాత్రమే. ఒక రైతు నారుపోయుట, నాటుట, కోయుట, నూర్చి ధాన్యం యింటికిచేర్చుట, తిరిగి తొలకరిలో నారుపోయుట, నాటుట, కోయుట, నూర్చుట,-ఇలా జీవితాంతం చేయుటలోనే నిర్వహణానందాన్ని కర్తవ్యానందాన్ని పొందునట్లు అతను తనజీవితంలోని ఆమెసంపర్క-

పుటలను తిరుగవేస్తూ వల్లెవేస్తూ మహదానందాన్ని పొందు తున్నాడు.

రోగాలన్నా రోగులన్నా చంద్రానికి భీతి ఒకప్రక్క, చీకాకు మరోప్రక్కా యెక్కువ. అందుకని రత్నాకరునికి డాక్టరునిమాత్రం యేర్పాటుచేసి, తాను వీలయినంత తప్పుకుతిరుగుతున్నాడు. అపుడపుడు రూముకు రావటం కూడా మానుకుంటున్నాడు. రోగికోరిందే డాక్టరూ చెప్పా డన్నట్లు రత్నంకోరుతున్నదికూడా ఏకాంతమే. తనజీవితానికి నూత్నంగా సంభవించిన యీ ఆనందానుభూతిలో ఆకలి దప్పులు తెలియుటలేదు.

ఉదయం పదిగంటలసమయ మది. అంతకుముందే చంద్రం కాలేజీకి వెళ్ళిపోయాడు. మేరీ గదిముందుకొచ్చి తటపటాయిస్తూ ఒకొక్క అడుగేవేస్తూ గదిలో ప్రవేశిం చింది. ఆనాటి అపరాహ్నసమయంలో పరున్నచోటే రత్నా కరుడు పరుండివున్నాడు. ఆనాటిదృశ్యం ఆమెమనస్సులో మెదిలి, కొంచెం కంపించి వున్నచోటేఆగిపోయి "రత్నా కర్ గారూ." అని పిలిచింది. రెండోవైపుకు తిరిగి పరుండి, స్మృతులను నెమరువేసుకుంటున్న ఆయన కర్ణరంధ్రాలలో కమనీయమైన యీ పలుకు పడినపుడు విచలితుడై శిరస్సు త్రిప్పి చూశాడు.

"మీరా! రండి రండి మేరీదేవిగారూ" అన్నాడు.

"దేవి అన్న శబ్దం నాపేరుకు జోడించి ఆ శబ్దాన్ని హీనపరచవలదని యిదివరకే చెప్పాను. మీకు సుస్తీగా వుందని నిన్ననే విన్నాను. చాలాచిక్కిపోయారే," అన్నది.

ఆయన బలవంతంగా లేవబోయాడు గాని, ఆమె నివారించింది.

ఆమె మంచంప్రక్కగా కుర్చీవేసుకు కూర్చుని, ఆయనలలాటంమీద చేయివేసిచూసి, "అబ్బ!జ్వరం మండిపోతున్నది. ఏమిమందు తీసుకొన్నారు?" అన్నది.

అతని నయనాలు అశ్రుపూరితాలయి, ఒక్కొక్కబొట్టే కనుకొలుకులగుండా కారుతున్నవి. ఆదరంలభించినపుడు అశ్రువులొలుకుట మానవసహజం.

మనస్సులోనే అతనిఅర్భకతకు అమాయకతకు ముగ్ధురాలవుతూ "అధైర్యపడకండి రత్నాకర్‌గారూ, మీ జ్వరం వూరికే తగ్గిపోతుంది. భయంలేదు. ఆకలిగావున్నదా చెప్పు?" అన్నది.

"ఆకలిలేదుగాని, దప్పిక విశేషంగావుంటున్నది" అని మద్దకంఠంతో అన్నాడు.

ఆమె వెంటనే లేచి, దొడ్డివైపుకెళ్ళి ఆ యింటిలోని మామూలుస్త్రీవలెనే పనిమనిషిని పిలిచి తోడుపెరుగు తెప్పించి, మజ్జిగచేసి త్రాగించింది.

"నీవు మజ్జిగ యెన్నిత్రాగగలిగితే అన్ని త్రాగు. జ్వరం అదేపోతుంది" అని ధైర్యాన్ని పురిగొలుపుకంఠంతో అన్నది.

లభించిన కొండంతఆదరము, మజ్జిగతో రత్నాకరునిలో గొప్పశక్తి వుత్పన్నమయింది. పూరించుకుని వినయపూర్వకకంఠంతో "మిస్ మేరీ, నేను మిమ్ము అర్థంచేసుకోక, మీ అపారప్రజ్ఞ తెలియక చులకనగా తలంచి,

యేమేమో అన్నాను, హీనంగా చూశాను. నన్ను క్షమించండి" అన్నాడు.

"జ్వరంలో మీకు మతిపోలేదుగదా ? నన్ను మీరు హీనంగాతలచిందీలేదు, అన్నదీలేదు. క్షమాపణెందుకు?" అని మందహాసంతో అన్నది.

"లేదు లేదు. మీయడల నేను అలక్ష్యంగా ప్రవర్తించాను, అసభ్యంగా తలచాను" అన్నాడు.

మందస్మితవదనంతో "ఓహో, మీ మనస్సులో నన్ను అసభ్యంగా తలచారా? అయితే నాకు తెలియని మీ అభిప్రాయిత్యాలగూర్చి యిపుడు చెప్పి క్షమాపణకోరవలసినపనిలేదు" అన్నది.

ఆమెహస్తాన్ని పట్టుకుని, "కాదుకాదు, అలా అని తప్పించుకుని నన్ను బాధించకండి. మీరు క్షమించానంటే నాలోనిబాధ పోతుంది." అన్నాడు.

అతనిచేతిలో బందీగానున్న తనహస్తాన్ని చూస్తూ, చిరునగవును చిలికిస్తూ, ప్రథమంగా తనకు హోటలులో కనిపించుట, ఆతరువాత దారిలో తనహస్తాన్ని యిలానే పట్టుకుని తనాగది చూడను ఆహ్వానించుట, మొదలగు స్మృతులను తలపోస్తున్నది.

"ఆఖరిసారిగా వినతిచేసుకుంటున్నాను, క్షమించరా?" అని పసివానివలె అడిగాడు. ఆమె వుబికివస్తున్న నగవును ఆపుకుంటూ, తనచేతివైపే చూస్తున్నది. ఆమె చూపును గ్రహించి తనపొరపాటును తెలుసుకుని విచలితుడై అధరాలునొక్కుకుంటూ ఆమెహస్తాన్ని విడచి "పొరపా

టండి, పరధ్యాసలో తెలియలేదు," అని చిన్నబుచ్చుకున్న ముఖంతో అన్నాడు.

"మీ అసలైనఅపరాధాన్ని యిపుడు తెలుసుకున్నారు, అందుకు సంతోషం," అని గలగల నవ్వింది.

"పోనీ, యీ తప్పునైనా క్షమించండి" అన్నాడు.

"దీనికి క్షమాపణెందుకు రత్నాకర్ గారూ? ఇది పరధ్యాసలో జరిగింది గనుక, దీనికి క్షమాపణ అనవసరం" అన్నది.

"ధ్యాసలో చేసినా, పరధ్యాసలో చేసినా అపరాధము అపరాధమేగదా! కనుక క్షమాపణ అవుసరమే" అన్నాడు.

"క్షమాపణకొరకు మీ రంత వాపోతారెందుకు? అపరాధానికి పశ్చాత్తాపము ఆఖరి నిష్కృతి. ఆమీాదట క్షమాపణ లనవసరం" అన్నది.

"పశ్చాత్తాపము అపరాధిని దహింపజేస్తుందిగాని, స్వాంతనను కల్పింపజాలదు, క్షమాపణే అపరాధికి ఆఖరి పరిష్కృతి మిస్ మేరీ" అన్నాడు.

"అపరాధం లేకుండా నే కలవరపాటుతో గాబరా చెంది క్షమాపణకోరిన భీరువుకి క్షమాభిక్ష సునాయాసంగా యిచ్చి, అపరాధాని కనకాశం కల్పించటమవుతుందేమో?"

"సరళసమస్యను చిక్కుగాచేసి కఠినరూపంకల్పించి, కఠోరశిక్షనివ్వటం వివేకమూగాదు, ధర్మమూగాదు"

"పోనీ, సమస్య సరళమైందే; నన్ను గురించి మీ మనస్సులో తలపోసిన అపభ్రంశాలు నాకు తెలియనివికనుక

నాటికి నా క్షమాభిక్ష అనవసరం. నాకు తెలిసిన మీ చర్యలు నన్నెక్కడా యెప్పుడూ క్షోభింపచేయనపుడు, అవి అపరాధాలు కాజాలవుగదా, క్షమాపణ యింకా యెందుకు చెప్పండి?" అన్నది.

సిగ్గుదొంతరులలో కుంచించుకుంటూ నేత్రాలను ఊర్ధ్వంచేసి, మ్రింగుతున్నశబ్దాలతో "మీలో యింత భాషాజ్ఞానము, భావజ్ఞానము, ఆదరాభిమానాలు వున్నవని తెలియక చులకనగా తలంచి నిర్లక్ష్యంగా ప్రవర్తించాను. ప్రగల్భాలాడాను. ఆరోజు మిమ్మ చంద్రంగా తలంచి, నిద్రలో నామీదకు లాక్కున్నాను. అటుయిటూ బాహువులతో నలిపివేశాను. అపుడే యేమో ప్రలాపించాను కూడా. అవన్నీ మహాపరాధాలని మీకు తెలుసుకనుక, క్షమాపణకోరుతున్నాను." అన్నాడు.

"వరుసగా అపరాధాలుచేసినవాడు క్షమాపణ కోరుతూ మరో అపరాధంచేసినపుడు యేధైర్యంతో క్షమించగలరు చెప్పండి ? తేలిగ్గా క్షమిస్తే ఆ అపరాధి అలవాటు పడిపోవచ్చుగదా" అన్నది.

"క్షమాపణకోరుతూ చేసిన మరో నూతనఅపరాధ మేమిటండీ?" అన్నాడు.

"మీరు యింతకుముందే నా చేయిపట్టుకుని యెంతో సేపు విడువలేదు. అది అపరాధంగాదా చెప్పండి" అని అంటూ ఆమె కిలకిలనవ్వింది.

రెప్పపాటులో అతనిముఖమండలమంతా మ్లానత చెందింది. నేత్రాలు వెలవెలబోతున్నవి. దంతాలతో అధ

రాలుకొరుకుక్కుంటూ, తన కుడిఅరచేతిని లలాటంమీద వేసి రుద్దుకుని అదురుతున్న అధరాలతో, హస్తద్వయంజోడించి, రుద్ధకంఠంతో "నేను మతిలేనిహీనుణ్ణి; గమనంలేకుండా చేశాను. అపును నిజంగా నేను క్షమార్హుణ్ణిగాదు. నాకు అతికఠినమైన శిక్షనివ్వండి" అన్నాడు.

ఆమెహృదయం ద్రవించి, నేత్రాలుసజలమయ్యాయి. అతనికంటపడకుండను గాబోలు ముఖం కొంచెం ప్రక్కకు త్రిప్పి, పక్కమీద వోరగా కూర్చుంటూ అతనిహస్త ద్వయాన్ని పట్టుకుని, కరుణపొర్లుతున్నకంఠంతో "అలా మాట్లాడబోకు. నీ హృదయం పవిత్రమైంది, నిర్మలమైంది. నీయడల నాకు అత్యధిక ఆదరము అభిమానము వున్నవి. నిన్ను క్షమించవలసినఅవుసరంలేదు. నిన్ను క్షమించా ననటం నన్నునేను న్యూనతపర్చుకోవట మవుతుంది. అయినా నీవు ఆవిషయంలోనే పట్టుబడితే ఒకమాటుగాదు, క్షమించానని యెన్నిమాటులైనా చెప్ప సంసిద్ధురాలను" అన్నది.

"నా కిక జ్వరం త్వరగా నయమవుతుంది. నాహృద యంలో అర్థంగాని బాధ యేదో వున్నది. అది యిపుడు అదృశ్యమైంది. మీలో యింత విజ్ఞానసంపత్తి ఘనీభవించి వున్నదని నేను కలలోకూడా అనుకోలేదు" అన్నాడు.

దంతాలు అధరాలు బిగబడుతూ తనహస్తాలలోని ఆతనిహస్తద్వయాన్ని ఝాపుతూ, "అవును, మీలాంటి కొందరికి యితరులను మలకనగాతలంచుటలో యెంత ఆనందమో అంతకుమించినఆనందం పొందుతారు పాగ

డుతూకూడా. అసలా విషయం మామూలైందేగాని, దాన్ని నిరసించి, ఆతరువాత విభ్రాంతిలో మితిమించి పొగడటం పరిపాటి" అన్నది.

"ఊహలో పొరపాటు యెవరికయినా వుండవచ్చు. వాస్తవికం తెలుసుకున్నపుడు విస్తుపోవటం సామాన్యంగదా! నిజంగా మీ నిర్వచనాశైలి, పద్ధతి అసామాన్యమైనవి. నా మట్టుకునేను ముగ్ధుణ్ణయిపోయాను. మీరు వ్యాఖ్యానము చేస్తుంటే అది యెంత నిగూఢమైనదైనా అతిసరళమై సామాన్యమై హృదయానికి హత్తుకుంటూ రంజింపజేస్తుందని స్వానుభవముపొందాను. పాఠం సంపూర్ణంగా అర్థంగానపుడు కంఠస్థమైనా నిష్ప్రయోజనము. మీరు యెంత కఠిన పాఠాన్నయినా ఒక్కమాటు చెప్పాక తిరిగి చదువకుండానే ఆ పాఠాన్నిగురించి సమాలోచనలు వ్రాయవచ్చునని నేను ఘంటాపథంగా చెప్పగలను" అన్నాడు.

"ఒక్కమాటుగా భట్రాజయిపోకండి. ఒకరిని గురించి అంతగా పొగడగూడదు. ఆతరువాత పశ్చాత్తాప పడవలసివస్తుంది. ఎవరిని హేయంగాచూస్తామో వారు సన్నిహితులయినపుడు హృదయాన్నాక్రమించినపుడు పూర్తిగా ఆక్రమించుట సర్వసాధారణం. ఏదిఏమైనా యెదట పొగడుట అవమానించటమే అవుతుంది" అంటూ ఆమె తనచేతులను యివతలకు తీసుకున్నది.

తిరిగి పసివానివలె హస్తద్వయాన్ని జోడించి "హృదయంలో అదుముతుంటే పొర్లుతున్నందువలన ఆపజాలక చెపుతున్నందుకు అన్యథా తలంచకండి. నాకిక కాలేజీకి

పోవాలనిపించుటలేదు. జ్వరంతగ్గాక మీదగ్గరే ట్యూషను చదివి పరీక్షకు కూర్చోవాలనుకుంటున్నాను" అన్నాడు.

ఆమె చిన్నగా మందహాసంచేస్తూ "మానవుడు అనేకఆలోచనలను తలపెడుతుంటాడు. అవన్నీ సాగుతనన టానికి వీలులేదు. అనవసరఆలోచనలతో మనస్సును పాడు చేసుకోకండి" అన్నది.

"నా నిర్ణయాలనుగాని అభ్యర్థనలనుగాని చులకనగా తోసివేయవద్దని ప్రార్థిస్తున్నాను. విజ్ఞానసంపన్నులలోను అత్యధిక అందమైనవారిలోను భగవంతుడు కఠినత్వాన్ని నింపుతాడంటారు. నీలోమాత్రం అందుకు భిన్నమని నా మనస్సు చెబుతున్నది" అన్నాడు.

"విద్యార్థి దశలోనిబుద్ధి యెక్కువగా పొరపాటు వైపుకే నడుస్తుంటుంది. నేనూ ఆ భగవంతునిసృష్టిలోని దాన్నే కాని, మీ రన్న మొదటి రెండూ నాలో లేవుగనుక మూడోదికూడా లేదేమో!" అని చిరునగవును చిలికించింది.

"మీరు విజ్ఞాననిధులుకారని, మీ అందం దేవత్వాన్ని బోలిందిగాదని యెవరయినా అంటే, నేనుమాత్రం సహిం చను" అన్నాడు.

ఆమె అధరాలనుబిగబడుతూ "మీరు బాగా విశ్రాంతిదీసుకోండి. అనవసరమైనఆలోచనలతో బుర్ర చెడ గొట్టుకోకండి. చేసినతప్పుకు చింతిస్తూ తిరిగి వరుసగా తప్పులుచేయుట మీబోటివారికి అలవాటు" అన్నది.

తడువుకున్నవానివలె బెదరినచూపులతో "తిరిగి నే నేమితప్పులు చేశానండీ?" అన్నాడు.

"ఒకమహిళను ఆమెసమ్ముఖాన ఆమెఅందాన్ని గురించి, వివేకాన్నిగురించి పొగడుట అపరాధంగాదా చెప్పండి" అన్నది.

"ఈవిషయంలోమాత్రం నేను మీమాటను ఆదరింపజాలను. యథార్థసత్యాన్ని సమక్షంలో చెప్పుట అపరాధ మెలాఅవుతుందంటారు?" అన్నాడు.

ఆమె నవ్వుముఖంతో "సత్యముఅసత్యముఅన్న సమస్యగాదిక్కడ. యదార్థమైనదయినా, తననుగురించివిశేషంగా విన్నపుడు, పొగడ్తలుసంప్రాప్తమైనపుడు పరవశమవుట మానవీయము. ఒకయువతినిగురించి ఆమె సమక్షంలోనే ఒక యువకుడు మితిమించి పొగడి, ఆమెను పరవశురాలినిచేసి తనయడల శ్రద్ధలనుకల్పించుకొనుట కూటనీతికాదని అపరాధంకాదని యెలా అనగలరు?" అన్నది.

చిన్నబోయినముఖంతో "కాదు కాదు. మీరు పొరబడుతున్నారు. నేనలాంటి కూటనీతితో గాదు అన్నది. అపార ప్రజ్ఞావిశేషతలకు ముగ్ధుడై తనలోనిఆనందాన్ని ప్రకటించుకోవటంకూడా కూటనీతి అవుతుందంటారా?" అన్నాడు.

"మీరేమన్నా అనండి, కాని ఆమార్గంలోనే పురుషుడు స్త్రీహృదయంలో స్థానంపొంది, తరువాత వంచిస్తుంటాడు. ఆ స్త్రీ యెంత కురూపియైనా అపురూపసుందరిగాను, అజ్ఞానురాలైనా విజ్ఞాననిధిగాను యెదుట వినిపిస్తూ వెనుదిరిగి పరిహాసిస్తూ స్త్రీచేత నృత్యంచేయింపచూస్తాడు పురుషుడు. పురుషుని పురుషుడు, స్త్రీని స్త్రీ పొగడుటలో అపరాధంలేదు

గాని, పురుషుడు స్త్రీనిపొగడుటమాత్రం వేడుకకాజాలదు" అన్నది.

"మనస్సులోని ఆనందాన్ని ప్రకటించాను. దాని వెనుక నాకు మరో యుక్తిగాని ఆలోచనగాని లేనేలేదు. మీరు నా ప్రతిమాటను పట్టి పరిహసిస్తున్నారు" అని హీన కంఠంతో అన్నాడు.

"లేదు లేదు, నేను పరిహసించుట లేదు. సాగరంలో నుంచే బడబాగ్ని వుద్భవించేది, ఆనందంలోనుంచే దుఃఖం వుద్భవించేదికూడా. ఇపుడు మీ వెనుక దురాలోచన లేక పోవచ్చుకాని, సందర్భం దాన్ని సృష్టించుకుంటుంది. పోవా లని నడిచినా, అనుకోకుండా నడిచినా ఆ రోడ్డున వెళ్ళినప్పుడు ఆ చోటికే చేరతారు. కనుక అది దానికి నాందిఅయినప్పుడు అపరాధంకాదని యెలా అనగలరు చెప్పండి" అన్నది.

చిత్తుచిత్తుగా పరాజయంపొందిన పహిల్‌వాన్‌వలె నిరుత్తరుడై నేత్రాలు నులుముకుంటున్నాడు.

"చూశారా మానవస్వభావం యెంత విచిత్రమైందో! నిరోధించేచోట మర్యాద లెక్కువగా చేస్తారు; స్వీకరించి యింకా కోరేచోట యేవగించుకుంటారు. కొద్దిసేపటికి ముందు మీ చర్యలను మీరే అపరాధాలుగా చిత్రించుకుని క్షమించమని బలవంతపెట్టారు, శిక్షనుకూడా ప్రసాదించ మని ప్రాధేయపడ్డారు. రెండోపక్షం నిష్కల్మషంగా మీ త్రుటులను తూచినట్లు చెప్పసాహసించినవెంటనే మీరు విముఖులవుతున్నారు. సహించలేకపోతున్నారు" అన్నది.

అస్పష్టమైన శబ్దాలలో "కాదుకాదు, మీరన్యథా తలంచకండి. సద్భావనము, అభిమానము యదార్థము పుచ్చరించుటలోకూడా పెడమార్గానికి నాందికాగలదనుటను నా మనస్సంగీకరించలేకపోతున్నది. మీ అందము నిజంగా అసామాన్యమైంది. మీ ప్రజ్ఞ అపూర్వమైంది. అలాంటి యదార్థసత్యాలను కాదనుట నాలాంటిమనస్సుకు అసాధ్యమైంది. ఇదికూడాదోషమని నే నెలాఅంగీకరించను చెప్పండి! మీరు గ్రంథపఠన మెక్కువగా చేసినందువలన ఆ అనుభవముతో ఇలాంటి విచిత్రధోరణిని స్థిరీకరించుకునివుంటారు. అది జీవితరంగంలోని అనుభవంగాదు. అందువల్లనే అది నాకు వెగటుగాదోస్తున్నది" అన్నాడు.

చిరునగవుతో లాలింపులొలుకు కోరదృక్కులతో "మీరన్నది నిజమే. పుస్తకాలఅనుభవములో పేలవతనముంటుంది. నిజానుభవములో హృదయానికిహత్తుకునియదార్థసత్యముంటుంది. కానిపుస్తకాలలో ఘట్టాలన్నీ పేలవంగా వుండవు. రచయిత తనజీవితంలోని అనుభవాన్ని యదార్థఘట్టాలను, తను అర్థంచేసుకున్న మనస్తత్వాలను నైపుణ్యంగా చిత్రించిన పుస్తకం పేలవంగావుండదు. అలాంటివి చదివినపుడు యదార్థభావాలు స్ఫురించుట తథ్యము. అందరూ కైలాసగిరిఅగ్రాన్ని చూడలేరు, సాగరగర్భంలో దూరలేరు. కాని సందర్శించకుండానే వూహించి నేర్పుతో వాటివర్ణన చిత్రించినపుడు అది పేలవంగావుంటుంది గాని, స్వయంగా సందర్శించినవారు చెప్పే, వారిఅనుభవాలు మనస్సులోదూరి వాటిపూర్ణాకృతిని పొందుతవి. కనుక స్వానుభవంతో నిగ్గు

తేలిన యదార్థసత్యాలు యేగ్రంథాలలో చిత్రించబడి వున్నవో వాటిని చదివి పొందే అనుభవం పేలవమయింది గాదు. నేటి నాగరికత నేటి సమాజసృష్టిగాదు. జీవోత్పత్తి పృథ్విమీద ప్రారంభమైనప్పటినుంచి లక్షలసంవత్సరాల జీవరాసుల అనుభవసంపత్తిమీద నిలిచివున్నది. వారందరి అనుభవనిర్మితసోపానాలమీదనే మనం పయనిస్తున్నాము. విశ్వమానవఅనుభవంతో లక్షలసంవత్సరాలుగా నిర్మిస్తూ వచ్చిన విశ్వవిజ్ఞానవికాససోపానాలను కూలద్రోసుకోవట మెలాంటిదో, ఒకజీవితానికి గ్రంథరచనలలోని అనుభవాన్ని తుస్కారంచేయుటకూడా అలాంటిదే.

"మరోమాట; సద్భావము, అభిమానము, యదార్థము వుచ్చరించుట దోషమా అన్నారు. ఈరోజు మీకు యేది యథార్థంగా తోస్తున్నదో అది రేపు విభిన్నమైందిగా తోచవచ్చు. మీ రిది వప్పుకోరు కాని, ఒకవిషయం బాగా ఆలోచించండి. నేను మీకుకనిపించిన ప్రథమదశలో యేమనుకున్నారు? నా అందాన్ని గురించిగాని విజ్ఞానాన్ని గురించిగాని ఆరోజు మీ రూహించినవి నేడు నిస్సంకోచంగా చెప్పండి" అన్నది.

వెలవెలబోతున్నముఖంతో "మీకు కోపమొస్తున్నది లాగుంది; క్షమించండి. ప్రథమంలో తెలియక నేను పొరపాటుగా అర్థంచేసుకున్నాను. మసకవెలుగులో క్రిందనున్న చిన్ని కుప్పనుజూచి యేదోగా భావించి, శరీరం జలదరించవచ్చు కాని, దాన్ని చేత తాకినపుడు అది పూలచెండుగా

తెలిసినపుడు దానిసుగంధంతో ముగ్ధుడవుతున్నపుడు మొదటిభీతి దూరమవుతుందిగదా!" అన్నాడు.

అతనిచేతిమీద పరిహాసకంగా మీటుతూ "నన్ను బాగా రెచ్చగొట్టి వాగించాలని చూస్తున్నావు. కాని నీ ఆరోగ్యం బాగాలేదు. యెక్కువమాటాడటం మంచిదిగాదు. అయినా నీమాటలలో యేదో మాధుర్యముంది. అందువలన జవాబివ్వకతప్పటలేదు. ప్రథమంగా నన్నుగురించిన నీ వ్యూహాలు, నిర్ణయాలు తప్పని నేడు తెలుసుకోగలిగాను. నేటివ్యూహాలు తప్పని అనుకునే రోజుకూడా రావచ్చు. మసకవెలుగులో కనిపించినది పూలచెండని తెలిసినపుడు, ఆదరంతో చేతికితీసుకున్నమీదట అందున్నక్రిములు చేతిపై ప్రాకి కుట్టినపుడు విసరిపారవేయుటకూడా తథ్యమే" అని అతనివంక లాలింపుగా చూస్తున్నది.

"మీముందు నేను గెలువలేను, కాని నా మనస్సెందుకో అంగీకరించుటలేదు. మిమ్ము స్తుతించుటకే నా మనస్సు ఉల్లాసపడుతున్నది. ఎన్నిశిక్షలను స్వీకరించయినా మిమ్ము పొగడుటలోగలిగే ఆనందానుభూతిని పొందాలని నా మనస్సు ఆరాటపడుతున్నది" అని సుస్పష్టమైనశబ్దాలలో అన్నాడు.

పదిరోజులు గడిచిపోయినవి. రత్నాకరుని కిపుడు జ్వరతీవ్రతలేదు. మంచందిగి తిరిగే వోపికాలేదు. తిరగాలనే యిచ్ఛాలేదు. పూర్తిగా నయమయి, కాలేజీకి పోవాలనే ఆలోచన కలుగుటలేదు. తీవ్రజ్వరంలోనున్నపుడు తనకు లభ్యమైన మేరీ పరిచర్యలు మనస్సులో మెదిలి, ఆనందాను

భూతులు గల్పిస్తున్నవి. ఆమె తనడ్యూటీకి సెలవుపెట్టివచ్చి నట్లుగాకూడా విన్నగుర్తు. ఆమె తనస్వహస్తాలతో తన మాడుమీద ఉడుకులాంపట్టీవేసి సవరించింది. ఉదరం మీద వేడినీటికాపులుకాచింది. లేవనెత్తి ఒకహస్తంతో వీపునుపట్టుకుని మరోహస్తంతో జావ త్రాగించింది. పెద వులకయిన యెంగిలిని తనతడిచేత్తో తుడిచింది. తనషర్టు గుండీలుపెట్టి కాలరు సరిజేస్తుంటే తనివితీరని ఆనందంతో హృదయం పొంగి నేత్రాలగుండా బాష్పకణాలు బయ ల్పడుతుంటే, ఆమె తనచేతిరుమాలుతో అద్దుతూ ఆప్యా యతనొలికిస్తూ "కన్నీరెందుకు బాబూ? నీకు యీ జ్వరం తగ్గిపోతుంది. భయంలేదు" అంటూ తనగడ్డాన్ని పుణు కుతూ కల్పించిన స్వాంతన అమోఘమైనది.

మాటలలో ఆమె స్త్రీపురుషవివక్షత నెంతోగానో ప్రదర్శించింది. కాని ఒక సామాన్యపరిచితుడయిన తనకు నిస్వార్థతతో ఆమెచేసిన సేవ అమోఘమైనది. ఆ సేవలో స్త్రీపురుషవివక్షత లేనేలేదు. తనమంచంమీదనే, తనకుఆని కూర్చుని ఉడుకులాంపట్టీలు వేసింది. జ్వరంతగ్గుముఖమై నపుడు వేడినీటితో తనముఖాన్ని అనేకమారులు తుడిచింది. తనక్రాపును ఆమె వ్రేళ్ళతో యెన్నోమారులు దువ్వింది. ఆమె తనషర్టుగుండీలను విప్పి, గుండెలమీద జామాయిల్ వేసి తనకోమలహస్తంతో మర్దనచేస్తుంటే, తనకుకలిగిన మానసికానందం వర్ణింపనలవికానిది.

జర్వం పూర్తిగా తగ్గింది. తిరిగి ఆమె కనిపించుట లేదు. ఆమె కనిపించకపోతే మనస్సు యెందుకో అంతర్గ

తంగా విలపిస్తున్నది. తను యెంత ప్రయత్నించినా తనలోని వుదాసీనత తొలగుటలేదు. జ్వరంపోయిందిగాని, తా నిపుడు పొందింది ఆరోగ్యంగాదు, మానసిక అనారోగ్యం. శారీరక రోగాలకంటె మానసికరోగం మహాప్రబలమైందని బాధాకరమైందని, శక్తిని హరింపజేస్తుందని యిపుడు అర్థమవుతున్నది. తన కిపుడు పూర్ణ ఆరోగ్యం కలగాలి, తిరిగి వుల్లాసంగా కాలేజీకి పోవాలి అనిపించుటకుబదులు, మరల జ్వరమువస్తేనే బావుండును; ఆమె తప్పకవస్తుంది; ఆదరిస్తుంది; సపర్యలుచేస్తుంది; తద్వారా పొందే అనంత ఆనందం తిరిగిలభ్యమవుతుంది, అని మనస్సులో అంతం లేనిఆలోచనలు దొర్లుతున్నవి. ఆలోచనలుఅధికమైనపుడుఆకలి మందగించుట మామూలు. రత్నాకరుడు చిక్కి శల్యావస్థలో జబ్బునుంచి బయటపడ్డా, ఆలోచనలతో ఆకలిలేనందున మరింత నీరసించి శయ్యనుంచి లేవలేనిస్థితి సంభవించింది.

జ్వరముతగ్గి నాలుగురోజులు గడిచినవి. కాని, నిరాహారంతో నిస్త్రాణ మరింత వృద్ధిజెంది తిరిగి జ్వరం ప్రారంభించింది.

# 11. క్రొత్తకాపురం

రోగులంటే భీతిగలవారికి రోగులనుచూస్తుంటేనే విసగట కలుగుతుంది. చంద్రకాంతం లోలోన చీకాకు చెందుతున్నాడు. రత్నాకరునియందున్న మమకారం సడలుతున్నది. రత్నాకరునిమంచంమీద కూర్చుని, అతనిఫాల భాగంమీద చేయి వేసి చూసి, “అబ్బ! మండిపోతున్నది;

జ్వరం మాగుడువాసనకొడుతున్నది. నీవు పత్యం సరిగా చేయక తిరిగి జ్వరం తెచ్చుకున్నావు. తిరగబెట్టినజ్వరం చాలా మొండిదంటారు. నాకు భయంగావుంది రత్నం. మీ నాన్నగారికి టెలిగ్రాముద్దామనుకుంటున్నాను.” అన్నాడు చంద్రకాంత.

శుష్కవదనంతో లోతుకంఠంతో “చంద్రం, ఆపని మాత్రం చేయకు. నీకు ప్రాధేయపడుతున్నాను” అన్నాడు.

“నీవు భలేవాడివి; జబ్బుగానున్నపుడు యింటికి తెలియజేస్తే తప్పేముంది?” అన్నాడు చంద్రం.

“లేదు, యేమీలేదు. కాని అనవసరమైన ఆదుర్దా పడతారు. నాకు మలేరియాక్రిందకు దిగింది గనుక, భయ మేమీలేదు. రెండురోజులతరువాత నేనే యింటికి వెళ తాను” అని ప్రాధేయతగా అన్నాడు.

“సరే” అంటూ పనిమనిషిని కావలసినవన్నీ జాగ్ర త్తగా చూడమని చెప్పి తాను వెళ్ళిపోయాడు.

పనిమనిషి పేరు జయలక్ష్మి. ఆ గది శుభ్రపరచుట, నీరుపోయుట, కారియర్ తెచ్చుట మొదలగుపనులు ఆమెవి. కాని ఆప్రక్క రెండుమూడుగృహకార్యభారాలు తనవే అయినందున వీరిపని తీరుబడివున్నపుడు చేస్తుంటుంది. జయ లక్ష్మి మహా గడసరి. ఆమె మొదటిభర్త ఆమెను వదిలించు కోను రెండువందలధనం ఖర్చుపడి, విడాకులుపొందికూడా ఆమెసూటీపోటీమాటలకు ఆ బస్తీనే త్యజించి వెళ్ళి పోయాడు. రెండోభర్తతో తగాదావచ్చినపుడు అతని మాటలకు ప్రచండ చండికారూపందాల్చి చేతిలోని కట్టె

పేముతో శిరస్సుపై మోదినందున ఆరునెలలు ఆస్పత్రిలో బాధపడి జీవితంచాలించాడు. మూడో భర్తతో తగాదా వచ్చినప్పుడు చార్జిసీ సహాయంతో అతనిని కారాగారాని కంపి, కతుదీర్చుకున్నది. అందుకే యిప్పుడామెకు భర్తగా వుండను యెవరూ సాహసింపలేదు. ఆమెతో కయ్యము పెట్టుకోను యెవరికీ ధైర్యముండదు. అలాఅని ఆమెలో అంతా రాక్షసత్వమే నిండిలేదు. తనను కాస్త పొగడితే,తన సద్భావాన్ని గురించి రవంత ప్రశంసిస్తే పరవశురాలై, పాదా లొత్తుతుంది. తనను తుస్కారము, హీనముచేస్తే, బరిమీద కూర్చుంటుంది. స్తుతించేవారిని నెత్తినెక్కించుకుంటుంది. ఆమె స్వభావం అర్థంజేసుకున్నాడు గనుకనే, రిక్షాలాగే కోటి నేడు జయలక్ష్మి నెత్తినెక్కి సవారీచేయగలుగుతున్నాడు.

జయలక్ష్మి శ్యామవర్ణంలో ఎత్తరిగా దార్ఢ్యంగా వుంటుంది. యెప్పుడూ కిలకిలలాడుతుంటుంది. ఆమె నవ్వుకూ, కోపానికీ అంతరం తక్కువ. లలాటము చిన్నది. అధరాలు ద్విగుణంగా వరగబడివుంటవి. చెక్కిళ్ళ పైభాగాలు వుబికివుంటవి. నయనాలు అతివిశాలంగా కొట్టవచ్చిన ట్లుంటూ ముఖమంతటికీ గొప్పశోభను కల్పిస్తుంటవి. కురులు భ్రమరవర్ణంలో దట్టమై నిడివిగా వుంటవి. కోటికి ఆవిడ చూపులు గిలిగింతలుపెడుతుంటవి. తను రిక్షాబాడుగ యెక్కువ దొరకనిరోజుకూడా జయలక్ష్మికి చారెడుపూల దండ కొని తేవలసిందే. బజారులో యేదో తినివచ్చి ఆకలి లేదని, భోంచేయనని అంటే బడబడలాడుతూ ఆపూటతోనే అతనిబలం అంతరిస్తున్నట్లు, చిక్కి శల్యమై రోగగ్రస్తుడవు

తున్నట్లు, అతనికి సేవచేయలేక తను చావవలసివచ్చినట్లు ఆఖరుకు దురదృష్టంపట్టి తాను దిక్కుమాలినదై నిర్భాగ్యురాలై జోగియెత్తనున్నట్లు, లోకానికిభారమై అనాథచావు తనకు సంభవించనున్నట్లు, కారుమేఘగర్జనలవలె ఆమె పోట్లాడుతుంటే, అతను సన్నగా నవ్వునుప్రదర్శిస్తూ, ఆవిడ నోటికందించినముద్దలను బలవంతంగా మ్రింగుతూ, ఆమె విశాలనేత్రాలవంక చూస్తూ, ఆవిడఅందాన్నికూడా ఆ ముద్దతోపాటు మ్రింగుతున్నట్లుచేస్తూ, ఆవిడ మోచేతికి అయిన మసిని తుడుస్తూ, ఆచేతిమీదసవరిస్తూంటే, ఆ సవరింపులు యింకా పైకివెళ్ళినపుడు ఆవిడ కిలకిలమని ఒక్కమాటుగా నవ్వుతూ అతనిబుగ్గలుపట్టి మెలివేస్తుంటుంది. ఆవిడ యెంత కోపగించుకున్నా, నిందిస్తున్నా, కొట్టవచ్చినా దీనంగా ఆవిడవైపు చూస్తూ నవ్వటం నేర్చుకున్నాడు కోటి. ఆవిడ ఆ దీనదృక్కులలో ఆత్మార్పణచేసుకోనుటలో అలవాటయింది. ఇపు డావిడప్రవృత్తులను గోటితోమీటుతూ, నృత్యంచేయించగల సమర్థుడయ్యాడు కోటి. అంత మంచి ప్రయోజకులు యోగ్యులు దీనిముందు యెందుకూ పనికి రాకుండాపోయారు. వాళ్ళపౌరుషాలను మంటగలిపింది కాని, నేడు అధముడు అప్రయోజకుడు నిరర్థకుడు, నీచుడైన కోటి చేతిలో ఆవిడ పిల్లిఅయిపోయి, అతనినిపూజిస్తున్నట్లు కని పిస్తున్నందుకు పేటలోని ఆవిడకులమువారంతా విస్తుపోతున్నారు.

రత్నాకరునికి జ్వరం తిరుగుబెట్టినప్పటినుంచి ఆయన సేవాభారం జయలక్ష్మిపైన బడింది. గడుసుతనమున్నవారి

హృదయంలో వోమూల దయ, ఉపకారాలు, సేవాభావం విశేషరూపంలో వుంటవి. జయలక్ష్మి యిపుడు ప్రక్కయిళ్ళ లోనిపనులన్నీ మాని రత్నంసేవలో మునిగిపోయింది.

"బాబుగారు, మీ ఆరోగ్యం యేరోజుకారోజు తీసిపోతున్నది. యెవరైనా పెద్ద డాక్టరుకు చూపిస్తే బాగుంటుంది. ఈ పేటలో జయగోపాలంగారు పెద్ద డాక్టరు. దీర్ఘవ్యాధులకు ఆయన గొప్ప డాక్టరుట. మీరు సెలవిస్తే పిలుచుకొస్తాను." అని సవినయంగా అన్నది జయలక్ష్మి.

"లేదు లేదు; ఆ పనిమాత్రం చేయబోకు లక్ష్మి. నాకిపుడు జ్వరం అంతగా లేదు. రెండుమూడురోజులలో పూర్తిగా పోతుంది. జబ్బు యేదయినా, డాక్టరు యెంత పెద్దవాడయినా వాళ్ళవద్దవున్నది నేడు పెన్సిలిన్‌సూదిపోట్లే. ఆ సూదిపోట్లంటే నాకు మహాఅయిష్టం" అన్నాడు రత్నం.

"బాబుగారూ, మీరు నాకు నచ్చినమాటన్నారండీ. నాకు రెండుసంవత్సరాలనాడు తేలుకుట్టి బాధపడుతుంటే, మా కోటి డాక్టరుదగ్గరకు తీసుకెళ్ళాడు. ఆయన సూదిమందిచ్చాడు. ఆ తేలుబాధ ఆ మరునాడే పోయింది గాని, ఆ డాక్టరు సూదిపొడిచినచోట వాచి, బరువుచేసి ఆరునెలల వరకు బాధించింది. గొప్పవారికి జలుబుచేసినా వేడిచేసినా సూదిమందు తీసుకుంటారు. అదొక నాజూకయింది గాని, జలుబు మందులేకపోయినా పోక వుంటుందా బాబుగారూ?" అన్నది.

ఈ మాటలు రత్నానికి మరింత స్వాంతనను కల్పించినవి. కాని మనస్సు యింకేవనోమాటలకొరకో వెదుకుతున్నది.

"దాహమవుతున్నది లక్ష్మి"

లక్ష్మి కాచి చల్లార్చిననీరు గ్లాసుతో తెచ్చి స్టూలు మీదపెట్టి, ఒకచేత్తో ఆయనశిరస్సు మరోచేత్తో భుజస్కంధాన్ని పట్టి నెమ్మదిగా లేవనెత్తి గ్లాసు చేతికిచ్చింది.

ఆనాడు మేరీ యీరీతిగానే తనను కూర్చుండబెట్టి మజ్జిగత్రాగించినదృశ్యం మనస్సులో మెదిలి ప్రభ్రాంతి చెందినవానివలె గ్లాసులో తేరిపారజూచి, ఉదాసీనతను ప్రకటిస్తూ "అబ్బ! యీ వేడినీళ్ళిచ్చావెందుకు? మజ్జిగ యివ్వకపోయావా?" అన్నాడు.

"జ్వరంలో మజ్జిగ యెలా యివ్వను బాబుగారూ? ఆరోజు ఆమెగారిచ్చిందంటే, యేదైనా వికటించినా సమర్థించగల్గును గనుక యిచ్చింది" అన్నది.

"యేమీ వికటించదు. భయమేమీలేదు. మజ్జిగ త్రాగితే జ్వరం తప్పకుండా తగ్గుతుంది. మజ్జిగతీసుకురా జయలక్ష్మి" అని లాలింపుగా అన్నాడు.

ఆమాటతో ఆనిడ పరవశురాలయింది. ఇంత పెద్ద నాగరికులనోట తనపేరు నింత మృదువుగా ప్రీతిగా వినుట తన కిదే ప్రథమసారి. తనపేరును యింత ఆదరంగా వుచ్చరించుటతో పొంగిపోయి, వీలయితే ఆ బాబుగారి రోగబాధను తాను తీసుకుని, తనఆరోగ్యాన్ని ఆయనకు ట్రాన్స్ఫర్ చేయాలని మనస్సులో తలపోస్తూ వేగంగా వెళ్ళి మజ్జిగ తెచ్చియిచ్చింది.

ఆ గ్లాసులోనిమజ్జిగలో యేదో ఆభాసగా కనిపిస్తు

న్నది. చూస్తున్నకొద్దీ అందులోనుంచి ఆహ్యాయత ఆవిర్భవిస్తున్నట్లు అనుభూతమవుతున్నది.

"అట్లా ఆ గ్లాసులో చూస్తారెందుకు, త్రాగండి" అంటూ లక్ష్మి తనచేతిని గ్లాసుమీద వేసి పైకెత్తింది. ఆవిడ వేళ్లు తనఅంగుళీయములకు త్రాకుచున్నవి. తనమనస్సులో మెదలుతున్న మేరీజాన్ స్పర్శగానే తోచి ఒక్కమాటుగా త్రాగి, పెద్ద నిట్టూర్పు విడిచాడు.

నెమ్మదిగా మేనువాల్చి నేత్రాలుమూసి లలాటం మీద తనచేతిలోని ఖాళీగ్లాసుఅడుగుభాగంతో నిమురుకుంటున్నాడు. లలాటంమీద వుడుకులాం వేసినట్లు చల్లగా ఆనందాన్నిస్తున్నది. ఆ మూసిననేత్రఫలకాలలో యెవరో దూరి, బుజ్జగిస్తున్నట్లున్నది. లలాటంమీద అటూఇటూ తిరుగుతున్నగ్లాసులోని మజ్జిగబొట్లు వలికి ముఖమంతటా పడి తెల్లగా తోణుకుతున్నవి. ఈ దృశ్యం జయలక్ష్మికి నో ప్రక్క వినోదాన్ని, మరొకప్రక్క జాలిని కల్పిస్తున్నవి. వెంటనే ఆమె తనచెంగుతో ఆయనముఖాన్ని తుడుస్తూ, రెండోచేత్తో ఆ గ్లాసుపట్టుకుని నెమ్మదిగా వదిలించుకోబోయింది. ఆయనమనస్సు యెక్కడ యేరూపంలో యేమి చేస్తున్నదో యెవరికితెలుసు ? గ్లాసుమీదవేసిన ఆమెచేతిని తనద్వితీయహస్తంతో మృదువుగా పట్టి, ఆ గ్లాసును ఆవల పట్టివుంచి, లలాటంమీద ఆమెహస్తాన్నుంచి అదుముకుంటు న్నాడు.

ఆయన చంద్రకాంతకంటే పెద్దయింటిబిడ్డని ఆపడకు తెలుసు. చాలా క్లిష్టంగాను గంభీరంగాను వుంటాడు.

బాగావున్నప్పుడు తనను మంచినీరివ్వమనికూడా అడిగి యెరుగడు. చంద్రకాంతముఖంలో కొన్ని వేళలందు పరిహాసం తొంగిచూస్తుంది గాని, రత్నాకరుని కది దూరము. అలాంటి ఆ వ్యక్తి నేడు తనచేయిపట్టి ముఖంమీద అద్దుకోవటం యెందుకో ఆమె యెంత యోచించినా అర్థమవుటలేదు. తనచేయిఅని తెలియక అలాచేస్తున్నాడేమో, చూసి విసుగు పోయి "ఛీ భడవా" అని కోపగించుకుంటాడేమోనని భయభీతితో కుంచించుకుంటూ, చేయిలాక్కొను సాహసం చాలక, వదలండి బాబుగారూ, అనటానికి మనసొప్పక తన హస్తానికిపట్టిన అదృష్టాన్నితలచుకుంటూ, ఆయన మూసిన నేత్రాలవంక తదేకంగా చూస్తున్నది. ఆయనశరీరంలోని తాపం తనహస్తంగుండా శరీరంలోకి ప్రవహిస్తున్నది. ఆయనజ్వరం తనలోకివస్తున్నదేమోనని భ్రమించి వెలవెల బోయింది. కాని మరుక్షణంలోనే అది జ్వరంగాదని తోచింది. ఆ తాపంలో శరీరమంతు గగుర్పాటు, పులకోత్సాహము కలుగుతున్నవి. తననుతాను మర్చిపోయి, వెర్రి బాగులదానివలె బిత్తరిచూపులతో అటూయిటూ కవాటం వైపు చూస్తూ, ఏదో అపహరించబోతున్నదానివలె శ్వాస బిగబట్టి రెండోహస్తం అతనివపుపట్టీగుండా దూర్చి వక్షస్థలం మీద వేసి నిమురుతూ వుద్విగ్నురాలై వూపింది.

రత్నం నేత్రాలు తెరచి చూసి, తను యిప్పటివరకు భ్రమించినగౌనుగాని కురులుగాని కానక, చకితుడై ఆమె చేయినితీసి ఆవల పెట్టి "లక్ష్మి" అని క్రోధస్వరంతో పిలిచాడు. ఆయనముఖమండలమంతా మ్లానతచెంద కాఠిన్యం

వహించివుంది. లక్ష్మి విచలితురాలై పట్టరానికోపంతో ఒక్కమాటు ఆపాదమస్తకం చూసి, చివ్వున వెనుదిరిగి దొడ్డివైపు వెళ్ళింది. ఆమెకోపం ప్రచండరూపందాల్చింది. వెంటనే అనరానిమాట లనో, చేయరానిపని చేసో కూర్చునేదే. కాని తనజీవితంలో యెన్నడూ యెరుగని కోమలమైన హస్తస్పర్శను విజ్ఞానభరితహృదయస్పర్శను పొందింది. ఆ అనుభూతిలోని అంశం ఆపివేసిందిగాబోలు, దొడ్డివైపుకొచ్చి శాల్మలీవృక్షఛాయలో నిలిచినపుడు ఆమెలో పరవళ్ళు త్రొక్కుతున్న క్రోధాగ్ని చప్పబడి, తనచేతిలో యింకా ఆ చేయి వున్నట్లే భ్రమించి, నేత్రాలుమూసి, ఆత్మానందాన్ని చిరునగవుద్వారా ప్రకటించుకుంటున్నది. ఇప్పుడామెక్రోధం వుపశమించింది. రత్నంయెడల విశేషరూపంలో జాలి పొర్లింది. ఆయనఅనారోగ్యము నిరాశ్రయముయెడల కరుణగలిగి, వెనుదిరిగివచ్చి మంచంప్రక్కన హాజరయింది. ఆమెను చూడజాలక సిగ్గుదొంతరులతో రెండోప్రక్కకు వత్తిగిలి తనను తాను దూరుకుంటున్నాడు. "ఎంత పొరపాటుచేశాను! తెలివిహీనుణ్ణి; మనస్సును అదుపులో వుంచుకోలేనివాణ్ణి. ఆమె క్రిష్టియనుయువతి, ఈవిడ పని మనిషి; ఆమె సభ్యసంస్కారాలే విచిత్రమైనవి. ఇక ఈమెవి హాస్యాస్పదమైనవి. అలాంటి ఆమెనుగూర్చి ఆలోచిస్తూ యీామెచేయిపట్టుట యెంత నీచము" అని తనలోతానే వాపోతున్నాడు.

ప్రక్కన నిలిచివున్న జయలక్ష్మికి ఆయనమనోభావం అర్థంగాక పాదాలవైపు కెళ్ళి, నెమ్మదిగా పాదాలొత్త

సాగింది. పాదాలను యువతలకుతీసుకుని విముఖతను ప్రక టించాలనిప్రయత్నించాడు. కాని, జ్వరఉష్ణతలోకలిగిన తిమ్మి రులవలన వత్తుటలోకలిగేహాయిని కోల్పోజాలక, అగి తన మనస్సును నిరోధించి ఆవిడఅధీనమయినవి. ఆమె మరింత ఉత్సాహితురాలై మోకాళ్ళవరకు సవరిస్తూ అతిమృదు వుగా వత్తుతున్నది. పొందుతూన్నహాయికి యెదురుఆలోచ నలుచేస్తూ వివశతలోమునిగి నిర్ణయరహితంగా నిద్దుర పోయాడు.

ఎన్నిరోజులు గడిచినా జ్వరం తిరుగుముఖ మవుట లేదు. ఈ తభా చంద్రకాంత భయభీతుడై ఏమిజరిగితే తన మీదకొస్తుందోననే భీతితో ఒకనిర్ణయానికివచ్చి "రత్నం ఇక మీ నాన్నగారికి నీ జబ్బువిషయం తెలియజేయక తప్పదు. అది నా కర్తవ్యం" అన్నాడు.

వెలవెలబోతున్నముఖంతో "నేను వ్రాశాను. జవా బుకూడా వచ్చింది. నేను రేపుగాని, యెల్లుండిగాని తప్పక యింటికెళతాను." అన్నాడు రత్నం.

"మరి, ఆ విషయం నాకు చెప్పనేలేదేమిటి? సరే, మంచిదే. మరేమీలేదు, రేపు తెలిసినపుడు 'నీవయినా యింతజబ్బుగానున్నపుడు యెందుకు తెలిజేయలేదు?' అంటారు. అదే నా భీతి" అని వెళ్ళిపోయాడు.

దొడ్లోవుండి యీ మాటలు విన్న జయలక్ష్మికి మాటలు అర్థంగాక, వెర్రిదానివలె చూస్తూవున్నది. ధైర్యం చేసి యెదుటికొచ్చి "బాబుగారూ, మీరు వెళ్ళిపోతు న్నారా?" అని జాలిగా అడిగింది.

దీనవదనంతో ఆమెనంక చూస్తూ "లక్ష్మి, ఒక రహస్యమైనపని చేసిపెట్టగలవూ?" అని ప్రశ్నించాడు.

"ఏమిటో చెప్పండి, ఏమిచేయవలసివచ్చినా చేస్తాను. నాకు యెవరిభయమూ లేదు" అని ధృడసంకల్పంతో అన్నది.

"ఇక్కడికి దూరంగా యెక్కడైనా ఒక గదిగాని, పోర్షన్‌గాని చూసి, మాట్లాడివస్తే నేను అందులోకి వెళతాను. చంద్రకాంతకు మాత్రము యీ విషయం తెలియగూడదు. చాలా రహస్యంగా మాట్లాడిరావాలి." అన్నాడు.

మరునాడుదయం జబ్బులోనున్న రత్నం తనసామానుతోపాటు యింటికి టాక్సీలో ప్రయాణమయ్యాడు. స్టేషను వరకు పంపుటకని చంద్రం ఉద్యుక్తుడయ్యాడుగాని, పరవాలేదని, నిరోధించి, ఒక్కడే వెళ్ళిపోయాడు.

కాని కారు స్టేషనుకుబదులు రాయపేట చేరింది. రత్నాకరుడు జేబులోనికాగితంతీసి స్ట్రీటు, డోరు నెంబరు చెప్పాడు డ్రైవరుకు. యెలక్ట్రిక్ స్తంభాలుకూడాలేని ఒక గొందిలో పెద్ద ప్రహరీలలోపల ఒకమూల కారుగ్యారేజీవలెన ఒకయిల్లు వుంది. ఆ గేటువద్ద జయలక్ష్మి నిరీక్షిస్తున్నదిగాబోలు, వెంటనే వచ్చి కారులోనిసామాను లోపలకు చేర్చినది.

ఆ యింటిలో ఒక పెద్దహాలు, వంటశాల వున్నవి. ఇంటిముందు అరుగులుకూడా అమర్చివున్నవి. ఇంటికి ముందుప్రక్కలా విశాలమైన స్థలమున్నది. స్థలమంతా వివిధవృక్షాలతోను పిచ్చిమొక్కలు గడ్డితోను నిండివుంది.

ఇంటిమీద బఠానీతీగ పెనవేసివుంది. సామాన్యకుటుంబీకులెవరూ వుండసాహసింపజాలరు గనుకనే యీ యిల్లు యెప్పుడూ ఖాళీగావుంటూవచ్చింది. ప్రహరీగోడద్వారం బిగించితే, బయటిప్రపంచంతో సంబంధాన్ని తెంపుకున్నట్లవుతుంది.

లక్ష్మి క్యాంపుకాటు అమరుస్తున్నది. రత్నం ఫోల్డింగ్ మీద కూర్చుని, ఇంటిని కలియజూస్తున్నాడు. మూలనున్న ఒకపెట్టెను మరీమరీ చూసి "లక్ష్మీ, ఆ పెట్టె యెవరిది?" అని ప్రశ్నించాడు.

కొంచెం సంకోచిస్తూ "నాదే బాబుగారూ" అన్నది. "నీదా? యిక్కడెందుకున్నది?" అనిప్రశ్నించాడు. అధోముఖియై చూస్తూ చిన్నగా "ప్రొద్దున మీకు చెప్పివస్తూ నాపెట్టెకూడా వెంటతెచ్చుకున్నాను" అన్నది.

మతిపోయినవానివలె ముఖమంతా మలినంచేసుకుని, హస్తం శిరస్సునవేసి రుద్దుకుంటూ, "యెంతపనిచేశావు, యెంతపనిచేశావు! నీ పెట్టె తెచ్చుకోవటమెందుకు? యిపుడు నీవు నీయింటి కెళ్ళిపోతావుగదా! ఆ పెట్టె తెచ్చేప్పుడు చూసినవారంతా యేమనుకునివుంటారు చెప్పు?" అంటూ నిండా మునిగినవానివలె లోతుకంఠంతో అన్నాడు.

ఆమె చేస్తున్నపనిని ఆపి, తీవ్రదృక్కులతో 'అదేమిటి బాబుగారూ, అలా అంటారు! నేను వెళ్ళిపోతే మీరు ఒక్కరూ యెలావుంటారు? బజారుకెళ్ళి కాఫీతెచ్చేవాళ్ళు లేక, మంచినీరిచ్చేవారయినాలేక యెలావుంటారు?' అని దృఢమైనకంఠంతో అన్నది.

శిరస్సున మోదుకుంటూ, "యీమాటలే అందరితో చెబుతూవచ్చావా?" అన్నాడు.

"నే నంత పిచ్చిదాన్నిగాదు. మా అమ్మగారింటికి వెళుతున్నానని యిరుగుపొరుగువారితో చెప్పి బయలు దేరాను," అన్నది. "బాబుగారూ, నేను పెట్టె తెచ్చుకున్నందుకు యింత బాధపడుతున్నారు. మీరు మరి ఆ గదినుంచి యెవరికీ తెలియనీయకుండా యిక్కడికొచ్చింది యెందుకు చెప్పండి? మనమెరిగినవారెవరికంటా పడనియిల్లు చూడమన్నారు యెందుకో చెప్పండి!" అన్నది.

నేత్రాలు పెద్దవిచేసి దంతాలు కటకటమనిపించి హస్తాలతో ముఖంకప్పుకుని గాద్గదికకంఠంతో, "అంటే నేను నీకోరకే యిక్కడికి వచ్చాననా? నీవు వుండటానికే యిల్లు చూడమన్నానా?" అని నిస్త్రాణ, దుఃఖావేగములతో ఒరిగిపోయాడు.

వీరోచితవాక్యాలు ప్రగల్భాలు దర్పాలు పౌరుషాలు సవాలు జేసేవాక్యాలయితే, లక్ష్మి క్రోధితురాలవుతుంది గాని, దుఃఖాన్ని, బాధను, ప్రార్థనలను, వినయాన్ని ప్రకటించేవాక్యాలుగాని చర్యలుగాని గాంచినపుడు ఆత్మార్పణకు సంసిద్ధురాలవుతుంది.

రత్నాకరుని తనతొడలమీదకు చేర్చుకొని, తన చెంగుతో ముఖాన్ని తుడిచి విసురుచున్నది. అతనికనుకొలకుల గుండా ఒకటొక్కటిగా బాష్పకణాలు రాలుతున్నవి. లక్ష్మి యెదుటివారిక్రోధావేశాల నెలా సహించలేదో, దుఃఖాన్నికూడా అలానే సహించలేదు. రత్నాకరునికన్నీరు

కారి, తనతొడలమీదే వెచ్చగాపడుతున్నపుడు ఆమెహృదయం ద్రవించుకుపోతున్నది. ఆయనదుఃఖాన్ని దూరం చేయను తను సర్వకష్టాలనైనా నెత్తినవేసుకోను సంసిద్ధురాలై, ఆయనకన్నీటిని చెంగుతో అద్దుతూ "బాబుగారూ, నన్ను మీరేమీ అనుకోకండి. మీరేమిచేయమంటే అదే చేస్తాను. మీకు యీ జబ్బు నయమయి, చల్లగావుండాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను. మీ జబ్బు యెలావుందో మాటలూ అలానే అర్థంగాకుండావున్నవి. చర్యలు అంతకంటె అగమ్యంగావున్నవి. నేను పెట్టెతెచ్చుకున్నందుకంత కష్టంగావుంటే, దొంగనలె యీయింటిలో ప్రవేశించుటెందుకు బాబుగారూ?" అన్నది.

కొంచెము తెప్పరిలుకుని నెమ్మదిగా ఆమెవడిలో నుంచి లేచి కూర్చుని, మారుమాటలేకుండా పొర్లుకొస్తున్న దుఃఖాన్ని బిగబట్టుకో ప్రయత్నిస్తున్నాడు.

లక్ష్మి ఆత్రతతో క్యాంపుకాటును సరిజేసి, ఆయన్ను పవళింపజేసి ప్రక్కనవిలిచి, పంకావిసురుతున్నది. ఆయన తనలోతానే కుమిలికుమిలి విలపిస్తున్నాడు. ఆయనదుఃఖాన్ని చూడజాలక వివశురాలై లక్ష్మి ఆయనపాదాలమీదపడి "నన్ను క్షమించండి బాబుగారూ, నాకు యేమీ అర్థమువుటలేదు. మీరు అసలే చిక్కి శల్యావస్థలోనున్నారు. మీ దుఃఖాన్ని నేను చూడలేకుండావున్నాను. మీ మనస్సులో వున్నదేమిటో చెప్పండి. మీరు యింటికిపోకుండా నాతో పాటు యీ అజ్ఞాతప్రవాసానికి రావటంలోని ఆంతర్య

మేమిటో నిర్భీతిగా చెప్పండి బాబుగారూ" అని వణుకుతున్న కంఠంతో అడిగింది.

ధైర్యాన్ని చిక్కబట్టుకుని "లక్ష్మి, నాకూ యిదంతా అగమ్యంగా వుంది. నా మనస్సు నాలో లేనట్లున్నది. ఎంత ప్రయత్నించినా యింటికిపోను మనసొప్పకొనుటలేదు. ఇక్కడే వుండాలనిపిస్తున్నది. చంద్రం గాబరావలన అతని నుంచి దూరంకావాలని ప్రయత్నించి, నీద్వారా యిక్కడికి చేరాను. అంతకుమించి నా మనస్సులో మరో ఆలోచనే లేదు. నన్ను మరేమీ అనుకోకు" అన్నాడు.

విషణ్ణముఖంతో "ఇంతవివరంగా మీరు ముందెందుకు చెప్పలేదు? అయితే, నే నిపుడు వెళ్ళిపోవచ్చునంటారా?" అన్నది.

దీనవదనంతో "లక్ష్మి, నీవు పుట్టింటికి పోతున్నానని చెప్పివచ్చావు గనుక, అక్కడివారు దురూహపడరు. నేను జబ్బులో నిరాశ్రయుడినై వున్నాను. కనుక నీవు యిక్కడే వుండి, నాకు కాస్త ఆరోగ్యంకలిగేవుపాయం చూడమని నిన్ను బ్రతిమాలుకుంటున్నాను" అన్నాడు.

"బాబుగారూ, నాకు కల్లాకపటం చేతగాదు. నేను యెంత హీనస్థితిలోవున్నా, నాకూ మానమర్యాదలున్నవి. ఇక్కడ నన్ను పుట్టిల్లుగా భావించి వుండమంటారా? యజమానిఇల్లని భావించి వుండమంటారా? క్షణక్షణము చిత్తప్రవృత్తి మారే మిమ్మల్ని గురించి యిక నే నేమీ చేయజాలను బాబుగారూ" అన్నది.

వెంటనే ఆమెచేయి అందుకుని నలుపుతూ "లక్ష్మి,

నీ వలా అనకు. నా మనస్ససలే సరిగాలేదు. నీవు నన్ను విడిచివెళితే నా మరణవార్తను నీవు రేపే వినవచ్చు. నీ కా వార్తవినాలనివుంటే వెళ్ళు, నేను నిరోధించను" అన్నాడు.

ఆయనహస్తాన్ని తనముఖానికద్దుకుంటూ "బాబుగారూ, అలా అనకండి. మీ రిక వెళ్ళమన్నా నేను వెళ్ళను. మీ ఆరోగ్యంకుదిరేవరకు నే నిక్కడే వుంటాను. మీ ఆరోగ్యం యెలా కుదురుతుందో చెప్పండి; అందుకు యేమి చేయవలసివచ్చినా నేను సంసిద్ధురాలను." అన్నది.

"ఇక నాఆరోగ్యం కుదుటపడుతుంది లక్ష్మి, నీవుంటే నాకు భయంలేదు." అని దిలాసాగా అన్నాడు.

"ఇపుడు మీరు స్థిమితంగావున్నారు గనుక, అడుగుతున్నాను. మీ బాధ యేమిటో నాకు నిస్సంకోచంగా చెప్పండి" అన్నది.

"ఏమీలేదు. ఆరోగ్యంలేదు, అంతే" అన్నాడు.

"అయితే మీరు యింటి కెందుకుపోరు?" అన్నది.

"పోబుద్ధిగావటంలేదు." అన్నాడు.

నూతనగృహంలో ప్రవేశించి రెండురోజులు గడిచిపోయినవి. కాని ఆరోగ్యం యధాస్థితిలోనే వుంది. నేడు మరీ శిరోభారంగా వున్నది. అందువలన లక్ష్మికి ఉడుకు లాంపట్టీ వేసేవిధానం చెప్పి వేయించుకున్నాడు. ఆమె ఆరకుండా ఆ పట్టీమీద ఒక్కొక్కబొట్టు ఉడుకునీరాం రాల్చుతూ, అరచేతులను సవరిస్తూ విసురుతూవున్నది.

ఆమెసేవలో శిరోభారం నెమ్మదించి కను మోడ్చాడు. మంచి ఆనందమయకలగంటున్నాడు గాబోలు, నిద్రలోనే

నవ్వుకుంటుంటే, లక్ష్మి ఖంగారుపడి, "యేమిటి బాబు గారూ !" అని ప్రశ్నిస్తూ ఆయన చుబుకాన్ని బట్టి పుణికింది. ఆయన ఆ కలవరింతలలోనే ఆ చేతినిపట్టి, తనలలాటం మీదున్న ఉడుకులాంపట్టిమీద వేసి అదునుముకుంటూ, తిరిగి ఆ చేతిని తనవక్షస్థలంమీదికి తీసుకెళ్ళి అదుముకుంటూ "మిస్ మేరీ, అబ్బ ! యెంత కాలానికి నామీద దయకలిగింది! నీ బెంగతో నా ప్రాణం పోతుందనుకున్నాను. నాకు నిన్ను గురించినఆలోచనే జబ్బయింది మేరీ." అంటూండగా లక్ష్మి తనచేతిని మృదువుగా లాక్కుంటూ "బాబుగారూ !" అని పెద్దగా పిలిచింది.

నేత్రాలు తెరచి భీతిలుతున్నకంఠంతో "ఏమిటి లక్ష్మి" అని ప్రశ్నించాడు.

"మేలుకున్నారా, యింకా నిద్రపోతున్నారా" అని ప్రశ్నించింది. అతను నవ్వటానికి ప్రయత్నించి, కుదరక వూరు కున్నాడు.

"బాబుగారూ, మీ రిపు డేదయినా కలగన్నారా చెప్పండి" అన్నది.

"నాకు తెలియదు" అన్నాడు.

"ఇప్పటికిప్పుడే మీరు యెవరినో సంబోధిస్తున్నారు గదా!"

"అది సరేగాని, బాగా ఆకలిగావుంది. కాఫీకావాలి లక్ష్మి" అని మాటను మలిపాడు.

నాలుగురోజులు గడిచిపోయినా, జ్వరం మామూలుగానే వున్నది. నీరసం దినదినాభివృద్ధినొందుతున్నది.

లక్ష్మి కేవలం కర్తవ్యపరాయణురాలై నిస్సంకోచంగా సేవాభారాన్నంతటినీ మోస్తున్నది. కాని, నేను ఆమెకూ ధైర్యంసడలింది గాబోలు, వృదయంనుంచి చింతాక్రాంతు రాలై అంతుతెగని ఆలోచనలుచేస్తున్నది.

"బాబుగారూ, మేరీ అనేఆమె నెవరినైనా మీా రెఱుగుదురా?" అని ప్రశ్నించింది.

వికసించినముఖంతో "అవునవును, ఏదీ, వచ్చిందా" అని అడిగాడు.

"రాలేదు. కాని ఆమె యెవరో చెప్పండి," అన్నది.

తిరిగి చింతాక్రాంతుడై "ఎందుకులే" అన్నాడు.

"ఆమె దేవ్వూరో చెప్పండి"

ఉదాసీనకంఠంతో "ఈవ్వూరే. మొదట నాకు జ్వరమొచ్చి నపుడు మనగదికివచ్చిన ఆంగ్లోఇండియన్ అమ్మాయిలేదూ, ఆమెపేరే మేరీ" అన్నాడు.

లక్ష్మి యింటిలోనిపనులన్నీ సరిదిద్దుకుని. ప్రయాణ సన్నద్ధురాలై కాగితమూ కలమూ తీసుకొచ్చి "బాబు గారూ, ఆ మేరీఅడ్రసు వ్రాసివ్వండి" అన్నది.

"ఎందుకు ?"

"అలా ఖంగారుపడతారెందుకు? ఆమెతో నాకు పని వుండగూడదా ?"

"ఆమెతో నీ కేమిపనివుంటుంది?"

"ఆమెయింట్లో పనిచేసేనౌఖరీ అడిగేపనే అను కోండి"

"ఆమెఅంటే నీకు కోపమా?"

"లేదుకాని, దయతో ఆమె యేపేటలో, యే రోడ్డులో వుంటుందో ఆ యింటి నెంబరుతో కూడా వ్రాసి యివ్వండి"

"ఎందుకో చెప్పు లక్ష్మి!"

"ఎందుకయినాగాని, మీరు దయతో వ్రాసి యివ్వండి"

"అడ్రసు నాకు తెలియదు లక్ష్మి. ఆమె టెలిఫోన్ యెక్స్ఛేంజిఆఫీసులో పనిచేస్తున్నట్లుమాత్రమే తెలుసు."

ఆమెకు కావలసినభోగట్టా సంప్రాప్తమైనట్లు విప్పారిన ముఖంతో గబగబ బయటకొచ్చింది.

. ... ... ...

"బాబుగారూ, ఆమె ఆఫీసు తెలిసిందిగాని, దుర దృష్టవశాత్తూ ఆమె లేదు. వూరికెళ్ళి పదిరోజులయింద్దట. ఇంకా రెండురోజులవరకు ఆమె సెలవులోవున్నదట. ఇంత కష్టపడి వెళ్ళినా ప్రయోజనంలేకపోయింది" అన్నది.

"నిజంగా నీవు మేరీకొరకే వెళ్ళావా? నీ కేమిపని చెప్పు లక్ష్మి"

"ఆమెద్వారాఅయితే మీజబ్బు వూరికే నయమవు తుందని గ్రహించాను. అందువలన ఆమెను తీసుకురావలసిన అవసరమున్నది"

"నీ మతిపోలేదుగదా? ఆమెద్వారా నా జబ్బెలా నయమవుతుంది" అన్నాడు.

"నిజం చెబుతున్నందుకు మీరు మరేమీ అనకండి. మీరు ఒకనాడు నిద్రలో ఆమెను కలువరిస్తూ ప్రాధేయ

పడుతున్నారు. మీరు అజ్ఞాతంగా కలవరింతలో వుచ్చరించినపుడే ఆమెపేరు నేను విన్నాను"

"కలలో యెన్నో వస్తుంటవి. వాటికీ యదార్థాలకు పొంతనేవుండదు"

"కావచ్చు కాని, యీవిషయంలో అలాకాదు. నేను ఆడదాన్నిగనుక, యీవిషయంలో నా అనుభవం చాలా విశేషమయింది"

అది సంధ్యాసమయం. శనివారము. సినిమాబుకింగ్‌ల వద్ద క్యూలు బారులుతీరి వున్నవి. పంచదారపంపిణీకో యేమో చిల్లరదుకాణంవద్దకూడా క్యూ తీర్చివుంది. వుడ్‌లాండ్సుహోటల్‌హాలు బాల్కనీలోకూడా జనం కిటకిటలాడుతున్నారు. వైద్యవాచస్పతిగారో, జ్యోతిష్‌పండితులవారో వారికోరకు లోపలనున్నారు. బీచివైపు జనం కోలాహలంగా నడుస్తున్నది. రాయపేటసెంటరులో బస్సునుంచి లక్ష్మిసమేతంగా మేరీ దిగింది. విజయాన్ని సాధించిన వీరునివలె విర్రవీగుతూ నడుస్తున్న లక్ష్మి యెవరో ఐస్‌ఫ్రూట్‌చీకుతున్నపసివానిని ఢీకొన్నది. పాపం అతనిచేతిలోని ఆఫ్రూట్ కాస్తా జారి క్రిందపడి, రాజ్యాన్నిగోల్పోయిన చక్రవర్తివలె ఖిన్నవదనంతో కొరకొర చూస్తున్నాడు. మేరీ వెంటనే అటూయిటూ వెతికి నిరాశతో "ఆ అబ్బాయికి మరో ఐస్‌ఫ్రూట్ కొనిపెడితే బావుండును" అని తటపటాయిస్తున్నది. లక్ష్మి వెంటనే ఆ క్రిందపడివున్నఫ్రూట్‌నుతీసి తనచీరతో మట్టితుడిచి అతనిచేతికిచ్చింది. వాడు ముఖంలోని క్రోధాన్ని కొద్దిగా సడలింపజేసి దాన్నందుకున్నాడు.

లక్ష్మివెంట మేరీ నడుస్తున్నది. ఆ సన్నటిగొందిలో ఆ పాడుబడినట్లున్న ఆ పెద్దకవాటాలు లక్ష్మి తెరుస్తుండుట చూసి, మేరీ విస్తుపోతున్నది. లోపల యిల్లు కనిపించుట లేదు. కేవలం భూమంతా అల్లుకున్న హరవర్ణితాచ్ఛాదితమై చెట్లుమాత్రమే కనిపిస్తున్నవి. ఈ లక్ష్మిని తా నొకమాటు చూసినా, మాటలధోరణి విశ్వసనీయంగా తోచినా, రత్నాకరునివిషయం తనకు శ్రద్ధాత్మకమైనా లోపలకు అడుగిడలేకపోతున్నది ఆమె సంకోచాన్ని గ్రహించి "నేను మిమ్మి మోసగించలేను. స్త్రీని స్త్రీయే అర్థంచేసుకోగలుగు తుంది. ఒక్క అడుగు లోపలకువేసి ఆయనదుర్గతి చూడండి, వారి నీ ఆపదనుంచి రక్షించటానికి మీ సహాయాన్నర్థించే మీ కింత శ్రమయిస్తున్నాను" అని ఉదారతను ప్రస్ఫుటం జేసే స్పష్టమైనపలుకులు పలికింది. ధైర్యాన్ని పూరించుకుని లోపలప్రవేశించింది మేరీ.

సంధ్యాసమయం. శీతలపవనాలు వృక్షములగుండా దూరి వస్తున్నవి. వాటిలో సాగరుని శీతలోష్ణమిళిత సందేశం కూడా నిండివున్నట్లున్నది. వృక్షాలవయస్సు అతిదీర్ఘమైనట్లు ద్యోతకమవుతున్నది. ఆ వృక్షరాజములమీదనున్న పక్షులు కిలకిలారావంచేస్తూ తమవినోదాన్ని ప్రకటించుకుంటున్నవి. ప్రక్కభవనాల పైఅంతస్తునుంచి గాబోలు రేడియోసంగీతం వినవస్తున్నది. ఒకభవనంకిటికీగుండా హార్మోనియంధ్వని అపశ్రుతులతో వినిపిస్తున్నది. మరోప్రక్కభాగంలో భార్యాభర్తలు గాబోలు పరతులుపెట్టి సవాలుచేసుకుంటూ అస హ్యంగా పరుషవాక్యాలు నుడువుతూ అరవంలో పోట్లాడు

కుంటున్నారు. పాలుఅమ్మువాడు గాబోలు సైకిల్ బెల్ గణ గణ మ్రోగించి 'పాలో' అని పెద్దగా కేకపెడుతున్నాడు. పసిపిల్లలకు పీచుమిఠాయి అమ్మువాడు గాబోలు చిన్ని గంటను తెరపిలేకుండా గణగణ మ్రోగిస్తున్నాడు. అడుగులో అడుగు వేసుకుంటూ మేరీ భయదృక్కులతోనే ఆ గ్యారేజీ వైపు నడిచి వెళ్ళింది.

క్యాంపుకాటుమీద దీర్ఘరోగివలె నిర్జీవిలాగా పడి వున్న రత్నాకరుడు నేత్రఫలకాలు వదులువదులుగా మూసి, స్వప్నవిహారంలో హాయిని గ్రోలుతున్నాడు. లక్ష్మి మంచం ప్రక్కకు వచ్చి, కుడిహస్తాన్ని పట్టెమీద మోపి ముఖంలోకి దీర్ఘంగా చూస్తూ, "బాబుగారూ, అదిగో ఆమెగారు వచ్చారు" అని హృదయానందంపొంగుతున్నకంఠంతో అన్నది.

ఖంగారుగా లక్ష్మివైపు తదేకంగా చూస్తున్నాడు. ఎవరిదో శీతలహస్తం తనలలాటంమీదపడి మృదువుగా స్పృశిస్తున్నది. సన్నటి మధురకంఠంతో "మీ రెలా అయి పోయారేమిటి రత్నాకర్ గారూ? ఒక్కకబురైనా తెలియ జేయలేదెందుకని?" అన్నధ్వని వినిపించి, ఆతనిముఖం ముకు ళించివున్న కమలము చంద్రకిరణముసోకినంతనే వికసించినట్లు విప్పారింది. శిరస్సుతిప్పి ఆమెను ఆకలిగొన్నపులివలె తదే కంగా చూస్తున్నాడు. ఆమె ప్రశ్నకు సమాధానమా యేమో అశ్రుబిందువులు ఒక్కటొక్కటిగా ఒలుకుతున్నవి.

మేరీ విమూఢురాలివలె రత్నాకరునివైపు తిరిగి లక్ష్మివైపుచూస్తూ కించపడుతున్నది. ఏదో పని కల్పించు

కుని లక్ష్మి బయటకువెళ్ళింది. మేరీ తనకర్చీఫ్‌తో అశ్రువులను అద్దుతూ ఆయనప్రక్కగా మంచంమీద కూర్చున్నది. ఆయన యేదో చెప్పాలని ప్రయత్నిస్తున్నాడు గాని, హృదయంలో జనిస్తున్నది కంఠంనుంచి బయల్పడుటలేదు. దుఃఖభారంతో శుష్కించి కంఠంపెగులుటలేదు; అధరాలు మాత్రం అదురుతున్నవి.

ఆమె ధైర్యాన్నిపూరించుకుని "రత్నాకర్‌గారూ, అధైర్యపడినందువలన ఆరోగ్యమూ రాదు, ఆదరమూ లభించదు. రోగికి ధైర్యం మొదటిమందు. ఆదరంతోగూడిన సేవ రెండోమందు. అవి రెండూ సమకూరినపుడే అసలుమందులు పనిజేస్తవి, కనుక దయతో ధైర్యంవహించి మీ బాధ యేమిటో చెప్పండి." అన్నది.

హీనస్వరం పెగిలీపెగలనిధ్వనితో "నిరాశ్రయస్థితిలో వున్నాను. నా బాధ నాకే తెలియుటలేదు. శరీరంలో సత్తువ గలిగితే జ్వరం పోతుందంటున్నారు కొందరు వైద్యులు. జ్వరంపోతే సత్తువవస్తుందంటున్నది లక్ష్మి. ఈ రెండూ సాధ్యాలుగావని నా మనస్సు చెబుతున్నది" అని నిస్పృహను ప్రకటించాడు.

"మీరు మరీ అబోధబాలకునివలె మాటాడకండి. ధైర్యము అన్నిటినికల్పించగలది. నిస్పృహ అన్నిటినీశూన్యం చేయగలది. శూన్యంలో శోధించగలదేదీలేదు. శారీరకబాధవలన మానసికబాధ, మానసికబాధవలన శారీరకబాధ సంభవించవచ్చు. ఒకదానికొకటి అదో యిదో మూలముండాలి గనుక, మీ బాధయేమిటో చెప్పండి!" అన్నది.

ఆయనకనుకొలకులనుంచి అశ్రుధారలు మరింత జోరుగా ప్రవహిస్తున్నవి. కంఠం గద్గదమౌతున్నది. అదురుతున్న అధరాలతో "నాకు నేనే అర్థంగాని అయోమయంలో వున్నాను. మనస్సెందుకో అనుక్షణమూ విచార గ్రస్తంగా వుంటోంది. ఏమీతోచదు. అనవసరఆలోచనలలో అధైర్యం నేళవించి వుంటున్నది. తినాలనిపించదు. పడనాలనిపించదు, తిరగాలనీ అనిపించదు. అంతకుమించి మరేకారణమూలేదు" అన్నాడు.

"అసలు యీ పాడుబడినయింటికి రావటానికి కారణమేమిటో ముందు చెప్పండి" అన్నది.

"ఈవిషయంలో మిమ్ము వినయపూర్వకంగా ప్రార్థిస్తున్నాను. నేను యిక్కడున్నట్లు చంద్రానికిమాత్రం చెప్పకండి. చంద్రం భయపడి నన్ను యింటికిపంపాలని ప్రయత్నించాడు. అందువలన యింటికని పయనమయి, యిక్కడికి వచ్చాను" అన్నాడు.

"ఇదొక ఘోరఅపరాధము. ఇంటికని బయలుదేరి యిక్కడికి రావటమెందుకు? చెప్పండి" అన్నది.

అనభిజ్ఞునివలె సంకోచిస్తూ "క్షమించండి. కారణం నాకే తెలియదు. ఇంటికి పోవాలనిపించడంలేదు." అన్నాడు.

"మీరు చాలా చిత్రమైనవారు; సౌకర్యాలు, సలలు అవుసరమైన యీసమయంలో యింటికి పోకుండా నిరాశ్రయస్థితిలో యిక్కడ పొందేదేమిటి చెప్పండి?" అన్నది.

బెదిరినవానివలె అటూయిటూ చూసి, లక్ష్మి దగ్గర

లేదని నిశ్చింతుడై "మిస్ మేరీ, నాహృదయం మహోద్వేల మైంది; నాహృదయంలో యేదో వెలితి యేర్పడి ఆరాట పడుతున్నది; అనుక్షణము నిరీక్షిస్తున్నది, వెదుకుతున్నది. ఆ నిరీక్షణలోని తపనే యిప్పటి నా జ్వరమేమో! ఇక తగ్గిపో తుందనే ధైర్యంవచ్చింది. నాకు ఆరోగ్యం చేకూరుతుంది గాని, మీ రొకమాట యివ్వాలి." అన్నాడు ఆదుర్దాతో.

వుత్సాహితురాలై "నేను డాక్టరునీ గాదు, మాంత్రి కుణ్ణీగాదు. అయినా యేమిటో చెప్పండి!" అన్నది.

"నే నిక్కడున్న సంగతి చంద్రానికి చెప్పకండి. రోజూ మీ దర్శనభాగ్యమివ్వాలి. ఈ నా కోర్కెనుమన్నించినపుడు నా ఆరోగ్యం దానంతటదే కుదుటపడుతుంది." అన్నాడు.

"మీరు భలేవారు! నా దర్శనసందర్భము మందుగా గాని, మంత్రంగాగాని వుపయోగింపజాలదు. నా కంత ఆశక్యతయివ్వవలసిన అవుసరము లేదు." అని చిరునగవును చిలికిస్తూ అన్నది.

విమోహితునివలె బిత్తరిదృక్కులతో చూస్తూ ఆమె సుకోమలకరకమలమునుబట్టి తన వక్షస్థలముమీద అదుము కుంటూ "నా బుద్ధి అతి స్వల్పమైంది. మీముందు మరింత చిన్నబోతుంటుంది. మీకు కారణాలను చెప్పగల సామర్థ్యం నాలో లేదు. నేను నాహృదయంలోనిమాట చెబుతున్నాను. నాకు మందులవలన ప్రయోజనంలేదు. మీరు కనిపిస్తూంటే నాకు తప్పక నయమవుతుంది. మిమ్ము తలచినా చూసినా నాలో వుత్సాహంకలుగుతున్నది; ఆనందం అనుభవమవు తున్నది. కనుక తమరు మరేమీ అనుకోక, నన్ను మన్నిం

చండి" అంటూ ఆమెచేతిని యింకా అదుముకుంటున్నాడు. నేత్రాలు జలమయమైనవి.

మిస్ మేరీ నెమ్మదిగా తనహస్తాన్ని జారదీసుకుని "మీరుచెప్పేది నా కర్థమవుటలేదు. జబ్బులో మీరు ఖంగారుచెందినట్లున్నది. శ్రద్ధగా తగిన మందుతీసుకోండి, నయమవుతుంది" అన్నది.

తనహస్తాలతో ముఖంకప్పుకున్నాడు. కాని కారుతున్న అశ్రుస్రవంతి చెంపలపైకనిపిస్తున్నది. ఆ పుల్లలాంటి చేతివ్రేళ్ళు వాటిక్రిందగా జారుతున్న ఆ అశ్రువులు ఆమె మనస్సును కదిపినవి. ఆలోచనాదొంతరులు పొర్లుతున్నవి. అతనిదీనతయెడ కలిగిన కరుణ పొంగి గాబోలు, ఆమె నేత్రాలుగూడా చమ్మగిలినవి. తన యెడమహస్తాన్ని ఆయన క్రాపుమీదవేసి వ్రేళ్ళతోదువ్వుతూ, కరుణార్ద్రకంఠంతో "రత్నంగారూ, కన్నీరుపెట్టకండి. మీరు చాలా చిక్కిపోయారు. యీ సమయంలో ధైర్యంలేకపోతే కోలుకోవటం కష్టం. మీ మనస్సులోని బాధయేమిటో నాకు బోధపడుట లేదు. ఏదియేమయినా, యీ నిరాశ్రయసమయంలో మిమ్ము ఆదరించుట నా ప్రథమకర్తవ్యం గనుక, నేను రోజూ వస్తాను" అన్నది.

మిస్ మేరీ వస్తూపోతూ వారంరోజులు గడిచిపోయినవి. రత్నంఆరోగ్యం అభివృద్ధిచెందుతున్నది. మిస్ మేరీకి తనఆఫీసుడ్యూటీకంటె యిక్కడిడ్యూటీయెడల శ్రద్ధకలిగింది. ఆఫీసులోవున్నా మనస్సు యీ అమాయకరోగిమీదే వుంటుంది. "ఫలహారం తినివుండడు, పళ్ళు భుజంచివుండడు,

పాలు త్రాగివుండడు. కేవలం నాకోరకు తెన్నులుచూస్తుం టాడు. యెంత వెర్రివాడు పాపం!" అని మనస్సులో అను కుంటూ క్షణక్షణము గడియారమునంక చూస్తుంటుంది. గడి యారంముల్లు త్వరత్వరగా తిరుగనందుకు క్రుద్ధురాలవుతుం టుంది. పొరపాటుగా ఒక నెంబరుబదులు మరో నెంబరు యిస్తుంటుంది. మానిటరు ఒకటడిగితే మరోటి సమాధానం చెప్పి, ఆయన తేరిపారచూస్తూ నవ్వునుప్రదర్శించినపుడు తన అప్రమత్తతతోడిసమాధానానికి చిన్నబుచ్చుకుని నాలుక కొరుకున్కుంటూ, 'అబ్బ! ఇంత పరధ్యాస నన్నంటివుంటున్న దెందుకు?' అనుకుంటూ, కాలం యింత నెమ్మదిగా దొర్లు తున్నందుకు విచారిస్తుంటుంది.

ఆమె కిపుడు పుస్తకాలమీద ధ్యాసపోవుటలేదు. ప్రక్కనున్న మిత్రదళంతో మాటాడాలనిపించుటలేదు. తనలో తానే ఆలోచనానిమగ్నురాలై మనస్సులో దొర్లిన విషయాన్నే దొర్లించుకుంటూ, ఆత్మానందంతో నవ్వు కుంటూ ప్రక్కవారిమాట మరిచి ఫక్కున నవ్వి, తిరిగి పొర పాటుకు కించ చెందుతుంటుంది. అతని అమాయకపుమాటలు నిరాశ్రయస్థితి ఆమెమనస్సును పూర్తిగా ఆకర్షించినవి. తానొక విచిత్రమైన పసిబాలకుని సాకుతున్నట్లు, అతని సేవలో ఆమెకు అనిర్వచనీయమైన ఆనందం కలుగుతున్నది. ఈ నూతన ఆటవస్తువుతో తనయింటిని క్లబ్బును పూర్తిగా మరిచిపోయింది. గొప్పగొప్ప గ్రంథాల పఠనంలో సంప్రా ప్తంగాని ఆత్మానందాన్ని నేడామె ఒక నిరాశ్రయునికిచేసే సేవలో పొందగలుగుతున్నది. ఈ సేవలోను, ఈ స్థానం

లోను కలిగే వుత్సాహంతో శరీరం పులకితమవుతున్నది. ఈ ఆనందానుభూతిలో పరవశమవుతున్న ఆమెమనస్సు అజ్ఞాతరూపంలో అనుక్షణమూ అటువైపుకే పరుగులెడుతున్నది.

మిస్ మేరీ తన బూటుచప్పుడుకాకుండా, పిల్లి అడుగులు వేసుకుంటూ శిరస్సువైపుగా వచ్చి, రత్నాకరుని ముఖం పరిశీలించింది. అతని నేత్రాలు తెరచివున్నవి. అంతంలేనిఆలోచనలలో విహరిస్తున్నట్లు ద్యోతకమవుతున్నది. అతను నేత్రాలుమూసివుంటే, ఏమిచేయాలనుకున్నదో గాని విఫలంజెందినదానివలె ప్రక్కకు వచ్చి "నేను నిన్న ఎలాపెట్టిపోయినసీసా అలానే వున్నది. రాత్రిగాని వుదయం గాని త్రాగినట్లులేదు. అంత స్వాదిష్టమైనటానిక్ త్రాగటానికికూడా మీకు సిగ్గుత్యమైతే, బల మెలావస్తుంది చెప్పండి? మందులు లేనేలేవు, టానిక్ కూడా త్రాగకపోతే యెలా?" అని లాలింపుగా అన్నది మేరీ.

వినమ్రమస్వరంతో "మందులులేకుండా రోగ మెలా నయమవుతున్నదో అలానే టానిక్కులులేకుండా బలం కూడా చేకూరగలదంటే మీరు నమ్మతారా?" అన్నాడు.

"పుష్టికరమైన పదార్థాలు తినకుండా టానిక్కులు త్రాగకుండా బల మెలా సంభవిస్తుందంటారు?" అన్నది.

"వాటన్నిటికిమించిన బలాన్నివ్వగలిగేది మానసికోల్లాసం మిస్ మేరీ" అన్నాడు.

అర్థంగానిదానివలె "ఆరోగ్యంలేనిదే మానసికోల్లాసం యెలాకలుగుతుందంటారు?" అన్నది.

"మీరు నాయెదుట కనిపిస్తుంటే, నాకు ఆరోగ్యం కలుగుతుంది, బలంవస్తుంది, మానసికోల్లాసం వుత్పన్న మవుతుంది. నాలోని యీ యదార్థసత్యాన్ని ప్రకటిస్తున్నందుకు మన్నించండి" అన్నాడు.

"అది, అర్థంగాని మీ భ్రమకావచ్చు" అన్నది.

"అర్థాలు అర్థంగాకుండానే నాటిలోని స్వాద్యాన్ని అనుభవంలో పొందవచ్చుగదా!" అన్నాడు.

"పరీక్షలలో కూర్చుంటే, పెద్దపెద్ద సర్కిల్స్ వస్తుంటవి. ఇలాంటికబుర్లలో బుర్ర మహాచురుగ్గా పనిజేస్తుంది. ఆ తెలివిని కాస్త ప్రయోజనమార్గంలోవుంచండి" అన్నది మందహాసాన్ని ప్రకటిస్తూ.

సిగ్గిలుతున్న ముఖంతో "మీసమక్షంలో చెప్పటానికి ధైర్యంచాలుటలేదు. నేను వివరాలు చెప్పలేనుగాని, మీరు యెదుట కనిపిస్తుంటే, నాకు యెక్కడలేని మనోబలంకలుగుతుంది. మనోభావాలు మహావేగంగా తరంగాలవలె పరువులెడుతవి. నాకు తెలియని గూఢకూహాలుకూడా నాలో జనిస్తుంటవి. ఆ పరీక్షపేపర్లనిచ్చి మీయెదుట కూర్చుని వ్రాయమంటే, అద్భుతంగా వ్రాయగలను. వున్నమార్కులన్నీ వేసినా చాలనంతగా వ్రాయగలను" అని ఆమెవంక కోణదృక్కులతో చూస్తున్నాడు.

వస్తున్న నగవును ఆపుకుంటూ "నాముఖాన యెదుటివారికి బలాన్నిగల్పించేశక్తిలేమయినా నివసిస్తున్నదా? మీ పరీక్షాప్రశ్నలకుజవాబులు నాముఖంమీద వ్రాసివున్నవా?" అంటూ ఆమె తనబ్యాగ్‌నుంచి పొట్లంతీసి కేక్సు తిని

పించి, పాలుత్రాగించి ఆయనప్రక్కన కూర్చుని "ఇక మీరు స్నానంచేయుట మంచిది. జ్వరం తిరుగబెట్టేటయము కూడా దాటిపోయింది" అన్నది.

"అవును" అన్నాడు.

ఆయనపట్టుమీదపడిన కేక్ ముక్కపొడినితనవ్రేళ్ళతో తీసివేస్తూ, పట్టుగుండీలను తొలగించి వక్షస్థలముమీదపడిన పొడిని తీయప్రయత్నిస్తున్నది గాని, చిక్కచిక్కగా చిక్కగావున్న ఆ రోమములగుబురులో చిక్కుకునివచ్చుట లేదు. ప్రయత్నంతో తీస్తున్నది. ఏ దేవకన్యో తనతో ఆడుకుంటున్నట్లు పొంగుతున్ననరాలతో తన్మయుడై, ఆమె రెండుహస్తాలను పట్టుకుని, తనముఖమండలానికి అదుముకుంటున్నాడు. "అబ్బ!" అని చిక్కబడుతూ తనివిదీరక గాభోలు అరచేతిని కొరికాడు.

క్రోధాభినయంతో "ఇస్! ఏమిటది? తప్పుగాదూ? ఒకస్త్రీతో అలా సంచరిచవచ్చా చెప్పు? ఇది పెద్ద అపరాధం రత్నంగారూ. మీ రిలాచేస్తే నే నిక రాను. మీ అనారోగ్యాన్ని, అమాయకత్వాన్ని నిరాశ్రయాన్నిచూసి వస్తున్నందుకు అత్యాచారంచేయకండి. జాలిని వుదాత్తతను కొల్లగొట్టి దుర్వ్యయంచేయగూడదని మీరు గుర్తుంచుకోండి" అన్నది.

బెదరినవానివలె ఆమెచేతులను వదిలి వెలవెలబోతున్న ఖిన్నవదనంతో చేతులుజోడించి "నన్ను క్షమించండి. మీ చేతులను దురుద్దేశ్యంతోగాని, పట్టుకోవాలని గాని పట్టుకోలేదు. అనాలోచితంగా అప్రయత్నంగా జరిగిన

విషయం. ఈ విషయంలో మీరు కోపగించుకుని రాకపోతే, మృత్యుగహ్వారంలో నన్ను విడిచినట్లవుతుంది. తెలియక చేసిన అపరాధాన్ని క్షమించాలి" అన్నాడు.

ఆమె పెదవులపై సన్నటి నవ్వురేఖను ప్రదర్శిస్తూ "అపరాధం తెలిసిచేసినా తెలియకచేసినా దానిఫలితం ఒకటే నండి. అమాయకంగా కనిపించేవారే అసాధారణకార్యాలు చేసికూర్చుంటారు. అయినా, మీ రిక యెన్నడూ యిలాంటి అపరాధంచేయనని మాటయిస్తున్నారు గనుక, మీ అపరాధాన్ని మన్నిస్తున్నాను." అంటూ ఆయన చెక్కిలిమీద మృదువుగా మీటింది. ఆ చిన్న చిటికదెబ్బతో ఆయన మొఖం విప్పారి వికసించింది.

"మీ ముఖాన రవంత క్రోధచిహ్నాలు కనిపించినా నా మనస్సు వేడెక్కుతుంది, హృదయం కంపిస్తుంది, స్వేదం కమ్ముతుంది. మీరు సంతోషంగా మాటాడుతుంటే నా శరీరమంతా పరవశమవుతుంటుంది, నన్ను నేను మర్చిపోతుంటాను. ఎప్పుడూ మీ రలా నవ్వుతూ ఆనందంగా యెదుట కనిపిస్తుంటే, యెంత బావుండును అనుకుంటుంటాను. మందహాసంతో మీ మృదుత్వం మహాకోమలంగా ఆకర్షణీయంగా కనిపిస్తుంది. కోపంలో మీరు ప్రచండభయభీతులు గల్పిస్తారు. నిజంగా మీముఖంలో ఒకోమాటు గనిపించిన కోపం, అలానే అరగంటవుంటే నా ప్రాణం నాకు తెలియకుండానే యెగిరిపోతుంది" అన్నాడు.

మందహాసాలొలికిస్తూ "పురుషజాతిలో టక్కరితనం పేరుకునివుంటుంది. ఆ టక్కరితనం అవసరంకొద్దీ కాస్త

కాస్త బయటకొస్తుంటుంది. నా కోపాన్నిజూచి మీరు భయ పడవలసిన అవుసరమేమిటి చెప్పండి. అది అసందర్భమైన విషయం. ఒకస్త్రీని పురుషుడు పొగడుట మహాపరాధమని ఒకసారి చెప్పాను. తిరిగి మీరు ఆ పొరపాటునే చేస్తు న్నారు" అన్నది.

"స్త్రీపురుషులమధ్య జరిగే ప్రతివిషయానికి రెండో అర్థం ఆపాదించి అపరాధంగాయెంచి పురుషునినోరుమూయ జూచుటకూడా క్షేమంగాదు. మనస్సులోవున్న మాటను నిష్కల్మషంగా చెప్పినందుకు మరేమీ అనుకోకండి. నవ్వు ముఖంతో కనిపించినపుడు మీరు యెంత ఆకర్షణీయంగా కనిపిస్తారంటే, యెప్పుడూ అలానే కనిపిస్తుంటే ఆకలిదప్పులు మాని, ఆనందాన్నిగ్రోలుతూ జీవితాంతం వుండవచ్చునని పిస్తుంది" అన్నాడు.

"కోపంగావున్నపు డెలావుంటానో అదికూడా వర్ణిం చండి" అన్నది.

"మీరు కోపంగావున్నపుడు నా వళ్ళు ఝల్లుమం టుంది. మా చిన్ననాటి మాష్టారు గుర్తుకొస్తుంటారు. నిద్రలోకూడా ఆయనచేతిలో బెత్తముండేది. ఆయన్ను చూస్తూ, వచ్చినపద్యం అప్పగించుట అసాధ్యమయ్యేది. ఆయనకు కొట్టి చెండాడటం అలవాటు; ఆయనశిష్యులకు కూడా ఆ అలవాటే అభ్యాసపర్చేవాడు" అన్నాడు.

"మీరు అమాయకులనుకున్నాను. కాని మహాచతురు లు. నన్ను చీల్చిచెండాడే పంతులుతో బోల్చి చిన్న

బుచ్చుతున్నారు. కోపంగావుండేబదులు సిగ్గుపడాలని, మీ రీ మాటలన్నారనుకుంటాను" అన్నది.

ఆయన పరాానంవహించి వూరుకున్నాడు.

"ఫలహారం తీసుకుని చాలాసేపయింది. టానిక్ తీసుకోండి" అంటూ, టానిక్ గ్లాసులోపోసి యిచ్చింది.

# 12. నిర్మలానూర్జహాన్

నిర్మలానూర్జహా నిపుడు బాలికగాదు; నవరసము లొలుకు యవ్వనంలో మిసమిసలాడుతున్న 17 సంవత్సరాల యువతి. అనేకసంవత్సరాలఅనంతరం ఆ యింటిలో యీ బాలికాప్రవేశంతో కళాప్రభాతం వెల్లివిరిసింది. తిరిగి గోపూజలు, లక్ష్మీపూజలు, వ్రతాలు ప్రారంభమైనవి. నీలకంఠస్వామిఆలయ పునర్నిర్మాణము వైభవోపేతంగా జరిగింది. పురాతననిర్మాణంకంటె రెట్టింపు విలువైన నిర్మాణంజరిగింది.

అభ్యాగతిగా వచ్చి యింటిలోజేరిన ఆ బాలిక ప్రేరణతో ఒక ఆలయపునర్నిర్మాణానికి 20వేలధనం వెచ్చించినపుడు శివప్రసాద్‌కి మతిపోయిందని, భవానీకి మందుపెట్టి వుంటుందని వదంతులు ప్రబలమైనవి. ఆ ఆలయంప్రక్క నదిసోపానాలకెదురుగా శివప్రసాద్‌తండ్రిపేరిట ధర్మశాల రూపంలో పదివేలు ఖర్చుపెట్టి ధర్మశాల నిర్మించినపుడు యీ బాలిక గొప్ప తాంత్రికంతో యింటిలోచేరి సర్వనాశనంచేస్తున్నదని, చూస్తూచూస్తూవుండగానే ఆ యింటిని

కర్పూరంవలె కరిగించి శివానికి భవానికి జోలియిచ్చి మాయమైపోతుందని, కులగోత్రాలులేని దరిద్రురాలని, మహమ్మదీయురాలు కాదంటారుగాని మ్లేచ్ఛబాలికో, క్రైస్తవకన్యో అయివుంటుందని, చేసే పూజలన్నీ దొంగ నటనలని ప్రక్క-గ్రామాలలో కూడా ప్రచారంజరిగి పోయింది.

ఆలయనిర్మాణం పూర్తయి, వుత్సవాలుజరిపినపుడు దూరదూరగ్రామాలనుంచి విందుకొచ్చిన వందలాది బ్రాహ్మణోత్తములు తమ కా విందు యెవరిద్వారా సంప్రాప్తమైందో, యెవరిద్వారా బ్రాహ్మణీకం ఆదరింప బడుతున్నదో, ఉద్ధరింపబడుతున్నదో, పూజింపబడు తున్నదో ఆ బాలిక మ్లేచ్ఛురాలని, మాయలాడిఅని, శివప్రసాద్‌కుటుంబాన్ని సర్వనాశనంచేస్తున్నదని, యింటి వారికి మతిపోగొట్టి అధికారం చలాయిస్తున్నదని పటుతర మైన నిర్ణయాలుచేసుకుని, సంభావనలతోపాటు తమనిర్ణ యాలనుకూడా వెంటదీసుకుని ప్రచారంచేసుకుంటూ వెళ్ళారు. పట్టణంలోను ప్రక్క-పల్లెలలోను నిర్మలనుగురిం చిన దుష్ప్రచార మెంత ఉధృతరూపం దాలుస్తున్నదో అంతకుమించిన అనురాగంతోగూడిన ఆధిక్యత ఆమె కా యింటిలో దినదినాభివృద్ధినొందుతున్నది. ఆమె శివంలోను భవానీలోను లీనమైపోయి, వారిని తనతో ఐక్యంచేసు కున్నది. ఇపుడా యింటిలోని అభిప్రాయాలు ఎవరిలో ఉద్భవించినా యేకోన్ముఖంగా ప్రభవిస్తున్నవి. బయటి వారికి వారు ముగ్గురుగా కనిపిస్తున్నా, వారిలోవారికి ఒకే

అభిప్రాయం, ఒకేహృదయం, ఒకేఆత్మగా అనుభవమై పోయింది.

బయటివారికి ఆ యింటి సర్వసంపత్తిని నిర్మల కరిగించివేస్తున్నదని, పెద్ద కుట్రలుపన్నుతున్నదని యెంత హేయంగా కనిపిస్తున్నదో అంతకుమించిన శ్రద్ధాభిమానాలు, ఆదరవిశ్వాసాలు ఆయింటిపరివారంలో పాతుకుపోతున్నవి. ధర్మకార్యాలయెడ ఆమె వెచ్చిస్తున్నధనం సామాన్యమైంది గాదు. కాని ఆ కుటుంబాని కామె నూతనంగా కల్పించిన ఆదాయాలు అంతకుమించినవి.

తరతరాలుగా సాగులేక గుట్టలుమిట్టలుగా ముళ్ళ పొదలతో నిండివున్న 20 యకరాలభూమిని నిర్మల చూసినపుడు, తనదేశపు భూములు సాగులు తోటలు ఆమెమనసులో మెదిలినవి. తనదేశంలో సస్యశ్యామలమైన భూములు యీ భూమికి మించినవిగాదు. కొండప్రాంతం వారికి విశాలమైన సమతలభూములుగాని, సర్వసౌకర్యాలుండు భూములుగాని లభ్యంగావు. ఆ మెరక పల్లాలభూములనే చిన్నిచిన్ని మళ్ళుగా చేసి, అమూల్యమైనపంటలు పండించుట ఆమె చూసివున్నది. మనస్సులోని ఆ ఆలోచన లిచ్చిన వుత్సాహంతోనే యీ భూమిని సాగుకుతేవాలని నిర్ణయించుకుని అందుకు భవానీని శివప్రసాద్‌ను అనుమతింప జేయుటకు విశ్వప్రయత్నాలు చేయవలసివచ్చింది. ఆ భూమిని సాగుచేయించ ప్రయత్నించుట నిరర్థకమని, అందుకు పెట్టే ఖర్చు నిష్ఫలమవుతుందని భవానీ దృఢవిశ్వాసము. అయినా నిర్మలానూర్జహాన్ అనునయప్రార్థనలను త్రోసి

పుచ్చుజాలక సమ్మతించి వూరుకున్నది. ఆ భూమిమీద పారబోయదలచిన డబ్బు యే ధర్మకార్యానికో ఖర్చుబెడితే మనశ్శాంతైనావుంటుం దన్నాడు శివప్రసాద్.

నిర్మలానూర్జహాన్ పట్టుదలగల సాహసవంతురాలు. ఆమె తన ప్రేమాదరాలతోగూడిన నమ్రతవలన పాలేర్లు, రైతుల సానుభూతిని చూరగొన్నది. తనకార్యానికి నిరసన ప్రకటిస్తున్నభవానీద్వారానే శుభముహూర్తం నిర్ణయించి అదనపు కూలీలతో పని ప్రారంభంచేయించింది. విరామం లేకుండా పని సాగిపోతున్నది. పనిలేని కూలీలందరికీ గొప్ప వుత్సాహంకలిగింది. పొదలన్నీ నరికివేయబడినవి. గుట్టలు మెరకలు చదునుచేయబడినవి. భూమిపైభాగంలో తేలిన కంకరముక్క బయటకు చేర్చబడింది. నిత్యము వందలు వెచ్చించుతూ రెండునెలలు పనినిసాగించినపుడు, అందుకు పెడుతున్నఖర్చును వూహించినవారంతా "ఈ గృహానికేదో దుర్దశ సంభవించింది. యకరము రెండువందలు విలువ చేయని యీ భూమిమీద నీటివలె ధనాన్ని ప్రవహింపజేయుట యెంత వెర్రితనం! యెన్ని పైరులువేసి యెంత పంటలుపండించినా పెట్టినఖర్చుకు వడ్డీవచ్చుట దుస్తరము. దరిద్రం ఆవేశించినపుడు యిలాంటి బుద్ధులు పుడుతాయి" అని అపోహ అంతటా వాడుకలోకివచ్చింది. నదిఒడ్డున ఆయిల్ఇంజను ఫిట్చేసినపుడు మరింత విస్తుపోయారు. ఖర్చు మొత్తం పదివేలయినా వేనకువేలు మట్టిలో పారబోసినట్లు వింతగా చెప్పుకున్నారు. కిస్మిస్ ద్రాక్ష యాపిలుతోటలు వేసి, మూడుసంవత్సరాలు గడిచాక పదివేలఆదాయం కనిపించి

నపుడు, అందరూ ఆశ్చర్యాన్వితులయ్యారు. రెండోసంవత్సరం 15వేలఆదాయం వచ్చినపుడు పరిహసించినవారంతా సిగ్గిలుతూ తమ కలాంటి అదృష్టం లభించనందుకు దరిద్రాన్ని దూరుకుంటూ బాధచెందారు. "ఈ భూమి ద్రాక్షతోటల కింత అనువుగావుంటుందని ఈ చిన్ని బాలిక కెలా తెలిసిందా" అని పదేపదే ఆలోచిస్తున్నాడు శివప్రసాద్. "భగవంతుని ద్వారా పంపబడిన లక్ష్మిఅవతారమే మా నిర్మల" అంటుంది భవాని.

# 13 పునర్నిర్మాణం

నిర్మలచే పునరుద్ధరించబడిన ఆలయము ధర్మశాలల ఉత్సవాలు సంతర్పణలు సంభావనలు ఒక్కమాటుగా గొప్పగా జరిగినపుడు ప్రజలలో కలవరం చెలరేగింది. ఆ యింటికి కలిగిన ఆర్థికాభివృద్ధిని మరచి పెద్దపెట్టున పెడుతున్న ఖర్చులను చూసి విస్తుపోతూ "ఈ యింటిలో దరిద్ర దేవత ప్రవేశించింది. ఈ కుటుంబాన్ని సమూలంగా సర్వనాశన మొనరించు రాక్షసి ఆవేశించింది. నేడో రేపో ఆ బ్రాహ్మణదేవతలకు జోలియిచ్చి పంపుతుంది ఆ మ్లేచ్ఛరాలు" అనుకుంటున్న కింవదంతులు అంతటా ప్రచారమైనవి.

భరద్వాజశాస్త్రిగారికీ వార్త కొంచెం ఆలస్యంగా చేరింది. మామూలుగా విన్న వదంతులు ఆయనకు తృప్తిని కలిగించలేదు. వచ్చినన్నివివరాలు తెలుసుకువచ్చినవారులభ్య

పడనూలేదు. మరునాటిసాయంత్రం విప్రవరులరాక వరుస వారీగాజరుగుచున్నది. నీలకంఠస్వామిఆలయవుత్సవం నిన్నటితో పూర్తయిందని, యెన్నడూ యెప్పుడూ యెక్కడా జరుగనంతటి వైభవోపేతంగా పూజలు హోమాలు జరిగినవని, నిత్యము వేలమంది షడ్రసోపేతమైన భోజనాదులు, సంభావనలు పొందుతున్నారని, వేరే నిర్మించిన ధర్మశాలకు మరో ప్రారంభోత్సవానికి యింకోవారం విందులు హోమాలు జరుపనున్నారని, ఈదెబ్బతో బహుశ ఆ కుటుంబఆస్తి అడుగంటవచ్చునని, ఆ కుటుంబాన్ని సర్వనాశనంచేయుటకే ఆ యింటిలో ఒక అనాధబాలిక చేరిందనీ వదంతులవివరాలు రఘునాధశాస్త్రిద్వారా తెలుసుకున్నాడు భరద్వాజ. రఘునాధ్ తిరిగిరావటానికి కారణం పొందిన కానుకలను, వస్త్రాలను యింటివద్ద విడచి, తన వేలువిడిచిన తమ్ముని కూడా కొనిపోవుటకని విని, మరింత వుత్సాహితుడైనాడు భరద్వాజ.

ఒక భ్రష్టురాలిద్వారా కూలిపోనున్న కుటుంబాన్ని చక్కబెట్టుటకు కావలసిన ఉపాయాలను ధైర్యసాహసాలను కూటనీతిని వ్యూహాలలో ప్రోగుజేసుకుంటూ పుత్రీసమేతంగా పయనమై వెళ్ళాడు భరద్వాజ్.

"నీవు యెంతచెప్పినా మనస్సు కంపిస్తున్నదమ్మా! మామయ్య పిలువాపెట్టకుండా యిక్కడకు రావటమెందుకు చెప్పు? ఆయన వచ్చుట మన కెప్పుడూ క్షేమంగాదమ్మా. ఆయ న్నెలా పలుకరించను చెప్పు? ఆరోజు అంత అవమానపుమాటలు దూషణలు అని వెళ్ళాడు, ఆయన తిరిగి

మనయింటికి రాకపోతేనే మనకు క్షేమమమ్మా!" అన్నాడు శివప్రసాద్.

"ఏది యెలాజరుగవలసివుంటే అలానే జరుగుతుంది శివం. ప్రతిదీ భగవంతునియిచ్ఛానుసారమేజరుగుతుంటుంది. మనయింటికివచ్చిన బంధువుని ఆదరించుట మనకర్తవ్యం నాయనా! భరద్వాజ మీ తల్లికి సోదరుడన్నసంగతి మరువకు. ఆమెకొరకైనా ఆదరించుట అవసరం. మీ తల్లి విశాల హృదయిని. పలుకరిస్తే ప్రేమతో పొంగిపోయేది. అలాంటి ప్రేమమూర్తిసోదరుడుగా యీ భరద్వాజను యీరూపంలో చూడవలసిరావటం భగవంతుని చిద్విలాసం నాయనా!" అన్నది భవానీ.

గోశాలనుంచి వచ్చిన నిర్మల నెమ్మదిగా శివప్రసాద్‌ను పిలిచి "బాబుగారూ, ఒక్కవిషయం చెబుతాను మన్నిస్తారూ. ఇక్కడ చేరినవారందరికంటె పెదబాబుగారు మీకు ఆత్మీయులు. వారియాజమాన్యంలోనే మీ కార్య కలాపాలన్నీ జరుగవలసింది. వారు అందరికీ పూజ్యులు. గతించిన దుష్కార్యాలకు జరుగనున్న సత్కార్యాలను ముడివేయుట ధర్మంగాదు. మీరు పలుకరించనందుకు వారు బాధపడుతున్నారు. నేను యెన్ని ప్రార్థనలుచేసినా మీ అనుజ్ఞకొరకు యెదురుచూస్తున్నారు. వారిని కించపరచుట మనకు క్షేమంగాదు బాబుగారూ!" అన్నది.

"ఆనాడు అకారణంగా కాలదన్ని నిన్ను అన్న మాటలు మరచావా నిర్మలా? ఆయన మా మేనమామ

గారే కాని, ఆయన గోముఖవ్యాఘ్రమన్నది నేను మరువ జాలను" అన్నాడు.

నేత్రాలు పెద్దవిచేసి, నోటిమీద వ్రేలు వేసుకుని "అబ్బ! నాయెదుట అలా అనకండి బాబుగారూ! వేయి సత్కార్యాలద్వారాపొందిన సత్ఫలితం ఒక్కదుష్కార్యంతో దూరమవుతుంది. ఈ సమయంలో గతించినవాటిని తలచుకోగూడదు. నన్ను ఆనాడు వారన్నవిషయానికి ఆనాడు గాని, యీనాడుగాని నాకు బాధలేదు. వారు సర్వాధికారులా పెద్దవారు. దండించగలహక్కు వారికున్నది. పెద్దవారిని నిర్లక్ష్యంచేస్తే మనకు అశుభంకలుగుతుంది బాబుగారూ" అన్నది.

"ఈవిషయంలో నీవు నాముందు తర్కించవద్దు నూర్జహాన్. మరువగలవాటిని తప్పక మరవాలి, కాని మరువరానివి కొన్నివుంటవి; వాటిని మరిస్తే ముప్పు శిరస్సునదాల్చవలసి వస్తుంది" అని క్రోధంతో అన్నాడు.

మందహాసాన్నిప్రకటిస్తూ, "బాబుగారూ, గాదెలో పందికొక్కు, యింటిలో మార్జాలము, అడవిలో సింహము సముద్రంలో బడబాగ్ని దాగగల్గును కాని, మానవహృదయంలో సర్వమూ దాగగల సావకాశమున్నది. అన్నిటిని సమన్వయపర్చుకోగల సామర్థ్యముంది మానవునికి. విశాల హృదయులగు మీబోటివారు యితరులఅపరాధాల పరిమాణాన్ని గుణించకుండానే మరువవచ్చు. యెదుటిఅపరాధాలు యెంతటివైనా అంతికుసుంచిన హృదయాన్ని కదింప జాలవు. తుపాను యెంత ప్రచండమైనదైనా గిరులను కదుప

జాలదు బాబుగారూ" అంటుండగా మధ్యలోనే శివ ప్రసాద్ క్రోధావేశాలతో అడ్డుకొని,

"క్షణంలో సంభవించే భూకంపం హిమాలయాలను సమూలంగా పాతాళానికి త్రొక్కివేయగలదన్నది మనువ బోకు" అన్నాడు.

ఆమె మరింత మృదుత్వంతో చిరునగవును చిలికిస్తూ ఆయనహస్తద్వయాన్ని తనకోమలహస్తాలలోకి తీసుకుని స్పృశిస్తూ, అనునయంగా "బాబుగారూ, భూకంపంద్వారా త్రొక్కివేయబడినా ప్రఖ్యాతవంతమైన ఆ కైలాసపర్వత శిఖరాగ్రం భూగర్భంలోనైనా తనఖ్యాతిని విలసిల్ల జేస్తుంది గదా! దాని ప్రఖ్యాతచరిత్రను నామరూపంలేకుండాచేయను భూకంపానికీ సాధ్యంగాదు బాబుగారూ! అయినా తర్క వితర్కాలతో యదార్థాలుగాని, సమస్యలుగాని తేలవు. (ఆమె మరింత అనునయంగా ఆయనహస్తాలను తనశిరస్సు మీదికి తీసుకెళ్ళి) బాబుగారూ, మీముందు ప్రాధేయపడు తున్నాను, ప్రార్థించుకుంటున్నాను. యీ ఒక్కమాటుకు యాచించుకుంటున్నాను. నన్నుక్షమించి నామాట మన్నించి పెదబాబుగారిని పలుకరించండి. వారికికూడా యేదో కార్య భారాన్నప్పగించండి. వారివలన మనకు కార్యభారం తగ్గి పోతుంది" అన్నది.

"నూర్జహాన్, యిక నన్ను విసిగించక నీయిష్టంవచ్చి నట్లు చేసుకో. గాజుకోటలోనుంచి మెరుస్తూ వెలుగునిస్తున్న అగ్నివైపుకే చిలుకపురుగు దూకుతుంటుంది. యేగాజు ద్వారా తను రక్షింపబడుతుంటుందో ఆ గాజుమీదే విసిగి

పోతుంటుంది. ఆ గాజు తొలగినమరుక్షణం తను భస్మీపటలమైపోతుందన్న సంగతి తనకు తెలియకేనని అనలేము. ఆ దహనంలోనే ఆనందమున్నదేమో! ఆ ఆత్మార్పణలోనే శాంతివుందేమో! స్త్రీస్వభావంకూడా అలాంటిదే. ప్రశాంత వాతావరణాన్ని స్త్రీ సహించలేదు. తుఫానులతోను భూకంపాలతోను నిండివున్నపుడే స్త్రీమనస్సు నిలకడగావుంటుంది; అందుకే కోరి కలహాలను కొనితెచ్చుకోవటం పడతులకు పరిపాటయిపోయింది'' అంటూ తనహస్తాలను విసుగ్గా లాక్కొని వెనుదిరిగాడు.

ఆమె నిశ్చేష్టురాలై, కూలబడినదానివలె ఆయన పాదపద్మాలమీద వాలి "బాబుగారూ, నా అపరాధాలను యెన్నింటిని మన్నించలేదు చెప్పండి. లోకమంతా నన్ను దొంగయని, దుష్టయని, మ్లేచ్ఛయని యెంత నిందించలేదు? వాటన్నిటిని మీరు పరిహసించి నన్ను ఆదరించి, నాకు నూతనజీవితాన్ని ప్రసాదించారు. భగవంతుడు మిమ్ము అందరివలె సామాన్యునిగా సృష్టించలేదు బాబుగారూ! దొంగలను దుష్టులను నీచులను సన్మార్గులుగాను సత్యసంధులుగాను చేయగల సత్తా మీలో వున్నది'' అంటూ ఆయనపాదాలమీద తనముఖాన్నివుంచి, చేతులతో కాళ్లను స్పృశిస్తున్నది. ఆమెబాష్పకణాలు తనపాదాలమీదపడి గాబోలు వులికిపాటుచెంది, ఆమెశిరస్సునుపట్టి లేవనెత్తి, అశ్రుముద్రితమైయున్న ఆమెముఖాన్ని తదేకంగా చూస్తూ మందహాసంచేయప్రయత్నిస్తూ విఫలుడై, ఆమె కొంగునే తనచేతపట్టి అశ్రువులను తుడుస్తూ, "సరే, ఇక కన్నీరు

కార్చకు! ఏమిచేయమంటావో నేరుగా చెప్పు? మరో మాట: నీ కీవిషయంలో యింతపట్టుదల యెందుకు పిచ్చిదానా?" అని చెక్కిలిమీద చిన్నగా మీటాడు.

ఆమె తనముఖానికి చేతులు అడ్డుపెట్టుకుని, "నేను మిమ్మూ, బామ్మగారినీ మంత్రశక్తితో వశంజేసుకుని మోసంజేస్తున్నానని లోకమంతా అనుకుంటున్నది బాబుగారూ. అలాంటిమాటలు విన్నపుడు నా మనస్సు ఆరాటపడుతుంటుంది. నన్ను నేరుగా యెన్నినిందించినా సహించగలశక్తి నాలోవుందిగాని, మిమ్ము మోసగించినట్లు విన్నపుడు నాకు నేనే వెలవెలబోతున్నాను. ఈప్రపంచంలో నాకు యేది అసాధ్యమో అదే వినవలసివస్తున్నపుడు నామనసు వుడికిపోతున్నది. అలాంటిసమయంలో మరెవరిసహకారమో కావాలని కోరుతున్నది" అని మధ్యలో వూరుకున్నది.

"జారి పడిపోతున్నవ్యక్తి గాబరాచెంది ప్రక్కను గనిపించిన నాగసర్పాన్ని తాడుగా భ్రమించి, పట్టుకుని పొందే ప్రయోజనముండదు నిర్మలా. అయినా నీమనస్సును నొప్పించుట నా అభిమతంగాదు. నీమనస్సుకు నచ్చినవిషయాన్ని స్వీకరించుటలోనే నాకూ ఆనందంకలుగుతుంది" అంటూ ఆమె ముఖానికి కప్పుకున్న చేతులను తొలగించాడు.

ఆలయంలో పూజలు, ధర్మశాలగర్భకోశంలో హోమాలు జరుగుతున్నవి. అగ్రజన్ములు అభ్యాగతులు గుంపులుగా భూమాతను కప్పివున్నారు. నూతననిర్మిత విశాల సోపానాలమీద కంఠంవరకు నీటిలోమునిగి గంటల

తరబడి స్నానాలుచేస్తూ వారు శరీరంలోని ఘృణోష్ణతను శాంతింపచేసుకుంటున్నారు.

భరద్వాజశాస్త్రిగారు ఒక బృందానికి అధ్యక్షత వహించారు గాబోలు, చుట్టూ జనాన్ని జేర్చి నశ్యంపీల్చి నాసికను అటూయిటూ ముద్దుకుంటూ "నీవన్నది నిజం రఘునాథ్; ఇది నేను యెవరిద్వారానైనా కథగా వింటే నవ్వి వూరుకునేవాడిని. ఇది వూహించలేని విచిత్రంగా తోస్తున్నది. ఇది నా సోదరిగృహం, శివం నా మేనల్లుడు. యీ విషయం యీయింటిలోగాని,పనివారుగాని గ్రహించేస్థితిలో లేరు. ఇంత గొప్పగొప్పకార్యాలు చేస్తూకూడా నాకు కబురయినా పంపలేదు. అవును, యీయింటిని సర్వనాశనం చేయుటకు నేను యిచ్ఛగించనని అడ్డుపడుతానని ఆ మ్లేచ్ఛురాలు పన్నాగంపన్నివుంటుంది. దాని తెలివి యెలాంటిదో చూడండి. బ్రాహ్మణపూజలలో హోమాలలో బ్రాహ్మణులకు భోజనాలు, సంభావనలూ సమంజసంగాని, అడుక్కుతినే అలగాజాతికి అంత విలువైన భోజనాలు, వస్త్రిదానాలు చేయుట అనర్థకము. అది అడుక్కుతింటూవచ్చిందిగనుక అడుక్కుతినేతనజాతికి, మావాళ్లను వెర్రివాళ్లను జేసిసర్వమూ దోచిపెడుతున్నది. నాలుగుగదులనిండా నిండివున్న పందలతానుల గుడ్డలు ముక్కలుచేసిపెడుతుంటే చూశాను. నా కళ్ళుతిరిగిపోయినవి రఘునాథ్. ఇన్నివేలరూపాయల గుడ్డలు అనవసరంగా ఆ అభ్యాగతులకు పంచట మెందుకని మాటవరుసకన్నానో లేదో నన్ను కొట్టవచ్చినట్లు మాట్లాడారు అక్కడివాళ్ళు. నిర్మలాదేవిఆజ్ఞప్రకారం జరుగవలసిందే

నట. ఆ మ్లేచ్ఛురాలిపేరు నిర్మలని, లక్ష్మియని పెట్టినంత మాత్రాన హిందూయువతి కాగలుగుతుందా? దానికి బ్రాహ్మణబుద్ధి వస్తుందా?" అన్నాడు.

"నిజంచెప్పారు బావగారూ! రాతిపలుకుకు రాజవజ్ర మని పేరుపెట్టినంతమాత్రాన దానివిలువ యెలా మారు తుందంటారు? ఆ పిల్లను లక్ష్మిఅని, నిర్మలని అనేకంటే, మాయలమారనో, దరిద్రదేవతాస్వరూపమనో అనుట వుచితం. చాలీచాలని సంభావనలు బ్రాహ్మణులకు, వస్త్రి దానం బిచ్చగాండ్రకు మరెవరు చేయగలరు చెప్పండి. ఆవిడ స్వయంగా బ్రాహ్మణిఅయివుంటే బిచ్చగాండ్ర కింత ఆధి క్యతయిచ్చివుండదు." అని వంతబలికాడు రఘునాధశాస్త్రి.

"అసలువిషయం మీఅంగరూ అర్ధంచేసుకోగలుగు తున్నందుకు చాలా సంతోషం. ఈ మంగలిమంత్రిత్వం యెన్నిరోజులు సాగుతుందో చూస్తాను." అంటూ నాసికను పట్టి గట్టిగా చీదుకున్నాడు.

"మొన్న మా చీనాయి, వచ్చిన వేలాదిబ్రాహ్మ ణులకు ఆదరసత్కారాలు జరిపి షడ్రసోపేతంగా భోజ నాదులు, మంచిసంభావనలు, ఫల,వస్త్రదానాలు సలుపుతూ ప్రక్క భిక్షుగాళ్ళకుకూడా భోజనాలు కల్పించి, వస్త్ర దానాలిచ్చుటలో అపరాధమేముంది, అంటూ వాదించాడు. అందరూ గగ్గోలుమని, వెర్రివెంగళాయిమాటలు మాట్లాడ బోకురా, బిచ్చగాళ్ళకు భోజనాలూ,వస్త్రదానాలు ఎందుకు? వాళ్ళను నెత్తికెక్కించుకుంటే ఆతరువాత యేమిజరుగు తుందో యెవరికి తెలుసు అని దూయబట్టారు" అని రఘు

నాథ్ శాస్త్రి అంటూండగా శివప్రసాద్‌గా రొస్తున్నారన్న ధ్వని బయలుదేరింది. శివప్రసాద్ భరద్వాజవున్నదగ్గరకే వచ్చి, నమస్కరించి "మామయ్యా, మీ రిలా పరాయి వారినలె యెరుగనట్లు కూర్చుంటే యెలా చెప్పండి! మీకంటె మాకు సన్నిహితులెవరున్నారు? గతాన్ని విస్మరించి, మమ్మ క్షమించి ఆ సామాన్లగదివైపు వెళ్ళి అజ్మాయిషీ చూడు మామయ్యా," అన్నాడు శివం.

"నిర్మలా ఓ నిర్మలా! ఒకేరకంచీరెలు నూటఒక్కటి కావాలని పంపావుట, కాని దొరకవట. ఒకేరకంకాకపోతే ఒకేవిలువయినవైతేమాత్రం పనిజరుగదూ? అసలా చీరెలెవరికి దానంచేయాలని పిచ్చిదానా?" అని బిగ్గరగా అంటూ వంటగదిలో ప్రవేశించింది భవానీ. "ఒకేవిధమైన చీరెలు 101 దొరుకుట దుర్లభమమ్మా. అసలా చీరె లెందుకో నాకు చెప్పు" అని మళ్ళీ అంటూ పొయ్యివైపు పరిశీలిస్తున్నది. కాని ఆ పొయ్యివద్ద శిరస్సునంచి, భవానీమాటలన్నిటిని వింటూకూడా యెరుగనట్లు తాలింపు వేయుటలో నిమగ్నమైవున్నట్టు నటిస్తున్న ఆ వనిత నిర్మల కానేకాదు. ఆ స్థూలశరీరం లలితదని భవానీకి తెలిసి, వెలవెలబోతూ "ఇదేమిటి!నిర్మల యేమయ్యింది లలితా?"అని ప్రశ్నించింది.

ఒణుకుతున్నకంఠంతో "గోశాలలో పాలు పితికిస్తున్నది పెద్దమ్మా" అన్నది లలిత.

భవానీ పాలుబోనిదానివలె నిలిచి యేదో ఆలోచిస్తున్నది. "నూటఒక్కచీర ఒకేరకమయినవంటున్నావు, అన్ని చీరె లేమిచేసుకోను పెద్దమ్మా? అన్నీ ఒకేరకమయితే మరీ

వైరితనం. విలువైనవి డజను తీసుకుంటే చాలదూ?" అని లలిత భవానీవైపు చూస్తున్నది. ఆమె మాఱుమాటలేకుండా బయటకువచ్చి గోశాలవైపు నడిచింది. కపిలగోదూడ పృథ్వీమీద పడుకుని తనశిరస్సును నిర్మలవైపు చాపి నేత్రాలుమూసివుంది. నిర్మల ఆ ఆవుదూడకర్ణకోనలప్రక్క వెతికివెతికి గోర్లను తీసివేస్తూ, నిమురుతూ ప్రశాంతంగా వున్నది. ఒకప్రక్క వేలాది ప్రజానీకం విందులుపొందుతూ, పూజలు హోమములు సలుపుచున్నది, యెవరి ప్రేరణ ప్రోత్సాహము సంకల్పముద్వారానో ఆ వనిత అతిసామాన్యంగా ఆర్భాటరహితంగా నిష్కల్మషంగా ఒక గోమాత శిశువుతో కాలక్షేపంచేస్తున్నది.

భవానీ కా దృశ్యం అత్యంత ఆకర్షణీయంగా తోచింది. ఇన్నివుత్సవాలను వేడుకలను కల్పించి, వేలజనాభాను రావించి, వారికి ఆదరసత్కారాలను అందజేసి తన కది సంబంధించనట్లు, తనకేమీ తెలియనట్లు, ఒకగోశిశువు ప్రక్కన జేరి దానికి హాయినికలిగిస్తూ, ఆత్మానందాన్ని గ్రోలుతున్నది నిర్మల. సర్వమూ కలిగికూడా కాంక్షలు. యీర్ష్యలు ద్వేషాలు చేస్తున్న తపనలో అంతంలేక ఆహుతియై, తల్లడిల్లుతున్నవారు ఒకప్రక్క, ఏమీలేకుండా సర్వమూవున్నంతతృప్తి, అన్నీవుండి యేమీలేనట్లు తనకు సంబంధంచనట్లు తానొక యోగినివలె దృగ్గోచరమవుతున్న నిర్మల మరోప్రక్క ఆమెమనస్సుకు రెండులోకాలుగా కనిపిస్తున్నవి. ఈ చిన్నిబాలికలో యింత విశాలహృదయము,

సహనము, సద్భావనము, ప్రేమ యెక్కడ ఇమిడివున్నవా అనే ఆలోచనలతో విస్తుపోతున్నది భవాని.

"నిర్మలా, యేమిటమ్మా, యిక్కడున్నావు?" అన్నది భవానీ. కొంచెం తటపటాయించుతూ "ఏమీలేదు అమ్మా, పూసుభోక యిలా వచ్చాను. పాపం! యీ పసి దూడను చూడండి యెంత నిశ్చింతగా నిరాలోచనతో హాయిగా నిద్రిస్తున్నదో!" అన్నది.

ఆమెహస్తాలనుబట్టుకుని పైకిలేవనెత్తి శిరస్సునిమురుతూ "దానినిశ్చింత సరే, నీ నిశ్చింతయేమిటో కాస్త చెప్పు? ఓప్రక్క హోమాలు, క్రతువులు, పూజలు జరుగుచున్నవి. మరోప్రక్క వేలమందికి భోజనాదులు, సంభావనలు, వస్త్రదానాలు వరుసగా జరుగుతున్నవి. వీటన్నిటిని సాగించి నీవు ఆవుదూడతో ఆడుకుంటున్నావా నిర్మలా!" అని మందహాసంచేసింది భవానీ.

"మీరూ, బాబుగారూ వుండగా నాకు ఆదుర్దాపడవలసిన అవసరమేముంది అమ్మా!" అన్నది నిర్మల.

"మేము వున్నా ప్రేక్షకులలాంటివాళ్ళము. ఆ కర్తృత్వమంతా నీదిగనుక, బాధ్యతా నీదే" అని చెక్కిలిమీద మృదువుగా వ్రేళ్ళమొనలతో మీటింది భవానీ.

"బాధ్యత నాదేననుకుని యెప్పటికప్పుడు ఖంగారుపడుతూ చిందులుత్రొక్కుతూ కైవారాలుచేసినా, గొంతు చించుకుంటూ కేకలు వేస్తూ బారలుచాచినా వాటిని గాటిలో సూటిగా పెట్టనప్పుడు నష్టమవు అమ్మా. రైలుయింజనులో యెన్నిబోల్టులు ఫిటింగులు తీగెలు వున్నా అన్నిటనీ సవ్యం

చేసి చక్రాలను పట్టాలమీదపెట్టి యింజన్‌స్టార్టుచేసి ప్రక్క సీటుపై నిశ్చింతగాకూర్చుని చూస్తుంటే బండి బాహాటంగా నడుస్తూనేవుంటుంది. అమరకం సరిగాచేసినపుడు అన్నీ బాగానే పనిచేస్తుంటవి. డ్రైవరు కేవలం సీనరీలుచూస్తూ కూర్చోవచ్చు. కార్యభారాలుకూడా అంతే. ఆదుర్దాలవలన సాగవు. సక్రమఅమరకాలవలన సాగుతవి. ఈ సర్వసృష్టికి మూలకారకుడైన భగవంతుడు సర్వాన్ని కేవలం సంకల్ప శక్తితోనే చేయగలుగుతాడు. కావాలన్నది సంకల్పం ద్వారా చేసి వదులుతాడుగాని, ఏమవుతుందో యెలావుం టుందో అని చింతించడు. సర్వాన్నిసృష్టించి కీతిప్పి రైలు యింజనులోని డ్రైవరువలె నిశ్చింతగా వుంటాడు." అంటుం డగా మధ్యలోనే భవానీ కల్పించుకుని, ఆమె శిరస్సును తనహృదయాని కదుముకుంటూ "అదిసరేగాని, ఆ లలితను వంటింట్లోకి చేర్చావెందుకు?" అన్నది.

"ఇంతకుముందు నేను చెబుతున్నది అదే. ఇంజను లోని ఒకనట్టు పోయినపుడు చేతితోపట్టి అయినా నడుపటం మేధావిపని. ఆ స్క్రూకు సరిపోవునట్టు లభ్యమైనపుడు దాన్ని అమర్చి తనవ్రేలుకు విశ్రాంతియిచ్చుట మంచిదే గదా" అన్నది నిర్మల. భవాని ఆమెచెవిమెలివేస్తూ, "నీవు చెప్పేది సరిగా చెప్పు, నాకు అర్థమవుటలేదు" అన్నది భవానీ.

"నన్నుక్షమించండి అమ్మా. నా జన్మజన్మల పూజా ఫలితంగా మీకు, బాబుగారికి నా చేతిమీదుగా భోజ నాదులు తయారుచేసి వడ్డించే భాగ్యం లభించింది. ఈలో

కంలో నాకున్న అన్నిటికంటె యీ హక్కును వదులుకో వలసివస్తే భరించరానిబాధ కలుగుతుంది నాకు, అయినా, యీ కార్యభారాన్ని నేను లలితమ్మగారికి కప్పగించవలసి వచ్చింది. నేను తయారుచేసినవి వారు భుజించరు. రెండోది వారిని సర్వవిధాలా ఆదరించుట మనకర్తవ్యంగదా!" అన్నది నిర్మల.

"నీవు చిన్నదానివైనా చాలా వివేకంతో మెలగి నట్లే తోస్తున్నది కాని, యీవిషయంలో నా మనస్సు యెందుకో నొచ్చుకుంటున్నది నిర్మలా" అన్నది భవానీ. పాలేరు ఏదో పనిమీద పిలిచినందున వెళ్ళిపోయింది నిర్మల.

గోశాలనుంచి పాలబక్కెట్టును వంటగదివసారావరకు తెచ్చి "లలితమ్మగారూ, యీ పాలు లోపలకు తీసు కెళ్ళండి." అని పిలిచింది నిర్మల. "లోపలకు తీసుకురా నిర్మలా" అన్నది లలిత. కాని మారుమాటలేకుండా నిర్మల అచటే నిలచివుంది. చేతిలోనిపని పూర్తిచేసుకుని లలిత బయటకొచ్చి చూసి విస్తుపోతూ "అదేమిటి! లోపలకు రావటానికి సంకోచమెందుకు?" అన్నది. "మీరు ముందు పాలబక్కెటును తీసుకెళ్ళండి అమ్మాయిగారూ" అన్నది నిర్మల.

"ఒకమాట అడగాలని యెంతోసేపటినుంచి అను కుంటున్నాను. ఒకేరకమయినచీరెలు నూటఒకటి కావా లన్నావుట యెందుకు?" అని అడిగింది లలిత.

"జరుగుచున్నపూజలలో అదికూడా ఒక తతంగం.

యేరూపంలోనైనాసరే మీ మేనత్తగారిపేరిట నూటఒక్కనంది ముత్తయిదువులకు చీరెలుఇప్పించాలనుకున్నాను. అవి ఒకేమాదిరి ఒకేఖరీదువి అయివుండాలని నా అభిలాష, అంతే" అన్నది నిర్మల.

"మా మేనత్తగారిపేరిట మీ రెందుకు దానమీయదలచారో చెప్పగలవా?" అని అడిగింది లలిత.

"దానమిచ్చేది నేనుగాదు, శివప్రసాద్‌బాబుగారు. వారితండ్రిగారిపేరిట ధర్మశాల నిర్మితమైంది. అక్కడిపూజలలో వారితల్లిగారిపేరిట 101 చీరెలు దానంచేస్తారు" అన్నది నిర్మల.

"ఇది స్వయంగా ఆయనమనోభీష్టమేనా? అయితే, ఈ చీరెలను యెవరికి దానంచేయదలచారు?"

"జరుగుచున్న యీకార్యాలన్నీ యెవరిమనోభీష్టను ద్వారానో వారిద్వారానే యిది జరుగుతున్నది. ఆ 101 చీరెలు బీదబ్రాహ్మణమహిళలకు దానమిస్తారు. అయినా మీరు అన్యథా తలంచక శివప్రసాద్‌బాబుగారికి తోడుగా నిలువండి అమ్మాయిగారూ! వారు మీ స్వంతబావగారు; వారిమీద మీకూ కావలసినంత చనువు ఆదరము వున్నవి. వారికీర్తిలో మీకీర్తి వుంటుంది గనుక మీబాధ్యతను మీరు గుర్తిస్తే, అందులోనే మీరు ఫలితం లభ్యమవుతుంది" అన్నది.

ఉరుకులమీదవచ్చిన గంగులు "నిర్మలమ్మగారూ, ఒక్కమాట విని పోండి" అని రొప్పుతూ అన్నాడు. "ఏమిటో చెప్పు గంగులూ?" అన్నది ఆమె అక్కడేవుండి.

లలిత పాలబక్కెటు లోపలవుంచి, గంగులువైపు తిరిగి చూస్తున్నది. "సంభావనలకు డబ్బుతీసుకురమ్మన్నారు భరద్వాజగారు" అని మళ్ళీ సణుగుతూ "కొంతమంది తగాదాలుపడుతున్నారమ్మా. ఇంతవరకు ప్రతిఒక్కరికి అయిదు పావులాలసంభావనలేయిస్తూవచ్చారుట. యిపుడు భరద్వాజబాబుగారు కొందరికి పదిపావలాలు, కొందరికి మూడుపావలాలూ, కొందరికి అయిదుపావలాలు యిస్తున్నారట. అందుకని వారిలోవారే కుమ్ముకుంటున్నారు" అని ఆమెవంక యింకా యేదో చెప్పనున్నట్లు చూశాడు. ఇచ్చేవారిబుద్ధి పొందేవారిప్రాప్తానుసారం కలుగుతుంటుంది; అందుకు వాదనలెందుకు? ఎవరిప్రాప్తం వారిది. ధర్మంలోకూడా సమానత్వంకొరకు పోరుసలుపుట అవివేకం" అని చిన్నగా నవ్వునుప్రదర్శిస్తూ, తనచెంగునున్న తాళంచెవులగుత్తిని తీసి, "అమ్మాయిగాగూ, ఇదిగో యీ తాళంచెవులు తీసుకుని, సంభావనలకని వేరుగావుంచిన డబ్బులోది యెంత కావాలో గంగులుకు యిచ్చి పంపండి." అన్నది.

లలిత తాళంచెవులు అందుకుని సంకోచంతో నిలిచివుంది.

"వారికా పెట్టె రాదులే; మీరే యివ్వండి. నిర్మలమ్మగారూ" అని నేత్రాలు పెద్దవిగాచేసి కోరగా లలితవైపు చూస్తున్నాడు గంగులు. నిర్మలనవ్వురేఖనుప్రదర్శిస్తూ "పరవాలేదు, ప్రయత్నిస్తే తెలియనివికూడా తెలుస్తవి; అంతే, మీరు వెళ్ళి సంభావనలకు కావలసింది గంగులు

ద్వారా నాన్నగారికి పంపండి అమ్మాయిగారూ" అని బయటకు వెళ్ళిపోయింది.

కాలేజీనుంచి సాటిప్రొఫెసర్లు వచ్చినపుడు వారికి సత్కారాలుచేసి, ఆలయములో, ధర్మశాలలో జరుగుచున్న హోమక్రతువులకర్మకాండలు చూపి, వీటన్నిటికి మూల విరాట్ అయిన నిర్మలను పరిచయంచేయాలని శివప్రసాద్ అటూఇటూ యెంత వెదికినా కనిపించక, విసిగిపోయి వారిని సాగనంపాడు. ఆగంతుకులను పంపి లోపలప్రవేశించినదే తడవుగా నిర్మల యెదురుగా నిలిచివుంది. "ఇంతసేపు వెదికాను, యెక్కడున్నావు? వారికి నిన్ను పరిచయంచేయాలనుకున్నాను. వారినిపిలుస్తానుండు." అంటూ ఆయన తిరుగుముఖంకాబోయాడు.

"ఆగండి బాబుగారూ, పెద్దపెద్దవారితో నాకు పరిచయమెందుకు చెప్పండి. అందరితో పరిచయంకావాలి, పేరుప్రతిష్టలు కావాలి అని నాకులేదు. నాకు మీ పరిచయాలు మీ ఆదరాలూ చాలు." అని మందస్మితవదనంతో అన్నది నిర్మల.

"నీవు యింతవరకు యెక్కడున్నావో చెప్పుముందు" అన్నాడు

"గోశాలగదిలో కూర్చున్నాను,"

"అక్కడెందుకున్నావు?" అన్నాడు శివం.

నిర్మల:- ఆ వచ్చిన అతిధులకంటపడకూడదనే.

శివం:- వారికి పరిచయమయితే కలిగేనష్టం?

నిర్మ:- "ప్రయోజనంమాత్రం యేమిటంటాను?

శివం:- మర్యాదకోరకు, సభ్యతకోరకు.

నిర్మల:- మీ పేరుప్రతిష్టల పెంపులో మర్యాదుం టుంది, మీ ఆదరసత్కారాలలో సభ్యతుంటుంది గాని, నాబోటి అనాథ మీమధ్య నిలుచుటలో మర్యాదెలావుం టుంది బాబుగారూ?

శివం:- అనాథ అనేమాట అనవద్దని ఎన్నోమారులు అన్నాను.

నిర్మల:- మీరు అన్నప్పటికి తననుతాను మరచుట ఆత్మవిధ్వంసకమవుతుంది బాబుగారూ.

శివం :- ఆత్మను కించపరచుకోనటం ఆత్మవికాసానికి అడ్డుపడుతుంటుంది నిర్మలా. ఆత్మవిశ్వాసం ఆత్మాభివృద్ధికి సంజీవినిలాంటిది. మొగ్గ పుష్పంగాను, పుష్పం పిందగాను, పిందె కాయగాను, కాయ పండుగాను పొందు దశలు యథార్థసత్యాలు. ఈ అంతర్దశలలో యేదశలోనిప్రభావం ఆ దశలోనే వుంటుంటుందిగాని, అన్నిదశలలోని ప్రభావము ఒకటిగా వుండజాలదు. మానవుడుపొందే దశలుకూడా అలాంటివే. జీవితంలో విజ్ఞానం వృద్ధిపొందుతూనేవుంటుంది. ఆర్థికస్థితి తారుమారు అవుతుండవచ్చు. గనుక మానవుడు యెల్లపుడూ ఒకటిగావుండలేడు. నీవు శాశ్వతమైన అనాథ వుగా యెలా యెంచుకుంటున్నావు నిర్మలా? ఏదిఏమయినా, నీవు ప్రస్తుతం అనాథవుగాదనిమాత్రం గుర్తుంచుకో. మరో విషయం; తాళంచెవులు లలితకిచ్చావుట యెందుకు?

నిర్మల:- నా కెలా సంప్రాప్తమైనవో ఆమెకూ అలానే సంప్రాప్తమయినవి.

శివం:- అలా సునాయాసంగా అనేయకు. ఆ పెట్టెలో విశేషవిలువచేసే మాఅమ్మగారినగలుకూడా వున్నవి.

నిర్మల:- నగలేగాదు, పదివేలకుమించి ధనంకూడా వున్నసంగతి నాకు గుర్తే.

శివం:- అయితే, అంత నిర్లక్ష్యంగా వాటి నామెకెలాయిచ్చావు?

నిర్మల:- నాకా భయంలేదు గనుకనే యిచ్చాను. మీరు నన్ను యెలా విశ్వసించారో నేనూ ఆమెను అలానే విశ్వసించానంటే నమ్ముతారా?

శివం:- నమ్మినవారికి ద్రోహంచేయలేనితత్వం నీది, నమ్మినవారిని ద్రోహంచేసేతత్వం వారిది.

నిర్మల:- అది మీ భ్రమకాకూడదా బాబుగారూ! నేను పుట్టుదొంగను. పాపం ఆమె అమాయకురాలు. మానవులను విశ్వాసంద్వారానే విశ్వస్తంచేసుకోవటం సులభసాధ్యమని మీద్వారా నేను నేర్చుకున్నాను. దొంగ చేతిలోనే సర్వాన్ని విశ్వసించి పెట్టినపుడు దొంగిలిస్తాడనుకోవటం పొరపాటని, అతను ప్రాణముకెత్తుగా కాపాడుతాడని మీద్వారా నేను పొందిన అనుభవము.

శివం:- నీవుచేసింది మంచిపనిగాదనిమాత్రం అనక తప్పదు.

నిర్మల:- గంగులు మీకు బాగా నూరిపోశాడనుకుంటాను.

శివం:- వాడు చెప్పకపోయినా యీవిషయాలు నాకు తెలియనివికావు.

గావుకేకలుపెట్టుకుంటూ వచ్చిన గంగులు రొప్పు కుంటూ "బాబుగారూ, అక్కడ పెద్దపెట్టున పోరాటం జరుగుతున్నది. గట్టిగా తిట్టుకుంటున్నారు. సర్దుబాటు చేయబోయిన ధర్మయ్యగారిని రెండుతిట్లు తిట్టి అవతలకు నెట్టి వేశాడు భరద్వాజ గారు." అన్నాడు.

"ధర్మయ్య అక్కడ యేమిచేస్తున్నాడు?" అని శివం అడిగాడు.

"నేను పసితనంనుంచీ యీయింటిలో నౌకరీచేస్తు న్నానుగాని, ఇంతహీనంగా యెన్నడూ యెవరూ అనలేదు," అని కన్నీరుపెడుతూ ప్రక్కన నిలిచివున్నాడు బాబుగారూ" అన్నాడు గంగులు.

శివప్రసాద్ ఆగుర్దాలో వెళ్ళిపోయాడు.

భరద్వాజశాస్త్రిగారికీ, యజ్ఞక్రతువులోవుండి శ్లోకా లు జపిస్తున్న విప్రవరులకు చిన్న పేచీవచ్చి, వికృతరూపం దాల్చింది. మంత్రోచ్చారణలో అపశృతులొస్తున్నవని భర ద్వాజగారివాదన. ఉచ్చరించుటలో దోషంలేనేలేదని, అయినా అంతకంటె ప్రధానమైనవిషయం ఆ ఉచ్చరిస్తున్నవ్యక్తి తా నుచ్చరిస్తున్నశబ్దభావాలు తెలిసి యేకాగ్రమైన ఆ భావ ధ్యాసతోనే వుచ్చరించునపుడు అపస్వరాలననుస్యలేకుండానే సత్ఫలితం లభిస్తుందని క్రతువుపలువు విప్రవరులవాదన. భావార్థం తెలిసినా తెలియకపోయినా బీజాక్షరాలకలయికను తూచినట్లుచ్చరించితే ఆ ఫలితం అప్పటికప్పుడే కనిపిస్తుందని భరద్వాజగారి అభిప్రాయం. ఉచ్చారణకంటె మనస్సులోని జ్ఞానదీక్ష ముఖ్యమని వారి అభిప్రాయం. ఈ విభిన్నఅభి

ప్రాయాలతో చెలరేగిన వాదప్రతివాదాలు ప్రేక్షకులకు మరింత వినోదాన్ని కల్పించినవి.

శివప్రసాద్ యీ వాదోపవాదాలను సర్దుబాటు చేయాలని విశేషప్రయత్నంచేసి విఫలుడయ్యాడు.

ఉగ్రరూపందాల్చిన భరద్వాజ చరచర యివతల కొచ్చి శివంహస్తాన్నిబట్టి బయటకుతీసుకొొచ్చి "బాబూ, శివం! నీమాట విననందుకు మరేమీ అనుకోకు. అపస్వరముతో బీజాక్షరాలు పలికినపుడు కీడుసంభవిస్తుంది నాయనా! నా చెల్లి దేవతాసమానురాలని అందరికీ తెలుసు. అలాంటి నా చెల్లెలివరపుత్రుడవైన నీకు కీడుసంభవించుటను నేను సహించలేని ఆమర్దాతో పోట్లాడాను. ఈకాలంలో బ్రాహ్మణత్వం యెక్కడ యేడ్చింది బాబూ! అంతా పొట్టకక్కుర్తి బ్రాహ్మణులయ్యారు. సరస్వతీకటాక్షం క్షీణించింది. మంత్రాలను తంత్రాలుచేసి మోసంతో లోకాన్ని ముంచుతున్నారు. దాతలకుజరిగే కీడునుగురించిగాని అపకారం గురించిగాని వారికి కించిత్ ఆలోచనలేదు. కేవలం వారి ఆర్జనే తమ ఆశయంగా పెట్టుకున్నారు. అలాంటి స్వార్థంతో నేత్రాలుమూసుకుని జరుగుతున్న అత్యాచారాలను చూస్తూ వూరుకోవటం నాకు నచ్చదు. ఆస్తులతో యథార్థఅంతస్తులు రావు శివం; హృదయనైశాల్యంతో అంతస్తులు కలుగుతవి. వీరు సలుపుతున్న హోమ క్రతువులలో యేదో లోపమున్నట్లు, నీకు తత్సంబంధకీడు జరుగుతుందేమోనని నా మనస్సు ఆరాటపడుతున్నది బాబూ. కనుక నీవు నన్ను

అన్యథా తలంచకు. నేను అన్నిటిని సద్దుబాటుచేస్తాను" అన్నాడు కంఠస్థంచేసినపాఠంవలె భరద్వాజ.

వేడెక్కినమనస్సుతో విమూఢునివలె చీకాకును చిక్క బట్టుకుంటూ "రాబోయే కీడులపేరుతో ప్రశాంతంగా జరిగి పోతున్న కార్యక్రమాలలో కల్లోలం కలుగనీయకు మామయ్యా. అనవసరంగా దూరదూరాలనుంచివచ్చినవారికి వేడుకబదులు విసకటనుకల్పించుట ధర్మంగాదు. ప్రశాం తంగా జరిగిపోనివ్వమని ప్రార్థిస్తున్నాను" అంటూ శివం అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

ఉదయం 9గంటలసమయ మది. హోమగుండం ప్రక్కలనుంచి వేదోచ్చారణ గోశాలవరకూ ప్రతిధ్వనిస్తు న్నది. దినకరుని కిరణప్రసారం తీవ్రరూపంలోపృథ్వీమాతపై ప్రవేశిస్తున్నది. అనంతాకాశంలోని మేఘగుచ్ఛాలు దూది పింజలవలె శ్వేతమెరుగులతో చమకులుగ్రక్కుతూ తేలి యాడుచున్నవి. గోశాలలోని గోవులు బీళ్ళకువెళ్ళేసమయ మయిందని గాబోలు నిరీక్షిస్తున్నవి. కడుపులనిండా పాలు ద్రాగి గంతులు వేసినమీాదట కట్టుగొయ్యలకు బంధించ బడినందున, తమస్వేచ్ఛనరికట్టినందుకు కోపంతో అటుయిటు లాక్కుంటూ బెదురుచూపులుజూస్తున్నవి. హోమాలు పూజలు యెన్ని ప్రక్కన జరుగుచున్నా తనపూజ తనపూజే యని యిప్పటివరకు గోశాలగదిలో పూజజరిపి గాబోలు బయటకు వస్తున్నది నిర్మల. ఆమెనుచూసిన గోవులు వాటి సంతానము అత్యధికప్రేమాదరాలతో దృక్కులనుబరపుతూ ముట్టెలనుపూపుతూ, కర్ణాలను వాలాలను ఆడిస్తూ ఆహ్వా

నిస్తున్నది. సోము అనే దూడ తనమెడలోని చిరిమువ్వను ఝణక్ ఝణక్ మని మ్రోగిస్తున్నది. మార్జహాన్ జన్మించింది సోమవారమట, ఆ దూడ జన్మించింది కూడా సోమవారమే! అందుకే ఆ దూడ పేరు 'సోమూ' అని నామకరణంచేసింది నిర్మల. పిల్లి అడుగులు వేసుకుంటూ వెళ్ళి సోమూ మెడను హస్తద్వయంతో పట్టి "యేమిటి గోలచేస్తున్నావు?" అని మందహాసంతో దంతాలుకరుచుకుంటూ అన్నది నిర్మల.

వంటశాలలో పనిముగించుకుని, యెవరికోరకో వెదకుతున్న లలిత గోశాలవైపుచూసి నిర్మలను గాంచి అంగలుపంగలు వేసుకుంటూ వచ్చి "నీకోరకే వెదుకుతున్నాను. ఇక నావల్లకాదు యీ భారంమోయుట" అని మలినముఖంతో అన్నది.

"అదేమిటలా అంటారు అమ్మాయిగారూ; చేసేవారికి పనులు యెప్పుడూ భారంకావు. అందులో యెవరి పనులు వారికి యెన్నటికీ భారంకాజాలవు," అని మందస్మిత వదనంతో అన్నది నిర్మల.

"నీవు నాకే భారమంతా అప్పగించినప్పుడు, నిజంగా నిష్కల్మషంగానే అప్పగించావనుకున్నాను కాని, మా నాన్నగారన్నట్లు యిందులోకూడా యేదో కుట్రవున్నదేమో అనిపిస్తున్నది" అన్నది మళ్ళీ.

"అది మీ అపోహ. నేను కుట్రలుచేయవలసిన అవుసరంలేదు; కుట్రలతో యీ కార్యభారాల నెందుకిస్తాను? మీకు కలిగినబాధ యేమిటో చెప్పండి అమ్మాయిగారూ" అన్నది నిర్మల.

"ఈ నాలుగురోజులనుంచీ నాజన్మలో యెన్నడూ చేయనంతపని చేశాను. నేను యెన్నిపనులుచేసినా, మిషనువలె చేస్తూనేవున్నా, వంటశాలలో యెన్నిపదార్థాలు యెంత ప్రయత్నంతో బాగాచేసినా, నేను యెవరినీ మెప్పించలేకపోతున్నాను. అడుగడుగునా నిన్నే అడుగుతున్నారు, నీపేరే జపిస్తున్నారు. నీవుచేస్తేనే వాటికి రుచి స్తవన్నట్లున్నది. పూజాగృహంలోకి మరెవరూ పోవీలులేదని పెద్దమ్మ మొహానే అన్నది. ఇవన్నీ నీవు అనిపించేవి చేయించేవి కావా చెప్పు? ఇదిగో యీ తాళంచెవులు నీదగ్గరే వుంచుకో నా కక్కరలేదు. ఆదరము మన్ననలేని సేవలు నిరర్థకం" అని కఠినమైనకంఠధ్వనితో అన్నది లలిత.

నిర్మల నివ్వెరపోతూ "అమ్మాయిగారూ, తొందర పడకండి. నేను మీ కిస్తున్నఆధిక్యత నటనలతోను కుతంత్రాలతోను గాదు. న్యాయమని భావించి చేస్తున్నాను. అధికారాలు ఆధిక్యతలు కేవలం కుల మత ఆర్థిక అంతస్తులను బట్టి వారసత్వాలనుబట్టి అమరవని గుర్తించండి. నిష్కల్మషము నిష్కామముతోగూడిన త్యాగము అన్నింటినిజయించ గలదనికూడా మీరు గుర్తించాలి. ఈర్ష్యాద్వేషాలు సాఫల్యతను సమకూర్చజాలవు. అవి కేవలం ఆత్మను కించపరచుటకే వుపయోగపడుతవి. తాపత్రయము, మితిమించిన కాంక్షలుకూడా అలాంటివే. వాటిద్వారా పొందుటకంటె పోగొట్టుకోవటమే తథ్యము. మీ ఆశలకు అడ్డుగానిలవాలని నా ఆశయంగాదు. నన్ను నిందించినందువలన నాకు దుఃఖం లేదుగాని, మీ మార్గాన్ని మీరు మరచిపోతున్నందుకే

నాకు దుఃఖం. మితిమించిన ఆదరాలను ఆధిక్యతలను నేను భరించలేను అమ్మాయిగారూ. నేను అనాధబాలికగా ఇక్కడికివచ్చినసంగతి నా మనస్సులో అనుక్షణము మెదులుతూనేవున్నది. అనాధగా నేవుంటూ కష్టంతో కాలాన్ని కొలవటంలోనే నా మనస్సుకు ఆనందం కలుగుతుంటుంది. కనుక పొందినఅధికారాలను పోగొట్టుకొనుటకు యిచ్ఛలేక బాధపడుతున్నాననుకోకండి. నేను వాటికి యెంత దూరం కావాలనుకుంటున్నానో అవి అంతగా నా శిరస్సుమీది కొచ్చిపడుతున్నవి. ఆ యదార్థరహస్యాన్ని తెలుసుకోవాలనే, కోరి మీ కీభారాన్నప్పగించాను. అర్థంలోనే నిరాశ చెంది, నన్ను నిందించకండి అమ్మాయిగారూ." అన్నది గంభీరంగా.

"నన్నింకా మోసగించాలనిచూడకు. యేమయినా చేయగలనుగాని, వీరిని మెప్పించుట, ప్రసన్నులనుచేయుట నా వల్ల కాదు. నీవు యేమీ తెలియనట్లు గోశాలలో కూర్చుంటున్నావు. అందరూ నన్నూ మా నాన్నగారిని నిందిస్తున్నారు. ధర్మయ్యను మా నాన్నగారు ఒక్కమాట అన్నందుకు పాలేళ్ళందరూ మా నాన్నగారిని నాయెదుటే అనరానిమాటలు అంటున్నారు. వచ్చినందుకు, హీనపర్చే విధానం తెలిసినపుడు యెక్కడకూర్చుంటే యేమి?" అన్నది యీర్ష్యగా.

కించపడుతున్నముఖంతో "అమ్మాయిగారూ, అలా అనకండి. హీనపర్చాలని నాకు యెన్నడూ లేదు, వుండదు. దురుద్దేశాలతో దుఃఖాలను సమకూర్చుకోగలనుగాని, సుఖ

సంచయంచేయజాలము. నే నెన్నడూ అలా వూహించ లేదు. మీలోని అవిశ్వాసం దూరమవుటకు నన్నేమిచేయ మంటారో చెప్పండి" అన్నది నిర్మల.

అశ్రుభరితనయనాలతో నిర్మలవంకత దేకంగాచూస్తూ వణుకుతున్నకంఠంతో "నీ వంటున్నదంతా నిజమేకావచ్చు. అయినా, యీ తాళంచెవులు నా దగ్గరవుండుట అందరికీ అయిష్టంగా కనిపిస్తున్నది. వీటిని నీవద్దనే వుంచుకుని, నాకు సరియైనమార్గం చూపుతూండు." అంటూ లలిత తాళం చెవులను బలవంతంగా నిర్మలచేతిలో వుంచింది.

మందస్మితవదనంతో వాటినితీసుకుని, "మిమ్ము ప్రసన్నంగావుంచుతూ, మీ ఆశయసిద్ధివైపుకే మిమ్ము నడుపాలని నా ఆశయం అమ్మాయిగారూ. ఈ చిన్నియదార్థం లోని మర్మాన్ని గ్రహించు; నేను యీ తాళంచెవులకు యెంతదూరంగావుండాలనుకుంటున్నానో అవి అంతగా నా వైపుకే నడుస్తున్నవి. అప్రయత్నంగా తనవైపుకే వస్తున్న వాటిని నిరాదరంగా, నిర్హేతువుగా భయపడి కాలదన్నుట కూడా అవివేకంకాజాలదు" అన్నది.

నిర్మలచేతికి తిరిగి తాళంచెవులుచేరి మూడురోజులు గడిచిపోయినవి. అది ద్వితీయహోమక్రతువు యేడవరోజు. అదే ఆఖరిరోజు. భోజనపుయేర్పాట్లు భరద్వాజశాస్త్రిగారి ఆధ్వర్యంలో మరింత విశేషరూపంలో జరుగుచున్నవి. ఈ రోజు సంభావనలక్రింద అయిదువేలరూపాయలు పంచుటకు తొలిరోజునే కేటాయించివుంచినవిషయం విప్రవరులకందరికీ విదితమే. ఆకారణంతోనే మరింత కోలాహలంగావుంది.

భరద్వాజహడావుడులతో శివం సంభావనలడబ్బుకొరకు నిర్మలకొరకు వెదకి ఆఖరియత్నంగా గోశాలగదివైపు వెళ్ళాడు. ఆమె గదిలో కటికినేలపై పరుండి, శివప్రసాద్ చెప్పిన పాఠ్యపుస్తకంలోని గౌతమునికథను పట్టిపట్టి చదువుచు "ద్వా—రా—దుఃఖము" అని గుణిస్తున్నది.

ఆయన ప్రసన్నవదనముతో "ద్వారా దుఃఖముతో గాదు. దుఃఖముద్వారా దుఃఖమును పరిష్కరించుమార్గము కనుగొనెను" అనిఆమెదగ్గరగా వెళ్లి కూర్చున్నాడు. ఆమెమహా ప్రసన్నంగా లేచి కూర్చుని, చిరునగవునుచిలికిస్తూ "మీరిలా వచ్చారేమిటి?" అన్నది. "నీకొరకు వెతుక్కుంటూ వచ్చాను" అన్నాడు.

నిర్మల:- బాబుగారూ, బుద్ధభగవానుని బొమ్మను యింత వికృతంగా ముద్రించారేమిటి?

శివం:- ఆ పుస్తకాన్ని ప్రభుత్వంవారు స్వయంగా ముద్రించారుగనుక.

నిర్మల:- ప్రభుత్వంవారుప్రకటించితే మరింత బాగా వుండాలిగాని, యింత వికృతంగా యెందుకున్నది బాబుగారు?

శివం:- ప్రభుత్వంవారు యదార్థసత్యాలనుగాదు, చూచేది, పాఠాలువ్రాసినవారు బొమ్మలుగీసినవారు పలుకుబడి సిఫారసులు వున్నవారా కాదా అనేదే.

నిర్మల:—బాల్యంలో చదివినవి బాగా మనస్సులో నాటుకుపోతవి గనుక, వీటిని ప్రభుత్వం విశేష శ్రద్ధగా యెందుకు వేయరు బాబుగారూ?

శివం;—నీవు చదువుచున్న ఆ బుద్ధుని పాఠంలోని విషయాలు కొన్ని హాస్యాస్పదాలు. అయినా అది వ్రాసినవారు ప్రభుత్వవిద్యాశాఖవారికి నచ్చినవారు గనుక, దానిమీద ముద్రపడింది. అది బాలురు చదువకతప్పదు. సరే, ఆవిషయాలకేమిగాని, సంభావనలడబ్బు యివ్వు నిర్మలా.

నిర్మల:—(చెంగునున్న తాళంగుత్తిని తీసి, ఆయనకిస్తూ) యివిగో తీసుకెళ్ళండి.

శివం:—నేను అడుగుతున్నది తాళంచెవులుగాదు, డబ్బు.

నిర్మల:—మీరే తీసుకెళ్ళండి బాబుగారు.

శివం:—ఆ పని నావల్ల జరుగదు. దాయటంగాని పంచటంగాని నావలన జరుగనిపనియని నీకు తెలుసుగా! (అంటూ తాళంచెవులున్న ఆమెచేతిని గట్టిగాపట్టుకుని తను లేస్తూ ఆమెనూ లేవలాగాడు.)

ఆమె చీరెకయినమట్టిని చూసి విస్తుపోతూ "అబ్బ! యీ చీరె అంతటా యిలా మట్టిచేసుకున్నావెందుకు" అంటూ తనచేత్తో దులుపుతున్నాడు. ఆమె మందహాసం చేస్తూ "నా చిన్నతనమంతా యీ మట్టిమీదపొర్లాడుతూ నే గడిపాను బాబుగారూ! అన్నిటికంటె దృఢమైందీ శాశ్వతమైందీ ఆ భూమేగదా!" అన్నది.

## 14 నిరపరాధికి శిక్ష

"సరే, ముందు పోయి, ఆ డబ్బు తీసుకురా," అని ఆమెపీపుమీద తనకుడిహస్తం వేసి మృదువుగా నెట్టాడు.

ఇనప్పెట్టె తెరచిన నిర్మల విభ్రాంతురాలై అక్కడే కూలబడిపోయింది. అందులో యేమీ లేవు. శివబాబు తల్లిగారి నగలపెట్టెకూడా అందులోనుంచి అదృశ్యమైంది. అధీరురాలై ఆమె అలానే యెంతోసేపు వుండిపోయింది. అయిదునిముషాలలో ఆమె హృదయాన్ని చిక్కబట్టుకుని, తిరిగి పెట్టెనుమూసి తప్పటడుగులు వేసుకుంటూ గోశాలవైపు నడిచింది. పృథ్వీమాత గిరగిరతిరిగిపోతున్నది. లేగదూడలుపరిహసిస్తున్నవి. దినకరునికిరణాలు యమపాశాలవలె ఆమెను చుట్టివేస్తున్నవి. వేలాది బ్రాహ్మణోత్తములు ఆమె ముందు జేరి నిందిస్తున్నట్లు, బిచ్చగాండ్రు పరుషవాక్యాలు పలుకుతూ రాళ్ళురువ్వుతున్నట్లు, శివబాబు నేత్రాలు రక్తమయంచేసి, వురిమిచూస్తూ హుంకరిస్తున్నట్లు, భవానీ తిట్టి తిట్టి వుమియుచున్నట్లు, భవంతుడు 'వెర్రిదానా,' అని పరిహసిస్తున్నట్లు ఆమెమనస్సులో తిరుగుతున్నది నేత్రాలకు దృగ్గోచరమవుచున్నది. ముందుకు కాలు వేయను సత్తువలేక అక్కడే కూలబడిపోయింది.

అప్పుడే పొలంనుంచివచ్చిన పాలేరు ఆ దృశ్యంచూసి గావుకేకలుపెట్టి, అందరనూ పిలిచాడు. క్షణంలో వూజలోనిజనమంతా చుట్టుముట్టి వింతగా చూస్తున్నారు. గదిలో పలినుంచి వచ్చిన శివం యీ దృశ్యాన్నిచూసి విచలితుడై "అమ్మా" అంటూ భవానిని కేకపెట్టి, ఆమెను లేవనెత్త ప్రయత్నిస్తున్నాడు. ఏదైనా వుసుగుముట్టిందేమోనని కేకలు పెట్టారు. అరగంట జరిగిపోయిందిగాని, ఆమె కింకా పూర్తి స్పృహరాలేదు.

ఎవరుయేమైనా, భగవంతుని పేర జరిగే కార్య క్రమాలు ఆగవీలులేదు. అందువలన భరద్వాజశాస్త్రిగారి ప్రేరణతో తప్పనిసరై శివం విమూఢునివలె అచేతనావస్థలో వున్న నిర్మలచేతిలోని తాళంచెవులను తీసుకొని కార్యోన్ముఖుడయ్యాడు. పెట్టె తెరచిన శివం ఖంగారుపడుతూ "అమ్మా, యిందులో యేమీలేవు!" అని కేకలు పెట్టాడు. నిర్మలవద్దనున్న గుంపు ఒక్కమాటుగా యిటువైపు కదిలింది

ఉరకలుదొక్కుతున్న ఉద్వేగంతో "ఏమిజరిగింది నాయనా?" అంటూ చెంతకుచేరి, వంగి పరికిస్తున్నాడు. గుంపులోనుంచి ఒకరు "వినలేదూ కేక! పెట్టెలో యేమీ లేవట. యెవరో తస్కరించివుంటారు" అన్నారు.

"ఒరే శివం, యెంత మోసంజరిగింది. ఘోరంజరిగింది. యేమేమిపోయినవి నాయనా?" అంటూ భరద్వాజ తానే అందరియెదుట పెట్టె తెరచి, అందరూ చూచుటకు వీలు గల్పించి, కంపిస్తున్న శరీరంతో "ఇంకేముంది. కొంపమునిగింది. మా సోదరినగలుకూడా పోయినట్లున్నవి. నగలు, డబ్బు పెట్టెలోవున్నంతవరకు చేతబట్టారు. ఎంత ఘోరం!" అని అటూయిటూ పరికించాడు. చేరిన జనం అత్యధిక శ్రద్ధతో వినోదాన్ని తిలకిస్తున్నారు. శివం మాటా పలుకూ లేని శిలాప్రతిమవలె కూలబడివున్నాడు.

భరద్వాజ ఆవేశభరితుడై "ఈ మాయ యెలా జరిగిందో తెలుసుకోవలసినవిషయమే. పోయినసొమ్ము తక్కువకాదు. నా సోదరిసొమ్ములు అతివిలువైనవి. ఇలాంటిదొంగతనం బయటనుంచివచ్చినవారివలన మాత్రం జరుగుట అసా

ధ్యం. ఇలాంటిసమయంలో అధైర్యపడి కూర్చుంటే పనిజరు గదు శివం. ధైర్యంవహించి ఆచూకీ తెలుసుకోవాలి. ముందు జాగ్రత్తకైనా యిపుడు చాలా యోచనతో చర్యతీసు కోవాలి" అన్నాడు.

"బయటపడిపోయిన ఆమెచేతిలోనుంచే తాళం చెవులు శివబాబుగారు తీసుకున్నారు" అన్నారు గుంపులో ఎవరో. "మరెవరో దొంగలొస్తారా? అవకాశంచిక్కినపుడు చేయగలవాళ్ళే చేస్తారు. ఆ పిల్ల పన్నాగమే అయివుం టుంది. తనమీదికిరాకుండా తప్పించుకోను మూర్ఛితురాలి వలె యెత్తువేసి కూర్చున్నది." అంటూ భరద్వాజగారు గొడవచేస్తూ, బయటికివచ్చి జనాన్ని తనచుట్టూచేర్చుకుని, దుఃఖంతోగూడినకంఠంతో సవిస్తరంగావివరిస్తున్నాడు "మా నాన్నగారు చనిపోయి యేలోకంలో వున్నాడో, ఆయన స్వయంగా చేయించిపెట్టిన మా చెల్లెలినగలు నేడు తస్క రించబడినవంటే, పైనున్నవారిఆత్మ మా చెల్లెలిఆత్మ ఎంత ఘోషిస్తాయో" అని వాపోతూ, హృదయాన్ని కుదుటపర్చు కుని స్థిమితపడి రఘునాద్‌ద్వారా పోలీసుకు రిపోర్టు పంపాడు.

నిర్మలకు స్పృహవచ్చి తిరిగి నిమిషంలో తెలివి తప్పి పోతున్నది. స్పృహకలిగినక్షణంలో యీఘోరం మనస్సుకు అఘాతంకల్పించి, కల్లోలితురాలై చైతన్యహీనురాలై పడి వుంటున్నది. శివప్రసాద్ కీ ఘటనవలన జరిగిన నష్టానికంటె యివ్వనున్నసంభావనలు ఆగిపోవటం, వేలమందికి యీవికృత కార్యం తెలియుట తలవంపులని, తనెంతో జాగ్రత్తగా పదిల

పరచిన తల్లి నగలు, నేడు అదృశ్యమవుట, తనతల్లి నేడే తనకుదూరమయినట్లు అంతూపొంతూలేని ఆలోచనలతో మనస్సు దిమ్మెత్తిపోయి, యెన్నికలలో పరాజయంపొందిన వ్యక్తికి ప్రచారఖర్చులకు చేసిన అప్పులవారంటు అప్పటి కప్పుడే వచ్చి మీాదపడినపుడు, యెన్నికలలో ప్రత్యర్థులఎడ చేసిన సవాలులకు ప్రతిగా చాలమోదను కర్రలతో ఎదుట నిలిచినపుడుండు స్థితే కలిగింది శివప్రసాద్‌కు. ఆయన మనస్సు పనిచేయుట మానివేసినట్లున్నది. సిగ్జివివలె లేచి తప్పటడు గులు వేసుకొంటూ శయ్యపైకి చేరి దీర్ఘనిట్టూర్పులువిడుస్తూ అటూయిటూ దొర్లుతున్నాడు.

భరద్వాజగారి సహకారంతో పోలీసువారు రిపోర్టును తయారుచేసుకున్నారు. భరద్వాజగారే యింటికాపందు హోదాతో వాఙ్మూలమిచ్చాడు. తన అనుమానం పూర్తిగా ఆ పిల్లమీాదే వున్నదని, తాళంచెవులు ఆమెవద్దనే వుంటున్నవని, ఆవిడ యెన్నోమారులు దొంగతనాలుచేసి జైళ్ళకు వెళ్ళిందని, ఆనెవృత్తి దొంగతనమేననీ, తననేస్తుడు జాలితో చేరదీసి ఆదరించినందుకు తిన్నయింటికే కన్నము వేసిందనీ, క్రితంరాత్రే దొంగతనం జరిగివుంటుందనీ ఆయన సవివరంగా చెప్పాడు.

సాక్షులు గట్టివారే లభ్యమైనారు. తాను శివప్రసాద్ గారిని పిలువను రాత్రి వచ్చినట్లు, ఆసమయంలో నిర్మలా. నూర్జహాన్ యెవరికో యేదో యిస్తున్నట్లు, ఆ వ్యక్తి చాలా యెత్తరిగాను మహమ్మదీయునివలె నున్నట్లు,పై జామాధరించి వున్నట్లు, పెట్టెలోవున్నవన్నీ తెచ్చావా, అని అతను

ఆమెను ప్రశ్నిస్తున్నట్లు, ఆమె ఆత్రంతో గుసగుసలాడుతూ 'నీవు నేనుగా హైద్రాబాద్ వెళ్ళిపో, నేను వారంతరువాత వచ్చివేస్తాను' అన్నట్లు, తననుచూసి ఆ యిరువురు వెలవెల బోయి చాటుకుపో ప్రయత్నించినట్లు మొదలగు వివరాలతో అతిధైర్యంగా వాఙ్మూలమిచ్చాడు రఘునాధ్ శాస్త్రి.

ఒక పైజామాధరించినవ్యక్తి మూడునాలుగురోజుల నుంచి వచ్చిపోతున్నట్లు, వీలుచిక్కినపుడల్లా ఆమెతో సంభాషిస్తున్నట్లు, వారిరహస్యసమావేశాలు కడు దీర్ఘమైనవిగా తనకు తోచినట్లు, వారిరువురిమధ్య స్త్రీపురుషసంబంధముండి వుండవచ్చునని తా నూహించినట్లు, వారు యేనో నిర్ణయాలు చేసుకుంటున్నట్లు, దూరానవున్న తనకు కనిపించినపుడు లేచిపోయేగొడవమాత్రమేగాబోలు ననుకున్నాననీ, గత రాత్రి ఆపైజామావ్యక్తి యేదోమూటతీసుకుని బెదురుబెదురు చిత్తరిచూపులతో వెళుతున్నాడనీ, ఆమూటలో యేదో పెట్టెఆకారంది వున్నట్లు కనిపించిందనీ, అతను బస్సుస్టాండుకు వెళుతున్నట్లు తనకు తోచిందనీ కాలావధానులుగారు వాఙ్మూలమిచ్చారు.

పోలీసువారికి పూర్తి కేసువివరాలు తెలిసినట్లు, నేరమంతా తేటతెల్లమయి ముద్దాయిలిద్దరు తమయెదుట నిలిచినట్లయి, గోశాలపంచలోనున్న నిర్మలానూర్జహాన్‌వద్ద కెళ్ళారు. ఆమె అర్ధనిమీలితనేత్రాలతో దీర్ఘమైన నిశ్వాసనువిడుస్తూ తనచేతిని ముఖంమీద కప్పుకున్నది. కను కొలకులగుండా ఒక్కటొక్కటిగా అశ్రుకణములు దొర్లు కుంటూ వస్తున్నవి.

పోలీసువారు ధమకీలతో తమనేర్పునంతటిని ప్రయోగించి ఆమెను యెన్నివిధాల ప్రశ్నించినా ప్రయోజనం లేక విఫలురై ఆమెను తమ వాన్‌లో తీసుకెళ్ళి కారాగార అతిథిగా స్వీకరించారు. ఎస్. ఐ., కానిస్టేబుల్సు ఒకరితరు వాత ఒకరుగా చావమోది, ఆమెచేత చెప్పించాలని ప్రయ త్నించారు. యెన్నినిందించినా యెన్నితిట్టినా యెన్నికొట్టినా "నాకు తెలియదు" అన్న సమాధానందప్ప మరేమీ ఆమె నుంచి పొందలేకపోయారు. ఆమెశరీరమంతా దెబ్బలతో కందిపోయింది. వీపుమీద చర్మంచిట్లిందేమో రక్తం గడ్డల కవుతున్నది. పోలీసువారి నిందలకు దెబ్బలకు ముందున్న దుఃఖం యిపుడు ఆమెలో కనిపించుటలేదు. నిందలు దెబ్బలు ప్రారంభమయాక ఆమె అశ్రువులుకూడా ఆగిపోయినవి. ముఖమండలంలో యిపు డంత కుములుతున్న బాధ కనిపిం చుటలేదు.

పట్టాలుతప్పిన ఎక్స్‌ప్రెస్‌రైలులోని ప్రయాణీకులు దిగి గుమిగూడి కలవరంచెందుచున్నట్లు హోమక్రతువుల లోని విప్రవరులు చెదరి, పూజారులు పూజలువదలి, వంట బ్రాహ్మణులు వంటశాలలు వదలి, గుంపులుగుంపులుగా చేరి కలకలారావంచేస్తున్నారు. అభ్యాగతిగా యింట్లోచేరిన దానికి అంత ఆనైక్యతయిచ్చినపుడు అనర్థం జరుగకుండా యెలావుంటుందని, కనకపుసింహాసనంపై శునకాన్ని కూర్చుండబెట్టినట్లు జాతి నీతి లేనిదాన్ని చేరదీయుట మహా అపరాధమని, దొంగచేతికి రత్నాలసంచిని దాయమని యిచ్చినట్లు దానిచేతికి తాళాలిచ్చుట వెర్రితనమని, నీతి

జాతిలేని తనలాంటి యెవడితోనో సంబంధంవుండివుంటుంది, వాడికిచ్చి పంపివుంటుందిగాని, భరద్వాజసహాయుడుండుట వలన దానిఆట పూర్తిగాసాగలేదని కింవదంతులుగా చెప్పకుంటున్నారు.

రఘునాథశాస్త్రి ప్రత్యక్షంగా దాని దొంగవ్యవహారం చూసికూడా పట్టుకోకపోవుట అపరాధమని, బాలావధానులు దారిలో మూటతో వెళుతున్నవానిని చూసినపుడు పోలీసులకు అప్పగించితే యీ దుర్దశవచ్చేదిగాదని; ఇంతసుందిని మంత్రంతో మైదుచేసినట్లు చేయగలిగినా భరద్వాజశాస్త్రిగారిని మోసంచేయలేకపోయిందని, మొదటినుంచి ఆయన దానిచర్యలను కనిపెడుతూనేవున్నాడని, ప్లీడరును జడ్జీలనుసైతం చకితులనుచేయగలిగిన భరద్వాజశాస్త్రిని మోసగించుట ఎవరితరమూగానిపని అని, ఈ సమయంలో ఆయన లేకపోతే ఆ దొంగది పలాయనమైవుండేదని, పోలీసులకు అప్పగించేముందు బాగా చావచితకమోదితే దానినోటితో అదే ఒప్పుకునేది, స్వయంగా అందరూ వినే అవకాశంకలిగేదని సురికొన్ని కూటములు అనుకుంటున్నవి.

ఆ దొంగముండ మాంత్రికురాలేనని, సుంత్రతంత్రాలతో యింటిలోనివారిని వశంచేసుకుని పిచ్చివారినిచేసి ఇన్నాళ్ళు ఆడించిందని, లోగడకూడా ఈఇంటిలో ఎంతో ధనం దోచివుంటుందని, నేడు దానిచెడురోజులు గనుక 'భరద్వాజబాబుండటాన పోలీసుల వశమయిందని, పోలీసులు చావమోదకామానరు, నా స్తవం చెప్పకాతప్పదు,

డబ్బూ నగలూ దొరుకుతవి, ఆ తరువాత దానికి పదిసంవత్సరాల జైలుశిక్ష ప్రాప్తమవుతుందనీ మరికొందరనుకుంటున్నారు.

పూజాగదినుంచి బయటకొచ్చిన భవానీ కీ గందరగోళం అగమ్యంగా కనిపించింది. ఆమె పూజానిమగ్నురాలై వుండగాకూడా బయటికలకలం కొంత వినిపించింది గాని, ఆమె తనపూజ భగ్నంకాకుండుటకు, తన వుచ్చారణ తనకే వినిపించునట్లు పెద్దగా జపించసాగింది. అంతటా గుంపులు గుంపులుగాచేరి చెప్పుకుంటున్నవారిలోనుంచి భవానీని దర్శించినవారు పరువు లెత్తుకుంటూ వచ్చి దుఃఖాన్ని పూరించుకుని "తా మింతవరకు యెక్కడున్నారమ్మా? తమకోరకే యెదురుచూస్తున్నాము. ఆ దొంగముండ కొంప నిలువునా ముంచింది. యెక్కడి పూజాకార్యా లక్కడే ఆగిపోయినవి. యిహ పరలోకాలలో దానికి పుట్టుగతులుండవు. మీలాంటి ధర్మమూర్తులను మోసగించినవారికి దిక్కులేని హీన మృత్యువు తప్పదమ్మా!" అని యేకకంఠంతో అన్నారు.

ఆమె కిదంతా అయోమయం అంధకారంగా వుంది. కంగారుచెందుతూ "యెవరూ, యేమి జరిగింది?" అని అడిగింది భవానీ.

"ఏమిజరిగే దేమిటమ్మా, కొంపముంచితే ఆ తప్పుడు ముండ. పెట్టెలో పదివేలరొఖ్ఖ మున్నదట, విలువైన నగలున్నవట. మొత్తం నిన్న సందెచీకట్లోనే దాటవేసిందట. అందరూ చూస్తుండగానే ఆ పని జరిగిందట. దాన్ని

ఘూస్తూనే, పచ్చి దొంగముండని పోలీసులన్నారు" అని విన్నవించారు వారు.

ఆమె విచలితురాలై మ్లానముఖంతో అదురుతున్న అధరాలతో పెగిలీపెగలని కంఠంతో "మీ రంటున్న ఆ దొంగముండ యెవరు?" అన్నది.

"ఇం కెవరుంటారు, మీయింటిలో వున్న ఆ అనాధ ముండ నూర్జహానే" అన్నారు.

ఆమె నేత్రాలు తిరుగుతున్నవి. పృథ్వి కృంగుతున్నది. పాదాలు ఆనుటలేదు. హృదయం రైలుయింజనువలె దడదడలాడుతున్నది. అధరాలుమాత్రం అదురుతున్నవి. క్షణంలో ఆమె మాట పలుకు లేకుండా నిర్జీవివలె కూలబడి పోయింది. మరో వుపద్రవమేదో వచ్చిపడినట్లు పెద్దగా అలజడి ప్రారంభమైంది. ఈ ఆపత్సమయంలో యీ కుటుంబాన్ని సంబాళించగల ఘటికుడు భరద్వాజగారేనని వారి కొరకు వెదుకుతున్నారు శ్రేయోభిలాషులు. కొందరు ఆమె ముఖంమీద జలంచిలకరించి పంకావిసురుతున్నారు.

అయిదునిమిషాల అనంతరం భవానీ తేరుకుని, కనులు తెరచి అటూయిటూ పరకాయించిచూసి, లేచి కూర్చున్నది. ఆమెచెవులు చిల్లులుపడేట్లు ఆమె మెరమెప్పులకొరకు ఔదార్యాన్ని ఐశ్వర్యాన్ని పొగడుతూ ఆ నీతి జాతిలేని దొంగముండను హీనాతిహీనంగా నిందిస్తున్నారు దగ్గరజేరిన విప్రులు.

భూకంపంతో పృథ్వి కంపించినట్లు భవానీహృదయం ఊగిపోతున్నది. శరీరమంతా స్వేదంక్రమ్ముతున్నది. నెమ్మ

దిగా లేచి నిలిచి, క్షణంలో రౌద్రరూపందాల్చి "పొండి నాముందునుంచి. మీరు యెవరినిగురించీ యేమీ చెప్పనవసరంలేదు." అని ఖంగుమంటున్నకంఠంతో అన్నది. పొంగుతున్న పాలగిన్నె క్రింది స్టౌ ఆరిపోయినపుడు క్షణంలో చప్పబడిపోయినట్లు వారిలోని అంతర్గత ఆనందోత్సాహాలు అదృశ్యమైనవి. కాటుకపూసుకున్నట్లు ముఖాలు నల్లబడినవి. వెనక్కు జారుకుంటున్నారు. ఆమెఎదుటగాని ప్రక్కలగాని నిలచుట కెవరికీ యిపుడు సాహసంలేదు.

భవానీ కాలుగాలినపిల్లివలె అంగలుపంగలు వేసుకుంటూ గోశాలవైపు పెరటివైపు యెవరికోరకో వెదుకుతున్నది. అపుడే మార్కెట్టునుంచి వచ్చిన గంగులు దుఃఖాన్ని ఆపుకోజాలక బొలబొల విలపిస్తూ భవానీపాదాలమీద పడి "అమ్మగారూ, బజార్లో జరిగిన వుదంతమంతా విన్నాను. నిర్మలమ్మను పోలీసులు చావమోదారుట. మీరుకూడా ఆమెను శంకించి పోలీసులకప్పగించారా అమ్మగారూ?" అని యిక మాటపెగలక, ఆమెపాదాలను విడునకుండా విలపిస్తున్నాడు.

భవానీ దుఃఖం పొంగి పొరలుతున్నందున ఆగజాలక ఒకచేత్తో చెంగును ముఖానికడ్డంపెట్టుకుని, రెండోహస్తంతో గంగులును లేవనెత్తి గాద్గదికకంఠంతో "నాకు యేమీ తెలియదు గంగులూ. పూజనుంచి నేను యింతకుముందే బయటకు వచ్చాను. ఈలోగా యిదంతా జరిగిపోయింది. శివం యెక్కడ గంగులూ?" అన్నది.

ఆమె యేదో ఆదుర్దాతో అటూయిటూ వెదుకుతూ

శివప్రసాద్‌గదికి వెళ్ళి చూసి, స్థిమితంపొందినదానివలె కాస్త తమాయించుకుని "శివం, ఓ శివం" అంటూ రెక్క బట్టి కుదిపింది.

దీర్ఘనిద్రనుంచి మేల్కొన్నవానివలె నేత్రాలు నులుముకుంటూ లేచి "ఏమిటమ్మా?" అన్నాడు.

"బయట యింత కర్మకాండ జరిగితే నీవు నిశ్చింతగా నిద్రిస్తున్నావా శివం! నీకు మతిపోలేదుగదా? ఏమిటీ గొడవంతా?" అని ప్రశ్నించింది.

విలపిస్తున్న కంఠంతో "బాబుగారూ, నిర్మలమ్మను జైలులోపెట్టి పోలీసువారు చావమోదారుట. శరీరమంతా హూనంచేశారుట. బ్రతుకుట కష్టమని కొందరంటున్నారు. ఇదంతా ఆ భరద్వాజశాస్త్రిగారిమాయ బాబుగారూ" అని మరింత రోదనచేయసాగాడు గంగులు.

"ఇదంతా నాకు అర్థంగాకుండావున్నదమ్మా. నూర్జహాన్ యెవరికోయిచ్చి పంపుతుండగా చూశారుట. ఆమె అలా ఎన్నటికీ చేయదని చెప్పగలంకాని, కాదని రుజువు చేయట మెలా? డబ్బుపోయినందుకు దుఃఖంలేదుగాని, ఇంత మందిలోపడ్డ అపవాదు నెలా తుడవటం?" అన్నాడు శివం.

"ఇది ఆలోచించటానికి సమయంగాదు. వెంటనే నీవు వెళ్ళి దాన్నే బుజ్జగించి వివరాలు అడుగు. దానికి అన్నీ తెలిసేవుంటవి. తెలుసుకుని దాన్ని వెంటబెట్టుకురా. అది వట్టి పిచ్చిది. కొరివితో తలగోక్కుంటే కాలకుండా వుంటుందా? ఇది భరద్వాజవన్నాగమే అయివుంటుంది. నీవు ముందు వెళ్ళి దాన్ని తీసుకురా నాయనా" అన్నది భవానీ.

శివం మారుమాటలేకుండానే వెళ్ళిపోయాడు.

పోలీసువారు శివప్రసాద్‌కు తగు మర్యాదయిచ్చి, నిర్మలానూర్జహాన్‌తో ప్రత్యేకగదిలో మాటాడుకునేఅవకాశాన్ని కల్పించారు.

గదిలో గోడప్రక్కన నిలిచి శిరస్సు అధోముఖం చేసి, వున్నది నిర్మల. శివప్రసాద్ ఆమెయెదుటికి వెళ్ళి "ఇదంతా యేమిటి నిర్మలా? నిజంచెప్పు?" అని అడిగాడు.

నిర్మలనుంచి జవాబులేదు.

శివం :- (ఆమెశిరస్సు పైకెత్తాడు. అశ్రుముద్రితమైన ఆమె ముఖం వెలవెలబోతూ అధరాలు వక్రాలుచెందుతూ నాసికారంధ్రాలు వుబుకుతున్నవి.) నీకు బిడియంగాని భయంగాని వద్దు. ఏమిజరిగిందో చెప్పు?

నిర్మల ఎలక్ట్రిక్‌ లిఫ్టువలె ఒక్కమాటుగా ఆయన పాదాలమీద వాలిపోయి, భోరున విలపిస్తున్నది. ఆయన ఎంత పట్టి ఆపాలన్నా సాధ్యంగానంతగా శరీరం ఊగిపోతున్నది. ఆమెవీపుమీద దుస్తులపైన రక్తపుమరకలు కనిపించినపుడు ఆయనకూడా కంపించిపోయాడు. ఆయన నేత్రాలనుంచి అశ్రువులు అజ్ఞాతంగా వలుకుతున్నవి. హార్త్రిబలంతో ఆమెనులేవనెత్తి, గాద్గదికకంఠంతో "ఏమిటి నిర్మలా? ఇదంతా యెలా జరిగింది? నీకుతెలిసినవిషయాలయినా చెప్పు?" అని బుజ్జగిస్తున్నాడు.

ఆమె పూరించుకున్నశక్తితో స్థిరంగా నిలిచి అధోముఖమైయున్నది. ఆయనముఖమండలాన్ని చూడలేకపోతున్నది.

ఆమె చేతులమీద, చెక్కిళ్ళమీద వాతలు తేలిన దెబ్బలు రక్తాన్ని చిందుతున్నవి. ఆ దెబ్బలను బాగా పరికించినపుడు ప్రక్కవారికికూడా అశ్రువులు క్రమ్ముతున్నట్లు ఆ వాతలు, రక్తం నగ్నంగా ప్రస్ఫుటనువుచున్నవి. ఆ వాతల మీద చేయివేసి స్పృశించనుకూడా, గిలగిలకొట్టుకునేంత నొప్పిగలుగుతుందనో రక్తం చేతికవుతుందనో భీతికలుగుచున్నది.

"ఇన్ని దెబ్బలు, యింత బర్బరంగా నిన్ను కొట్టింది యీ కసాయి పోలీసులేనా? వాళ్ళు మనుషులో రాక్షసులో ఇన్స్పెక్టరుని యిపుడే అడుగుతానుండు. ఒక స్త్రీమీదచేయి చేసుకోవటం యెంత అపరాధమో వారికి తెలిసినచ్చేట్లు చేస్తాను" అంటూ ఆదుర్దాతో బయటకు వెళ్ళబోయాడు.

ఆమె వెంటనే ఆయనహస్తాన్ని పట్టుకుని వారిస్తూ "తొందరపడకండి బాబుగారూ, నన్నుగురించి మీరంత ఆదుర్దాచెందవలసినపనిలేదు. మీ మనస్సుకు నేను యెన్నో మాటలు బాధ కలిగించాను, మీకుటుంబానికి తీరని నష్టాన్ని కల్పించాను. అవమానాలను సృష్టించాను. ఇంకా నామీద మీకు అంత దయ ఎందుకు బాబుగారూ? నన్నుగురించి మీరు యిక యేమాత్రం పట్టించుకున్నా మీకు మిగిలివున్న గౌరవంకూడా పోతుంది. ఇక్కడికి మీరు వచ్చినట్లు యెవరికీ తెలియనీయకుండా యింటికి వెళ్ళిపోండి బాబుగారూ" అని అనునయప్రార్థనారూపంలో అన్నది.

క్రోధాభినయంతో "నిర్మలా, నేను పసివాడినిగాదు, మైదుచేసి పంపను. జరిగినకర్మకాండలోని ఆంతర్యమేమిటో

చెప్పు. నీవు చెప్పకుండా దాచినందువలన యెవరికీ మేలు చేకూరదు. నా ముఖంచూస్తూ నిజం చెప్పు" అంటూ ఆమె గడ్డాన్ని తన వ్రేళ్ళతో పట్టి పైకెత్తి మృదువుగా స్పృశిస్తు న్నాడు. ఆమె అశ్రువులు అతివేగంగా చెక్కిళ్ళమీదుగా వచ్చి, ఆయన అంగుళీయములను తాకినవి. ఆయన ఆమెశిరస్సునుపట్టి తన వైపుకు లాక్కొని, హృదయంమీద ఆన్చుకుని, రెండోహస్తంతో ఆమెబాహువులను శిరస్సును వీపును స్పృశిస్తూ, దెబ్బలను వ్రేళ్ళతో పరిశీలిస్తూ, ఆమె వీపుమీది జాకెట్టును పైకిత్రోయ ప్రయత్నించి, రాక వుద రంమీదున్న బటన్ తొలగించి, వీపును పరికించాడు. ఆ సువర్ణకాంతులను వెదజల్లు శరీరంమీద పడిన దెబ్బ అతి బలమైంది. చర్మం చిట్లి స్రవించినరక్త మింకా తడితడిగానే వుంది. ఆ వీపుమీద లెక్కలేనన్నివాతలు సువర్ణఫలకం మీద కెంపురంగు కుంచెతో పిల్లలు అటూయిటూ గీతలు గీచినట్లు కన్పించినవి. ఆ వీపుమీది దృశ్యం చూస్తున్నపుడు వాటివలన కలిగే బాధ గుర్తుకురావటంలేదు. స్ఫటిక ఫలకం లాంటి ఆ వీపుమీద తన ప్రతిబింబం స్ఫుటంగా కనిపిస్తు న్నది. కాని ఆ ప్రతిబింబంలోని కంఠంమీదుగా చర్మం చిట్లిన ఆ వాత కనిపిస్తున్నది. ఆ స్ఫటికఫలకదృశ్యంలో లీనమైన శివం తననుతాను మర్చి వుత్తేజితుడై దంతాలు కటకటమనిపిస్తూ కుడిచేత్తో ఆమెవీపు మధ్యభాగాన్ని బలం గా పట్టి అటూయిటూ కుదిపాడు. చర్మంచిట్లినచోటమరింత వత్తిడితగిలి గాబోలు, తిరిగి నూతనరక్తం స్రవించి ఆయన చేతికంతటికి అయింది. తన చేతిరక్తాన్ని చూసి విచలితుడై,

"అబ్బ! నే నెంత వెర్రివాడిని! గాయాన్ని యింకా రేపాను." అని గాద్గదికంగా అంటూ, ఆమెశిరస్సును విడచి, చేతి రక్తాన్ని తుడుచుకోబోయాడు. ఆమె చివ్వున తనచేతుల్లోకి తీసుకుని తనకొంగుతో ఆయనచేతిరక్తాన్ని తుడుస్తూ "ఈ దుష్టరక్తాన్ని మీ పవిత్రమైనచేతుల కెందుకుచేసుకున్నారు బాబుగారూ!" అన్నది మందహాసంతో.

ఆమెనవ్వు కారుమేఘాలలోని మెరుపువలె ఆయనకు ధైర్యాన్ని కల్పించినట్లయింది. "నీ రక్తంతో నా హస్తాలు పునీతమయినవని నా విశ్వాసం" అన్నాడు.

"ఇత్తడిని బంగారమని విశ్వసించడంఅవివేకంకదూ"

శివంలో గొప్ప వుత్సాహంకలిగి, "నిర్మలా, యిపుడైనా నీవు నిజంచెప్పు. తాళంచెవులు ఆమధ్య లలితకిచ్చావు, నాలుగురోజులక్రితమే తిరిగి నీకుచేరినవి. ఈ జరిగిన దురంతమెలా జరిగిందో చెప్పు?" అన్నాడు. ఆమె తిరిగి మౌనంవహించింది. దినకరునికి మబ్బులు అడ్డంవచ్చినట్లు ఆమెప్రసన్నముఖానికి మరేదో అడ్డంవచ్చి మ్లానత చెందింది.

శివం విసిగిపోయి ఆఖరిప్రయత్నంగా "నిర్మలా, నీవు సమాధానం చెప్పనందువలన నాకుకలిగిన నష్టంకంటె యెన్నోరెట్లు నష్టం సంభవించిందని తెలుసుకున్నపుడు నీవే పశ్చాత్తాపపడతావు. ఆనాడు నీవేగాదు, యెవరూ సహాయపడగల అవకాశముండదు. ఆఖరిదిసతిగా అడుగుతున్నాను. నా క్షేమంకోరితే చెప్పు, ఆతరువాత నీ యిష్టం. నీవు యీ

బాధలనుంచి బయటపడి సుఖంగావుండాలని ఆశీర్వాదిస్తు న్నాను. ఇక నేను వెళతాను" అన్నాడు.

కన్నీరుకారుస్తూ, ఆయనహస్తాలను పట్టుకుని తన ముఖందగ్గరకు తీసుకెళ్ళి, "బాబుగారూ, అలాంటిమాట లనకండి. మీరు మరీమరీ అడిగి నన్ను చిత్రవధచేయకండి. నా శరీరంమీదపడిన దెబ్బలుచూసి, మీ మనస్సు బాధ చెందుచున్నది. కాని వాటవలనగాని, యీ జైలుకువచ్చినం దువలనగాని పోలీసువారిదూషణలవల్లగాని నా మనస్సు రవంతకూడా బాధచెందుటలేదు. నాశరీరానికి నొప్పిలేదు. మీకు నేనుచేసిన అన్యాయాన్నిగురించే నేను బాధపడు తున్నాను. తెలిసికూడా మీకు ద్రోహంచేశాను బాబు గారు. ఈ ద్రోహానికి ప్రాయశ్చిత్తం యెన్నిజన్మలు అనుభ వించినా తీరదు. తెలిసి తెలియనట్లుచేసిన ద్రోహానికి నాలో నేనే కుమిలిపోతున్నాను. మీరు ఆవిషయాన్నే తిరిగితిరిగి అడిగినందువలన నా ఆయువు అంతమయిందేమోననిపిస్తు న్నది. కనుక బాబుగారిని నన్ను క్షమించమనికూడా కోర గలహక్కు నాకులేదు. మీరు దయతో వెళ్ళిపోండి"అన్నది.

చిత్తకార్తెయందు చిటికెలో మబ్బులుగ్రమ్మినట్లు ఆయనముఖం క్షణంలో తెల్లబోయి వికటరూపంలో కాంతి న్యూనవహించి కారుమబ్బురూపందాల్చింది. పెద్ద వేడినిట్టూ ర్పును విడచి, అధరాలుకొరుకుక్కుంటూ గిర్రున వెనుదిరిగి పెద్దపెద్ద అంగలువేసుకుంటూ యింటిముఖంవైపు వెళ్ళి పోయాడు.

శివంకోరకు యెదురుచూస్తూవున్న భవానీనిగాని,

గంగులునుగాని యితరులనుగాని పలుకరించకుండా, వారిని చూడనట్లే శివం సరాసరి తన శయనాగారానికివెళ్ళి మొదలు విరిగినమ్రానువలె శయ్యమీదపడి దిండులో మొహంపెట్టి తనవెర్రితనానికి కన్నీరుకారుస్తున్నాడు. విశ్వాసంద్వారా అవిశ్వాసాన్ని ద్రోహాన్ని దూరంచేయగలమనుకొనుట యెంత వెర్రితనం! అని మనస్సులో అనుకుంటూ వాపోతున్నాడు. భవానీ ఆత్రతతో లోపలప్రవేశించి చూసిన దృశ్యంతో విస్తుపోయి, మతిపోయినదానివలె క్షణం నిలిచి, తరువాత "యేమి జరిగింది శివం?" అని ప్రశ్నించింది. కాని జవాబు రాలేదు. ఆమె ప్రక్కగా శయ్యమీద కూర్చుని, అతనిశిరస్సు నిమురుతూ, ఓదార్చుతూ, అతని ముఖాన్ని తనవైపుకు లాక్కుని, "ఎందుకు నాయనా, అంత బాధపడటమెందుకు? భగవంతుని చిద్విలాసం ఎలావుంటే అలానే జరుగుతుంది. భయపడినా దుఃఖపడినా అందువల్ల కలిగే మార్పులేమీ వుండవు. నిర్మల యేమిచెప్పింది శివం?" అని తిరిగి ప్రశ్నించింది.

పెగిలీపెగలని గొంతుతో గాద్గదికంగా "మనం వింటున్నవన్నీ నిజమేనని చెప్పిందమ్మా! అంతకుమించి ఆ విషయంలో యేమీ చెప్పలేదు," అన్నాడు.

ఆదుర్దాతో "అంటే ఆ దొంగతనం నిర్మలే చేశానని అంటున్నదా?" అని ప్రశ్నించింది.

"అవునమ్మా" అన్నాడు. ఆమె తనముఖాన్ని గంభీరంచేసి ఒక నిశ్చితాభిప్రాయానికి వచ్చినదానివలె "నీవు నమ్ముతున్నావా శివం?" అన్నది. "ఏమిటో నాకు యేమీ

తోచటంలేదమ్మా. నిర్మల స్వయంగా మరోమాట చెప్పటం లేదు. తను చేసినట్లే ఒప్పుకుంటున్నది." అన్నాడు, "పొరపాటు, అలా యెన్నటూ జరిగివుండదు శివం. చూసినట్లు పోలీసులకు సాక్ష్యమిచ్చారుట, ఏమిచూశారో నేను తేలుస్తాను వుండు." అంటూ భవానీ బయటకువచ్చి గంగులు ద్వారా రఘునాథ్ శాస్త్రిని పిలిపించింది. అది యింటిహాలు. రెండుద్వారాలు మూయబడివున్నవి. రెండు తెరువబడి వున్నవి. కిటికీలన్నీ మూసేవున్నవి. రఘునాథ్ శాస్త్రి వచ్చి భవానీకి నమస్కరించి ఆమెఆదేశానుసారం యీజీచైర్‌లో ఆసీనుడయినాడు. "శాస్త్రిగారూ, మీరు పెద్దవారు. మనం అన్యాయంతోను అక్రమాలతోను పొందే ఆర్థికప్రయోజనాలు యిక్కడే పోతవి కాని, వాటిద్వారా సంప్రాప్తమయ్యే ఘోరపాతకంమాత్రం పరలోకానికికూడా చద్దిమూటవలె వస్తుంది. నిర్మల దొంగతనంగా మా డబ్బు నగలు యెవరికో యిస్తుండగా మీరు చూశారన్నారుట. కళ్లుమూసుకుని కటికిఅబద్ధం ఆడకుండా యదార్థాన్ని వినిపించండి" అన్నది.

"మీబోటివారిముందు అబద్ధమాడతానా అమ్మా. మీబోటివారిముందు ఆ పాడువిషయాలు చర్చించుటకూడా మంచిదిగాదు. ఆ దొంగముండ మూటగట్టి యెవడికో యిస్తున్నపుడు నేను కళ్ళారా చూశాను. అప్పుడే మీకు చెబుదామనుకుని పనితొందరలో మరచాను. బాలానధానులు యెన్నోమారులు అతను రావటం పోవటం చూచాట్ట. దాని దగ్గర దొంగచేష్టలేగాదు, తిరుగుడుముండ అమ్మా" అంటుం

డగా మధ్యలోనే భవానీ అందుకుని, కూర్చున్నదల్లా నిలిచి శివమెక్కినట్లు వుగ్రురాలై 'చండికాస్వరూపందాల్చి, "శాస్త్రిగారూ, మీ నోరుముయ్యండి, ఖబర్దార్. మరో మాట అన్నావా నేను సహించను. పోయినధనం నిర్మలదే. అది కావాలని కోరితే, మా సర్వస్వము దానిదోసిట్లో పెట్ట గలము. అది పరమపవిత్రమైంది. దాని కలాంటి నీచబుద్ధి గాని, కాంతుగాని లేదు. మీ కక్కుర్తీ, విశ్వాసద్రోహము దానిలో మచ్చుకైనా లేవు" అని హుంకరిస్తుండగా శాస్త్రి గారు భయకంపితుడై నెమ్మదిగా లేచి ఒక్కొక్కఅడుగు వెనక్కు వేసుకుంటూ బయటికి జారిపో ప్రయత్నించాడు. కాని వెనుకనుంచి లాఠీలతో భీమన్న, పాలేరు ధర్మయ్య, ఒక్కమాటుగా లోపల ప్రవేశించి, తలుపులుబిగించారు. భవానీ లోపలిద్వారంనుంచి వెళ్ళిపోయింది. కండలుదేలి భీకరరూపంలో మింగివేయనున్నట్లు గనిపిస్తున్న భీమన్నను జూచి, కంపితుడై గుండెనుచిక్కబట్టుకుని భవానీవెంట పారి పోవాలని ప్రయత్నించాడు శాస్త్రి. కాని భీమన్న పసిబాల కుని రెక్కపట్టినట్లు శాస్త్రిచేయిపట్టి హాలుమధ్య కూల వేశాడు. ధర్మయ్య రెండోతలుపు వారగా మూసివుంచాడు.

భీమన్న శాస్త్రిగారి రెక్క మళ్ళీ గట్టిగా పట్టి నొక్కుతూ పైకిలాగి లాఠీని ప్రక్కనపెట్టి రెండోహస్తంతో గొంతుకను బిగించి, దంతాలు కరకరమనిపిస్తూ "దేవుని పేరు తలచుకుని నిజం చెప్పు? అబద్ధంవచ్చిందా గొంతుపిసికి గోనెలోకట్టి నదిలో పారవేస్తాను, జాగ్రత్త!" అని హూంక

రించాడు. గడగడ వణుకుతున్నాడు శాస్త్రి. గొంతు పెగలుటలేదు. పైప్రాణం పైనే పోతునట్లున్నది.

సన్ననికంఠంతో చేతులుజోడించి, "నిజం చెపుతున్నాను, నాకు యేమీ తెలియదు. భరద్వాజగారు రెండువందలిస్తానని ఆశపెట్టి అలా చెప్పమన్నారు. స్వగ్రామస్తుడు, బంధువుగనుక ఆయన చెప్పమన్నట్లు చెప్పాను. బాలానధానులకుకూడా యేమీ తెలియదు. వారిద్వారానే ఆయనా సాక్ష్యమిచ్చారు. మా యిద్దరికీ డబ్బు అప్పుడే యిచ్చారు." అని సమాధానం చెప్పాడు.

ధర్మయ్య ఆదుర్దాతో లోపలకు వెళ్ళి భవానీని, శివప్రసాద్‌ను హాల్లోకి తోడితెచ్చాడు. వారిరువురి యెదుట రఘునాధ్ పూసగుచ్చినట్లు యధార్థాన్ని చెప్పి తనకుయిచ్చిన రెండువందలడబ్బును టేబులుమీద వుంచాడు. శివప్రసాద్ విచలితుడై ఆ నోట్లనెంబర్లను పరిశీలించి, "ఇవి మనపెట్టె లోని కట్టలలోవే నమ్మా" అన్నాడు.

"అవునురా, మనడబ్బుతోనే మనలనుపిచ్చివాళ్ళను చేసి, బంధిస్తున్నాడు భరద్వాజ." అని హేయభావంతో అన్నది.

ఈ కుతంత్రం బయటపడిందని భరద్వాజ యెప్పుడు కనుగొన్నాడో, పుత్రీసమేతంగా పలాయనమయ్యాడు. ఎంత వెదికినా యెవరికీ కనిపించలేదు.

అసలీ దొంగపని జరిపించినది భరద్వాజేనని, నిర్మల యోగ్యురాలు, మానసంగలది, విశ్వాసపాత్రురాలు, కర్మిష్టి, నిష్కామయోగినిలాంటిదనే వదంతులు తిరిగి బయలు

దేసినవి. గంటకుముందు ఆమెను హేయాతిహేయంగా నిం దించినవారే యిపు డామె పేరిట భగవంతుని ప్రార్థిస్తు న్నారు. ఈ సత్కార్యాలన్నిటికి మూలవిరాట్ నిర్మలేనన్న రహస్యం వారి కిపుడు బోధపడి, ఆమెదర్శనభాగ్యంకొరకు తహతహలాడుతున్నారు.

మనడబ్బు పోలేదని, ఆ పన్నుగడఅంతా భరద్వాజ చేసినదేనని పోలీసువారికి చెప్పి, కేసును యెత్తివేయించి నిర్మలను తీసుకురమ్మని భవానీ యెంత ప్రోత్సాహమిచ్చినా, శివప్రసాద్ ధైర్యంచేయలేకపోయాడు. నిర్మల అంత తేలిగ్గా రాదని అతనిభయం.

“నా బిడ్డను తీసుకురాను నేనే స్వయంగా వెళతా” నని భవానీ బయలుదేరింది. శివం ఆమెననుసరించాడు.

నిర్మల యింటికి చేర్చబడింది. ఆమెనుచూడాలని వస్తున్న జనానికి తెరపిలేదు. కాని, భవానీ ఆమెను తనగది లోకి తీసుకెళ్ళి తలుపులుబిగించి స్వయంగా వేడినీటితో కాపులుకాస్తున్నది. “నన్నీ దెబ్బలేమీచేయలేవు. మీ కంత శ్రమయెందుకమ్మా!” అంటున్నది నిర్మల. “ఇలాంటి వెర్రిదానివిగనుకనే, అనవసరమైనబాధలను నెత్తిపైకి తెచ్చు కుంటావు” అని అంటుండగానే “అమ్మా, అమ్మా” అని శివం కేకలుపెడుతూ తలుపుగొట్టాడు.

భవానీ నెమ్మదిగా తలుపు వోరగా తెరచింది. ఆదు రాతోగూడిన ఆనందంతో “మనడబ్బు, నగలు దొరికిన వమ్మా. నదినడ్డున రెండుమైళ్ళదూరాన పొదలో గుప్తంగా మామయ్య నాలుగురోజులనాడే దాచివచ్చాడుట. రెండు

గంటలముందే లలితతో కలిసి వెళ్ళి వాటిని పొదనుంచి తీయబోతే, మామయ్యను పాము కాటువేసిందట. అక్కడే పడిపోయాడుట. లలిత యేడుస్తూ శోకాలుపెడుతుండగా జనం పోగయితే, చేసినపాపానికి ప్రాయశ్చిత్తంజరిగిందని వివరాలు చెప్పిందట. వారు ఆయన్ను, మనడబ్బు నగలను మనయింటికే తీసుకొచ్చారు. లలిత కాళ్ళమీదబడి యేడు స్తున్నది" అని శివం వివరిస్తుండగా గంగులు "మనసొత్తు మన యింటికి జేరింది అమ్మగారూ. ఇవిగోండి" అంటూ మూట యిస్తూ "భరద్వాజగారు బ్రతుకుట కష్టమమ్మా, నోటి వెంట నురుగువస్తున్నది. ఆయనపాపం పండిపోయింది. కరిచింది నల్లత్రాచుపామట" అన్నాడు.

ఈ ఆఖరిమాటవిని, నిర్మల భయకంపితురాలై తన చీరె సర్దుకుని లేచి, "అమ్మా, యిక నాకేమీ పరవాలేదు గాని, పెదబాబుగారిని బ్రతికించుట మనకర్తవ్యం" అన్నది.

భవానీ కుపితురాలై "నిర్మలా, జరిగినకర్మకాండ చాలు. ఇంకా లేని అభాండాలు నెత్తిన పెట్టుకునే ప్రయత్నం చేయబోకు. ఒకమనిషిని బ్రతికించుట మనిషికి సాధ్యమైన విషయంగాదు" అన్నది.

వినయపూర్వక ప్రార్థనారూపంలో "కొన్నికొన్ని సమయాల్లో సాధ్యాలు అసాధ్యాలుగాను, అసాధ్యాలు సాధ్యాలుగాను సంభవిస్తుంటనమ్మా" అన్నది.

"నీవు యీసమయంలో బయటకుపో వీల్లేదు." అని నిష్కర్షగా అన్నది భవానీ.

"పోనీ, బాబుగారయినా వెళ్ళి నేనుచెప్పినట్లు చేయ

మనండి; పెదబాబుగారు బ్రతుకుతారు" అని కొంచెం తట పటాయిస్తూ "బాబుగారూ, నన్ను క్షమించి నామాట వినండి. మన పెరటివైపున గోడలమీద నేలమామిడి మొక్కలు కనిపిస్తవి. ఆ మూలిక పసరు కాటువేసిన గాయంమీద పిండి, పూర్వదిశగా తిరిగి, ఓం, శ్రీ నాగేంద్రా, వాయుభక్షకా రక్షకా రక్షింపుము యీ భరద్వాజను-అని మనస్సులో జపిస్తూ, ఆ పసరు పిండినచోట వూదుతూవుండండి. తిరిగి మనిషికి స్పృహవచ్చేవరకు అలా చేస్తే ఆయన తప్పక బ్రతుకుతారు" అన్నది.

శివప్రసాద్ ఆమె చెప్పినట్లు చేయగా భరద్వాజ స్పృహవచ్చి, తేరుకుని, లేచినతరువాత నిర్మలకోరకు కలవరిస్తూ "నాయనా శివం! నన్ను నిర్మలవద్దకు తీసుకెళ్లు క్షమాపణకోరుకుంటాను. ఆమె మహాసాధ్వి. ఈ ప్రపంచంలోని సర్వఘోరపాపాలను క్షమించగలశక్తి ఆమెలో వుంది" అన్నాడు.

శివప్రసాద్ ఆధారంతో భవానీగది చెంతకొచ్చి, గబ గబ రెండుఅడుగులలో గదిలోప్రవేశించి, నిర్మలపాదాల మీద శిరస్సువుంచి "నేను మహాపాపిని; విశ్వాసఘాతకుణ్ణి నన్ను క్షమించు అమ్మా" అన్నాడు.

నిర్మల వులికిపాటుతో లేచి, ఆయన్ను లేవదీస్తూ "పెదబాబుగారూ, నన్ను యీ రూపంగా చిత్రవధచేయకండి. అమ్మ యెపుడూ అంటుంది-భగవంతుని చిద్విలాసం యెలాజరుగవలసివుంటే అలానేజరుగుతుందని. జరిగినదానిని గురించి చింతించుటకంటె, సత్యము న్యాయము అయిన

దాన్ని గుర్తించుటకు ప్రయత్నించుట వుత్తమము. మీ మీద నాకు ద్వేషంగాని, క్రోధంగాని యెన్నడూ లేవు. కొన్ని సందర్భాలలో మీ చర్యలను చూచి, చింతించాను అంతే" అన్నది.

"భవానీ శివప్రసాద్‌లు అన్నట్లు నీవు దేవతాస్వరూపిణివి. అంతస్థు కులాన్ని వంశాన్నిబట్టి గాదు, హృదయ నైర్మల్యము, పవిత్రతలబట్టి వుంటుందని, అలాంటి నిష్కామ హృదయానిదే ఆఖరివిజయమని అనుభవంతో తెలుసుకున్నాను," అని నిండుకంఠంతో అన్నాడు.

# 15 వంటయింట్లో చదువు

నెలరోజులు గడిచినవి. నిర్మలానూర్జహా నిపుడు అతి శ్రద్ధగా చదువుతున్నది. అతిచురుకుగా చదివి పంతులుగారిని చకితులనుచేయాలనేఅభిలాష మెండు. ఆటలాడు పసిబాలిక వలె యింటి కార్యభారాలన్నిటిని వడివడిగా ముగించుకుని, కాలేజీనుంచి శివప్రసాద్ వచ్చువేళకు తనపాఠాన్ని కంఠస్థం చేస్తుంటుంది. రానురాను పొయ్యిదగ్గరకూర్చుని, ఒకప్రక్క పుస్తకం తెరచిపెట్టి చదువుతూ, వంటపనులుచేసుకొనుటలో అభ్యాసపడింది.

కాలేజీలో పెద్దపెద్దరచనలను సమాలోచన, వ్యాఖ్యలతో బోధించుటలో శివప్రసాద్‌కు రుచితప్పిపోయింది. నిత్యమూ పంచభక్ష్యభోజ్యాలు భుజించువానికి వెగటుకలిగినట్లు, గొప్పరచయితలజీవితాలను వివరించుటలోకూడా

వుత్సాహం కలుగుటలేదు. ఆయనమనస్సు 4-30గంటలవద్ద గడియారం ముల్లును వెదకుతుంటుంది. ఈ కాలేజీకార్యక్రమము నేడాయనకు కారాగారశిక్షగా అనుభవమవుచున్నది. ఇంటిదగ్గర నిర్మలకు తాను బోధించు మూషోతరగతి చిన్నపుస్తకంలోని పాఠాలమీదికి మనసుపోతున్నది. ఆ పాఠాలలోని కమనీయత అర్థంగానిరూపంలో తన నంటి వుంటున్నది. ఆ పాఠాలలో ఆమె తప్పుచదివినపుడు తన చిన్ననాటిస్మృతులు మదిలో మెదులుతూ అనిర్వచనీయమైనఆనందాన్నిగల్పిస్తుంటవి. ఆమె వంకరటింకరగా వత్తులు పోగొట్టి వ్రాసిన అక్షరాలను దిద్దుతున్నపుడు, ఆమె నాలుక కొరుక్కుంటూ చిన్నబుచ్చుకుంటూంటే, తన మనస్సు ద్రవిస్తుంటుంది. అపుడు తాను ఆమెశిరస్సుమీద చేయివేసి నిమురుతాడు.

అది ఆదివారము. సెలవుదినము. అపరాహ్నసమయం. పాఠాలుచెప్పుటకని అరగంటనుంచి తాను శిష్యురాలికొరకు యెదురుచూసి విసిగి, వంటశాలవైపు వచ్చాడు. నిర్మల యేదో వంటపనిలో వున్నది.

శివం:- ఈ మధ్యాహ్నసమయంలోకూడా నీ విక్కడ యేమిచేస్తున్నావు నిర్మలా?

నిర్మల:- మీకు ఫలహారం తయారుచేస్తున్నాను.

శివం:- నీకు పాఠంచెబితే నా పని తీరిపోతుందని యెదురుచూస్తున్నాను.

నిర్మల:- ఫలహారంచేశాకయితే, నెమ్మదిగా పాఠం చెబుతారు; తప్పులు చదివినా సహించగలుగుతారు,

లేకపోతే కోడతారనేభయంతోనే యీపని చేస్తున్నాను బాబుగారూ.

శివం:- నిజంగా నీకు నేనంటే భయమా నిర్మలా?

నిర్మల:- భక్తివున్నచోటే నిజమైన భయముంటుంది బాబుగారు.

శివం:- నీకు భయముంటే, నా మాట వినవెందుకు? ఈపనికి మరెవరినైనా నియమించి నీవు పూర్తికాలాన్ని చదువుకే వినియోగించమన్నాను.

నిర్మల:- ఈ పనులు మరొకరివలన సక్రమంగా నెర వేరవని నా భయం బాబుగారు.

శివం:-నిన్ను సమాధానపర్చుట సాధ్యంగానివిషయం. ఆ పుస్తక మిలా తీసుకురా (అంటూ ప్రక్కనున్నస్టూలు మీద కూర్చున్నాడు.)

నిర్మల:- అదేమిటి బాబుగారూ, వంటయింట్లో చదువు! అమ్మచూస్తే యేమనుకుంటుంది?

శివం:- అమ్మ నిద్దరోతున్నది. (లేచి పొయ్యిగడ్డ ప్రక్కగా తెరచివున్నపుస్తకాన్ని చేతబట్టుకుని, దొంగ పాటుగా రెండోహస్తంతో నిర్మలహస్తాన్ని గట్టిగాపట్టి, పాఠ శాలకు యెగనామంపెట్టినవిద్యార్థిని పట్టి లాక్కువెళ్ళినట్లు తనస్టూలువద్దకు తీసుకెళ్ళి ప్రక్కన కూర్చుండబెట్టి తాను స్టూలుమీదకూర్చుని, ఆమెచేతిలో పుస్తకాన్నిపెట్టి) "ఇక చదువు" అన్నాడు.

కోరగా జాలిగా చూస్తూ "మీకు టిఫిను తయారు చేసిపెట్టాక చదువుకుంటానుగా; అప్పుడు తప్పులునస్తే

చెవులు మెలివేద్దురుగాని, పదినిమిషాలు బయట వుండండి.” అన్నది నిర్మల.

మందస్మితవదనంతో “టిక్షను చేసేది నాంకోరకేగదా, నీవు చేసినా నేను తినదలచలేదు. యెవరికి యేరూపంలో వుత్సాహముంటుందో ఆరూపంలోనే ఆనందాన్ని కలిగించాలిగాని తనయిష్టాన్ని బలాత్కారంగా యితరులమీద రుద్దుట వివేకంకాదు” అన్నాడు.

అధరాల నుబికిస్తూ “ఏది అవుసరమో దేనివలన తనకు అత్యధిక ఆనందం లభిస్తుందో తెలియనివారుకూడా వుంటారు బాబుగారూ” అన్నది.

మృదువుగా ఆమె చెవినిబట్టి “నీప్రశ్నలకు సమాధానం చెప్పుట కష్టం. ఇపుడు చదువుతావా లేదా?” అంటూ నెమ్మదిగా వత్తుతున్నాడు.

ఆమె దీనవదనంతో “ఈ రెండో చెవి యేం పాపం చేసింది చెప్పండి? దాన్ని కూడా రెండో చేత్తో పట్టుకోండి!” అంటూ, ఆయనద్వితీయహస్తాన్ని పట్టుకుని రెండో చెవిమీద పెట్టుకున్నది.

ఆయనకు కర్ణద్వయాన్ని బాగా మెలివేయాలని వుత్సాహంకలుగుతున్నదిగాని, నొప్పికలుగుతుందేమోననే సంకోచం వెనక్కు లాగిపట్టుతున్నది.

ఆమె క్రిందుగా జారి తుర్రున పారిపోయి “గురువుగారిహృదయం కర్కశమైందిగాదు. అందువలన శిష్యురాలు భయపడవలసినఅవుసరంలేదు. క్షమించండి, పదినిమిషాల్లో నా పని ముగించుకుని, మీ పాఠశాలలో వినయంగల

విద్యార్థినిపలె హాజరవుతాను. అప్పుడు మీ యిష్టంవచ్చిన శిక్షవిధించండి" అని నవ్వుముఖాన్ని ఆయనవైపు ప్రదర్శిస్తూ, బాండీని పొయిమీద ఎక్కించింది.

ఆయన నిర్ఘాంతపోయినవానివలె మిడిగ్రుడ్లు వేసి తీక్ష్ణదృక్కులతో చూస్తూ వుండిపోయాడు.

ఏలకులు మొదలగువాటితోను కుంకుమపువ్వుతోను, గ్లూకోస్‌తోనుచేసి నేతిలో రవ్వవేగుడు వేగిన మీగడ సాసరునిండా నింపి, అందు స్పూనువుంచి, తెచ్చి స్టూలుమీద కూర్చునివున్న శివప్రసాద్ చేతిలో వుంచింది. ఆయన దాని నలానే చేతితోపట్టుకుని ఆమెవైపే చూస్తున్నాడు.

మందస్మితవదనంతో "ఇంకా యీ శిష్యురాలిపై జనించిన కోపం పోలేదా? అది భుజించి ఆ తరువాత కఠినమైనశిక్షనివ్వండి. ఇక మోసగించను. మీచేతికి అందునట్లు హాజరవుతున్నాను" అంటూ ఆయనచెంతకు వెళ్ళి నేలమీద చతికిలబడింది.

"అలా చూస్తారేమిటి బాబుగారూ?" అని తిరిగి ప్రశ్నించింది.

పేలవంగా నవ్వుతూ "ఏమీలేదు, నీవు విచిత్రమైనదానివి. నీమీద కోపంతెచ్చుకోవాలన్నా సాధ్యంగాదు. జీవితంలోని వాస్తవికాన్ని నిగూఢమర్మాలను పూర్ణంగా అర్థంచేసుకున్నావు గాబోలు! నీవేదిచేసినా అందంగాను ఆకర్షణతోను త్యాగంతోను వుంటుంది. మోగనిష్టలోని కర్మిష్టివలె నీనుంచి అపుడపుడు ద్యోతకమవుతుంటుంది."

అని అంటూండగా మధ్యలో నిర్మల అందుకుని చేతులు జోడించి నవ్వును ప్రదర్శిస్తూ దంతాలుబిగబట్టి, "ఓ గురు వర్యా, తమ కవనవర్ణనకు నన్నే కథాస్తువుగా చేసుకోకండి. ముందు ఆ ఫలహారాన్ని యీ బీదశిష్యురాలి గురుదక్షిణగా ఆరగించండి. ఆతరువాత తమకవిత్వంయెటునడుస్తుందో చూదాము" అన్నది.

"నాకు యేమీ అక్కరలేదని ముందే చెప్పాను. పంతానికైనా తీసుకోగూడదనుకున్నాను. ఇవి యే పకోడీలో గారెలో వుప్మాయో అయితే తప్పక నా పంతం నెగ్గించుకునేవాడిని. కాని నీవుచేసిన యీ పదార్థంకొరకు నా జిహ్వ కొట్టుకుంటున్నది. ఇలాంటి స్వాదిష్టమైనపదార్థాలు చేయుట యెక్కడ నేర్చావు నిర్మలా?" అన్నాడు.

"ఇది మా దేశంలో మామూలుగా చేసేదే బాబుగారూ. పాలు, మీగడ, కోవా మేము మామూలుగా తినేవి. మీగడ నిలా తాలింపువేస్తే 'రబిడి' అంటాను, అంతే" అన్నది.

"మరి నీ కేది?నీవు తినవేమిటి?" అని ప్రశ్నించాడు.

"నాకూ అమ్మకు యింకా వున్నది బాబుగారు" అన్నది.

"నీవు ముందు నాయెదుట తిను" అన్నాడు.

"అలాంటి పిల్లలప్రశ్నలువేసి నన్ను వేధించకండి. మీముందు నేను యెన్నడైనా తిన్నానా చెప్పండి? అమ్మ నిద్రలేచాక వారిని ఫలహారంచేయించి నేను తింటాను" అన్నది.

ఆయన ఫలహారంభుజించి "నిర్మలా, అమృతప్రాయమైన ఫలహారంపెట్టావు. అందుకు పాఠాలను ద్విగుణంగా చెపుతాను. యిక పుస్తకం తెమ్ము" అన్నాడు.

"ఇది పాఠశాలగాదు, వంటశాల గురువర్యా!" అని మృదువుగా నవ్వి, పుస్తకాన్ని తెరచింది. పాఠాన్ని సాఫీగా నట్టులులేకుండా చదివేసింది. శివం విస్మితుడై "నీవు యీ పనులన్నీ యెంతచురుకుగా ఆడుకుంటున్నట్లు చేయగలుగుతున్నావో చదువులోకూడా నీవు అలాగే చదివేస్తున్నావు. ఇంతతొందరగా యెలా వస్తున్నవి? ఏకసంతగ్రాహివి కాదు గదా?" అన్నాడు. "అలాంటి అపోహపడకండి. నా బుర్ర చాలా మొద్దుది. మీ భయంతో పనులకంటె శ్రద్ధగా చదువుతున్నాను" అన్నది.

"చదువుట, అర్థంచేసుకొనుట నీకు వంటపాకము వంటిదేగాని, వ్రాయుట బాగా నేర్చుకోవాలి. పాతపాఠము చూడకుండా వ్రాయి" అన్నాడు.

ఆమె అలమరలోని కాగితాలు కలము తెచ్చి, శివం స్టూలుప్రక్కన కూర్చుని వ్రాస్తున్నది. భూమిమీద పుస్తకం పెట్టి పుస్తకంమీదికి వంగి వ్రాస్తున్నది. ఆమె వ్రాస్తున్న అక్షరాలమీదికి ఆయన మనస్సు పోవుటలేదు. ఆమెకురులను చూస్తూచూస్తూండగా మనస్సుపట్టలేక నెమ్మదిగా వాలుజడను తనచేతిలోకి తీసుకుని తాడువలె అటూయిటూ ముడివేయప్రయత్నిస్తున్నాడు. యెటూకుదరక ఆ జడను తనకుడిహస్తానికి మెలివేసుకుని అటూయిటూ మృదువుగా కుదిపాడు. ఆమె ముద్దులొలుకుపలుకులతో "నన్ను వ్రాయ

నివ్వండి బాబుగారూ," అని శిరస్సుయెత్తకుండానే వ్రాస్తున్నది. ఆ జడను నెమ్మదిగా ప్రక్కగా నేలమీాదికి వదిలి, వీపుసవరిస్తూ చీరెలోపలవున్న బ్లౌజును వీపుపైకి లాగప్రయత్నిస్తుండగా, నిర్మల వ్రాయుట ఆపి శిరస్సు పైకెత్తి "ఏదో అత్యాచారంచేయబోతున్నారేమిటి బాబుగారూ?" అన్నది.

శివం నతనతగొడుతూ "నీ వీపుమీాద ఆనాడు తగిలిన గాయం మానిందో లేదో చూదామని." అన్నాడు.

ఆమె మామూలుధోరణిలో "గాయమెక్కడ బాబుగారు? పోలీసువారు కొట్టినపుడు చర్మం చిట్లి రక్తస్రావమయింది. అది యిన్నిరోజులు మానకుండా వుంటుందా?" అని ఆమె మళ్ళీ వంగి వ్రాయనారంభించింది. "మచ్చపడిందేమో చూడాలనివుంది నిర్మలా" అంటూ తిరిగి యథావిధిగా ప్రయత్నిస్తున్నాడు. "అవును, చేసిన గాయాలు పోయినా మచ్చలుపోవు" అని వ్రాసుకుంటూనే అన్నది. ఆయన యెంతప్రయత్నించినా ఆ బ్లౌజు రాక, అటూయిటూ లాగి ప్రయాసపడుతుంటే, ఆమెవ్రాసుకుంటూనే నవ్వుకుంటున్నది. పెద్దప్రయత్నంతో బ్లౌజును చీరలోపలనుంచి లాగుటలో సఫలుడైనాడు. వీపుమీాదనున్న పమిటను తొలగించాడు. కాని అక్కడినుంచి బ్లౌజు పైకి యేమాత్రమూ నచ్చుటలేదు. పసిబాలకునివలెజాలిగొలుపు కంఠంతో "ఆ బటను తీయి నిర్మలా" అన్నాడు.

ఆమె నవ్వుకుంటూ వ్రాతలో నిమగ్నమైవుండే "నాకు తెలియదు" అన్నది. మనస్సులోనివుద్వేగం ధైర్యాన్నిస్తుంది. ఆయన తనయెడమహస్తాన్ని ఆమెయెడమ

మోచేతిక్రిందుగా దూర్చి ఆమె ఉదరంమీదున్న క్రిందిబట నును పైబటనును వూడదీస్తున్నాడు. ఆమె నవ్వుకుంటూనే తననుగాదనునట్లున్నది. కృతకృత్యుడైనాడు. జాకెట్టును మెడమీదివరకు లాగి, వీపును నగ్నంచేశాడు. ఆమె కదలిక లేకయే "ఏమిటి బాబుగారూ?" అనిమాత్రం అన్నది. "నీ వీపును చూచుటకు మనస్సు వువ్విళ్ళూరుతున్నది నిర్మలా" అని తదేకంగా చూస్తున్నాడు. ఆ వాత లిపుడు లేవు. సన్నటి జిలుగుమసక మచ్చగామాత్రం వున్నది. ఆ మచ్చ కూడా అదృశ్యమవుట కెన్నోరోజులుపట్టదనిపిస్తున్నది. ఆ మచ్చవున్న చోట అంగుళీయములతో అటూయిటూ స్పృశిస్తున్నాడు. మనస్సులో తనకు తెలియని మత్తు ప్రవేశించింది. అక్కడ కొరికివేయాలనిపిస్తున్నది. ఆ వీపుకు భగవంతుడు అంత అందాన్ని యెందుకు కల్పించాడో, యెంత ఆలోచించినా అతనిబుర్రకు తోచుటలేదు. తనహస్తద్వయంతో వీపును అటూయిటూ సవరిస్తూ, తాను పూర్తిగా ఆమెమీదకు వంగి, తనప్రతిమనుచూసుకుంటున్నాడు. అది విలువైన స్ఫటికఫలకమైనట్లు, అందు తన ప్రతిమను యెవరో చిత్రించినట్లు గోచరిస్తున్నది. తనదృష్టిని తనప్రతిమే లాగుతున్నట్లు కనులార్పకుండా చూస్తున్నాడు. చూసినకొద్దీ మనస్సు వికలంచెందుతున్నది, అంతంలేనిఆలోచనలతో వుక్కిరిబిక్కిరవుతున్నది. అజ్ఞాతంగా ఆయననేత్రాలనుంచి అశ్రువులు టపటప వీపుమీద రాలినవి. తనకేమీ తెలియనట్లు పాఠంవ్రాసుకుంటున్న నిర్మల చకితురాలై చివ్వున లేచింది; శిరస్సుకు శిరస్సు ఢీకొని "అబ్బా!" అన్నాడు శివం.

"పాపిష్టిదాన్ని, అదేమిటి బాబుగారూ? బాగా దెబ్బతగిలిందా?" అంటూ ఆయనశిరస్సుమీద చేయివేసి నిమురుతూ, రెండోహస్తంతో తనకొంగుతో ఆయన అశ్రువులను అద్దుతూ "కన్నీరుకారుస్తారెందుకు బాబుగారు, చెప్పండి" అంటూ ఆయనశిరస్సును తనభుజస్కంధంమీద వాల్చి నిమురుతున్నది.

హృదయాన్ని కుదుటబర్చుకుని సన్నటికంఠంతో "ఏమీ లేదు" అని ఫూరుకున్నాడు. "ఏమీలేకుండా కన్నీ రెందుకొస్తవి బాబుగారూ" అన్నది నిర్మల. "ఆవిషయం నాకేం తెలీదు. దుఃఖంతోదార్లినవిమాత్రం కాదు. పన్నీ రేమో! ఏమీ చెప్పలేకుండావున్నాను." అన్నాడు.

"అదేమిటి బాబుగారు, నా వీపుమీద అలాంటి అర్థంగానిసమస్య లేమివున్నవంటారు?" అన్నది.

"నీవీపుమీదేగాదు, నీశరీరంలోని ప్రతిఅణువులోను ఆ సృష్టికర్త తననైపుణ్యాన్నంతటిని అతిచాకచక్యంగా ప్రదర్శించాడు. నీశరీరంలోని అనిర్వచనీయమైన శృంగార మాధుర్యం నీకు గోచరంకాదు నిర్మలా" అంటూ తన కుడి హస్తాన్ని మాడుమీద పెట్టుకున్నాడు.

"అదేమిటి బాబుగారు? నే నడుగుతున్నది మీ కన్నీటికి కారణం?" అన్నది.

"దారిలోదొరికిన కర్రపుల్ల ఆసరాగావుంటుందని చేతబట్టి, పయనిస్తుండగా విసగటచెంది బడలికతో చెదరిన మనస్సుతో నిస్పృహచెందనున్నసమయంలో తనచేతిలో నున్నకర్ర మంత్రదండమైనట్లు, తను కోరినదల్లా ప్రసాదించు

శక్తి దానికున్నట్లు ఆకస్మికంగా తెలిసినపుడు ఆ పథికునిస్థితి యెలావుంటుందో, అతనికంటివెంట కన్నీరుకారుతుందో కారదో చెప్పగలవా నిర్మలా?" అన్నాడు శివం.

"అలాంటి అమూల్యమైనవస్తువు మీ కిపు డేమిలభ్యమైందో చెప్పండి" అన్నది.

"అంతకుమించినదే లభ్యమైందినాకు" అన్నాడు శివం.

ఆత్రతతో గూడిన ఆదుర్దాతో "అది ఏమిటో నాకు కూడా చెప్పండి" అన్నది. ఆయన తీవ్రదృక్కులతో ఆమెను తదేకంగా చూస్తున్నాడు. "మీకు లభ్యమైన ఆ సంపత్తిని నేను అపహరించను బాబుగారు. నన్ను విశ్వసించండి." అని తిరిగి అన్నది. ఆయన దంతాలునొక్కుకుంటూ, అధరాలనుబిగబట్టి దీర్ఘనిశ్వాస విడుస్తూ, తన కుడిహస్తంతో ఆమె చెక్కిలి మృదువుగాపట్టి లాగి వదిలాడు. "మీకు దొరికినసంపత్తిని నాకు చూపరా?" అని మళ్ళీ ప్రశ్నించింది. "అసూయ చెందకుండావుంటావా?" అన్నాడు. "ఈ ప్రపంచంలోని సర్వసంపత్తికి నేనేఅధిపతినైతే మీపాదాల చెంత వుంచేదాన్ని" అన్నది.

"నాకలాంటి దురాశ లేదు. దాయుటకు రక్షించుటకు అనుభవించుటకు తగినశక్తి కావాలిగదా!" అన్నాడు. "అంతటిసంపత్తి లభ్యమైనపుడు దాన్ని రక్షించగల, అనుభవించగలశక్తి ఆ సంపత్తితోనే లభ్యమవుతుంది బాబుగారు" అన్నది. "అయినా నాకు లభ్యమైన సంపత్తి నాకు చాలు. సర్వసంపత్తి నాకు అక్కరలేదు." అన్నాడు. మీరు నా మనస్సులోనిమాటనే అన్నారు. మనస్సులోనితృప్తే సర్వ

సంపత్తి అనునది నిర్వివాదము. నన్ను మాటలతో మరి పించచూస్తున్నారు. దయతో తనకు లభ్యమైనదేమిటో విడమర్చి చెప్పండి." అన్నది.

"అయితే చెబుతాను విను" అంటూ ఆమెశిరస్సును తనవైపుకుతీసుకుని కర్ణరంధ్రంలో "ఆ అమూల్యసంపద నీవే నిర్మలా!" అన్నాడు.

ఆమె ప్రసన్నవదనంతో "పరిహాసం జేస్తున్నారా? వుండండి అమ్మతో చెబుతాను" అంటూ రివ్వున పారి పోయింది.

## 16 ప్రయివేటు పాఠశాల

రోజులు చెడువైపుకు దొర్లుట ప్రారంభించినపుడు వేగంగా లాక్కు వెళ్ళుతవి. నలువైపులా చెడులక్షణాలే కనిపిస్తుంటవి. కాలము కర్మము చెడువైపుకే దోహద మిస్తుంటవి. బద్రీనారాయణ ఇపుడు అస్వస్థతగావుంటు న్నాడు. రత్నాకరుడు పరీక్షతప్పినపుడు చీకాకుపడి, ఇక్కడి వాతావరణంలో చదువలేడని, అతనిజాతకచక్రం ఫలించా లంటే మరోచోట చదివించుట అవుసరమని మద్రాసుపం పాడు. కాని యీ సంవత్సరం కాళిదాసు, కృష్ణకుమారి యిరువురూ తప్పారు. బద్రీనారాయణ కంటున్నకలలకు యివి ఘోరఅపచారాలను ఆపాదించినవి. ఈ విఘాతంతో కలిగిన వికలంతో ఆయనఆరోగ్యం మరింత దెబ్బతిన్నది. ఈవిషాదంతో జాతకప్రభావాలమీద, మంచిచెబ్బరలమీద

పూజా పునస్కార నిష్ఠలమీద, దేవుళ్ళమీద శంకకలుగ సాగింది. తాను యెన్నోమారులు యెందరెందరికడనో త్రిప్పిన జాతకచక్రాలు, ప్రాణమొకయెత్తుగా వుంచబడినవి—నేడు నిష్ప్రయోజనకరంగా కనిపిస్తున్నవి.

రోహిణి రెండుసంవత్సరాలక్రితమే చదువుమాని వేసింది. తనక్లాసులో కొన్ని ప్రేమపూరితప్రార్థనాపత్రాలు అందుటతోను, పోస్టుద్వారాఅందిన కొన్ని ప్రేమవిన్నప ములతోను, ప్రత్యక్షంగా ఒకరిదువురు సాహసించి ద్వంద్వ భావంతోగూడిన ప్రేమసంభాషణ తెచ్చినందునా ఆమెక్రోధా వేశురాలై చదువుకే స్వస్తిచెప్పింది. ఆనాడు చదువు మానుట ఆమె అప్రయోజకత్వంగా తోచింది తండ్రికి. చదువులద్వారా ఫ్యాషన్లద్వారా పొందే, విజ్ఞానంకంటే, సశ్శీలము, సద్భావనము, సత్ప్రవర్తనలతో గృహకార్యాల లోను, సంతానపాలనలోను, సహనంలోను యోగ్యవతిగా, మానవతిగా మున్నవలందుచే స్త్రీత్వాన్నినిలుపుట, మహిళా లోకానికి గౌరవంతెచ్చుటఅని ఆమె తండ్రితో వాదించింది. కాని ఆ సమయంలో ఆవిషయాలు నచ్చలేదు. ఇపుడు చదువుచున్న కృష్ణ, కాళిదాసు, రత్నాలవలన కలుగు చీకాకుతో విసిగి రోహిణియే మంచిపనిచేసిన ట్లనిపిస్తున్న దాయనమనస్సుకు.

కాళిదాసునుకూడా మద్రాసుపంప నిశ్చయించుకున్న పుడు కృష్ణచదువువిషయం ఆయనను ఆందోళనపరచింది. "నన్ను పిలిచారా నాన్నా?" అంటూ వచ్చి ప్రశ్నించింది కృష్ణ. "నేను పిలువలేదమ్మా" అన్నాడు.

"ప్రయివేటుగా చదివి, పరీక్షకుకూర్చుంటాను నాన్నా" అన్నది. ఆయన వికటంగా చదివి తప్పినవాళ్ళు ప్రయివేటుగాచదివి ప్యాసవగలరా, అమ్మా!" అన్నాడు. "మా కాలేజీలో శివప్రసాద్ లెక్చరర్‌గారు చాలా గొప్ప వారు నాన్నా. ఆయన ఆక్సుఫర్డులో చదివినవాడు. మా ప్రిన్సిపాలుకూడా ఆయనముందు చాలడు. ఆయన చెప్పిన సబజక్టులో యెన్నడూ తప్పరుకాని, ప్రయివేటు ఆయన చెప్పరు. కాని మంగళనాథ్‌వగైరా కొంతమంది పీడించిన మీదట అందుకు వప్పుకున్నారుట. ఫీజులు వగైరాలకు వా రాశించరుట. రోజూ ఒకగంట సాయంకాలం చెబుతా నన్నారుట. ఇది గొప్ప అవకాశమని విద్యార్థులనుకుంటు న్నారు. నేనుకూడా వారిదగ్గరే చదువుకుంటాను నాన్నా" అని కృష్ణ తన వుత్సాహాన్ని అణచుకుంటూ అన్నది.

"అవును, వారినాయన్ను నేను బాగా యెరుగుదును. బాగా పొలమూపుట్రా వున్న కుటుంబము. ధర్మకార్యా లంటే ఆ కుటుంబానికి మహాయిష్టం. ఈ అబ్బాయికూడా చాలా మంచివాడనే విన్నాను. మొన్ననీమధ్య శిథిలాల యాన్ని పునర్నిర్మాణంచేశాడుట; తండ్రిపేర ధర్మశాల నిర్మించాడుట. గొప్ప వుత్సవాలుకూడా జరిపాడు. నేనా అబ్బాయిని చూడలేదుగాని, విదేశాలలో పెద్దగా చదివి వచ్చినా, అతి నమ్రతగా వుంటాడుట. పెద్దవారిని గొప్పగా గౌరవిస్తాడుట" అన్నాడు బద్రీనారాయణ.

కృష్ణకుమారి, మంగళనాథ్, ఛత్రపతి, కమలాకర్ మొదలగువిద్యార్థి బృందము కాలేజీకి స్వస్తిజెప్పి శివ

ప్రసాద్‌వద్ద వుచితవిద్యార్థులుగా చేరారు. శివప్రసాద్ ట్యూష నుతో, తాము చదివినా చదువకపోయినా పరీక్షలలో ప్యాసు కాగలమనేధైర్యంతో యెవరికివారే ట్యూషనుకు ఆదుర్దా పడుతున్నారు.

శివప్రసాద్‌హృదయం ఆదరానురాగాలతో రంజిలు తుంటుంది. పట్టుబట్టి ప్రాధేయపడినపుడు కాదని నెట్టివేయ గల స్వభావంగాదు ఆయనది. పదేపదే వారు ప్రాధేయపడి నపుడు సమ్మతించాడు గాని, యిపుడు కాలేజీపనితోను యీ ట్యూషన్లతోను తీరుబడిలేకుండా చేసుకున్నాడు.

రాత్రి యెనిమిదిగంటలసమయ మది. విద్యార్థులను బంపి స్నాన భోజనాదులు పూర్తిజేసుకుని, తనగదిలో శయ్యమీదపడుకుని కాళిదాసమహాకవి 'శకుంతలా పరిణయం' చదువుతున్నాడు శివప్రసాద్. తనపనులన్నీ ముగించుకుని ఒకచేత పాలగ్లాసు మరోచేత్తో తనపాఠ్యపుస్తకాన్ని పట్టు కుని వచ్చి "పాలుపుచ్చుకోండి బాబుగారూ" అన్నది నిర్మల. ఆయన విననట్లు చదువుకుంటూనేవున్నాడు. "బాబు గారూ" అని తిరిగి సంబోధించింది. కాని ఆయనదీక్ష చెక్కు చెదరలేదు. ఆమె నవ్వుకుంటూ తనచేతులలోని పాల గ్లాసును బల్లమీద వుంచి, ఆయన చేతిలోని పుస్తకాన్ని పట్టుకున్నది. ఆయన ఆ పుస్తకాన్ని విడచిపెట్టి నేత్రఫల కాలను వదులుగా మూశాడు. ఆమె ఆ పుస్తకాన్నికూడా తీసి బల్లమీదపెట్టి, తన వేళ్ళతో ఆయన నేత్రఫలకాలను విడదీస్తుంటే ఆయన మరీ మూయప్రయత్నిస్తున్నాడు.

"బాబుగారూ దయతో తమరు పాలుత్రాగి ఆతరువాత దాగుడుమూతలాడండి." అన్నది.

మనోవిహారంలోనుంచి బలవంతంగా ద్రోల్గించబడినవానివలె త్రుళ్లిపడి తనముఖంమీదనున్న ఆమెహస్తాలను పట్టుకుని నిట్టూర్పు విడుస్తూ "అబ్బ! మానవస్వభావం యెంత విచిత్రమైంది! ఆ దుష్యంతమహారాజుకు నగరంలో యెందరో నాగరికవనితలుండగా, తనకుతగిన రాకుమార్తెలనుపొందు అవకాశముండగా అడవిలో కనిపించిన అనాథబాలికను ప్రేమించు టెందుకు? ఆమెయెడల అంత అనురాగము ఆత్మీయత పెంచు టెందులకో?" అన్నాడు.

"అదేమిటి బాబుగారూ; యింత విజ్ఞానులు మీరలా ఆలోచిస్తున్నారు? ఆదరము, అనురాగము, ప్రేమ అంతస్తులను ఆలోచించి జనించవు. వివేకంగలహృదయాన్ని పటాటోపాలు లేని ప్రకృతిసిద్ధమైన, నిష్కల్మషము, నిస్వార్థముఅయిన అమాయకహృదయమే ఆకర్షిస్తుంది. మీరు విదేశాలలో గొప్పగా చదివివచ్చారుగదా, వారి సాహిత్యం కంటె భారతసాహిత్యమే యెక్కువ చదువుతారెందుకని?" అని ప్రశ్నించింది.

"పాశ్చాత్యసాహిత్యము చదువవలసిందేగాని, దాన్నే గొప్పగాను ఘ్యాపనుగాను తలచి వాటిలోనే ఆధిక్యతవున్నదని కొందరు తలచుతుంటారు. కాని అది గొప్ప పొరపాటు. ఇంగ్లీషుచదివిన విద్యావేత్తలు యే సంస్కృత గ్రంథాలను చదువరు. పైపెచ్చు హేళనగా భావిస్తారు కొందరు. కాని, సంస్కృతసాహిత్యం కైలాసపర్వతంవలె

మహోన్నతమైనది. పాలనుచిలికినకొద్దీ వెన్న వుత్పన్నమవునట్లు సంస్కృతసాహిత్యాన్ని చదివినకొద్దీ అర్థంచేసుకొన్నకొద్దీ విజ్ఞానంలభ్యమవుతుంటుంది. మానవవికాసాన్ని గురించి, పృథ్వీరహస్యాన్ని గురించి, విశ్వవికాసాన్ని గురించి, సకలసృష్టిరహస్యాలను సంస్కృతసాహిత్యం పరిశోధించినంత మరేసాహిత్యము పరిశోధించలేదు. శృంగారములో కూడా అందు అద్భుతమైన రచనలున్నవి. ధాన్యానికి పూకకు యెంతభేదముంటుందో, సంస్కృతసాహిత్యానికి యితరసాహిత్యానికి అంత భేదముంటుంది" అంటుండగా మధ్యలోనే నిర్మల కల్పించుకుని, "అయితే, నాకు ఆ సంస్కృతమే నేర్పక యింగ్లీషు మొదలుబెట్టారెందుకు బాబుగారూ?" అని ప్రశ్నించింది.

"అది అంత తేలికగా చదువగలిగిందిగాదు"

"పట్టుదల దీక్ష వుంటే, అసాధ్యమేదీగాదు" అంటూ పాలగ్లాసును చేతబట్టి, రెండవచేత్తో ఆయనశిరస్సునుబట్టి లేవనెత్తప్రయత్నిస్తూ "ముందు యీ పాలు తీసుకోండి, ఆరిపోతున్నవి" అన్నది. పాలారగించి, "నీకు పాఠం చెప్పాలి గదూ? పుస్తక మేదీ?" అన్నాడు. టీపాయిమీదున్న పుస్తకాన్ని తీసియిస్తూ, "ఇంతకుముందువరకు వారందరికి ట్యూషను చెబితిరి, అలసిపోయారేమో; పోనీ యీపూటకు వద్దులెండి; రేపువుదయం చెబుదురుగాని" అని సంకోచిస్తూ అన్నది.

ఆయన చిన్నగా నవ్వుతూ, "చదువుకు యెగనాం పెట్టేపద్ధతులు నేర్చుకున్నావన్నమాట! నా శ్రమమీద నీ

కంత శ్రద్ధవుంటే, వారితోపాటే కూర్చుని ఆ సమయంలోనే చదువుకోగూడదా చెప్పు? ఈ ఒక్క విషయంలోనే నా మాటను నిరాకరిస్తున్నావు" అన్నాడు.

గాబరా చెందినదానివలె "లేదు బాబుగారు; అలా అనకండి. మీమాటను నేను యెన్నడూ వుల్లంఘించను కాని, ఆ మొగపిల్లలతో కూర్చోనటానికి నాకు మనస్కరించుటలేదు బాబుగారూ. వారియెదుటకు పోవుటకే నాకు ధైర్యంలేదు; అక్కడ చదువుట నావల్లగాదు" అన్నది. ఆయన తనచేతిలోని ఖాళీగ్లాసును టీపాయిమీదపెట్టి, పుస్తకాన్ని ఒకచేతపట్టి ద్వితీయహస్తంతో నిర్మలచేయిపట్టి లాగి తనశయ్యమీద కూర్చుండబెట్టి "కృష్ణకుమారిని చూడు, యెంత సోషల్‌గా మెలగుతుందో? ఆమెమనస్సులో స్త్రీపురుషభేదం వున్నట్లే తోచదు. అలా మెలగినపుడే సభ్యసంస్కారాల ఆధిక్యత అనుభవమవుతుంది." అన్నాడు.

"బాబుగారు, మీనోటితో అలాంటిమాట అనకండి. మగవారందరితోను కలిసిమెలిసి తిరుగుతూ పరిహాసాలాడుతూ మెలగుట సభ్యత సంస్కారమూ అవుతుందా! అది సభ్యత సంస్కారమూ యెన్నటికీ కాజాలదు. పురుషులనుచూసినపుడు పరదాలలోదాగుట తలుపులచాటుకు పరుగులిడుట అసభ్యంగావచ్చుకాని, వారితో కలిసిమెలిసి తిరుగుట, అన్యోన్యతనుపెంచుట, కలిసిచదువుట స్త్రీ విషయంలో క్షేమంగాదనిపిస్తున్నది" అన్నది.

"ఏవిషయంలోను భయంలేని నీకు యీ చిన్నికార్యరంగంలో భయమెందుకు?" అన్నాడు. "అపరాధిగాను,

అభాగినిగాను. అందరిసమక్షంలోను ప్రదర్శితమవుతూ కూడా, స్త్రీత్వాన్ని నిలుపుకోవచ్చు, నీతిని శీలాన్ని కాపాడుకోవచ్చు కాని, గౌరవప్రపత్తులతో ఆదరాభిమానాలతో, ఒక స్త్రీ పురుషులతో మెలగుట నీతికి శీలానికి క్షేమంగాదని నా అంతరాత్మ ప్రబోధిస్తున్నది బాబుగారూ" అన్నది. కొంచెము క్రోధాన్ని ప్రకటిస్తూ, "అది నీలోని వెర్రిభ్రమ మాత్రమే" అన్నాడు.

ఆమె చిన్నబుచ్చుకున్న ముఖంతో వెలవెలబోతూ "బాబుగారూ, మీ మనస్సుకు కష్టంకలిగించానులాగుంది: నన్ను క్షమించండి. ఇక మీరు చెప్పినట్లే చేస్తాను. మీ ప్రసన్నంకొరకు నేను అగ్నిగుండంలోదూకి ఆత్మాహుతియైనా సంతోషంగా చేయగలను" అంటూ ఆయన చేతిని తీసుకుని అంగుళీయములను విరుస్తున్నది. ఆ చేతివ్రేళ్ళను పూర్తిచేసి రెండోచేతిని తీసుకున్నది. ఆయనచేతిమణికట్టు మీద బాష్పకణాలు ఒక్కటొక్కటిగా పడుతున్నవి.

శివప్రసాద్ విచలితుడై "కన్నీరుకారుస్తున్నావెందుకు నిర్మలా?" అంటూ, తనరెండోహస్తంతో తుడిచి, ఆమె శిరస్సును తనవైపుకు లాక్కున్నాడు. వాలిపోయిన ఆమె శిరస్సు ఆయనతొడలను ఆసనంచేసుకున్నది. కురులను నిమురుతూ ఆమెముఖమండలాన్ని పైకిత్రిప్పి లలాటం మీదున్న కేశములను పైకినెట్టుతూ, కనులార్పకుండా చూస్తూ, రెండుహస్తాలతోను రెండు చెక్కిళ్ళనుపట్టి, మృదువుగా నత్తుతూ, దంతాలను బిగబడుతూ "కన్నీరెందుకు కార్చావు చెప్పు?" అన్నాడు.

ఆమె కనుకొలకులనుంచి తిరిగి అశ్రుస్రవంతి వలు కుతూ ఆయనహస్తాలలోకే వస్తున్నది. ఆయన మరింత అధీరతతో బరువుకంఠంతో "ఇదేమిటి నిర్మలా?" అంటూ ఆమె శిరస్సును పైకియెత్తిపట్టి లలాటంమీద ముద్దిడి, అశ్రుముద్రితముఖాన్ని తనహృదయానికి అదిమివుంచాడు. బోర్లా పడిన ఆమెను త్రిప్పినపుడు తొలగిపోయిన ఆమెపైట పక్కమీద పడిపోయింది. జాకెట్టుగుండీలు ఊడిపోయినవి గాబోలు, అనాలోచితంగా ఆయనదృష్టి అటువెళ్ళి కట్టుబడి పోయింది. దృష్టి తనఅధీనంతప్పిపోయింది. స్విచ్‌నొక్కిన పుడు కరెంటు భవనంలోని అన్నివైపులతీగలలోను పరువులెత్తినట్లు ఆయనశరీరంలోని నరములన్నిటియందు రక్తము తానవించి మేళవంచేస్తున్నది. తనముఖం అటువెళ్ళి ఒక్క పెట్టున మీదపడి, యేదో రాజీచేసుకోవాలని వురకలు వేయ జూస్తున్నది. ఏ కవివర్ణనలో లేని మెరుపులు తళుకులు చిందిస్తూ, నృత్యంసలుపుతూ హృదయతంత్రులమీద మీటి మతిబోవునట్లుచేస్తూ మత్తులోముంచెత్తిస్తూ హృదయాన్ని నలిపివేస్తూ సృష్టిలోని సర్వశృంగారసంపద సమ్మేళనమైనట్లున్నది. క్షుద్బాధతో ప్రాణంపోనున్న శునకమహారాజుకు నిర్జనగృహంలో పొయ్యిమీదనున్న పాయసం కనిపించి, మహదానందంపొంది, యెంతప్రయత్నించినా యెంత వేచి చూసినా, ఆ క్రిందనున్న మంటగాని పాయసంలోని వేడి గాని చల్లారుడుపాయం గానవపుడు, పోనున్నప్రాణాన్ని నిలుపజాలక, యెదుటనున్న పాయసాన్ని ఆరగింపజాలక

నిరాశ్రయస్థితిలో నిట్టూర్చి కన్నీరుకార్చినట్లు శివప్రసాద్ కనుకొలకులనుంచి అశ్రుబిందువులు చెదురుగా నిర్మలఫాల భాగంమీద పడినవి.

"ఏమిటి బాబుగారు?" అంటూ విడిపించుకో ప్రయత్నిస్తున్నది. కాని ఆయన మతిపోయినవానివలె మాట లేకయే, ఆమెను తనమీదికి మరింత లాక్కో ప్రయత్నిస్తు న్నాడు. ఆమె నిశ్చేష్టురాలై నిర్జీవినలె పెనగులాట మాని వూరుకున్నది. ఇపుడాయన మోచేతుల కేదో వెచ్చగా తగులుతున్నది. కాని ఆయన హృదయంలోనిదడ ఆమెకు సుస్పష్టంగా వినిపిస్తున్నది. ఆయన గొంతులో తరళం శుష్కించిపోతున్నది. నాసిక బుసలుగొడుతున్నది. ఆమె పాదం తగిలి గాబోలు, టీపాయిమీదిగ్లాసు దొర్లి క్రిందపడి ఘల్లుమన్నది. ఝల్లుమన్న గుండెలతో ఆమెనువిడచి శివ ప్రసాద్ ఖంగారుచెందుతూ ఏదో గొప్ప అపరాధంచేసిన వానివలె సిగ్గిలుతున్నాడు.

ఆమె చీరెసర్దుకుంటూ, జాకెట్టుబటనులుపెట్టుకుంటూ తన పొరపాటుకు విచారపోతూ "బాబుగారూ, మీరుకూడా అత్యాచారంచేయుట నేర్చుకుంటున్నారా?" అన్నది.

తిరిగి "మాటాడరెందుకు? మౌనంగా అతినమ్రతగా వుండేవాళ్ళే దురాలోచన లెక్కువగాచేస్తుంటారు. మీరు అలాంటివారు కాదులెండి!" అంటూ నవ్వింది. అప్పటికి తగినధైర్యం కలిగింది. వెంటనే "నామీద నీకు విశ్వాస మేనా నిర్మలా?" అన్నాడు. చిన్న నవ్వురేఖనుప్రదర్శిస్తూ

"చెరువు కట్టలను శంకిస్తుందా చెప్పండి! బాడీవేసుకోక పోవటంకూడా తప్పని నేడు తెలిసివచ్చింది" అన్నది.

"నా భయంతోనే వేయదలచావా? యిన్నిరోజుల నుంచి యెందుకు వేయుటలేదు?" అన్నాడు.

"స్త్రీ స్త్రీవలెనే వుండాలిగాని, బిగించి మరో రూపంగా సమతలంచేయజూచుట, వికృతంచేయుట వివేకం కాదనుకున్నాను. కాని, వికృతమైనాసరే,రక్షణ అవుసరమని నేడు అనుభవమయింది" అన్నది.

పశ్చాత్తాపపడుతున్నహృదయంతో దీనవదనంతో లాలింపుమాటలతో "ఈ ఒక్కమాటుకు క్షమించు నిర్మలా. నేను దురాలోచనతో యేమీ చేయలేదు. యిక యెన్నడూ చేయను." అన్నాడు.

"చెడును యెపుడూ సద్భావనంతో చేయరు బాబుగారూ!" అన్నది. ఆయన మరీ అధీరతతో "ఈ ఒక్కమాటుకు క్షమించు." అన్నాడు. ఆమె తన వ్రేళ్ళతో ఆయనగడ్డాన్ని పుణకుతూ నవ్వును ప్రదర్శిస్తూ "క్షమించే హక్కు గురువుగారికుంటుందిగాని, శిష్యురాలికుండదు. ముందు పాఠం చెప్పండి," అంటూ ఆమె దిగి ప్రక్క కుర్చీలో కూర్చొని, ఆయనచేతికి పుస్తకమిచ్చింది.

రెండుమాసాలు గడిచినవి. ఇపుడు నిర్మల తెలుగు పుస్తకాలుబాగాచదువగల్గుతున్నది. నాలుగోఫారం ఇంగ్లీషు పుస్తకంకూడా చదువుచున్నది. కృష్ణకుమారితో కూరిమి గాఢమైంది. ఇపుడు తనపాఠాలను యెక్కువగా కృష్ణవద్దనే నేర్చుకుంటున్నది. అందరితోను కలిసిమెలిసికూర్చుని చదువు

కొనుటలోను, అందరిసంభాషణలలోను పాల్గొనుటలోను అలవాటయిపోయింది. శివప్రసాద్‌వచ్చు వేళ 5 గంటలయినా విద్యార్థులు 3 గంటలకే హాజరవుట, వారు వచ్చినదేతడవుగా నిర్మలకూడా వారిలోనే చేరి, చదువుకొనుట, వివిధ విషయాలమీద వాదవివాదాలుచేసుకొనుట వారి నిత్య కార్యక్రమాలయినవి. నిర్మలను బలవంతంమీద తనఇంటికి తీసుకెళ్ళి గొప్పగా సత్కరించింది కృష్ణ. నిర్మలఅందానికి అణకువకు అదృష్టానికి కృష్ణయింటిలోనివారంతా ముగ్ధులై యెంతగానో పొగడి విశేష ఆదరంచూపారు. నిర్మలకీ సంఘటనతో ఆత్మాభిమానం పెల్లుబికింది.

నిర్మల కిపుడు వంటశాలలో మనస్సు నిలచుటలేదు. వంటపని విధికృత శిక్షగా తోస్తున్నది. కృష్ణ యిచ్చిన కథల పుస్తకాలమీద, పాఠ్యపుస్తకాలమీద సంభాషణలమీద మనస్సు పరువులెడుతున్నది.

భోంచేస్తున్న భవానీ ఒక్కటొక్కటిగా కూరలు ప్రక్కకుతోస్తూ, చిన్న నవ్వురేఖను ప్రదర్శిస్తూ "నిర్మలా, చదువులో చురుకుదనం పెరుగుతున్నకొద్దీ ఇతరవిషయాలలో మతిపోతున్నదనుకొంటాను. ఇదేమిటమ్మా! ఈ బంగాళాదుంప వేపుడులో ఉప్పెక్కువవేశావు, పులుసు కూరలో పుట్టెడుకారం పోశావు. చట్నీలో పులుపు తరుగు చేశావు, చారులో ఉప్పులేదు. శివానికీ కూరలతో ఎలా పెట్టావమ్మా?" అని ప్రశ్నించింది.

చిన్నబుచ్చుకున్నవదనంతో సిగ్గుదొంతరులసందుగా నాలుకకొరుక్కుంటూ, చివ్వున దగ్గరకుబోయి, భవానీ

పాదాలంటి కంపిస్తున్నకంఠంతో "ఈ ఒక్కరోజుకు క్షమిం చమ్మా, చదువుధ్యాసలో మతిలేకుండా చేశాను. ఈ పాడు చదువుకు యిక నేను పోనే పోను. మీకు ఆవకాయంటే యిష్టంగా, పోనీ యీపూటకు దాంతో తిను అమ్మా. మీరు భోంచేయకుండా లేస్తే, నన్నుచంపినట్లు" అన్నది. వంగి తనపాదాలంటుతున్ననిర్మలచెక్కిలిమీద తనవ్రేళ్లతో చిన్నగా మోది, "చదువుమానుకోవటమెందుకే వెర్రిదానా? బాగా చదువుకో; ఒకవేళ వంటపని నీ ఒక్కదానివలన తెమలకపోతే నేనుకూడా చూస్తాను. లేకపోతే నారాయణ దాసును (గుడిపూజారి) చేయమను. అన్నీ నీవేచేయాలంటే సాధ్యమా వెర్రిదానా? ఒక్కమాటమాత్రం చెబుతున్నాను. నీవు ఇంగ్లీషుచదువుట అనవసరం అమ్మాయ్. తెలుగు భారత భాగవతాలు చదువగలిగినంత నేర్చుకో. అంతేగాని, ఇంగ్లీషు మనకెందుకు చెప్పు?" అన్నది.

నాకూ యింగ్లీషుచదువుట అంత యిష్టంలేదు. సంస్కృతం చదువుతాను, బాబుగారితో చెప్పు అమ్మా" అన్నది నిర్మల.

"సంస్కృతం కఠినభాష నిర్మలా! మా అన్నయ్య సంస్కృతపండితుడు. తండ్రివద్ద చదివిన సంస్కృతజ్ఞానం తోనే శివం యేగ్రంథమైనా చదివి చెప్పగలడు. స్త్రీలకు అంత శ్రమకూడా అనవసరమమ్మా. మాతృభాషలో కావలసి నంత జ్ఞానముంటే చాలు. అనవసరమైనవన్నీ తెలుగులోకిఅనువ దింపబడివున్నవి. స్త్రీలు భారత, భాగవతాలు, రామా

యణము పూర్ణంగా అర్థంచేసుకోగలిగినంత చదువుకుంటే యింకేం కావాలి చెప్పు? అన్నది భవాని.

"అయితే, నాకు యింగ్లీషు వద్దని బాబుగారితో చెప్పు అమ్మా," అన్నది. "ఆవిషయం వాడితో నేను చెప్పటెందుకు? నీవే చెప్పరాదా" "వారియెదుట వారి కయిష్టమైనవిషయం చెప్పటకు నాకు భయంగావుంటుంది." అంటూ భవాని చేయికడుక్కో బోతుండగా, అడ్డువెళ్ళి "అదేమిటి, మీరు సగంలోనే లేచిపోతున్నారు." అన్నది. భవానీ నవ్వుకుంటూ "వట్టి పిచ్చిదానివి. యెంత తినమంటావు?" అంటూ వెళ్లింది.

# 17 తిరుగుబాటు - నాటిక

నేటికి శివప్రసాద్ మాట నెరవేరింది. వంటబ్రాహ్మణి యేర్పాటుజరిగింది. ఇపుడు భవానీకి పూజాగది ప్రధాన స్థానమైంది. నిర్మలచేతిలో యెకునకుండా పుస్తకాలుంటున్నవి. ఆమె యిపుడు వంటశాలలో దర్శకత్వముమాత్రమే చేయ గలుగుచున్నది. చదువుమీద దీక్ష పెరిగినకొద్దీ పరభ్యాస కూడా అధిగమిస్తున్నది. ఆధిక్యతలు మన్ననలు మనుకా రాలు యిపు డాకర్షిస్తున్నవి. కృష్ణకుమారియింటికి రోజు కోనారయినా పోతున్నది. పోనిరోజు యేదోకొంత కనిపిస్తుం టుంది. మంగళనాథ్‌తోను కమలాకర్‌తోనుకూడా సన్ని హితపరిచయ మేర్పడింది. వారు ట్యూషనుపొందేది గంట యినా, పదిగంటలపగటిసమయ మిక్కడే గడిచిపోతున్నది.

మంగళనాథ్ రంగస్థలనాటిక ఒకటి తయారుచేశాడు. అందు మూడొంతులభావనకూర్పు నిర్మలద్వారా పొందినదే.

ఆ నాటికపేరు 'తిరుగుబాటు'. అందు స్త్రీపాత్రలు లేవు. శివప్రసాద్ ఇంటిపెరడు నాటకశాలగా రూపొందింది. పోర్షన్స్ చదువుట, అప్పగించుట, రిహార్సల్సు వేయుట మొదలగు కార్యక్రమాలన్నీ అక్కడే జరిగిపోతున్నవి. ప్రయివేటు విద్యార్థులసంఖ్య యిపుడు పెరిగింది. కాని వారిలో పరీక్షా పాఠాలకుబదులు డ్రామాపాఠాలందు మోజు పెరిగింది. అందరిచేతులలోను వ్రాసుకున్న తమతమ డ్రామాపోర్షన్స్ వుంటున్నవి. ఈ డ్రామాట్రూపువారికి పర్మినెంటు ప్రేక్షకులు కృష్ణ, నిర్మలలు. వారి ప్రతిరిహార్సలును గమనించి, యెవరిపోర్షన్ యెక్కడ బాగా నటించినదీ, యెక్కడ అతకనిదీ మొదలగు, ఆ యిరువురుప్రేక్షకుల నుంచి వచ్చు సమీక్ష వారికి నిఘంటువులాంటిదైనది. అందు నిర్మల మరింత ప్రాముఖ్యంపొంది, వుత్సాహితురాలవుతున్నది. ఆ నాటిక ఇతివృత్తం రాజకీయపార్టీలపోరాటం. అందు ఒక రాజకీయనాయకుడు పరిపాలనాప్రధాని, పార్టీ అధ్యక్షుడు, సర్వకమిటీలకు చైర్మన్. అతనిసోదరుడు ఆ తరువాతి కీలకస్థానాల్లో వుంటాడు. సోదరి ఆనందాన్ని ఆధిక్యతను సర్వసౌఖ్యాలను పొందు విదేశప్రతినిధి. తనయుడు ప్రతిపక్షంలో నాయకుడు. తండ్రిసంప్రతింపులతో మెలగుట; బావగారు రాజముద్రికాగారవాన్ని పొంది అగ్రస్థానాన్నలంకరించివుంటాడు. ముఖ్యఅనుయాయులు శాఖాధిపతులుగా, అదనంగావున్నవాటికి రాబోవువాటికి వారసులుగా వుం

టారు. వారిని సమర్థించు రక్షులకు మహారక్షులకు ప్రజలకు చేతులలో జండాలు; ప్రదర్శనలలిచ్చుటకు రోడ్లు; నోటినిండా జేజేలుకొట్టుటకు పై వారిపేరులు, వారిచ్చిన శృంగారశబ్దాలతోగూడిన నినాదాలు వుంటవి. వెనుకటిరోజుల్లో మహారాజులు తమకుశక్తివున్నంతవరకే పరిపాలన నిర్వహించి, అనంతరం వారసులకప్పగించి ప్రక్కనుండి పరిశీలిస్తుండేవారు. నేడు యెన్నికలద్వారా గద్దెలనెక్కిన పరిపాలకులు తమశక్తిఫుడిగినా మతిభ్రమించినా కొనవూపిరివున్నంతవరకు ఆగద్దెలనువిడువకుండా గద్దెమీదనే ప్రాణంపోవాలి; దేశము ప్రజలు యేమయినా, యేదుర్దశకుగురియయినా తన పరిపాలనాకాల కొలమానవిశేషం చరిత్రలోవుండాలి అనేదే యేకైక ఆశయంగానుండుట; ఎంతకాలం పై వారిని మోసినా, వారిద్వారా దేశానికి వాటిల్లుతున్న శాశ్వతనష్టాలను కప్పిపుచ్చినా, వారి నామ నినాదాలతోనే తమ నోరుచించుకున్నా, వారి బొమ్మలనెన్నిటిని రోడ్ల మధ్య ప్రతిష్టింపజేసినా ప్రజలను నోరుమూయించి తనవెంటపెట్టుకున్నా, యెంత దీక్షతో కోపికతో నిలిచినా నిష్ప్రయోజనమై తానలావున్నంతవరకు పదవులలోవున్నవారు దిగేదిలేదు, యేఒక్క గద్దె ఖాళీఅయ్యేదీలేదు; తాను పొందేదీలేదు; వారక్కడ స్థిరమైనపుడు నేనిక్కడ వారిని మోయను స్థిరపడుట ఆత్మక్షోభ, దేశద్రోహమూ దప్ప మరేమీగాదు. వారికంటే నా పరిపాలనలో నినాదాల రూపంలోగాకుండా నా స్తవికఉజ్వలత్వం తప్పక పొందుతుంది; మరొకరు అంతకంటె మహోన్నతరూపాన్ని సృష్టించ

వచ్చుననే విప్లవాత్మకవ్యూహాలతో మొదటియత్నంగా అధికారనాయకులకు విన్నవిస్తారు. వారు పరిహాసరూపంలో నవ్వి, వీపులమీదచేయివేసి నిమిరి "మీరు చెప్పినపనులు యేవి చేయలేదో చెప్పు? మీమాట విననివారు పంచాయతీలో యెన్నికయినా రద్దుచేశాము. దావాలలో మీపక్షం చేయమని సివిల్ అధికారులకుకూడా చెప్పాము. పర్మిట్లు లైసెన్సులు మీరు యెవరికియివ్వమంటే వారికే యిస్తున్నాము. మీమాటవిననివారు బలవంతులైనా వారిని యెన్నికలలో రాకుండా మీకు అండగా నిలుస్తున్నాము. మీరు కోరినట్లు వార్డులు మార్పుచేస్తున్నాము. మీరు కావాలన్న సొసైటీలనే అనుమతిస్తున్నాము, రోడ్లను వేయిస్తున్నాము, వంతెనలను నిర్మిస్తున్నాము, మీరువద్దన్నవి యెంత విలువైనవయినా అవుసరమైనవయినా చీఫ్ యింజనీర్లనోళ్ళుకూడా నొక్కుతున్నాము; మేము చేసినా మీరుచేసినా మనపార్టీ మనఆశయం లక్ష్యం ఒక్కటైనప్పుడు మనఆత్మలుకూడా అనంతమైన ఒకేఆత్మగదా! మీలో సహనమూ ఓర్పూ ఉండాలి. మేము దిగితే మనపార్టీయే పడిపోవచ్చు" అని అధికారనాయకులంటారు.

"ఇది పాతపాఠమే. ఇలాంటిమాటలు వినివిని విసిగిపోయాము. ఈమాటలతోనే మిమ్ము మోసిమోసి మా భుజస్కంధాలు కదుములుగట్టి, మేము వెర్రివాళ్ళమని రుజువు చేసుకున్నాం. మీరు యేవిచేసి మమ్ము సంతృప్తిపరచదలచారో, వాటిని, యింకా విశేషమయినవి చేసి మిమ్ము ఆశ్చర్యాన్వితులనుచేస్తాము. కనుక మీరున్నస్థానాలను విడచి,

కొంతస్వవధిని మాకూ యిచ్చి, మా స్థానాలను మీ రాక్ర మించండి. మీరు శాశ్వతంగా అధికారంచలాయించుటకే జన్మించలేదు. సామ్రాజ్యాల నేలా నేలకూల్చామో, రాజుల నెలా దించామో, గర్వంతో మీదే హక్కు అనే ఆధిక్య తతో యెన్నికలనేముసుగుతో శాశ్వతంగా అధికారంలో వుండాలనుకునే మిమ్మకూడా కూలద్రోయుట మా కర్త వ్యంగా మేము నిర్ణయించుకున్నాము" అని అధికారంలేని నాయకులంటారు.

"మీ వీరోచితమైనచరిత్రను మీరు మర్చిపోతు న్నారు. మీ త్యాగము, సహనము అనంతమైనవి. ఈ పరి పాలనంతా మీ ఆశీర్వాదబలంతోనే జరుగుచున్నది. మీరే పార్టీ, పార్టీయే మీరు. అసలు పరిపాలకులు మీరు. మీ చెప్పుచేతలలో మీ కనుసన్నలలో అధికారాన్ని చలా యిస్తున్న సేవకులము మేము. మీ సేవ మా కర్తవ్యము. మా సేవనుగుర్తించి మా బాధలను గమనించి మా వెంట వుంటే, యింకా యేమయినా చేయగలము. మేము మా భార్యలతోను, పిల్లలతోను యిష్టాగోష్టిసలుపు అవకాశం కూడా లేకుండా కఠినశిక్షితులవలె నిద్రాహారాలుమాని, మీ సేవజేస్తున్న మా బాధలు గ్రహించండి. ఈ అధికారము నిప్పులకుంపటిలాంటిది. దీనిలో సుఖమేమీలేదు. మీరు హాయిగా నిర్విచారంగా బాధ్యతారహితంగా వుంటూ, మమ్ము పడకుండా చూస్తూ మాచేత సేవచేయించుకోండి; కాదంటారా, ప్రజలనుంచి ప్రభుత్వానికి సలహాకమిటీలను

వేస్తాము. మీ అందరూ వుండగలిగినన్ని కమిటీలు వేసి మిమ్ము వాటిలో సభ్యులను చేస్తాము" అని అధికారపాలకులంటారు.

"ఆ చచ్చుసలహాకమిటీలు మా కక్కరలేదు. వాటిలోనూ మీరుండి మా నోళ్ళు మూస్తారు. పార్టీ పేరుతో పక్షం పేరుతో మేమింకా మోసపోదలచలేదు. ఆ పదవులలో వున్న కష్టాలను బాధలను గుర్తించే, మీకు విశ్రాంతియివ్వ దలచాము. ఆ నిప్పులకుంపటిని మేమే స్వయంగా మోయ దలచాము. మామీద మీకు మోయలేమనే భయముంటే, నున్ను అక్కడ కూర్చుండబెట్టి మీరు మీ కుటుంబాలతో హాయిగా వుంటూ మాకు సలహాలనిస్తుండండి" అని అధికారంలేని నాయకులంటారు.

"కేవలం పట్టుదలతో పంతం వేసినందువలన ప్రయోజనం లేదు. మేము గద్దెదిగి మిమ్మెక్కిస్తే, మనము, మనపార్టీ మరునెలలోనే తలక్రిందులై, ప్రతిపక్షంవారిచేతికి పోతుంది. బాగా గమనించి ముందుకురండి" అని చిరుక్రోధాన్ని ప్రకటిస్తుంది అధికారనాయకమండలి.

"అందుకూ మేము సంసిద్ధులమే. మేము నిర్వహించలేనపుడు మీరు శాశ్వతంగా నిర్వహిస్తుంటే, సహించుట కూడా అవివేకమే. మీరూ మేమూ గాక, మూడోవారు (ప్రతిపక్షులు) వస్తే వారు యింకా బాగా వ్యవహరించి, దేశాన్ని సొష్టవంచేయగలరేమో. వారూ మీలాంటి మాలాంటి అర్హులేగదా, యోగ్యులేగదా! వారిని ఘృణీకరిస్తూ మిమ్ము పూజించుట మా వెర్రితనము, అమాయకత్వము అని నేడు స్పష్టంగా తెలుసుకొన్నాము. ఇక

మీరు మీ బంధువులు అధికారగద్దెలమీద వుండడానికి వీల్లేదు" అని అధికారహీనులయిన నాయకవర్గం అంటుంది.

ఆఖరుకు రాజీకుదురుతుంది. తత్ఫలితంగా యెన్నికల ద్వారా లభ్యమయ్యేపదవిని 5సంవత్సరాలకు మించి వరుసగా పొందరాదు, ఒకరు యెంతటిఘనులయినా ఒక్కపదవికి లేక హోదాకుమించి పొందరాదు. ఒకమంత్రి ఒక్కశాఖనే నిర్వహించాలిగాని, అన్నిటిని గుత్తచేసుకోరాదు! వుండే అయిదుసంవత్సరాలలోను మంత్రులయినవారు అనవసర ఆర్భాటటూరులుచేయరాదు, మొదలగువిషయాలతో రాజీ కుదురుతుంది.

# 18 మధురఘడియలు

అది దీపాళిపండుగరోజు. అపరాహ్నసమయం రెండు గంటలవుతుంది. 11 గంటలకు పవళించిన శివప్రసాద్‌కు అప్పుడప్పుడు మ్రోగుతున్న మందుగుండుసామానుధ్వనులు కలవరాన్ని కలిగిస్తున్నవి. అయినా, తనను నిద్రలేపి పరామర్శింపవలసినవ్యక్తి రాలేదుగనుక, కనులు తెరవకయే అటూయిటూదొర్లుతూ నిద్రలోనే నిరీక్షిస్తున్నాడు. ఎంతప్రయత్నించినా తిరిగి నిద్రవచ్చేసూచనలు కనిపించక, యెవరిమీదనో మనస్సులో పెద్దగా విసుగటచెందుతున్నాడు. దుప్పటిని పూర్తిగా ముసుగుపెట్టి, ప్రార్థించి పదిమారులు క్షమాపణ చెప్పుకుంటేగాని లేవగూడదని నిర్ణయించుకుని ఊహాలోకంలో విహరిస్తున్నాడు.

తెల్లవారకముందే తనను నిద్రలేపింది. టూత్ పేస్టు, బ్రష్ చేతిలోపెట్టి స్నానాలగదిలోకినెట్టి వెళ్ళింది. అక్కడ అంతకుముందే వేడినీరు, టవలు సిద్ధంగావున్నవి. తిరిగి తన గదిలోకి వచ్చినదేతడవుధు పసివానినిలాక్కెళ్ళినట్లు బుజ్జగిస్తూ స్నానాలగదిలోకి తీసుకెళ్ళింది. "మొహంకడుక్కున్నాను నిర్మలా," అని తను యెంతచెబుతున్నా, నవ్వునుప్రదర్శిస్తూ మారుమాటలేకుండా తనను లోపలవుంచి తలుపులు బిగించి వేసినపుడు తను ఆశ్చర్యపోయి అటూయిటూ చూశాడు. గంగాళంలోని నీటినుంచి ఆవిరివస్తున్నది. నూనెగిన్నె శీకాయపొడి వగైరాలు కనిపించినవి. "పీటమీద కూర్చోండి" అన్నపుడు విస్మితుడై "గంగులు యేడీ!" అన్నాడు. ఆమె అమృతమొలికించు చిరునగవును ప్రదర్శిస్తూ "అనవసరప్రశ్నలు ఎందుకు? మీరు కూర్చోండి." అని గదిమినపుడు తనశరీరం పొంగినట్లయి, అర్ధంగానిఆనందంలో వూగి, మారాముచేస్తే యెలావుంటుందోఅని వువ్విళ్లూరుతూ నిలిచివున్నాడు. "నాకు మీ ఒక్కపనే కాదు, చాలాపను లున్నవి. కూర్చోండి మహాశయా," అంటూ తనహస్తాన్ని బట్టి లాగి కూర్చుండబెట్టి ఆమె తనచేత్తోనే తనపట్టునువ్రాడ బొరికి నంకిన వేసి, తనశిరస్సు వంచి కర్ణరంధ్రాలలో నూనె వేసి, వేళ్ళతో అటూయిటూ పొడిచి లాగి కుదిపి, ఆతరు వాత మాడుపై చారెడునూనెపెట్టి, ఆమె స్వహస్తాలతో తలంటింది. శిరస్సు తుడిచి, "యిక స్నానంచేయండి" అంటూ తలుపుతీసుకుని వెళ్ళిపోయింది.

తను గదికిచేరుటకుముందే ఆమె టిఫిను, పాలగ్లా

సుతో హాజరయివుంది. ఆమెనుచూస్తున్నపుడు తను యేపనిచేయుటకు మనస్సువుండదు. ఆమెను చూచుటకు ఆమెనుగురించి వూహించుటలోనే మనస్సు పరువులెత్తుతుంటుంది. ఆమెయెదుట తనసోమరితనం నగ్నంగా ప్రదర్శితమవుతుంటుంది. తను ధోవతి లుంగీగాచుట్టి యీజీఛైర్లో వాలిపోయాడు. "అబ్బ! మీరు మరీ పసివారైపోతున్నారు. తలదువ్వుకోని పట్టువేసుకోండి. టిఫినుతీసుకోందురుగాని" అంటూ ఆమెయే దువ్వెనతెచ్చి దువ్వి, పట్టుతెచ్చి ఆయన శిరస్సుకు తగిలించింది. తననుగాదన్నట్లు అలానే వూరుకున్నాడు. ఆమె తనశిరస్సుమీద చేయివేసి వూపుతూ నవ్వుకుంటూ పసివానికివలె చేతులుకూడా తొడిగి బటనులు పెట్టి టీపాయి ముందుకునెట్టి దానిమీద గారెలప్లేటు, బాసిందీప్లేటూ వుంచింది.

ఆయన ఆ ప్లేటుకేసి ఓమారు చూసి తిరిగి ఆమెనే స్నిగ్ధదృష్టితో పరికిస్తున్నాడు. వీపువైపుకు జారవిడచిన ఆమె శిరోజాలతడి యింకా ఆరలేదు. నొసటితిలకంలోని తళుకులు కాంతిపుంజాన్ని వెదజల్లుతున్నవి. లలాటంమధ్యస్థాన్ని కొలుస్తున్నట్లు ఆ తిలకాన్ని బాగా పరికించినపుడు తృతీయ నేత్రమువలె ద్యోతకమవుచున్నది. శిశిరఋతువులో మంచు బిందువులతో శోభించు కమలమువలె ఆమెముఖమండలము ప్రఫుల్లితమై మధుభరితంగా ప్రకాశిస్తున్నది. ఆమెధరించిన ఆ స్నిగ్ధ శ్వేతవస్త్రాలు మరింత అద్భుతంగా శోభిస్తున్నవి. ప్రభాతప్రకాశమానమైన బాలభానునివలె ఆమె ఆ శ్వేత వస్త్రాలమధ్య అరుణవర్ణంలో అద్వితీయంగా శోభిస్తున్నది.

పూర్ణ వికసిత గులాబి రేకులవలె వక్రంగా వంగిన ఆమె అధ రాలు కెంపువర్ణంలో ప్రతిబింబిస్తున్నవి.

అనురాగంతో "అలా చూస్తారేమిటి? వాటిని భుజిం చండి, పాలు చల్లారిపోతవి." అన్నది.

వాత్సల్యోద్వేలమైన ముఖంతో ఆమెను మరింత స్నిగ్ధదృక్కులతో చూస్తున్నాడు. ఆమెతనకోమలహస్తంతో ఒక్కగారెను తుంచి, ఆయననోటి కందించింది. పసివానివలె ఆమెనేత్రద్వయంవంక దీనదృక్కులతో చూస్తూ తింటు న్నాడు. లేతదవ్వలాంటి తమలపాకువలె ఆమెఅరచేయి అతి నాజూకుగా మృదువుగా కనిపించింది. అప్రత్యాశితంగా ఆమె అంగుళీయములను కొరికాడు. ఆమె వుబికి చిందులాడు తున్న మందహాసంతో "అబ్బా!" అన్నది.

సానుభూతితో విప్ఫారితమై ఆమెచేతిని తనచేతిలోకి తీసుకుని నిమురుతూ, "పొరపాటుజరిగింది, క్షమించు నిర్మలా" అన్నాడు. "జరుగుతున్నదంతా పొరపాటేనని తెలుసు కోండి" అని పాలగ్లాసుపట్టి వేడిని పరీక్షిస్తున్నది. అగా ధంలో దొర్లినవానివలె వెలవెలబోతూ దీనంగా ఆమెవంక చూశాడు. "చిన్నబుచ్చుకుంటారెందుకు? మీది గుహస్థా నంగనుక, అలాంటి హక్కున్నది. శిష్యురాలికి మీ అప చారాలను అనుభవించేభారం వున్నదిగదా!" అని కిలకిల నవ్వింది. ఆ నవ్వు వైర్‌లెస్‌విద్యుత్‌వలె ఆయనరక్తంలో వురకలు వేసింది. వెంటనే వుత్కంఠిత హృదయంతో ఆమె అరచేతిని తనముఖమండలానికివేసి అదుముకుంటున్నాడు.

ఆమె మృదువుగా తప్పించుకుని క్రోధాభినయాన్ని

ప్రదర్శిస్తూ "ఏమిటి బాబుగారు? నాకు చాలా పనులున్నవి. త్వరగా మీరు టిఫినుతీసికోండి." అన్నది. "వీటినితినిపించి నీవు వెళ్ళిపోతానన్నమాట." అన్నాడు. "అవును మహాశయా, వీటిని యిలానే వుంచుతారేమోనని యింతసేపూ వున్నాను. దయతో భుజించండి." అన్నది.

"అయిష్టమయినవాటిని ఆరగించి, వాంఛనీయమైన వాటిని కోల్పోవుటకు యే బుద్ధిగలవాడైనా వప్పుకుంటాడా నిర్మలా?" అన్నాడు.

ఆమె కోరగాచూస్తూ "పోనీ, మీకు యిష్టమైందేదో భుజించండి బాబుగారూ" అన్నది.

ఆయన చిరునగవును చిలికించుకుంటూ నెమ్మదిగా టీపాయిని ప్రక్కకునెట్టి లేచివచ్చి, శయ్యనధిష్టించాడు. మ్లానముఖంతో "అదేమిటి బాబుగారు? నేనేమయినా పొరపాటుచేశానా? కోపంవచ్చిందా?" అంటూ దగ్గరగా వెళ్ళి నిలిచింది.

శివప్రసాద్:—ఇష్టమైంది తీసుకుని అవుసరంలేనిది వదిలేయమంటావా?

నిర్మల:—పోనీ మీకు యిష్టమైందే తీసుకోండి.

శివం:—నీ విలా దగ్గరకురా.

నిర్మల:— (దగ్గరగా వెళ్ళి మందస్మితవదనంతో) ఏమిటో చెప్పండి?

ఆయన ఒకచేతో ఆమెహస్తాన్ని బట్టుకుని ద్వితీయ హస్తంతో ఆమెచుబుకాన్ని బట్టి "నాకు యిష్టమైంది యిది. మిగిలినవి నా కక్కరలేదు" అన్నాడు.

ఆమె మాట పలుకులేకుండా అలానే నిలిచిపోయింది. ఆయన చేయిగుంజను ప్రయత్నిస్తున్నాడుగాని, అధీరతతో గనిపించిన ముఖము అశ్రుభరితనయనాలు చూచి విచలితుడై చేయివిడచి "అదేమిటి నిర్మలా, అలా అయిపోయినావు, కోపంవచ్చిందా? పొరపాటు! యిక చేయను" అంటూ చేతులుపట్టుకున్నాడు.

ఆమె తిరిగి మందహాసంచేస్తూ "ముందు మీరు టిఫిను తీసుకోండి బాబుగారు" అని ఆ ప్లేటులు రెండూ తెచ్చి బెడ్ మీద వుంచి, దీనంగా ఆయన్నుచూస్తున్నది. ఆయన వినమ్రవిద్యార్థివలె క్రిందికిచూస్తూ దీక్షావ్రతివలె గంభీర ముద్రలో వాటినిభుజించి. గటగట పాలుత్రాగి శయ్యమీద వాలి మరోవైపు చూస్తున్నాడు.

ఆమె ఆ ప్లేట్లను ఆవలబెట్టి కాలుగాలిన పిల్లివలె అటూయిటూ తచ్చాట్లాడుతూ, ఆయనవంకే చూస్తూ వున్నది. కాని ఆయన చెదరనిధ్యాసలో వున్నాడు. ఆమె తనవోటమిని అంగీకరించి నెమ్మదిగా శయ్యప్రక్కకెళ్ళి వంగి ఆయనముఖానికి చేరువగా తనముఖం వుంచి, దీనంగా "కోపమొచ్చిందా బాబుగారు? అలా నటించకపోతే, మీరు టిఫినుతీసుకోరని అలాచేశాను." అంటుండగా ఆయన నేత్ర ఫలకాలు మూసుకున్నాడు. ఆమె తనహస్తద్వయంతో తెరువప్రయత్నిస్తూ కాలివ్రేళ్ళమీద వంగి బరువు నాపుకోలేక ఆయనమీదికి నరిగిపోయింది. అప్పటికి ఆయన నేత్రాలు తెరువలేదు. మాట పలుకులేదు. అది ఆమెకు విచిత్రంగాతోచి, లేవ ప్రయత్నిస్తున్న ఆమె అలానేవుండి

"నేను మీమీద పడిపోయాను బాబుగారూ, రవంత జాలి కూడా లేదా? అయితే, నేను వెళ్ళిపోతానులెండి" అంటూ లేచింది. వెంటనే ఆయన చేయిపట్టుకుని, "యెక్కడికి?" అంటూ లాగాడు. తరువాత ఆయనను సమాధానపరచి వెళ్ళిపోయింది.

ఆ ప్రభాతదృశ్యాన్నే స్మృతిపథంలో తిరగవేసుకుంటూ, యెంతోసేపు గడిపాడు. కాని తనను పిలిచేవారెవరూ కనిపించలేదు. గడియారం 8 గంటలుకొట్టింది. తిరునాలకు చేసుకెళ్ళిన మిఠాయిని కొనువారులేక, వ్యాపారి తానే తింటూ యింటికిచేరినట్లు, నిస్పృహతో శివం ఎవరూ పిలువకపోయినా తానే లేచి, పిల్లి అడుగులు వేసుకొంటూ వంటశాలవైపు వెళ్ళాడు. ఆమె వంటశాలలో స్వయంగా పిండివంటలు చేస్తుంటుంది; వెనకగా వెళ్ళి కనులుమూయాలని అనుకుంటూ వెళ్ళాడు. కాని అచట వంటబ్రాహ్మణి మాత్రమే యేదో చేస్తున్నది. దప్పికగొన్న పథికుడు జలమని భ్రమించిపరువులెత్తి, యెండమావులని గ్రహించినప్పుడు నిస్పృహచెందినట్లు, నిశ్చేష్టుడై తడబడుతున్నకంఠంతో "నిర్మల లేదా?" అని ప్రశ్నించాడు. "లేదు బాబుగారు; మీ భోజనమైనతరువాత ఆమెగారు బద్రీనారాయణగారింటికి వెళ్ళింది" అని జవాబిచ్చింది.

ఆయన మనస్సు మరింత వికలమైంది. ట్యూషనుకు విద్యార్థులైనా వుంటే బావుండుననుకున్నాడు. నిత్యము యిక్కడే గుంపుగావుండు విద్యార్థులు సమ్మెచేసినట్లు నేడు ఒక్కరూ లేరు. శివప్రసాద్ యేమీతోచక రీడింగురూముకు

చేరి, పుస్తకాలు కెలుకుతూ దీర్ఘనిశ్వాసవిడచి, మహాకవి అశ్వఘోష్‌విరచిత 'ఊర్వశీవియోగం' చేతబట్టి యీజీ చైర్‌లో వాలిపోయాడు. దూరాలనుంచి మందుగుండు సామాన్లధ్వనులు ప్రతిధ్వనిస్తున్నవి. అధికంగా నిద్రించినందువల్లనో లేక ఆలోచనలకు అంతంలేనందువల్లనో శిరస్సు వేడెక్కివున్నది. చేతనున్న పుస్తకం తెరువకుండానే స్టూలుమీదపెట్టి, నొసటిమీద చేతులువేసుకుని, నేత్రాలు మూసుకుని ఆద్యంతాలులేని ఆలోచనలలోమునిగిపోయాడు.

ఆరుగంటలయింది. సంధ్యచీకటి అలుముకున్నది. పెరడు, దొడ్డి అంతటా ప్రమిదలు బారులుదీర్చి, కొన్ని వక్రాలుగాను, పద్మాకారాలుగాను విశేషనైపుణ్యంతో అమర్చబడివున్నవి. ఇవన్నీ యెవరిఆదేశానుసారం అమర్చబడినవో, యెవరికుశలతతో దిద్దబడినవో వారు వాటిని వెలిగించుటకు కనిపించనందున, వ్యాకులచిత్తులైనారు పనివారంతా. భవానీ మరింత క్రుద్ధురాలై చీకాకుపడుతూ వాటినిచూడనుకూడా బయటకు నచ్చుటలేదు. ఆమె కాలుగాలినపిల్లివలె యింటిలో తిరిగినగదికే తిరుగుతూ, పరనాగారంలోకి వెళ్ళిచూసి "ఒరే శివం! నీ విక్కడుండేనా యింతసేపూ కనిపించలేదు. నిర్మల చూడు, యెంతపని చేసిపోయిందో! పండుగపూట యిక్కడిపనులన్నిటినీ యెక్కడివక్కడ వదిలివేసి స్నేహితురాలియింట్లో కూర్చున్నది. పదిరోజులనుంచి వత్తులు జేసింది. ప్రమిదలు యెక్కెట్లనో పెట్టాలన్నది, యేమీలేకుండా వెళ్లికూర్చున్నది. ఇంతపిచ్చిది మరెక్కడా వుండదు. వాళ్ళు బలవంతపెడితేమాత్రం వుండ

వచ్చా చెప్పు? ప్రతియేటా దానిచేత్తోనే వెలిగించేది" అన్నది.

అంధకారంలో తడుముకుంటున్నవానివలె బిత్తరి దృక్కులతో తడబాటును నిలదొక్కుకుని, "పోనీలే అమ్మా యెప్పుడూ వంటరిగా వుంటున్నందున, క్రొత్తగా స్నేహితురాలు లభ్యమవుటవలన వారిబలవంతంచే కాలక్షేపానికి పోయివుంటుంది" అన్నాడు శివం.

"పోయినా పండుగపూట యిల్లువదిలిపోయి కూర్చుంటే యెలా చెప్పు?" అన్నదామె.

బయట యేదో పెద్దసమూహం గలగలధ్వనులతో యింటివైపు వస్తున్నది. నివ్వెరపడి, యిరువురూ బయటకు వచ్చారు; స్ట్రెచరుతో యెవరినో తెస్తున్నసమూహం తమ సింహద్వారంకడకు వచ్చి ఆగింది. శివం ఆగలేనిఆదుర్దాతో చరచర వెళ్ళి చూసి, మతిపోయినవానివలె నిర్విణ్ణుడయినాడు. ఆ స్ట్రెచరుమీదున్నది నిర్మలే. ప్రక్కగా కన్నీరుకారుస్తూ నిలిచింది కృష్ణ. మిగత బృందమంతా తన ప్రియ వేటువిద్యార్థులు. తనముఖానికి గుడ్డఅడ్డంపెట్టుకుని పెగిలిపెగలనికంఠంతో మందధ్వనులతో "మాష్టరుగారు, మమ్ము క్షమించండి. మా డాబామీద అంతా మందుసామానులు కాలుస్తున్నాము. కాలుతున్న చిచ్చుబుడ్డి ఆకస్మికంగా పగిలి పెద్దధ్వనితో మీదికొచ్చిపడినట్లయింది. నిర్మలకంగారుపడి వెనక్కుపరుగెత్తబోయి జారిపడింది. కుడికాలు బెసికి మడమదగ్గర బెణికింది. ఆ కాలంతా సలుపుతోందట. గంటనుంచి నూనెవేసి మాలిష్ చేశాము. బెణుకుఆకు తెల్లవారి తెప్పిస్తా

నన్నాడు మా నాన్నగారు. అందాక మా యింటిదగ్గరే వుంచు దామంటే, నిర్మల క్షణంకూడా వుండనని, యింటికి పంప మని పట్టుబట్టింది. ఇక్కడికితీసుకురాను యెవరికీ ధైర్యంలేక పోయింది. ఆఖరుకు నేనే ధైర్యంచేసి తీసుకొచ్చాను. ఆమె రానన్నకొద్దీ బ్రతిమాలి తీసుకెళ్ళినందుకు యింత అఘాయి త్యం జరిగింది. మమ్మ క్షమించండి. మీ రేమంటారోనని నిర్మల భయకంపితురాలవుతున్నది. ఇందులో ఆమెదోషము లేదు. అరగంటలో పంపిస్తానని నేనే తీసుకెళ్లాను" అంటూ విన్నవించింది.

శివప్రసాద్ మారుమాటాడగల స్థితిలో లేడు. ఇదంతా ఏదో కలగా తోస్తున్న దాయనకు. భవానీ క్రోధావేశపూరితురాలై "ఇదేమంత మంచిపనిగాదు. నాకు చెప్పకుండా దాన్ని పండుగపూట అలా లాక్కెళ్ళటం నీకు గాబట్టి తగిపోయింది. ఏదో గొప్పకార్యంచేసినట్లు యింకా క్షమాపణలు గోరుచున్నావు. ఇలాంటి కూడని అఘాయి త్యాలు నాముందు చేయబోకు. కేవలం చదువులు, సాంగ త్యాలవలన స్త్రీత్వంరాదు." అంటూ అసందర్భమైనమాట లతో చీత్కారంచేస్తూ, స్ట్రెచర్ప్రక్కకు వెళ్ళి, నిర్మల ముఖం పైకిత్రిప్పి చూసింది. అశ్రుముద్రితమై జేవురించి వున్న ఆ ముఖమండలంలో ప్రచండతుఫానువలె దుఃఖం పొర్లుకొస్తుంటే తనహస్తాలలోకి భవానీహస్తాలను తీసుకుని, తనముఖంమీద వుంచుకుని "అమ్మా" అంటూ పెద్దగా అరచింది. ఆ పిలుపులో ఆత్మవ్యథతోగూడిన మమకారం ద్యోతకమవుచున్నది. నిష్కల్మషమైన ఆర్ద్రతతోగూడిన ఆ

పిలుపు భవానీహృదయకుహరంలోకి చొచ్చుకుపోయి, కెలికి నట్లయి భవానీలోని మాతృత్వం పెల్లుబికింది. వెంటనే ఆమె నిర్మలభుజస్కంధాలక్రింద చేతులువేసి, తన భుజం మీద వేసుకున్నది. నిర్మల తన కోమలహస్తాలతో భవానీ కంఠాన్ని పెనవేసుకున్నది. ఆమె నేత్రాలగుండా ప్రవహిస్తున్న అశ్రుస్రవంతి భవానీవీపుమీదుగా జారిపోతున్నవి.

రక్తరంజితమై జ్యోతులవలె మెరుస్తున్న నేత్రాలతో తీక్ష్ణదృక్కుల నొక్కమాటు ప్రసరింపజేసి, నిర్మలతో లోనికి వెళ్ళిపోయి, శయ్యమీద నెమ్మదిగా పరుండబెట్టి, తాను ప్రక్కనకూర్చుని బెణికినకాలును పరిశీలిస్తున్నది.

శివప్రసాద్ మతిబోయినవానివలె నిశ్చేష్టుడై నిలిచి వున్నాడు. ఆయనదృష్టి వెలుగుతున్నప్రమిదలమీగున్నట్లు తోస్తున్నది. ఆయనమనస్సులో యేమిజరుగుచున్నదో యెవరికీ తెలియదు. కాని, ఆయనముఖమండల మేదో భీకరాన్ని వ్యక్తంజేస్తున్నది. ఆయన యెంత సరళము సాధారణమైన వ్యక్తో అంతకుమించిన గంభీరత పట్టుదలగల సమర్థుడయిన యోధుడుకూడాను. ఆయనక్రోధపూరితగంభీరతకు భీతిలి, ఒక్కరొక్కరుగా విద్యార్థులందరూ జారుకున్నారు. కృష్ణ మాత్రం అపరాధినవలె భయకంపితురాలై అదురుతున్న అధరాలతో దగ్గరగా వచ్చి దుఃఖభరితకంఠంతో చేతులు జోడించి "మన్నించండి మాష్టరుగారు. అనుకోని అపర్ధంజరిగింది" అని అశ్రువులు వలికించింది. కాని, శివప్రసాద్ చలించలేదు. కదలక మెదలక అలానే వున్నాడు. ఆమె విచలితురాలై చకితదృక్కులతో చూచి, తనదుఃఖాభినయం

వదలి, ధైర్యాన్నిపూరించు వుత్కంఠతో "ప్రమాదమైన దెబ్బ తగులలేదు మాష్టరుగారూ. కాలు బెణికింది. రెండు రోజులు తోమితే, వూరికే పోతుంది. భయమేమీలేదు" అన్నది. ఆయన్నుంచి జవాబులేదు. ఆయనముఖమండలంలో తనదృష్టిని నిగిడించి మరీ చూస్తున్నది. అందు అనిర్వచనీయమైన జిజ్ఞాస దృగ్గోచరనువుచున్నది. ఆయనముఖకవళికలో ఇదివరకెన్నడూ తెలియని అత్యధిక ఆకర్షణీయమైన ఆనందానుభూతులేవో అనుభవమయి, తనశరీరంలో గిలిగింతలుపెడుతున్నవి. ఆయనదృష్టిలోని స్నిగ్ధత, ముఖంలోని నిశ్చలత, తేజస్సు ప్రభాతదినకరుని ప్రకాశంవలె అత్యధిక శోభాయమానంగా ప్రభవిస్తున్నది. మంత్రదండాన్ని ముఖం యెదుటబెట్టి మంత్రించినపుడు దానికి వశీభూతుడై దానినే చూస్తూ దానిలో లీనమవనున్నట్లు ఆమె ఆకర్షితురాలై ఆయనముఖంలోకే చూస్తూ తననుతాను మరచింది.

ఆ దీపశిఖకాంతులలో ఆయనముఖమండలంలో మెరుస్తున్న విషాదరేఖలు ఆమెను కుదిపి లాలించినట్లయి, అనాలోచింతగా ఆయనహస్తాలనుపట్టి, ఖంగారును సూచిస్తున్నధ్వనితో "అలా వున్నారేమిటి మాష్టరుగారూ?నిర్మలకేమీ ప్రమాదంలేదండి. నేను యిక్కడే వుండి, నిర్మలకు నయంచేసి యింటికి వెళతాను. మీరు భయపడకండి మాష్టరుగారూ". అంటూ ఆమె ఆయనహస్తాలను స్పృశిస్తున్నది. గాఢనిద్రనుంచి మేల్కొన్నవానివలె నేత్రాలు నులుముకుంటూ, "ఏమిటి నీవు చేప్పేది? నిర్మల కెలా వున్నది?" అని మనస్సుచెదరినవానివలె ప్రశ్నించాడు.

ఆయన అనభిజ్ఞతకు మరింత విస్తుబోయి, ధైర్యాన్ని పూరించుకుని "ఏమీ పరవాలేదు మాష్టరుగారు!" అన్నది. వెంటనే కృతజ్ఞతను చూపులలో ప్రకటిస్తూ, ఆమె చుబుకాన్ని పుణుకుతూ, రెండో హస్తం ఆమె శిరస్సు వెనుకభాగాన వేసి లోపలి వైపుకు మృదువుగా నెట్టాడు. ఆమె మంత్రముగ్ధురాలివలె చరచర లోపలకు వెళ్ళి నిర్మలవున్నగదిని వెదకజూస్తున్నది. శివప్రసాద్ ఆమెను ఆహ్వానిస్తూ నిర్మలగదికి వెళ్ళాడు. దెబ్బ తగిలిన కాలు అంతటా పరిశీలించిన భవానీ శివాన్ని, కృష్ణను చూసి, కృష్ణనుచూడనట్లు శివంవైపు తదేకంగా చూస్తూ "ఎన్నడూ యెరుగని అఘాయిత్యం చేసికూర్చున్నది శివం. సహవాసదోషఫలితాలిలాగే వుంటవి. దానికి ఇంగ్లీషు, యీ చెడుస్నేహాలు యెందుకు చెప్పరా శివం?" అని విసుగుగా అన్నది.

శివం అస్పష్టమైనశబ్దాలలో నతనతగొణుతూ చిరునగవును ప్రదర్శింప ప్రయత్నిస్తూ "భగవంతుని చిద్విలాసం యెలావుంటే అలా జరుగుతుందని నీవే అంటావుగా అమ్మా" అన్నాడు.

ఆమెకు కృష్ణసముఖంలో సంభాషించుట ఇష్టంగాకనో యేమో మౌనంవహించి వెళ్ళిపోయింది.

నిర్మలకనుకొలకులగుండా అశ్రుబిందువులు జారుతున్నవి. ఆమె వాటిని గుప్తంచేసుకోవాలని శిరస్సును రెండోప్రక్కకు తిప్పింది కాని, కపోలాలందున్న అశ్రుముద్రిక సుస్పష్టంగానే కనిపిస్తున్నది. శివప్రసాద్ ప్రక్కగా శయ్యమీద కూర్చుని, ఆమెచుబుకంమీది అశ్రుధారకను

అంగుళీయములతో తుడుస్తూ "ఇటు తిరుగు నిర్మలా; బాధ గావున్నదా?" అన్నాడు. నిర్మల ఆయనహస్తంమీద తన హస్తంవేసి నిమురుతూ నెమ్మదిగా ఆయనవైపు తిరిగింది. ప్రక్కగా నిలిచివున్న కృష్ణకూడా కనిపించింది. ఆమె విన్నరాలై సుఃఖిస్తూ, "బాబుగారు, నా బాధనుగురించి దుఃఖించుటలేదు నేను. పండుగరోజు మీమనస్సుకు నొప్పికలిగించాను," అని దుఃఖాన్ని దిగమ్రింగుతున్నట్లు అధరాలను బిగబట్టి వేడినిట్టూర్పును విడచింది. ఆయన చిన్నగా నవ్వటకుప్రయత్నించి విఫలుడయి "కలిగించినబాధకంటె నీ దుఃఖం మరింత బాధనుకలిగిస్తుందని గుర్తించు. జరిగిన దానికి విలపించుటకంటె జరుగవలసినదాన్ని ఆలోచించుట వివేకము. కృష్ణకుమారి నీకొరకు వేచివున్నది!" అన్నాడు.

నిర్మల తనచెంగుతో ముఖాన్ని తుడుచుకుని, శివప్రసాద్‌ను, తిరిగి కృష్ణకుమారిని ప్రశాంతదృక్కులతో చూస్తున్నది. ఇపుడు అందరిమనస్సులు కుదుటపడినట్లయింది. "ఆ కుర్చీలో కూర్చో కృష్ణా" అన్నాడు శివం.

కృష్ణ మంచంరెండోప్రక్కకు వచ్చి నిర్మలపాదాల దగ్గర చీరెకొలగించి మడిమపైభాగాన వ్రేళ్ళతో చిన్నగా నొక్కుతూ "యిక్కడ బెణికింది; రేపటికి తగ్గుతుంది" అన్నది.

"నా కా నొప్పి పూరికే పోతుంది. భయంలేదు. బాబుగారు రేమంటారోననేభయం నన్ను మరింత విచలితురాలినిజేసింది" అంటూ, అప్పాలుపెట్టి పోగొట్టుకున్నవాడు ఆలిభయంతో కించచెంది, అయినా పోగొట్టుకున్న అప్పాల

కంటె అనంతమైన అనుభవాన్ని పొందానుగదా అని నవ్వి నట్లు, నవ్వి, "నాకు ఫరవాలేదు, నీవు వెళ్ళు కృష్ణా, ప్రొద్దు పోయింది" అన్నది నిర్మల.

"అవునవును, ప్రొద్దుపోతున్నది. నీవు వెళ్ళు కృష్ణా" అన్నాడు శివం. కృష్ణ మారుపలుకజాలక వెళ్ళిపోయింది.

అదే పోతుందనుకున్న నొప్పి మరునాడు ఎక్కు వైంది; దెబ్బ బలమైందిగాదని నిశ్చింతగా నిద్రపోయాను గాని, నిర్మల తెల్లవార్లూ బాధపడుతూనేవున్నది. తెల్లవారి శివప్రసాద్ వచ్చి ఆమెమూలుగులను చూసి నిర్ఘాంతపోయి చెంతకూర్చుని, ఓదారుస్తూ అనురాగంతో ఆమెశిరస్సు మీద చేయి వేసి నిమురుతూ, 'రాత్రంతా యిలానే బాధ పడుతున్నావా నిర్మలా?" అన్నాడు. ఆమె పసిబాలికవలె చేతులుజోడించి "బాబుగారూ, మీపాదాలుపట్టుకుంటాను. నేను బాధపడ్డట్లు పడుతున్నట్లు అమ్మకుమాత్రం చెప్పకండి" అని వినమ్రతతో బరువైనకంఠంతో అన్నది. "పోనీ, నా కయినా యెలావున్నదో నిజంచెప్పు!" అన్నాడు. వాత్స ల్యోద్వేలమైన ముఖంతో "కాలు కదుపనిచ్చుటలేదు. పైపెచ్చు లాక్కుపోతున్నట్లు నరాలు నములుతున్నవి బాబుగారు" అన్నది. సానుభూతితో "అమ్మ యిటురాక ముందే ముఖం కడుక్కో" అన్నాడు. "స్నానంకూడాచేసి, దుస్తులుమార్చుకోవాలనివుంది గాని, కాలు క్రిందమోప లేను బాబుగారు" అన్నది.

ఆయన వెంటనే వెనుకముందు సంకోచాలు లేకుండా ఆమెను పసిబాలికవలె చేతులమీద తీసుకెళ్ళి స్నానాల

గదిలో కూర్చుండబెట్టి బ్రష్ చేతికిచ్చి, గదిలో వేడినీరు పెట్టించి, పెట్టెనుంచి ఆమెదుస్తులను తీసియిచ్చి, తలుపు వేసి, కన్నములోగుండా తోడుదొంగను ఒంపి బయట కాపలా కాస్తున్న దొంగనవలె స్నానాలగదిముందు పచార్లు చేస్తున్నాడు శివప్రసాద్. పురుషునికి స్త్రీ యెంత అమూల్యసంపదో అనుభవంలో అర్థమవుతుంటుంది.

నిర్మల స్వయంగా యెంత బాధననుభవిస్తున్నా, ఆ బాధ శివప్రసాద్‌కుదప్ప మరెవరికీ తెలియరాదని ఆమె మనోవాంఛ. అందుకే శివప్రసాద్ యెంత ప్రాధేయపడ్డా, డాక్టరునురప్పించుటకు సమ్మతించలేదు. తన సూక్ష్మగ్రాహ్యతనుపయోగించి, ఆలివ్ ఆయిల్ అర్నికా తెచ్చి కలిపి సీసా నిర్మలచేతికిచ్చాడు. ఆమె వెలవెలబోతూ వెర్రిదానివలె ఆయన్ను చూస్తున్నది. ఆమెకాలు వంగనీయదు. తన చేతులకు మోకాలువరకే అందగలుగుతుంది. అయినా తనవలన కాగలపనిగాదది. శివప్రసాద్ తిరిగివచ్చి తలుపులు బిగించి, ఆమెప్రక్కన ఆసీనుడై, ఆమెచీరెను మోకాలుపైకి తొలగించి, చేతిలోకి తీసుకోబోయాడు. ఆమె నిర్ఘాంతపోయి, చేతులుచాపి, "బాబుగారు. ఆగండి. మీ హస్తాలతో నా కాళ్ళు అంటుకోవటం నేను భరించలేను. నన్ను మరీ హీనురాలనుచేయకండి" అంటూ నివారించింది.

శివం:—నీవు పిచ్చిదానివిలాగుంది. ఆపత్తులో స్త్రీ పురుషవివక్షత అనవసరం.

నిర్మల:—మీ రేమయినా అనండి. పురుషుడు స్త్రీకి

శిరోధారితమైనవాడు. కనకాన్ని కాలికి ధరించగలమా చెప్పండి?

శివం:—వివక్షతలు విఘాతాన్ని గలిపిస్తుంటవి. పరస్పరసహకారాలలో వివక్షతలేనపుడే సర్వోదయమార్గమవుతుంది. కనకాన్ని కాలికిధరిస్తే అపరాధమా? మొందు ధరించుటలేదు?

నిర్మల:-బాబుగారు, మీ హృదయం పవిత్రమైంది. మీరు దైవసమానులు. మీ నోటితో అలాంటి మాటలనకండి. న్యాయము, ధర్మము, దయ, మమత, కరుణ, స్నేహము మొదలగునవన్నీ వివేకంతో కల్పించిన తర్కంతో యెగిరిపోవచ్చు, కాని, నేను స్వీకరించలేను బాబుగారు. బంగారమూ ఖనిజమేనని కాలికి ధరించవచ్చు కాని, కష్టపోతవని తెలుసుకోవాలి. మనుషులందరూ ఒక్కమాదిరి యెలాకాదో, అట్లే ఖనిజాలన్నీ ఒకటికాదు.

శివం:—డాక్టరు యెంత గొప్పవాడైనా అవుసరమైనపుడు రోగికి కట్టుకడతాడు; తైలం వేసి తోముతాడు. రోగాన్ని దూరంచేయను చికిత్సచేయుట వైద్యునికర్తవ్యంగదా? నన్నూ అలానే భావించు.

నిర్మల:—రోగికి ప్రాణమే ప్రధానమైనపుడు మీరు జెప్పినట్లే. మీరు యేమయినా చెప్పండి, మీరు నా కాలు అంటితే శిరస్సు బ్రద్దలుకొట్టుకుని చనిపోతాను. మీరు నాకు ఆశ్రయప్రదాతలే గాదు. దైవస్వరూపులు. మీలాంటి స్వచ్ఛమైన పవిత్రమూర్తుల హస్తాలు నాలాంటి స్త్రీపాదా

లకు తగిలితే జన్మజన్మాలకు పోని పాపం లభ్యమవుతుంది బాబుగారు.

ధైర్యచ్యుతికలిగిన శివప్రసాద్ నిరుత్తరుడై ఆయిల్ సీసా అలమరలో వుంచి, తలుపుగడియతీసి ప్రక్కనున్న యీజీచైరులో వాలి ఆలోచనానిమగ్నుడై నిద్రాదేవతను ఆరాధించాడు. వేడినీటిస్నానంవలన కలిగిన వుపశాంతితో, శివబాబు ప్రక్కనున్న తృప్తితో నిర్మలకూడా గాఢనిద్రకు గురియైనది.

పగలు పదిగంటలసమయ మది. శివప్రసాద్‌కు మెల కువవచ్చింది. ప్రక్కన నిర్మల గాఢనిద్రలోనున్నది. ఈ నూతనవైద్యునికి గొప్ప చికిత్సావకాశం లభించినట్లు ఆనంద పరవశుడై వెంటనే తలుపులుబిగించి, అతిమెలకువగా ఆమె కాలిమీదిచీరెను తొలగించి, ఆలివ్ఆయిల్‌ను చేతినిండా పోసుకుని, మృదువుగా మోకాలిమీదనుంచి అధోభాగ మంతా పులిమాడు. ఆమెనిద్రచెదర్పలేదు. ఆయన ఇంకా ఇంకా ఆయిలు వేసి రాస్తూనేవున్నాడు. క్రింద చీరెఅంతా నూనెతో తడిసి పరుపులోఇంకుతున్నది. నిద్రభంగమయితే తనచికిత్సకు ఆటంకంకలుగుతుందనే భయంతో అదిమి వ్రాయలేకపోతున్నాడు. ఆమెకాలును పరిశీలిస్తున్నకొద్దీ ఆయన అవ్యక్తంగా పులకితుడవుతున్నాడు. ఖజానాలో దూరిన దొంగ కరెన్సీకట్టలమీద చేతులువేసి అటూఇటూ చూస్తూ గుండెదడను ఆపుకుని ధైర్యాన్ని పూరించుకుని యింకా లోపలనున్నకట్టలవైపు చూస్తూ వ్యామోహితుడవు తున్నట్లు, శివం ఆమెకాలిమీద మిగిలివున్నచీరెను రవంత

తొలగించి, ఊరువుభాగాన్ని చూస్తున్నాడు. చీరెలోగుండా ఆయన ప్రవేశపెట్టిన దూరి ఆయిల్ అయినందున గాబోలు ఆ సువర్ణ కాంతి అద్వితీయమై శోభిస్తున్నది.

మానవస్వభావం కొన్నిహద్దులవరకే నీతిని పాటించ గలుగుతుంది; నియమాన్ని అనుసరించగలుగుతుంది. స్త్రీ విషయంలో పురుషునిహృదయం మహా దుర్బలమైంది. కాని తనహృదయదౌర్బల్యాన్ని కప్పిపుచ్చుకుని, నాటకమాడగల చతురత, సామర్థ్యం పురుషునిలో విశేషించి వుంటవి. స్త్రీ యెంత హీనురాలైనా పురుషప్రేరణలేకుండా చెడిపో జాలదు. హీనాతిహీనురాలైన స్త్రీమనస్సుకన్నా సచ్చరిత్రుడు, శీలవంతుడైన పురుషహృదయం దుర్బలమైంది.

ఆ సువర్ణకాంతిపుంజాన్ని వెదజల్లుతున్న మృదు మధురమైన ఊరువును పరిశీలిస్తున్నకొద్దీ ఆయనహృదయం ఆనందోజ్వలమై క్రీడాకౌతుకచాంచల్యంతో సర్వాంగనులు పులకితమవుతున్నవి. ఉబికిచిందులాడుచాంచల్యం భ్రూవిక్షేప మాత్రంతో ఆత్మతృప్తిలేక తృష్ణాభరితోద్వేలంతో ఆమె తొడను పసిబాలికచుబుకంపట్టినట్లు పట్టి దంతాలు కరకరమని పించాడు.

ఆమె కలగంటున్నట్లు బిత్తరపోయి "అయ్యో, ఇదేమిటి బాబుగారు?" అంటూ ఆయనహస్తాన్ని గట్టిగాపట్టి, ఆ ఆధారంతోనే లేచి కూర్చున్నది. కన్నములోదొరికిన దొంగవలె ఆయనముఖం యెన్నడూలేనివిధంగా వెలవెల బోతున్నది. చిన్నబుచ్చుకున్న ఆయనముఖాన్ని చూసి, తా నేదో పొరపాటుచేసినట్లు నొచ్చుకుంటూ "చల్లని

మంచుగడ్డ కాలిమీదపెట్టినట్లున్నది బాబుగారు" అని మృదువుగా నవ్వింది. ఆయన చెదరని గంభీరముద్రతో నగ్నంగావున్న ఆమె కాలిమీదికి చీరెను యథావిధిగా సర్దుతున్నాడు. "అదేమిటి బాబుగారు, మీచేతులకు మళ్ళీ నూనెచేసుకుంటారు!" అని వారించబోయింది. కాని, ఆయన పూర్తి చేసి, నూనె సీసాను అలమరలో పెట్టి, స్నానాలగదిలోకి వెళ్ళిపోయాడు.

నిన్న జరిగిన దురంతంతో సాహసంచాలక విద్యార్థు లెవరూ ప్రయివేటుకు రాలేదు. కృష్ణమాత్రం యేకైక ప్రతినిధిగా వచ్చింది. గదిఅంతటా నిండివున్న ఆలివ్‌నూనె వాసన గమనించి, నిర్మలకాలుమీది చీరనుతొలగించి, ఆశ్చర్యాన్వితురాలై "ఇంత తైలం కారిపోయేట్లు కాలు మీద పోశారేమిటి? పరుపుకూడా తడిసింది. యెవరు పూశారు?" అని ప్రశ్నించింది కృష్ణ. గంభీరముద్ర తో నేనే పూసుకున్నాను" అన్నది నిర్మల. "ఎవరిచ్చారు యిది," కృష్ణ ప్రక్కగాకూర్చుని, నిర్మలకాలుమీది చీరెనుతొలగించి, నెమ్మదిగాతోముతూ "గుడ్డలుచెడిపోయేటట్లు యింత నూనెపోసుకున్నావెందుకు?" అని రెండోచేతికికూడా చేర్చి తోముతున్నది. నొప్పిని వోర్చుకోజాలక, నిర్మల దంతాలు బిగబట్టి శిరస్సు అటూయిటూ త్రిప్పుతూ వొప్పుతున్నది. "ఎంతో నిగ్రహంతో వోర్చుకోగల నీకే యింత బాధగా వున్నది. నేనయితే చచ్చివుండేదాన్ని. నావల్ల నేనీ కీ బాధ కలిగిందని అందరూ నన్నే దూషిస్తున్నారు నిర్మలా!" అంటూ ఆమెకాలుఅంతటా వ్రేళ్ళతోఅదిమి తోముతున్నది.

ఊపిరిబిగబట్టి నొప్పి సహిస్తున్న నిర్మలకు యీమాటలు విన గల స్థిమితంలేకపోయింది.

శివప్రసాద్ టవలుతో చేతులుతుడుచుకుంటూ గదిలో ప్రవేశించాడు. కృష్ణ ఖంగారుచెందుతూ లేచి నిలిచి, నిర్మల కాలిమీదిగుడ్డను సరిజేస్తున్నది. తను యింతకుముందు చేసి పోయిన ఘనకార్యం ఆమెకు తెలిసిందేమోననేభీతితో చిన్నబోయినవదనంతో "ఎంతసేపయింది వచ్చి?" అని ప్రశ్నించాడు. "ఇంతకుముందే వచ్చాను మాష్టరుగారు. నిర్మల చూడండి, గుడ్డలనిండా తైలంపోసుకున్నది." అని ఫిర్యాదుగా అన్నది. ఆపదనుంచి బయటపడినవానివలె, విప్పారినముఖంతో "నీవు కాస్త సహాయపడగూడదు? ఆపత్సమయంలోనే ఆత్మీయులెవరో అర్థమవ్వేది." అన్నాడు. "మీ రేమనుకుంటారోననేభయంతో రాలేదండి. లేకపోతే, నేను రాత్రికూడా యిక్కడే వుండిపోయేదాన్ని" అన్నది. "నీవు నిలుచోవటమెందుకు? తోముతున్నట్లున్నావు, కూర్చొని ఆ పని చూడు. నేను వెళుతున్నాను" అంటూ క్రీగంట నిర్మలవంక చూచాడు. ఆమెముఖం అనురాగంతో ఆర్ద్రమైయున్నది. ఆయన వెళ్ళిపోయాడు.

కృష్ణ మౌనంగా కూర్చుని, తిరిగి యథావిధిగా నిర్మల కాలును తోముతున్నది. ఇరువురిమధ్య నిశ్శబ్ద వాతావరణం గంభీరముద్ర వహించింది. ఎవరిమనస్సులో యేమి దొర్లుతున్నదో యెవరికి తెలుసు! ఎవరూ ఆ నిశ్శబ్దతను భంగపర్చ సాహసింపలేకపోతున్నారు.

ఆత్మగ్లానికలిగినట్లు ఆనందోజ్వలదృష్టితో సానుభూ

తితో "నిర్మలా, నీవు అదృష్టవంతురాలివి. మాష్టరుగారు విజ్ఞానసంపన్నులు; ఆదర్శమూర్తులు, అసమానయోధులు. అలాంటివారిదయను కొల్లగొట్టుటసామాన్యవిషయంగాదు. వారికి నీయడలనున్న ఆదరం అనంతమైనదని నిన్న తెలుసుకున్నాను" అన్నది కృష్ణ. "అలాంటి మాటలని నా మనస్సుకు బాధకలిగించకండి కుమారిగారు. నేను బాధలను భరించగలను, కష్టాలను, హింసలను సహించగలను, కటికి బీదరికాన్ని కౌగలించుకొని మందహాసంచేయగలను, ధూత్కారాలను అపచారాలను యెదుర్కోగలను గాని, దయను, ఆదరసత్కారాలను మమకారాలను స్వీకరించలేను, భరించలేను. బాబుగారిలాంటి దైవస్వరూపులనుంచి దయను, ఆదరసత్కారాలను పొందుటకు నాహృదయం కంపిస్తుంటుంది; అనుక్షణము వ్యధచెందుతుంటుంది. వారి పాదధూళి పడినచోట నా ప్రాణం విడిస్తే బావుండునను కుంటాను. వారినిశ్వాసతో నా ప్రాణాన్ని మిళితంచేసి, దిగంతవిస్తృతమైన ఆకాశానికి వదిలితే బావుండుననుకుంటాను. వారి దయ మమకారాలకు నేను బానిసనైపోయాను. అందుకే దయ, కరుణ, ఆదరాలంటే నాకు భయమేస్తున్నది" అన్నది నిర్మల. "అదేమిటి నిర్మలా, సమాజంలో అత్యధిక విలువైనవి నిష్కల్మషంతోగూడిన ఆదరాభిమానాలు, దయ, కరుణ, మమకారాలే. వాటిని జీవితానికికావలసినంత యెవరుపొందుతారో వారే ధన్యులు. అలాంటివాటికి భీతి చెందుటెందుకు?" అన్నది కృష్ణ. "అందుకు తగినకారణాలను నేను చెప్పలేకపోవచ్చు. సాధారణ యాచకుడు కని

పించినవారందరిని యాచిస్తుంటాడు. యెక్కువమంది విముఖత చూపుతుంటారు. ఒకరిద్దరు భిక్షయిస్తుంటారు. ఆకస్మికంగా అప్రత్యాశితంగా ఒక అజ్ఞాతదాత తనవద్దనున్ననిధిని సాధారణరూపంలో దానంగా యాచకునకొసగినపుడు, ఆ యాచకుడు అనాలోచితంగా ఆ దాతకు కట్టుబడిపోకతప్పదని నా విశ్వాసం. సమాజంలో విలువైనవేవో వాటిని పొందినంత మాత్రాన జీవితానందం లభిస్తుందనుటకు వీలులేదు. దేని కొరకు తపిస్తామో అది దుర్లభమవుతుంటుంది. దేనిద్వారా యేది లభ్యమవుతుందనుకుంటామో దానిద్వారా అది లభ్యంకాకపోవచ్చు. ఈ ఆదరాభిమానాలు దయ మమకారాలు మర్యాదలు నాకెందుకో భయాన్ని కలిగిస్తుంటవి. వీటిలో యేదోరూపంలో కల్మషముందేమోననుకుంటాను. శ్రామిక వృత్తిలో న్యాయము ధర్మము అనేగీటుమీద సూటిగా నడువనివ్వని నాటకానికి మర్మాలు ఆ మర్యాదలు మమకారాలేనేమో" అన్నది నిర్మల. "తనకు సాధ్యమయ్యేది పొందగలిగింది యెంతవిలువైనదైనా అసంతృప్తికరమైందిగా తోచవచ్చు. పొందినదాని యదార్థవిలువను తెలుసుకోగలుగుట కూడా ఒక గొప్ప నిపుణతే నిర్మలా. నీకు నేడు యేది సంప్రాప్తమైందో దానివిలువ దానికి దూరమైననాడు దిగ్భ్రాంతిని కల్పించి శాశ్వతవిలాపాన్ని కలిగించగలుగుతుంది" అన్నది కృష్ణ.

"అబ్బ! అలాఅని నన్ను చిత్రవధచేయకండి. నేను పొందిన ఆదరంవిలువ నాకు తెలియందిగాదు. ఈ సర్వజగత్తులోని సంపత్తికీ మించినదని నాకు తెలుసు. ఆ కారణం

తోనే నాకు భయంకూడా. అంధుడు అయోగ్యుడు అయిన వానిముందు మాతంగికన్యల మధుభరితనృత్యం నిష్ప్రయోజనం." అంటూఉండగా మధ్యలో వంటబ్రాహ్మణి వచ్చి "భోజనం తీసుకురమ్మంటారా అమ్మా?" అని అడిగింది. అంతటితో వారిసంభాషణ ఆగిపోయింది.

రెండురోజులు గడిచిపోయినవిగాని, నిర్మల కాలు యింకా భూమిమీద ఆననిచ్చుటలేదు. ఆమెసేవాకార్యక్రమాన్ని పూర్తిగా తనపైనవేసుకున్నది కృష్ణ. నిర్మల అనురోధంతో శివప్రసాద్‌కు భోజన ఫలహారాదులుకూడా కృష్ణద్వారా జరుగుతున్నవి. నిర్మలపరిచర్యలు, నిర్మల చేస్తూ వచ్చిన కార్యక్రమాలు అదేరూపంలో ఇప్పుడు కృష్ణ నిర్వహిస్తున్నది.

పగలు మూడోజాముసమయమది. స్నానం చేయించి కాలుమీద యూకలిప్టస్ఆయిల్ కాపు వేసినందున గాబోలు, నిర్మల గాఢనిద్రలోవుంది. ఈ విశ్రాంతిలో కృష్ణ తేలికబడినట్లయి, వంటశాలవైపు వెళ్ళి వంటమనిషి సహాయంతో కచోడీ తయారుచేయించి, అందుకనుపాకం వచ్చి బఠానీగింజలు కాలీఫ్లవర్ బంగాళాదుంపలతో తయారుచేసి సాసర్లలో పెట్టుకుని శివప్రసాద్‌గదిలో ప్రవేశించింది. ఆలోచనాభారంతో గాబోలు, ఆయన మరింత గాఢనిద్రలో నున్నాడు. నెమ్మదిగా వెళ్ళి మంచప్రక్కనున్న టీపాయి మీద సాసర్లుపెట్టి, ప్రక్కననిలిచి స్నిగ్ధదృక్కులతో పరిశీలిస్తున్నది. తాను ఎంతో ప్రీతితో తయారుచేయించిన పదార్థాలు ఆరిపోతున్నవనేబాధ ఒకప్రక్క, యోగనిద్రలో

నున్నట్లున్న ఆయన ప్రశాంత సుఖమయనిద్రను చెదర్చ గల సాహసంలేని ఆదుర్దా మరోప్రక్క ఆమెను చీకాకుపరు స్తున్నవి. వివశురాలై కుర్చీని మంచానికి ఆనవేసి కూర్చు న్నది. గాఢనిద్రలో రక్తం యెక్కువగా ప్రవహిస్తుంది. స్వేదం క్రమ్ముతుంటుంది. కమలంమీద మంచునీటి బిందు వులవలె ఆయనలలాటంమీద స్వేదబిందువులు ముత్యాల వలె మెరుస్తున్నవి. ఆ స్వేదబిందువులను తుడిచివేయాలని మనస్సు వువ్విళ్ళూరుతున్నది. ఈ సర్వజగత్తులోని యదార్థ సుఖసంపద ఆ స్వేదబిందువులరూపంలో ప్రదర్శితమై, తనకు చైతన్యాన్ని కల్పిస్తున్నట్లున్నది. నిజమైన ఆనందరూపంలో ఆ లలాటంమీద ఆ బిందువులు శృంగారనృత్యంసలుపుచున్న ట్లున్నది. ఆ బిందువులు ఒక్కటొక్కటిగా పెద్దవై ప్రక్కకు జరిగి ఒకదానికొకటికలిసి యేకమై ప్రక్కకు ప్రవహిస్తున్న పుడు ఆత్మలన్నీ చేరి, అనంత ఆత్మస్వరూపంపొంది ప్రభవించి నట్లు దృగ్గోచరమయింది. కర్ణరంధ్రంలోనికి దొర్లనున్న స్వేదస్రవంతిని జూచి, ఆమె సహించలేక తన పైటచెంగుతో మృదువుగా అద్దింది. ఆ స్రవంతిని అడ్డగించగలిగినందుకు తా నేదో కృతకృత్యురాలయినట్లు, ప్రసన్నురాలై అటే చూస్తు న్నది. మానవకృషి ప్రకృతిసిద్ధమైనప్రవాహాన్ని శాశ్వతంగా అడ్డగింపజాలదు. ఆయనలలాటంనుంచి తిరిగి అదేరీతి స్వేదస్రవంతి ప్రక్కకు ప్రవహించుచుండగా కృష్ణ అనా లోచితంగా చెంగుతో అద్దుతున్నది. గాఢనిద్రలోనున్న ఆయనచేయి యీగమీదికో దోమమీదికో పోయినట్లు విసురుగా ఆమెచేతిమీద పడింది. ఒక చిన్ని మలారంవలె

నున్న ఆమెచేతిగాజులు ఘల్లుమని ఆయనముఖంమీదనే పడినవి. ఏదో విఘాతంచెందినట్లు నివ్వెరపాటుతో చివ్వున లేచి వెలవెలబోతున్న ఆమెనుజూచి నిశ్చేష్టుడయి ఖంగారు పడుతున్నవానివలె "నీవు యిక్కడున్నావెందుకు కృష్ణా?" అని ప్రశ్నించాడు.

ఆమె ఆత్రతతో లేచి, ఆయనప్రక్కమీదపడిన గాజు ముక్కలు యేరుతూ "మీకు టిఫిను తెచ్చాను మాష్టరు గారు" అని, ఆయనకుడివైపుకుపోయిపడిన ముక్కలను కూడా వెతికితీసి, బీరువాటాపుమీద పోసి, టేబులుమీది కచోడీ, కూరసాసర్లు, మంచినీటిగ్లాసు ఆయనముందుపెట్టింది. "ఎంతసేపయింది నీవు వచ్చి?" అని ప్రశించాడు. "అర గంటఅవుతుంది మాష్టరుగారు" అని జవాబిచ్చింది. "నిద్ర లేపగూడదూ?" అన్నాడు. "అలానే అనుకున్నానుగాని, నిద్రలోని సంపూర్ణసుఖాన్ని చూచినపుడు నన్ను నేను మర్చిపోయాను" అన్నది కృష్ణ. "నా నిద్రలోనిసుఖాన్ని నీ వెలా గుర్తించగలిగావు చెప్పు?" అన్నాడు. "స్వయంగా పొందుతున్నదానికంటె మరొకరు పొందుతున్నదాన్నిచూచి నపుడే దానిలోతుపాతులు మరింతగా అనుభూతమవుతవి" అన్నది కృష్ణ. "నాచేతికి నీ గాజులుతగిలి పగిలినవెందు కని?" అని ప్రశ్నించాడు. ఆమె చిన్నబుచ్చుకుని ముఖాన్ని చేతులతోకప్పుకుని, సిగ్గుదొంతరులమధ్య "మీ ముఖంమీద చెమట ధారలుగట్టి కారుతున్నపుడు చూడలేక, తుడువ బోయాను" అన్నది.

కృతజ్ఞతాభరితకంఠంతో "చేతికి దెబ్బతగులలేదు

గదా" అంటూ ఆమెచేతినిపట్టి పరిశీలిస్తున్నాడు. ఆమెచేయి యెందుకో వణుకుతున్నది. ఆయన మందహాసంచేస్తూ "గాజు లేమీ గుచ్చుకోలేదుగాని, నీహస్తం అదురుతున్నదేమిటి?" అంటూ ఆ చేతిగాజులను పైకీ క్రిందికీ నెట్టి గాజులను త్రిప్పుతూ, ఒక వయోవృద్ధుడు స్నేహితుడైన పూల వ్యాపారితో మాటాడుతూ అతనిఅంగడిలోని పూలచెండును దీసి ఆఘ్రాణించి ముగ్ధుడై, తిరిగి అచటనే పెట్టి తను దిరిగి పరధ్యాసతో పయనమయినట్లు, ఆమె సుకోమల హస్తాన్ని విడచి ఫలహారంవైపు చూశాడు.

ఆయన కా ఫలహారం చాలా రుచికరంగా నేవున్నది. కాని, అభినందించలేకపోయాడు. తాను పొందుతున్న ప్రతి దానిలోను నిర్మల స్పర్శాలోపం యేదో కొరతగా తోస్తున్నది. ఆమెను యెప్పుడూ చూడాలని మనస్సు వాపోతుంటుంది. కాని కృష్ణద్వారా తన దుర్బలత్వం యెక్కడ పట్టుబడిపోతుందోననే భీతి పిరికివానినిచేస్తున్నది.

# 19 విఫల మనోభీష్టాలు

మిస్ మేరీ అనురాగ ఆదరాలతో రత్నాకరుడు కోలుకున్నాడు. ఆమెడ్యూటీ వేళలను, తిరిగివచ్చేటయముల‌ను మననంచేసుకుంటూ, నిరీక్షిస్తూవుండుట, ఆమె ప్రవేశించినంతనే చంద్రకిరణముసోకి వికసించిన కుసుమమువలె పులకితుడై వేగిరపడుట, ఆమె నేరుగా వంటశాలవైపు వెళ్ళి లక్ష్మిసహాయంతో తాను తెచ్చిన స్పెన్సర్ బ్రెడ్‌ను రొట్టి చేసి, జామ్‌వ్రాయుట, తాను పసిబిడ్డవలె వెళ్ళి ఆమెకూ

ర్చున్నస్టూలుకుప్రక్కగా అరుగుమీద కూర్చుని, ఆమెను ఆమెచేతిలోని బ్రెడ్‌ను కనులార్పకుండా చూస్తుండుట, ఆమె ఆయన్ను చూడనట్లే నటిస్తూ తనపనిలో యేకాగ్ర రూపంలో నిమగ్నమవుట, ఆయన చిన్నబుచ్చుకుని మునగ దీసుకునివుండుట, ఆ దృశ్యాన్నంతటిని గమనిస్తూ, లక్ష్మి ప్రేక్షకురాలివలె గిలిగింతలుపెట్టే ఆనందాన్నిపొందుతూ, ఆశ్చర్యాన్ని అణచుకొనుట, మేరీ పొయ్యివంకే చూస్తూ, లోనినవ్వును అణచుకుంటూ "లక్ష్మి, అయ్యగారేమి చేస్తున్నారో చూడు!" అంటుంది.

లక్ష్మి బైటకువెళ్ళివచ్చి "గదిలోగాని బయటగాని కనిపించలేదమ్మా" అని అధరాలుబిగబట్టి అధోముఖియైనది. మేరీ "ఆ మహాశయుడు ఊహావిహారాలలో యే వనదేవత ముందు మోకరిల్లి స్తోత్రంచేస్తున్నాడో" అన్నది. "స్తోత్రం చేయుటమేమిటమ్మా?" అన్నది లక్ష్మి. మందహాసంచేస్తూ, "వారిసంగతి నీ కింకా బాగా తెలియదు గాబోలు, వారు కవులుగా మారిపోతున్నారు. ఎదుటివారిని యేకరువుబెట్టి పొగడుటలో ప్రవీణులు. ఆ పొగడుటే స్తోత్రం!" అన్నది మేరీ. లక్ష్మి అనభిజ్ఞురాలివలె "పొగడు టెందుకు?" అన్నది. ఆమె మరింత ఆనందాన్నిపొంది "మనస్సులోని ఆశయసిద్ధికి వరాలుగోరి దేవిస్తోత్రంచేస్తారులే" అన్నది. "వరాలేమిటి?" అని ప్రశ్నించింది లక్ష్మి. "వరాలంటే గొంతెమ్మకోర్కెలకు అస్త్రాలు" అన్నది మేరీ.

మేరీకుడిచేతిప్రక్కగా అరుగుమీద ఆసీనుడైవున్న రత్నాకరుని కీ ప్రసంగం గిలిగింతలుపెట్టినట్లు శరీరం పుల

వుతున్నది. తననుచూస్తూకూడా చూడనట్లే నటిస్తూ
ను రెచ్చగొట్టుట బాల్యస్మృతులవలె మృదుమధురమై
ందడోలికలలో వూగిపోతున్నాడు.

అమాయకంగా "అయ్యగారికి అసలు కోర్కెలే
న్నట్లులేదుగదమ్మా" అన్నది లక్ష్మి. మిస్ మేరీ చిరునగ
ను చిలికిస్తూ "నీవూ బురిడీలోపడ్డావ్! నీవు బాగా గుర్తు
పెట్టుకో లక్ష్మి. ఏకోర్కెలూలేనట్లు అమాయకంగా యెవరు
కనిపిస్తారో వారిలోనే అత్యధిక ఆశలు ఆలోచనలు వుంటవి"
అన్నది.

"రత్నంబాబుగా రలాంటివారు కాదమ్మా!" అన్నది
లక్ష్మి.

"కాకపోతే, ప్రక్కనేవుండి పలుకకుండా దొంగవలె
యెందుకుచూస్తారో చెప్పు" అన్నది మేరీ.

లక్ష్మి జవాబుచెప్పజాలక దీనంగా ోడినదానివలె
అనురాగఅనునయంతో రత్నాకరునివైపు చూస్తున్నది. కుం
చించుకుపోయిన రత్నాకరుడు ధైర్యాన్నిపూరించుకుని
గొంతుపెకలించుకుని "ఆడవారికి మొగవారిని విమర్శించు
టలో ఆనందంగలుగుతుంటుంది లక్ష్మి" అన్నాడు. "నీవూ
ఆ స్త్రీజాతిలోనిదానివేనన్నసంగతిని వారు గుర్తించాలని
చెప్పు లక్ష్మి" అంటూ ఆయనవైపుకు తిరిగి "చిన్నబుచ్చు
కోనవసరంలేదు మహాశయా; స్త్రీ యెప్పుడూ పురుషుని అవ
హేళనచేయగోరదు; ఆధిక్యతనిచ్చుటకే ప్రయత్నిస్తుంది.
పురుషుడుమాత్రం స్త్రీని తేలికచేసి, తనగుప్పిట్లో ధరించా
లనిచూస్తాడు. ఆరిపోతున్నవి ముందు, ఫలహారంచేయండి"

అంటూ ప్లేటును ఆయన కందించింది. ఆయన చిరుకో
న్నటనయిస్తూ "స్త్రీ పురుషునిశిరస్సు నధిష్టించికూడా ప
ర్శిస్తుంటుంది. నిందిస్తూనే భోజనాలు ఫలహారాలు పెట్టు
కూడా అలవాటు స్త్రీలకు" అని ఆయన ప్లేటును స్వీక
రించాడు.

పూర్తిఆరోగ్యాన్ని పుంజుకున్నా; కాలేజీప్రసక్తి
లేకుండా ప్రయివేటుగా మేరీవద్దనే చదివి పరీక్షకుకూర్చో
వాలని నిర్ణయంజరిగింది. కాని కార్యరంగంలో కొన
సాగుటలేదు.

రత్నాకరుని ప్రయివేటుగా కూర్చోబెట్టి, ప్యాసు
చేయించాలనేపట్టుదల మేరీలో జనించింది. ఆ బాధ్యతంతా
తనదిగానే భావించి, తను యెన్నడూవహించనంత శ్రద్ధతో
శ్రమతీసుకుంటున్నది. ఆమె పాఠాన్నివిశేషవిశదరూపంలో
అతిసరళంగా గంటలతరబడి వినిపించి, అందలిముఖ్యాంశా
లను తనస్వదస్తూరితో నోట్సు తయారుచేసియిస్తున్నది. కాని
ఆయనముందవన్నీ నిరర్థకమయిపోతున్నవి. ఆయనమనస్సు
కొక్క శబ్దంకూడా యెక్కుటలేదు. అనర్గళంగా ఆమె బోధి
స్తున్నపుడు తను యెంత విశ్వప్రయత్నంచేసినా, మనస్సు
స్థిమితంపొంది, అర్థంచేసుకోదు. ఆమెముఖమండలంలోని
శోభితదొంతరులవైపు, వుచ్చారణలోని మాధుర్యంవైపు,
శ్రావ్యమైనకంఠంతో మంచి పాటపాడితే యెలావుంటుందా
అని, ఆమెఅధరాలు, చుబుకము, నేత్రాలు అంతఅందంగా
యెందుకు తీర్చిదిద్దబడినవా అని, ఆ కపోలాలమీదికి వక్రా
లుగా వాలి వూగుతూ నృత్యంసలుపుతున్న ఆ కురులలో

అంత అంద మెందుకున్నదా అని, ఆ ఫాలభాగం స్ఫటికము వలె అంత నునుపులుతేలి యెందుకున్నదా అని, ఆ సుకోమలకరాలు మాటలతో అనునయిస్తున్నపుడు, శాసిస్తున్నట్లు, అదేదో దేవీఆజ్ఞగా అనుభూతమవుతున్నట్లు, ప్రతి కదలికలోను ఆ అధరాలు అద్భుతమై శోభిస్తున్నట్లు ఆయన మనస్సు కలవరంచెందుతుంటుంది. ఆమె ఆగిపోయినపుడు, చూస్తున్న చుక్కానిలోని దీపం ఆరినపుడు అంధకారమై నిస్పృహతో బయటకుముఖంబెట్టి చూసిన బాలకునివలె నిట్టూర్పువిడుస్తుంటాడు. ఆమె పాఠంబోధిస్తున్నపుడు ఆయన ఆమెవైపు తదేకంగా కనులార్పకుండా చూస్తున్నపుడు శ్చితశ్రద్ధతో పాఠంవింటున్నాడని ఆమెతలంపు. కాని, రా ప్రశ్నించినప్పుడు ఆయన అయోమయావస్థలో పడి మేవాడు. ఆయన ఒక్కమాటా అర్థంచేసుకోలేదని సుకున్నపుడు విస్తుపోయి, బాధచెంది నోట్సు వ్రాసి ుది.

ఆ నోట్సును ముందుపెట్టుకొని కూర్చున్నపుడు ఆమె న ఆ ప్రతిఅక్షరంలోను మేరీముఖం ప్రతిబింబిస్తుం . చదవాలని ప్రయత్నించినపుడు ఆ అక్షరాలలోని లు తనతో దాగుడుమూతలాడినట్లు నృత్యంసలు తనను యెక్కడికో తీసుకెళుతుంటవి. చదవాలని సిన ప్రయత్నాలన్నీ విఫలమయినవి. చదివినా స మరోఆలోచనతో నిండిఉండి నిష్ప్రయోజనమవు ది. నోట్సువలనకూడా ప్రయోజనం కనిపించనపుడు, మేరీ కొన్ని ముఖ్యమైనప్రశ్నోత్తరాలను తయారుచేసి

యిచ్చింది. కాని ఫలితం యథావిధిగానే నిలిచింది. మేరీ కిదో వింతగా తోచింది.

"రత్నాకర్‌గారు, మీకు వేయి నమస్కారాలు. ఇక నావల్ల యేమీ కాదని నేటికి తెలుసుకున్నాను. కాని నిష్కపటహృదయంతో నా ప్రశ్నకు జవాబుచెబితే సంతోషిస్తాను. బోధించుటకు నా సర్వశక్తిని వినియోగించాను గాని, నిష్ప్రయోజనమయింది. రేయింబవలు పరిశ్రమజేసి నోట్సువ్రాసి యిచ్చాను; ప్రశ్నోత్తరాలు వ్రాసియిచ్చాను; యెందుకూ పనికిరాలేదు. ఇది నా దురదృష్టమో, మీ అయోగ్యతో సెలవిస్తారా?" అన్నది మేరీ.

ఖిన్నవదనంతో అశ్రుభరితనయనాలతో ఆమెవం చూస్తూ వుండిపోయాడు రత్నాకర్. ఆమె అనురాగం అర్ద్రమై, అంగుళీయములతో ఆయనచుబుకమును కుతూ "సంకోచమెందుకు? నిజం చెప్పండి" అన ధైర్యాన్నిపూరించుకుని బరువైనకంఠంతో "నన్ను క్షమి మేరీ. నేను చదువలేను. ఇక ప్రయత్నించుట ప్రయాస" అన్నాడు. ఆమె సానుభూతితో "ఆ విష నేనూ అనుకుంటున్నాను. నేనడుగుతున్నది అసలుకార అన్నది. ఆయన తిరిగి వెలవెలబోతూ అధోముఖుడై ఆమె తిరిగి "పోనీ, ఒకపనిచేస్తారూ? నేను వ్రాసియి నోట్సు చూసి, మీరు యెత్తివ్రాసుకోండి. యెన్నిమా చదివినా అర్థంగానివి కంఠస్థంకానివి కొన్ని చూచి నప్పుడు పట్టుబడతాయి" అన్నది. సరళము, సుల

అయిన నూతనమార్గమేదో దొరకినట్లు వుత్సాహితుడై అందుకు సమ్మతించాడు. మిస్ మేరీ వెళ్ళిపోయింది.

దుర్గుణానికి రవంత స్థానంచిక్కినపుడు దాని ఆధారంగా కావలసినంత స్థానాన్ని పెంచుకుని, మొక్క మాదిరై విస్తరించి వికసిస్తుంది. దానికి ప్రకృతి పూర్ణరూపంలో తోడ్పడుతుంటుంది. రత్నాకరునికి నోట్సు యెత్తివ్రాయుట కూడా అసంభవమనిపించింది. ఎవరిద్వారా తాను తేలికగా ప్యాసుకాగలనని భావించాడో, ఎవరిద్వారా తనహృదయం వినూత్నరూపందాల్చిందో, ఎవరి అజ్ఞాతప్రేరణ తనహృదయాన్ని మరిగించిందో వారిప్రతిబింబము వారిప్రేరణ తనను మరోమార్గానికి తీసుకెడుతున్నవి. వాటిని నిరోధించి, తన నిర్దిష్ట యత్నాని కుపక్రమించను తా నసమర్థుడైనాడు. ఎవరి మనస్సు మరొకరిఅధీనమవుతుందో వారికంటె అప్రయోజకు లీ లోకంలో వుండరనునది రుజువయింది రత్నాకరునికి. ఆమె వ్రాసియిచ్చిన నోట్సులోని ప్రతిఅక్షరము అమూల్యమైన ముత్యమువలె శోభిస్తున్నది. అలాంటి అసాధారణ ముత్యాలహారాల కూర్పువలెనున్న ఆ పంక్తులను యెత్తి వ్రాయాలని ప్రయత్నించుట వెర్రితనమని ఆ అక్షరాలలోని ప్రతిమలు తనను గేలిచేస్తున్నట్లు గోచరించి మనస్సు వికలం చెంది పుస్తకాలను శిరస్సుక్రిందవుంచి పవళించాడు. ఆయన కళ్ళుమూసినా యెవరో కనిపించి, మందహాసంతో లాలింపులతో నోప్రక్క, పరిహాసము, తుస్కారములతో మరో ప్రక్క రెచ్చగొడుతున్నారు. తాను పిచ్చివాడై అర్థంగాని

ఆలోచనలతో వేడినిట్టూర్పువిడుస్తూ సానుభూతికొరకు తనలో తానే వెదుక్కుంటున్నాడు.

## 20 జ్ఞానోదయం

రత్నాకరుడు కాలేజీకి వెళ్ళుట యేనాడో విరమించాడని, జబ్బుగావుండి యింటికని బయలుదేరినతదుపరి యింత వరకు ఆయనవిషయాలేవీ తెలియవని, యెక్కడున్నదీకూడా తెలియదని, అతనిపేర వచ్చిన మనియార్డరుమాత్రం పోస్టాఫీసుకెళ్ళి తీసుకున్నట్లు పోస్టుమాన్‌వల్ల తెలిసినదని చంద్రం చెప్పినపుడు బద్రీనారాయణ ఒక్కమాటుగా రసాతలంలోకి దొర్లినట్లు మతిగోల్పోయాడు. ఆయనఆలోచన నశించింది. మాటపడిపోయింది. ఒకనాడు జాతకచక్రాలకొరకు తాలను చంకబెట్టి జ్యోతిష్కులవద్దకు తిరిగి, వారిమాటలతో పొంగిపోయి కన్న కలలు నేడు తనను పరిహసిస్తున్నవి. ఆ జాతకచక్రాలను, జ్యోతిషాలను అగ్నిహోత్రానికి ఆహుతి చేస్తే బావుండుననిపించింది.

చంద్రంసహాయంతో విశేషప్రయత్నంతో రత్నాకరునిజాడ తెలిసింది. అంతేగాదు, మారుమూల ఆ పాడుబడిన శిథిలగృహంలో ఒక పనిమనిషితో వుంటున్నాడనే వదంతులు ఆ యిరుగుపొరుగువారిద్వారా తెలిసినపుడు బద్రీనారాయణహృదయం వికలంజెంది, పాషాణసదృశమైంది. చంద్రంతో తాను అక్కడికిచేరినపుడు, చంద్రానికి పాలుగాజోలు యిచ్చి, ప్రక్కననిలిచివున్న లక్ష్మి కనిపించింది.

లక్ష్మి చంద్రం పనిమనిషి. కాని తాను చెప్పకుండా

వచ్చిరహస్యంగా ఇంతకాలంనుంచీ వుంటున్నది. చంద్రాన్ని చూచినపుడు ఆమెకు ధైర్యచ్యుతికలిగి, తనేదో నేరంచేసి నట్లు భయకంపితురాలై దొడ్డివైపుకు వెళ్ళిపోయింది. మతి బోయినవానివలె తప్పటడుగులు వేసుకుంటూ రత్నాకరుని చెంతకు వెళ్ళి నిలచినపుడు, రత్నాకరుడు శిలాప్రతిమవలె వెలవెలబోయాడు. జలజలలాడుతున్న నేత్రాలతో కంపి స్తున్న తండ్రిని క్రీగంట చూసినపుడు, రత్నాకరుని హృద యంలోని దాగుడుమూతలాటలు, దౌర్బల్యము అన్నీ క్షణంలో మృగ్యమైనవి. అతనిముందు అంతా అంధకారం ఆవరించింది. ఆ అంధకారంలో ఒక జ్యోతిర్లత గనిపించింది. ఆ జ్యోతిర్లతలో అదురుతున్న అధరాలతో జలజలలాడు తున్న నయనాలతో కంపిస్తున్న జర్జరకాయంతో తనతండ్రి కనిపిస్తున్నాడు. ఆయన తనయెడల చూపిన విశేష మమ కారము, హద్దులనుఅధిగమించిన ఆధిక్యత ద్యోతకమవు చున్నవి. అత నప్రయత్నంగా తండ్రిపాదాలమీద వాలి పోయి, దుఃఖభరితకంఠంతో "నాన్నా!" అని మాత్రం అన గలిగాడు.

బద్రీనారాయణకు ఆ ఒక్కమాటమాత్రం వినిపిం చింది దప్ప తాను తనవెర్రితనంతో కన్న యెండమావుల వంటి స్వప్నాలనుగూర్చి ఆలోచిస్తున్నాడు.

ప్రక్కనుండి సాక్షీభూతునివలె తిలకిస్తున్న చంద్రా నికి ద్వేషం ప్రబలరూపందాల్చింది. తన పనిమనిషితో వచ్చి యింత రహస్యంగావుండుట సహించరానిదిగా తోచింది. ఆదుర్దా అణచుకోజాలక "ఇంత మూర్ఖపుపనిచేస్తావని

యెన్నడూ అనుకోలేదు రత్నం! చదువుపేరిట బస్తీచేరి, యిలాంటిపనులుజేసే నీబోటివా నుండబట్టే విద్యార్థుల గౌరవప్రతిష్టలు మంటగలుస్తున్నవి. పనిమనిషిని లేపుకు రావలసినంత కర్మమేంకాలింది!" అని కఠోరమైనశబ్దాలలో అన్నాడు చంద్రం.

అంత దుఃఖంతోవున్నా రత్నానికీ మాటలు కలక నేసినవి. కోల్పోయిన ధైర్యం తిరిగి ఆవేశించింది. మనస్సు లోని మలినమబ్బులు తొలగి కర్తవ్యం మిగిలిపోయింది. వెంటనే లేచి నిలిచి "నన్ను క్షమించు నాన్నా, చంద్రం మాటలుమాత్రం నిజంకాదు. నేను అలాంటి అపచారం చేయలేను." అంటూ తండ్రిని కూర్చోబెట్టాడు.

అవునో కాదో తర్కించగలస్థితి తండ్రిలో లేదు. తాడిక్రిందకూర్చుని, తానుత్రాగుతున్నది కల్లుగాదని రుజు వుచేసుకోగలవివేకం తనలోలేదని రత్నానికి తెలుసు. ఏచదు వుకొరకని తాను వచ్చాడో, తనకు తండ్రి కోరినంతధనం పంపాడో, ఆ చదువు మృగ్యమైనది నగ్నసత్యమని అందరికి తెలుసు. అందుకే ఆవిషయంలో తన నిరపరాధాన్ని రుజువుచేసుకోను వ్యర్థప్రయత్నాలుచేయదలచక తండ్రి వెంట పిల్లివలె అర్భకునివలె పయనమై యింటికి చేరాడు రత్నం.

ఆవేశించిసభూతం వదలినట్లు, చెదరినమనస్సు కుదిరి నట్లు, పోయినహృదయం దొరికినట్లు యింటికిచేరిన తదుపరి రత్నాకరుడు కర్తవ్యపరాయణుడై తను కాలంవృధాచేసి నందుకు, మనస్సు మలినంచేసుకుని జీవితాన్ని అంధకారం

చేసుకున్నట్లు, తన భావి ఉజ్జ్వలజీవితాన్ని కలలుగంటున్న తండ్రిని వ్యథాభరితుని జేసినట్లు పశ్చాత్తప్తహృదయుడై పరితపిస్తూ ఆలోచిస్తున్నాడు. కాని, బద్రీనారాయణకోపం కరుడుగడుతున్నది. విసిగి నిస్పృహ చెందిన తాను యిక వీరి భవిష్యత్తునుగూర్చి ఆలోచించుటే అనవసరమనే నిర్ణయానికివచ్చి, తన పరలోకచింతననుగురించి పరిశోధనలు ప్రారంభించాడు. తనపేటలోనే వుంటున్న శివప్రసాద్ చిన్నవాడైనా శిథిలాలయాన్ని వైభవోపేతంగా పునర్నిర్మించి యజ్ఞయాగాదులు జరిపించాడు. అందు నిత్యమూ పూజలు జరుపు యేర్పాటుచేశాడు. ఆవిషయాలే తనముందు ఆదర్శప్రాయంగా, యేకైక జీవన్ముక్తిమార్గంగా ద్యోతకమవుచున్నవి. తానూ రోజూ ఆ ఆలయానికెళ్ళి పూజిస్తే బావుండుననిపిస్తున్నది. తానూ అలాంటి దైవకార్యమేదైనా సాధిస్తే' బావుండుననిపిస్తున్నది. ఆవైపే మొగ్గుతూ వెదుకుతూ, వ్యథజెందుచున్న ఆయనమనస్సులో రత్నాకరుని విషయం చోరలేకపోయింది.

"నేను మహాపరాధంచేశాను అమ్మా! అయినా, నీముందు నేను ప్రమాణంచేసి చెబుతున్నాను; చేయరాని పని చేయలేదు. జబ్బుపడికూడా మీకు తెలియనీయకుండా బాధపడుతూ, చదువును పాడుచేసుకున్నాను. అందుకు అమిత పశ్చాత్తాపపడుతున్నాను. క్షమించమని నాన్నతో చెప్పు అమ్మా. మళ్ళీ కాలేజీలో జేరి, చదువుకుంటాను. ఈ దఫా తప్పక ప్యాసవుతాను" అనితల్లితో వినయవిధేయతలతో

ప్రాధేయపడ్డాడు రత్నం. ఆడవారిమనస్సు యెంత కఠోరంగా కనిపిస్తుందో అంత సున్నితమైనది.

నరహాసవదనంతో "ఆరోజు నేను అలాంటి కలలు కనుట మంచిదిగాదని యెంత చెప్పినా జాతకచక్రాలుపట్టుకు తిరిగి పొంగిపోయాడు. ఈనాడు మామూలువిషయాలకే ధైర్యచ్యుతితో వైరాగ్యాన్ని వూహించుకుంటున్నాడు. అన్నివేళలా ధైర్యంతో మనకుదగ్గ కృషిసలిపినపుడు మనకుతగినవే లభ్యమవుతవి. రత్నం యేకటీరుగా పశ్చాత్తాపపడుతూ చదువుకుంటాననని విలపిస్తున్నాడు వాడిని కాలేజీలో చేరమనండి" అన్నది కళ్యాణి భర్తతో.

"ఈ విషయాలలో నీవు పట్టించుకోకు. నీకు తెలియదు. వాడు గొప్పవాడై వంశాన్ని వుద్ధరిస్తాడనుకున్నాను. కాని వాడిభవిష్యత్తును కనులార మద్రాసులో చూసి వచ్చాను." అన్నాడు బద్రీనారాయణ.

"మీరు మరీ పంతంపట్టి కూర్చోకండి. దారితప్పి, బాధలనుభవించి, తిరిగి దారిలోకొచ్చినవాడు యెంతైనా పైకిపోగలడు. దారితప్పినవానినే దండించైనా దారిలో పెట్టాలి" అన్నది కళ్యాణి.

కల్యాణిప్రయత్నం విఫలమైంది. ఎన్నివిధాల విన్నవించినా, విసిగిపోయి కఠుడుగట్టిన బద్రీనారాయణ వినలేదు. కాని కృష్ణతోపాటు శివప్రసాద్ లెక్చరర్ వద్దకే పోయి, ప్రయివేటుగా చదివి, పరీక్షలోకూర్చోమని సలహాయివ్వ గలిగింది.

రత్నాకరుడిపుడు శ్రద్ధాభక్తులు, వినయవిధేయతలు

గల, శివప్రసాద్ శిష్యుడు. రత్నాకరుడు పూర్తిగా మారి పోయాడని, బుద్ధికుదిరిందని, ఏవయినా, వాటిసమయమొచ్చి నపుడు అలానే చక్కబడుతనని, జాతకచక్రప్రభావం జీవితంలో ప్రభవించవలసినఘడియకే ప్రభవిస్తుందని, తప్పుడు దారిలోపడిపోయి, నిలదొక్కుకుని నిగ్గుదేలిన రాజమార్గానికి రాగలిగినవాడు మహాయోగ్యుడు సమర్థుడు అవుతాడని వివిధ విధాలుగా యిరుగుపొరుగువారు అనుకుంటున్నారు.

ప్రయివేటుగాచదివి పరీక్షలలోకూర్చుని రత్నం ప్యాసయినసంగతి తెలిసినపుడు బద్రీనారాయణ పొంగి పోయాడు. ఆయనహృదయంలో ఆనందం వెల్లువలై పొర లింది. అణగారిపోయిన కలలు తిరిగి చిగిర్చినవి. తన యింటిలో ఆనందాన్ని పునఃప్రతిష్ఠించినది శివప్రసాద్‌గారే నని, ఆయన మహాయోగ్యుడని, అఖండ విద్వత్ సంపన్ను డైన సజ్జనుడని, ఆయన్నుగురించి వేనోళ్ళ పొగడుతున్నాడు బద్రీనారాయణ. ఆ యింటిలో అందరకు ఆరాధ్యదేవతగా హృదయావృతమై ప్రభాసిస్తున్నాడు శివప్రసాద్.

శివప్రసాద్‌తో బద్రీనారాయణ కుటుంబసంబంధం ఘనిష్టగూపందాల్చింది. బద్రీనారాయణ చేయు ప్రతికార్యానికి శివప్రసాద్ సలహా ముద్రపడనిదే కార్యరూపందాల్చుట లేదు. శివప్రసాద్ గంభీరమైనవ్యక్తి. ఆర్భాటాలూ అప్ర స్తుతప్రసంగాలు ఆయనవద్ద మచ్చుకుకూడా లేవు. అయినా, ఆయనవద్ద తనఅభిప్రాయాలు చెప్పి, ఆయనమానాన్ని అంగీకారముద్రగా పరిగణించుట బద్రీనారాయణ కలవా టయిపోయింది. తమకుటుంబంపాలిటి పెన్నిధిగా భావిస్తు

న్నారు శివప్రసాద్‌ను. కాని శివం యెవరినిగురించి యేమి అనుకునేదీ తెలియదుగాని నిర్మలను తన కుటుంబంపాలిటి పెన్నిదిగా తలంచుచున్నట్లు అర్థమవుతున్నది.

రత్నాకరుని కిపుడు తనయింటిలో కోల్పోయిన ఆదరాభిమానాలు హక్కులు పునఃప్రతిష్ఠితమయినవి. ఇపుడు సాదరుఖర్చులకు కావలసినపైకం సంప్రాప్తమవుతున్నది. శివప్రసాద్ సప్రేమాదరములను మరింత చూరగొన్నాడు. రత్నాకరునిలోని విశిష్ట పట్టుదలతో గూడిన అధ్యయనదీక్ష నమ్రతలు అందరను ఆశ్చర్యచకితులనుజేస్తున్నవి. ఆరోజులలో యీవ్యక్తి అలాంటికార్యా లెలాచేశాడా అని, అపు డేదో భూతం ఆవేశించివుంటుందని, ఇపుడా భూతం వదిలిపోయింటుందని కొందరిఅభిప్రాయం. శివప్రసాద్‌గారి విశేషప్రజ్ఞవలన అలా మారిపోయాడని కొందరి అభిప్రాయం. ఫీజులకుఆశించకుండా, స్వప్రయోజనాలు తెలియకుండా, పరస్పరప్రీతితో గూడిన మోమోటమిలచే అత్యధిక శ్రద్ధతో శివప్రసాద్‌గారుగనుక ప్రయివేటు చెప్పగలుగుతున్నాడని, బద్రీనారాయణపరివారం నిత్యమూ పొగడుకుంటున్నరు.

శివప్రసాద్‌వద్ద చదువుచున్న విద్యార్థిబృందంలో రత్నాకర్ ఒక్కడు వేరుగా కనిపిస్తున్నాడు. మంగళనాథ్ ఆధ్వర్యంలో జరుగు నాటికవిషయంలోగాని, ఛెస్, కేరమ్స్, మొదలగు ఆటపాటలలోగాని రత్నానికి వుత్సాహంలేదు. ఘోరవలేదు, సంపర్కమూ లేదు. అతను సహచర్యాలకు సాంప్రదాయ్యాలకు పనికిరాని పుస్తకాలపురుగు అని అందరి

లోను ప్రబలమైన ప్రచారంజరిగిపోయింది. కృష్ణకూడా రత్నాన్ని 'పుస్తకాలపురుగు' అని అవహేళనచేస్తుంటుంది. తన రత్నంను పుస్తకాలపురుగుగా అందరూ పరిగణిస్తుండుట విన్న బద్రీనారాయణలోని వెనుకటి వూహాలు మరింత ప్రబలరూపందాలుస్తున్నవి. తనబిడ్డ చదువులో అంతగా లీనమైపోయినందుకు ముగ్ధురాలై, మిగతా బిడ్డలమీద కసురుకుని "వాడినిచూసైనా బుద్ధితెచ్చుకోండి" అంటున్నది కళ్యాణి.

## 21 ముద్రికా ప్రసాదం

మంగళనాధ్ కాలేజీలో డిబార్ అయినందున ప్రిన్సిపాల్ విషణ్ణదృక్కులకు గురియైనందున, విద్యార్థిదశలోని అభిరుచి అంతంగానందున మంగళ్‌నాధ్ యీ ప్రయివేటు విద్యార్థులలో చేరాడేగాని, అధ్యయనంలో శ్రద్ధచూపలేకపోతున్నాడు. ఉల్లాసవంతుడు, అల్పసంతోషి, అందరికి ఆప్తుడు. ఎవరిబాధనూ చూడ్చజాలడు. తోటివిద్యార్థుల కొరకు తను యెంతధనాన్నైనా వెచ్చిస్తుంటాడు. సంఘజీవి. యెప్పుడూ మందిలో వుంటూ, ఆకర్షిస్తుంటాడు. తాను కూర్చిన "తిరుగుబాటు" నాటికను యెన్నోమార్లు ప్రదర్శించాడు. అందు తను ముఖ్యపాత్రధరించాడు. అనేకమంది అభినందించారు, ప్రశంసించారు. అందు మంగళనాధ్‌పాత్ర మరింత అద్భుతంగావున్నదని కృష్ణకుమారి యెన్నోమార్లు పొగడింది. ఆమెపొగడ్తలతో పరవశుడై రేయింబవలు నాటి

కా ప్రదర్శనలలోనే మునిగిపోయాడు. అందుకు కర్టెన్సు, డ్రస్సింగ్సు మొదలగువాటిని వేయిరూపాయలుపెట్టి కొని వేశాడు. నాటికలో కొన్ని పద్యాలుకూడా కూర్చాడు. వాటిని మంగళనాథ్‌గాత్రంలో విన్నపుడు కరతాళధ్వనులు కల్పించింది కృష్ణ.

ఆయనలోని అవిచ్ఛిన్నమైన సరళత్వము, నిర్మలత్వము, నిష్కపటము, అల్పసంతోషము, త్యాగబుద్ధి కృష్ణను ముగ్ధురాలినిచేసి, ఆకర్షించినవి. ఆయనలోని ప్రతి చర్య త్యాగంతోను వుత్సాహంతోను ఆమెకు ద్యోతకమవుచున్నది. ఆయన అందరికి ఆప్తుడుగా సన్నిహితంగా వుంటాడు. కాని, ఆత్మీయంగా ఆయనక్షేమాన్ని గోరేవారెవరూ ఆమెకు గనిపించక, అందరియెడ ద్వేషము, ఆయనయెడ సానుభూతి బలపడుతున్నవి. ఒక్కొక్కరిగా అందరితోను సాపేక్షికంచేసిచూసింది. మంగళనాథ్‌కు మంగళనాథే సాటిగా గనిపించాడు. అతనియడల సానుభూతితోగూడిన అనురాగంతో పులకితమవుతున్నది. నిర్మలను ప్రేరేపించి, ఆమె అనురోధంతో 'నటమందిర్'లో ప్రదర్శితమయ్యే నాటికకు శివప్రసాద్ అధ్యక్షతవహించుట జరిగింది.

నాటికఅనంతరం ప్రశంసిస్తూ అందు మంగళప్రావీణ్యాన్ని, నటనాకౌశల్యాన్ని, రాజకీయచైతన్యాన్ని స్తుతిస్తూ శివబాబు అరగంటసేపు మాట్లాడినపుడు అందరూ మంగళనాథ్‌ను ఆపేక్షతో ఆత్మీయతతో చూస్తూ మనసా అభినందించారు. ఆసమయంలో కృష్ణ మరింత పరవశురాలయింది.

ఆ నాటిక ప్రదర్శింపబడిన మరునాటి సంధ్యాసమయ

మది. అంధకారరాకాసి వెలుగును మింగివేస్తూవున్నది. పంచమినాటి శశిధరుడు గాఢగారగా కనిపిస్తున్నాడు. దిగంత విశ్వంలోని నీలిమాకాశము బూజురుగప్పుకుంటున్నది. అంగారకుడు గాబోలు పోటీపడుగులుతీస్తూ వస్తున్నట్లు మిణుకు మిణుకుమంటూ, ద్యోతకమవుచున్నాడు. నిర్మల యింటి పనిలో నిమగ్నమైయున్నది. మంగళనాథ్ అందరికంటె ముందువచ్చుట నిత్యము జరుగుతుంటుంది. కృష్ణ అంతకంటె ముందువచ్చి నిరీక్షిస్తూ, ఏదో దీర్ఘాలోచనలుచేస్తున్నది. మంగళనాథ్ శంకర్స్పీక్లీ గాబోలు తిరుగవేస్తూ కూర్చు న్నాడు. కృష్ణ సంకోచబిడియాలతో పిల్లి అడుగులు వేసు కుంటూ మంగళనాథ్సమీపానికి చేరి, పలుకరింపజాలక చూస్తూ నిలిచింది. మంగళనాథ్ స్త్రీలయెడ ఆదరస్వభావము గలవాడేగాని, వారిని పరిచయముంచేసుకొనుటలోగాని, సంభా షించుటలోగాని అపేక్షాలేను, అలవాటూలేదు. యే స్త్రీ అయినా పలుకరించితే, అంతటితోనే ఆ పరిచయం పరిస మాప్తమవుతుంటుంది. అందుకే కృష్ణ తనకు దగ్గరగా వచ్చినపుడు తనదృష్టిని పుస్తకంలో మరింత దీక్షతో నిలిపాడు.

కృష్ణః-చాలా తొందరగా వచ్చినట్లున్నారు మంగళ నాథ్గారు?

మంగళః- నేను నిత్యము యిదేవేళకు వస్తుంటాను.

కృష్ణః- మీ నాటికలోని భావాలు నాకు బాగా నచ్చినవి. నిజానికి. పదవీవ్యామోహంతో తనవ్యక్తిత్వాన్ని చంపుకుని దేశాన్ని యేమిచేస్తున్నా అధ్వాన్నముపైపుకు

తీసుకెళుతున్నా, పైనాయకులకు అండగానిలచి నోరు మెదుపకపోనటం అనర్థకమే.

మంగళ:—అర్థంచేసుకుని సానుభూతిని ప్రకటించినందుకు సంతోషం.

కృష్ణ :- మీ నటన మహా అద్భుతంగావున్నది మంగళనాథ్.

మంగళ :- కృతజ్ఞుణ్ణి.

కృష్ణ :- (ఆయన ముక్తసరిగా మాట్లాడుటచే విసిగి) మంగళనాథ్‌గారూ, ఒక్క విషయం మీకు చెప్పాలనివుంది, అన్యథా తలంచక క్షమించి, నామాటను మన్నిస్తారా?

మంగళ :- తప్పకుండా.

కృష్ణ :- (తన వ్రేలిఉంగరాన్ని తీసి, ఆయనకిస్తూ) మరేమీ అనుకోక, దీన్ని మీ నటనాకౌశల్యానికి ముగ్ధురాలనై ఆత్మతృప్తికొరకు అపేక్షతో కానుకగా యిస్తున్నాను స్వీకరించండి.

మంగళ :- (పుస్తకాన్ని మూసివేసి వెలవెలబోతూ) ఇదేమిటి? మీ కలా కనిపించినందుకు ధన్యుణ్ణి. కాని, అది మామూలునటనే. మీరు స్త్రీలు; పైగా అస్వతంత్రులు. కనుక దయతో నన్ను క్షమించండి. మీ కానుకను నేను పొందినట్లే భావిస్తాను.

కృష్ణ :- దీన్ని మీరు స్వీకరించకతప్పదు. మీ ప్రతిభ మీకు గొప్పగా కనిపించినా భావించినా అది రాణించదు. ఇతరులద్వారా గుర్తించబడినదే శ్లాఘనీయము. నేను స్త్రీ నయినంతమాత్రాన విశిష్టమైనదాన్ని, దాని

నిజస్వరూపంలో గుర్తించుట అపరాధమంటారా? (అంటూ ఆమె బలవంతంగా ఆయనచేతిలో వుంచింది.)

మంగళ:—(ఆమెవంక తదేకధ్యానంలో చూస్తూ, తిరిగి యివ్వప్రయత్నిస్తూ కరుణార్ద్రకంఠంతో) ఎందుకైనా మంచిది, దీన్ని మీవద్దనే వుంచండి. నాకిచ్చారు, స్వీకరించాను. తిరిగి దాయమని మీ కిస్తున్నాను. నాదగ్గర యేవస్తువూ నిలువదు. కనుక, దీన్ని దయతో మీవద్దనే భద్రంగా వుంచమని ప్రార్థిస్తున్నాను.

కృష్ణ:- (ఆయన యివ్వబోతున్న ఉంగరాన్ని నిరోధిస్తూ) ఒకరికొరకు తనస్వభావానికివిరుద్ధంగా నడిచినపుడే విశిష్టత బయల్పడుతుంది, త్యాగం ద్యోతకమవుతుంది. నాకు మీయడల గలిగిన అవ్యాజమయిన అభిమానానికిగాను నేను సమర్పిస్తున్నాను, దాన్ని మీరు అతిశ్రద్ధతో బజినిగా కాపాడగలిగినపుడే ప్రత్యాశితఫలితం లభించినట్లు.

మంగళ:- మీరు క్షమించండి. అసంభవమైనపని చేయగలనుగాని, ఒకవస్తువును దాచుట నావల్ల కానిపని.

కృష్ణ:- శ్రద్ధ జాగ్రత్త అనురాగము ప్రేమలు ప్రయత్నంతో తెచ్చుకుంటే వచ్చేవి కావు. స్వప్రభావజనితాలు. దీన్నిమీరు గుప్తగా వుంచగలరో లేదో దానిబాధ్యత నాది గాదు. దీన్ని మీరు స్వీకరించితీరాలి. (అంటూ ఆమె ఆయనహస్తాన్ని వత్తుతుంది.)

ఎవరో వస్తున్నపదసవ్వడి విని కృష్ణ తుర్రున వెళ్ళిపోయింది. మంగళ్ మతిపోయినవానివలె చేతిలోని రింగును గుప్పెట్లో బిగించుకుని తప్పటడుగులు వేసుకుంటూ బయట

రోడ్డుమీదికి వచ్చి, ఏమీతోచక అచటనే నిలిచిపోయాడు. మిణుకుమిణుకుమంటున్న రోడ్డులైట్లు ఒకేవరుసలో తీర్చి వెలుగుతున్నవి. అంతరిక్షంవైపు పరికించాడు. చిరపరిచితమైన నక్షత్రమండలంలో నూతనశోభ కనిపిస్తున్నది. నభోమండలంలోని ప్రతినక్షత్రము తనను ఆదరంగా అభిమానిస్తున్నట్లు ద్యోతకమయింది. అవి యెవరికొరకో వెదుకుతున్న విరహదృక్కులుగా బిరబిరలాడుచున్నవి. ఆ విరహదృక్కులలోని మృదుతాపంలోని జిలిబిలినృత్యం గిలిగింతలను కల్పిస్తున్నది. వాటిలోని దీక్ష పరికించినకొద్దీ స్థిరమైందిగా మాత్రమే తెలిసి, తన అనభిజ్ఞతకు నొచ్చుకుంటున్నాడు. నేత్రాలునులుముకుని శోభాయమానమైన గగనాన్ని తిరిగిపరికించాడు. అనునయదృక్కులు మధుభరితంగా గోచరిస్తున్నవి. తనను ప్రార్థిస్తూ ఆత్మార్పణ గావించుకుంటూ స్వీకరించమని చేతులుచాచినట్లు తోచింది. తనచేతిలోని రింగును వ్రేలుకుపెట్టుకుని చూసుకున్నాడు. అందులోని గోమేధికము అంగారకునికంటె తీక్షణంగా మెరిసింది. ఆ జాతిరాయిని చూస్తున్నకొద్దీ అందులో ప్రస్ఫుటమైన ముఖమండలం కనిపిస్తున్నది. వెర్రివానివలె ఆ ప్రతిబింబాన్నే చూస్తున్నాడు. చూస్తున్నకొద్దీ అతనిశరీరం పులకితమవుతున్నది. ఆ రింగులో అమూల్యవిలువ యెక్కడో దాగివున్నట్లు ద్యోతకమై వెంటనే దాన్ని దొంగసొత్తును జాగ్రత్తపరచువానివలె పేపరులోచుట్టి పాంటుజేబులో వేసుకుని, తపస్సుద్వారా మంత్రశక్తిని గడించిన మాంత్రికునివలె లోపలకు వెళ్ళిపోయాడు.

# 22 అధ్యాయనం

నిర్మలానూర్జహాన్ తెలుగుభాషలో అనర్గళంగా చదువను వ్రాయనేగాకు, భాగవతం చదివి శబ్దార్థసహితంగా తాత్పర్యాన్ని వివరించి భవానిని మెప్పించగలుగుతున్నది. ఆమెకంఠంలోని కమనీయత అద్భుతమైందని, ఆమె భాగవతంచదువుతుంటే, ప్రవాహపువాలునబడి పోవు నావవలె మనస్సు ఆనందంలో ఆర్ద్రమై సముద్రపు తేలుతుందని, శ్రావ్యమైన ఆమెకంఠంలో చదువుతున్నంతసేపూ మత్తులోమునిగినట్లుంటుందని, ఆమె నిశ్చలమనస్సులో నిర్మలవదనంతో కూర్చుని భాగవతపఠనంచేస్తున్నపుడు శ్రోతలకు సాక్షాత్ సరస్వతీదేవి ప్రత్యక్షమై పఠిస్తున్నట్లుంటుందని ప్రశంసలు పొందింది. ఇంగ్లీషులోకూడా అంతటి విజ్ఞానాన్ని కల్పించాలనిశివప్రసాద్ ప్రబలయిచ్ఛ. ఆడపిల్లలకుయింగ్లీషు చదువులు అనవసరము అనర్థకమునని భవానీఅభిప్రాయము. శివప్రసాద్ మనస్సును మెప్పించాలని, ఆయనకోర్కె ప్రకారం కష్టపడి ఇంగ్లీషుకూడా చదివి, ఆయన్ను ఆనందపర్చాలని నిర్మల అభిలాష.

నిర్మల తెలుగుఅధ్యయనంలోకంటె ఇంగ్లీషుఅధ్యయనంలో మితిమించి శ్రమించింది. ఫలితం సంతృప్తికరంగా లేదు. వ్యాకరణం సరళమై భాష తేలికయిందని వింటున్నంతసేపూ అనిపిస్తుంటుంది. కాని ఆ వుచ్చారణలో ఆమెకు తెలియని బిడియాన్ని కల్పిస్తుంది. ఒక పల్లెపడుచు అధరాలకు రంగునద్దినేనో, రెండుజాలుజడలు వేస్తేను, లేక ఒక పట్టణ

విద్యార్థి క్రిరుచెప్పులుతొడిగి తలపాగచుట్టి, కర్ర చేతబట్టి నిలిస్తేను యెంత అస్వాభావికంగావుంటుందో అలానే అర్థంగాని సంకోచబిడియాలు ఆమెను కించపరుస్తున్నవి. ఇంగ్లీషుశబ్దాలను స్పష్టరూపంలో వుచ్చరించాలను కుంటుందికాని, తెచ్చిపెట్టుకున్న కంఠంవలె భావించి వెలవెల బోతుంది. ఎవరూలేనపుడు తనకుతానే యెంతగానో కించ పడుతుండేది. "బిడియంతోను సంకోచంతోను బాధపడు తున్నావుదప్ప, నీవు తెలుగుకంటె తేలికగా ఇంగ్లీషు నేర్చు కోగలవు"అని శివప్రసాద్ అన్నపుడు, ఆమెముఖం విప్పారు తుంటుంది. తెలుగుపుస్తకాలు తీసుకెళ్ళి శివప్రసాద్ యెదుట కూర్చున్నంతచనువుతోను సాహసంతోను ఇంగ్లీషుపుస్త కాలతో వెళ్ళగలిగేదిగాదు. ఇంగ్లీషుపాఠాలు కృష్ణదగ్గర చెప్పించుకుని చదివి, శివప్రసాద్ విస్తుపోవునట్లుచేయాలని కూడా ప్రయత్నించింది. కాని, కృష్ణద్వారా అందుకుతగిన ప్రోత్సాహం లభించలేదు. ఆమెకు చదువుకంటె విమర్శనా దృష్టియెక్కువ. రేయింబవలు కబుర్లుచెప్పగల్గును,వినగల్గును గాని, గీటుమీదనడిచినట్లు పాఠాలు చెప్పుటగాని, చదువుట గాని ఆమె కభ్యాసంలేదు.

రత్నాకరుడు ప్యాసయినతరువాత చదువుమీద శ్రద్ధ ద్విగుణీకృతమయింది. మంగళనాథ్‌నాటికగాని, అందు పాల్గొంటున్న యువకబృందంస్నేహాలుగాని అతన్నాకర్షించ లేదు. వెలివేయబడినవానివలె వేరుగానే నిర్దిష్టస్థానములో వుండి, యెప్పుడూ చదువుతూ కనిపిస్తుంటాడు. పుస్తకాల పురుగుగా అందరిఅవహేళనకూ పాత్రుడై, చెల్లెలు కృష్ణ

పరిహాసానికి పాత్రుడయినాడు. అతనిపట్ల విద్యార్థు లెవరికీ ఆదరంగాని, అభిమానంగాని లేవు. వినయవిధేయతలు, చదువుయెడల శ్రద్ధకలిగిన విద్యార్థి సాటివిద్యార్థులలో మన్ననలకు ప్రత్యామ్నాయంగా హేళనకు పాత్రుడవుట పరిపాటి. కాని అలాంటి శ్రద్ధాభక్తులుగల విద్యార్థి అధ్యాపకుల నాకర్షించుటకూడా సహజమే. శివప్రసాద్‌కు రత్నాకరుని యెడల అత్యధిక ఆదరము జనించింది. నేడు గంటలతరబడి రత్నాకరునికి పాఠంబోధించుటలో తన్మయుడవుతున్నాడు. పాఠంలోని మౌలికమైన సమాలోచనలతో రత్నాకరుని బుద్ధి నింపుతున్నాడు. తను బోధించిన విషయ విశేషాలను శ్రద్ధతో ఆలకించి, మననంచేసుకుని, చదివి సంతృప్తిపరచు సమాధానాలొస్తున్నందున ఆయనమనస్సక్కడే మరింత లగ్నమైనది.

స్త్రీబుద్ధి కొన్నికోణాలలో అతితీక్షణంగాపనిచేస్తుంది. రత్నాకరుడు యే అస్త్రంతో శివప్రసాద్ నంతగా ఆకర్షిస్తున్నాడో, నిర్మల అర్థంచేసుకున్నది. తనను అంతకంటె వేయి విధాల అధికంగా ఆదరిస్తున్నా, ఆప్యాయత వలికిస్తున్నా, నిర్మల కది యీర్ష్యగా మనస్సులో వేధించింది. రత్నాకరుని కంటె శ్రద్ధగా చదవాలని చేసిన యత్నఫలితంగా రత్నాకరునిప్రక్కనే తానూ పీఠంవేసింది. తెలియనివి రత్నాకరుని ద్వారానే తెలుసుకుంటున్నది. రత్నాకరునియెదుట యెలా చదవుటకైనా ఆమెకు జంకులేదు. బిడియంలేదు. అందువలన గళం సాఫీచేసుకుని నిర్భీతిగా చదవగలుగుతున్నది. ఆ నిర్భీతి నిస్సంకోచము లామెచదువుకు మెరుగులుదిద్దినవి.

ఇపుడు నిర్మల యింగ్లీషు సాఫీగా, ధారాళంగా చదవగలుగుతున్నది. ఏపుస్తకాన్నైనా చదవగలదు. ఆమె కిపుడు ఇంగ్లీషుచదువులలో కూడా అభిలాష హెచ్చింది. రత్నాకరునితో పోటీపడి చదువుచున్నది. ఎవరు యెక్కువ శ్రద్ధతో చదువుచున్నారని చెప్పుట కష్టమైనవిషయం. కాని నిర్మలానూర్జహానిపుడు ముఖ్యంగా రత్నాకరునితో నేపాఠాలు చెప్పించుకుంటున్నది. అవసరమైనవి నిస్సంకోచంగా అడిగి తెలుసుకుంటున్నది. కాని శివప్రసాద్ వద్ద పాఠాలు చెప్పించుకునే అలవాటును యథావిధిగానే సాగిస్తున్నది. ఆకస్మికంగా ఇంగ్లీషులో ఆమెకుకలిగిన చురుకుదనమునకు శివప్రసాద్ తన్మయుడైనాడు. ప్రయివేటు పేరుతో వచ్చి చేరి, నాట్యమండలిగా రూపొందినవారిలో చేరక, రత్నాకరునివలె నిర్మలకూడా పోటీపడి శ్రద్ధతో చదువుచున్నందుకు శివప్రసాద్ ఆనందించాడు.

శివప్రసాద్‌కు ఫలహారాన్నిస్తూ "బాబుగారు, మంగళ్‌నాథ్‌కు యెప్పుడూ డ్రామావెర్రిదప్ప చదువుధ్యాస లేదు. ఆయనతోపాటు అందరూ ఆ హడావిడిలో నేవుంటారు. ఇపుడీ నాటకమండలి పేరు'శివనాటకసమితి'అని నామకరణం చేస్తారుట. 'తిరుగుబాటు' నాటికలో పద్యాలు, పాటలు కూర్చారుట. వాటిఅభ్యాసంతో మా చెవులు చిల్లులుపడి పోతున్నవి. చదువుసంధ్యలులేకుండా యిక్కడ చేరి, యీ డ్రామాగోల ఎందుకు చెప్పండి? వారిని యిక్కడికి రావద్దని చెప్పండి" అన్నది నిర్మల.

ఆయన చిన్న మందహాసంతో ఆమెచుబుకాన్ని పుణు

కుతూ "వాళ్ళు డ్రామాలు వేసుకుంటే మనకు నష్టమేమిటి చెప్పు?" అన్నాడు.

"చదువు పేరుతో యిక్కడకు వస్తూ, చదువు లేకుండా డ్రామాలు వేయుట మంచిదంటారా? ఆ దోషం మీామీాదికే రావచ్చును" అన్నది.

"మనదోష మేముందిగనుక?" అన్నాడు.

"వారువచ్చింది చదువుకోసంగనుక చదువుకోమనండి లేకుంటే వెళ్ళమనండి" అన్నది.

"నీవు అమాయకురాలవు నిర్మలా! మానవశక్తి ఒకేకోణంలో ప్రభావితమైతే క్షేమమూగాదు, అభ్యుదయమూ గాదు. అందరూ వినయవిధేయతలతో పుస్తకాలలోనే నిమగ్నమయితే, సమాజానికి కావలసినవన్నీ సమకూరవు" అన్నాడు.

"అదేమిటి బాబుగారు! వారు చదువుకుంటున్నారని వారి పెద్ద లనుకుంటారు. మీాయడలగలవిశ్వాసంతో నిశ్చింతగా వుండివుంటారు. కాని నిజస్థితులు తెలిసినపుడు, మీారు జాగ్రత్తచేయనందుకు మిమ్మన్యథా భావించవచ్చు. ఈ అలజడి అంతటికి ముఖ్యకారకుడు మంగళనాథ్. ఆయన ప్రవర్తన అంత మంచిదిగా తోచదు. కనీసం, ముందు ఆయన్నయినా మనయింటికి రావద్దని చెప్పండి. రత్నాకర్ లాంటి విద్యార్థులిరువుడున్నా యెంతో బాగుంటుంది. అతని వలన మీా కెంతో ఖ్యాతివస్తుంది. అతనిని చూసిఅయినా వీరికి బుద్ధిలేదు" అన్నది నిర్మల.

ఆయన దరహాసంజేస్తూ, ఆమెహస్తాన్నిబట్టి లాగి

ప్రక్కన శయ్యమీద కూర్చుండబెట్టి, నీపునిమురుతూ "మానవస్వభావం జలమువలె చంచలమైనది. ఏసమయంలో యెలా రూపొందుతుందో యెవరూ నిర్ధారింపజాలరు. ఒక నాటి చెడు మరోనాడు మంచిగా పరిణమించవచ్చు. నీవు యెవరినిగురించి హేయంగా తలుస్తున్నావో, అతను స్వచ్ఛమైనవాడు. నిస్వార్థసేవానిరతిగలవాడు. స్వార్థంతెలియని వాడు. న్యాయము, ధర్మముకొరకు వాపోవుహాడు. అతని మనస్సులోని ప్రతిబింబమే ఆ నాటిక. ఆ నాటికలోని విషయాలు యదార్థసత్యాలు నిర్మలా. అలాంటి పరమసత్యాలను నిర్మొగమాటంగా, నిష్కర్షగా, నిర్భితిగా చాటుట అందరికీ సాధ్యమైందిగాదు. అలాంటి ఆందోళనలు లేక పోతే, దేశములో న్యాయము, ధర్మము లుప్తమైపోతాయి. కనుక, మనఆడులోచేరి, అలాంటికార్యాలు చేసుకుంటున్న వారిని పరిహాసించి, వినయంతో చదువుకొను రత్నాకరుని హర్షించుట వివేకంగాదు. ఒకరు బుద్ధిమంతుడై శ్రద్ధగా చదివి వుద్యోగాలుపొంది, తననుతాను పోషించుకోగలిగితే మనకు కలిగే మేలేమిటి చెప్పు?" అన్నాడు.

ఆమె అనభిజ్ఞురాలివలె వెలవెలబోతూ "ఆ నాటిక లోనివిషయాలు అంత పరమసత్యాలయితే, అలాంటిసత్యాలను చాటుటే సంఘక్షేమమయితే, మీరావైపు యెందుకు శ్రద్ధవహించరు? వైమనస్యంగా కనిపిస్తారెందుకు? రత్నాకరునియడల శ్రద్ధవహిస్తారెందుకు?" అని ప్రశ్నించింది.

"అందరకూ అన్నివిషయాలూ సాధ్యంగావని ముందే చెప్పాను. అందరూ వుపన్యసించలేరు కాని, బాగావున్న

వుపన్యాసాన్ని అందరూ మెచ్చగలరు. అందరూ నటించలేరు, పాడలేరు కాని, మంచినటనను పాటను అందరూ ఆనందించగలరు, హర్షించగలరు. అధ్యాపకునిమనస్సు వినయవిధేయతలతో చదివేవానివైపే సహజంగా మొగ్గుతుంటుంది" అంటూ, జిలిబిలిగా రేగి వక్రాలుగా ఆమె ఫాలభాగంమీద పడివున్న కురులను తనహస్తద్వయంతో సరిదిద్దుతూ, స్వేదంచే క్రిందివైపుకు జారిన ఆమెతిలకాన్ని దిద్దుతూ, ఆమెచుబుకాన్నిపట్టి వూపి, శిరస్సును తనవక్షస్థలంమీద అదుముకుని, ఆమెబాహువులను నిమురుతూ దంతాలను కరకరమనిపించి, తన కుడిహస్తంతో ఆమె చుబుకాన్నిపట్టి పైకెత్తి అపరాహ్నపు సూర్యకిరణములవలె తేజోమయ తీక్షణదృక్కులతో చూస్తూ, వేడినిట్టూర్పులతో ఆర్ద్రమైనకంఠంతో "నిర్మలా!" అన్నాడు.

# 23 విరుద్ధధ్వనులు

ఆమె పసిబాలికవలె అనభిజ్ఞురాలివలె ఆయనపట్టుబట్టను అటూయిటూ త్రిప్పుతూ "ఏమిటి బాబుగారూ? అలా జూస్తారేమిటి?" అన్నది.

శివప్రసాద్ ఆమెకుడికపోలంమీద తుడిచి, పుణుకుతూ "ఏమీలేదు నిర్మలా; స్త్రీని కొందరు శశిధరునితోను మరికొందరు పుష్పరాజముతోను, దేవకన్యలతోను, రత్నాలతోను రవ్వలతోను వజ్రాలతోను వైఢూర్యాలతోను, వనదేవతలుగాను పోలుస్తారు. కాని నిన్ను వాటితో

పోల్చాలనిపించుటలేదు. మిసమిస నునుపులుదేలి, చమకులు గ్రక్కుతూ సింధూరపురంగును వెదజల్లు కాశ్మీర్ యాపిల్ వలె కనిపిస్తున్నావు.” అంటూండగా నిర్మల తనచేతిని ఆయననోటికి అడ్డుపెట్టి, “నేను కాశ్మీరుదానినేగా బాబుగారు” అన్నది. శివం ఆమెచుబుకాన్ని బట్టి వూపుతూ “భగవంతుడు నీలో యింతఅందాన్ని యెందుకు నింపాడు? అబ్బ! నీవు యెంతగా ఆకర్షిస్తున్నావో తెలుసా, నిర్మలా” అన్నాడు. ఆమె మామూలుధోరణిలో “మా దేశంలో నాకంటె చాలా అందంగావుంటారు బాబుగారు” అన్నది. ఆయన ఆమెను కసిదీర బాహువులతోనొక్కి చివ్వునలేచి, ఆమెను తీసుకెళ్లి ఇనప్పెట్టె తెరచి, అందులోని నగలపెట్టెను తీసి ఆమెచేతులలో బలవంతంగాపెట్టి, తిరిగి గదిలోకి తీసుకొచ్చాడు. ఆమెచేతులలో అవి అదురుతున్నవి. బంగారుదృక్కులతో తడిఆరినకంఠంతో “ఇవి యెందుకు బాబుగారు?” అన్నది. ఆమె చేతులలోని పెట్టె తెరచి, అందులోని కెంపుహారాన్ని తీసి, ఆమెమెడలోవేసి శిరస్సును హస్తద్వయంతోపట్టి తన శిరస్సుకు మోటించుకుంటూ, దంతాలు కటకటమనిపిస్తుండగా, ఆమె చేతులలోనిపెట్టె క్రిందపడిపోయింది. ఆయన వెంటనే ఆమెశిరస్సును విడచి, ముఖమండలం పరికించాడు. ఆమెముఖం వెలవెలబోతున్నది. అధరాలు అదురుతున్నవి.

ఆయన వోదార్పుకంఠంతో “అంత బేలపోతావెందుకు నిర్మలా? పడిపోయినంతమాత్రానభయపడుటెందుకు” అంటూ క్రింద చెదరిపడివున్న ఆభరణాల్లో రవ్వలదుద్దులు తీసి, ఆమెకర్ణాలకు బిగించిచూసి “ఇప్పుడు చూడు, అద్దంలో

నీముఖం పౌర్ణమినాటిచంద్రునికి సప్తరంగుల ఇంద్రధనుస్సు కైవారంవున్నపుడు శోభించినట్లు, ప్రఫుల్లితమై అత్యంతా కర్షణీయంగా ద్యోతకమవుతున్నది" అన్నాడు. కాని ఆమె శిలాప్రతిమవలె అలానే నిలిచివున్నది. ఆయన వెంటనే క్రింద చెదరివున్న ఆభరణాలన్నింటినీ ఒక్కటొక్కటిగా ఆమెకు అలంకరించాడు. ఆఖరిదిగా పాపిడిగొలుసు నమర్చి, ఆమెచుబుకాన్ని అంగుళీయంతో పైకెత్తి, విశిష్ట తేజస్సుతో ప్రజ్వరిల్లుతున్న సాక్షాత్ లక్ష్మీదేవివలె ద్యోతకమవుచుం డగా, ఆమెదృష్టిలో దృష్టినిబరపి చూస్తున్నాడు. చిత్త కార్తెలో యెండమబ్బులనుంచి బడబడ పెద్దచినుకులతో వర్షంకురిసినట్లు, ఆమెనేత్రఫలకాలనుంచి అశ్రుబిందువులు టపటప ముత్యాలదొంతరులవలె కపోలాలమీదుగా దొర్లు తున్నవి.

శివప్రసాద్ కలవరపాటుచెందుతూ, ఆమెచెంతకు చేరి, శిరస్సునచేయివేసి నిమురుతూ, అంగుళీయముతో అశ్రుబిందువులను తుడుస్తూ "ఇదేమిటి నిర్మలా, కన్నీరు కారుస్తావెందుకు చెప్పు?" అంటూ ఆమెను మరింత చేరు వకుతీసుకుని, పసిబాలికను ఓదార్చునట్లు నోదారుస్తున్నాడు. మానవదుఃఖానికి స్వాంతనలభించినపుడు హద్దులను అధిగ మిస్తుంది. నిర్మల కంపిస్తున్నశరీరంతో విలపిస్తూ శివప్రసాద్ పాదాలపై వాలిపోయింది.

శివప్రసాద్ గదితలుపులు బిగించి, ఆమెను అమాం తం లేవనెత్తి తనశయ్యమీద పరుండబెట్టి ప్రక్కనకూర్చుని, ఆమె ముఖమండలమందలి అశ్రుబిందువులను వుత్తరీయంతో

అద్దుతూ, "ఏమిటి చెప్పు నిర్మలా?" అని కపోలాలనుబట్టి వత్తాడు. ఆమె బలవంతంగా లేచి ప్రక్కనకూర్చుని, హృదయాన్ని చిక్కబట్టుకుని చిన్ని ప్రసన్న రేఖను ప్రదర్శించాలని ప్రయత్నించి విఫలురాలై "ఏమీలేదు బాబుగారు" అన్నది.

"నీవు చాలా విచిత్రమైనదానివి! అంత కన్నీరు కార్చికూడా యేమీలేదంటావే?" అన్నాడు.

"హృదయంలో సంభవించే బాధలకు, శిరఃకంపనానికి కొన్నికొన్నిసమయాలందు కారణాలనుచెప్పుట కష్టం బాబుగారు" అన్నది.

ఆయన మృదువుగా ఆమె కపోలాలను మెలివేస్తూ మందహాసాలొలికిస్తూ "కారణంలేని కంపనలు హృదయబాధను అనారోగ్యాన్ని సూచిస్తవి తెలుసా! అందుకు నిమ్మరసం మందు" అన్నాడు.

ఆమె తిరిగి వెలవెలబోతున్నముఖంతో "బాబుగారు, యీ ఆభరణాలు అతిపవిత్రమైనవి, మహావిలువైనవి. మీ తల్లిగారినగలను ధరించగలహక్కు ఈ యింటికివచ్చే నూతన వధువుకే వుంటుంది. అలాంటి అమూల్యఆభరణాలకు నా ద్వారా అవమానంజరుగుచున్నందుకు నామనస్సు దుఃఖిస్తోంది. వీటినిధరించేహక్కుగల ఆ అదృష్టవంతురాలు ఎన్ని జన్మల పూజాఫలం కలిగివుంటుందోనని, ఈ ఆభరణాలకంటె అమూల్య రత్నసమానుడైన వీటి అధిపతిని పొందగల ఆ మహాభాగ్యశాలిని యెందరు దేవీదేవతలఆశీర్వాద

బలంతో ఈ యింట ప్రవేశిస్తుందోనని నా వూహాలు నన్ను కలవరపర్చి కన్నీరుకార్పించినవి బాబుగారు!" అన్నది

ఆయన తిరిగి ఆమెకపోలాలను మృదువుగా మెలివేస్తూ "అయితే, యీ ఆభరణాలనుపొందుటకు తపోబలం కావాలంటావు. వీటిఅధిపతిని పొందను యే బలం కావాలన్నావు?" అని కొంటెగా ప్రశ్నించాడు.

ఆమె చిన్నగా నవ్వుతూ "నిజం బాబుగారు. మీరు హాస్యంలోకిదించకండి. వీటివిలువ కేవలం బంగారము, రవ్వలు, కెంపులవిలువమాత్రమే గాదు. ఆ విలువనుమించిన వెలగట్టజాలని వాటిచరిత్రవిలువ వున్నది. వాటిని మీ అమ్మగారు, మీ నాయనమ్మగారు ఒకప్పుడు ధరించారు. అందువలన వాటివిలువ నేడు లెక్కించుట కెవరికి సాధ్యం! అలాంటివాటిని ధరించేహక్కు యీయింటికి రావటానికి యెన్నిజన్మల పూజాఫలంలేనిదే ఎలాసంభవం బాబుగారు?" అన్నది నిర్మల.

"తిరిగి అపరాధంచేస్తున్నావు. నేను అడిగింది నగల అధిపతివిలువనుగురించి!" అన్నాడు.

"పోండి బాబుగారు; మీరు కొన్నిసమయాల్లో కొంటెప్రశ్నలడుగుతారు. మిమ్ముగురించి మీ యెదుట యెలా చెప్పగలుగుతాను చెప్పండి? మీరు దేవతాసమానులు. మీలోని నిర్మలత, నిశ్చలత్వం నిస్వార్థత మహోన్నతమైనవి. నేనుమాత్రం మిమ్ము జన్మజన్మాలకు ప్రత్యక్షదైవంగా భావిస్తాను. అలాంటి అమూల్య రత్నసమానులైన మిమ్ముపొందుటకు దేవిదేవతల ఆశీర్వాదం వున్నపుడే ఆ

పొందు వారికి సాధ్యమవుతుంది” అంటూండగా ఆమె నేత్రాలు చెమ్మగిలినవి.

దరహాసవదనంతో “నిర్మలా, యీయింటికి వధువుగా రాబోవు ఆ యువతిని చూడాలనివుందా నీకు?” అన్నాడు.

సజలనేత్రాలతో ఆత్రతతో నవ్వనుప్రదర్శిస్తున్న అధరాలతో “నా ప్రబలమైనకోర్కె అదే బాబుగారు. ఈ విషయంలోనే నామనస్సు యెప్పుడూ ఆందోళన చెందుతుంటుంది. ఆ అదృష్టవంతురాలిని చూడాలని అనుక్షణం నా మనస్సు ఆరాటపడుతుంటుంది” అన్నది. కాని ఆమె నేత్రాలనుంచి అశ్రువులు రాలుతున్నవి. “అదేమిటి నిర్మలా, నీవిషయాలు నాకు యెన్నటికీ అర్థంగాని అగమ్యాలనుకుంటాను. కన్నీరెందుకు కారుస్తున్నావు చెప్పు” అన్నాడు.

ఆమె కరుణాభరితకంఠంతో “మన్నించండి బాబుగారు, అవి నా ఆనందబాష్పాలు, అంతే” అన్నది.

అయితే, యీరోజే నీకోవిషయం చెప్పాలనుకుంటున్నాను. నేను అబద్ధమాడనని విశ్వసిస్తావా?” అనిప్రశ్నించాడు.

“అలాంటిప్రశ్నలడిగి నన్ను అవహేళనచేయకండి. సూర్యచంద్రులు తారుమారవుతారంటే వినగలను, మీరనృతంపలుకుతారంటే నేను వినలేను, సహించలేను” అన్నది.

“అయితే, విను; నీవు యేజన్మజన్మల్లో పూజలుసలిపిన పుణ్యమూర్తిని సందర్శించాలనుకుంటున్నావో ఆ పరమ

యోగ్యురాలు మనమధ్యనే వున్నది. నీతోనే నిరంతరము వుంటున్నది." అని ఆమెవంక తదేకంగా ధ్యాననిమగ్నుడై చూస్తున్నాడు.

ఆమెముఖం ఒక్కమాటుగా మ్లానతచెందింది. శిలా ప్రతిమవలె నిశ్చేష్టురాలై వెలవెలబోతున్నది.

ఆయన మందస్మితవదనంతో "అలా ఖంగారుచెందుతున్నావెందుకు నిర్మలా?" అన్నాడు.

ఆమె ధైర్యాన్ని పూరించుకుని "లేదు బాబుగారు" అనిమాత్రం అనగలిగింది. "నీకు నచ్చలేదా?" అని తిరిగి ప్రశ్నించాడు. ఆమెముందు నిత్యము ప్రయివేటుక్లాసులలో చూస్తున్న ఏవోదృశ్యాలు దొర్లుతున్నవి. ఆయనకగాన్ని బట్టి తనశిరస్సుపైనుంచుకుని, యేదోనిర్లిప్తభావంతో "బాబుగారు, నా సలహా యీవిషయంలో వింటానని మాట యివ్వండి" అన్నది.

ఆయన మందహాసంచేస్తూ, "ఇపుడు ప్రత్యేకంగా మాటయివ్వవలసిన అవుసరమేముంది నిర్మలా. ఎప్పుడూ నీమాట వింటూనేవున్నానుగదా!" అన్నాడు.

ఆమె గంభీరకంఠంతో "మీరు పెద్దవారు; మీముందు వివరాలు చెప్పజాలను గాని, మీరనుకుంటున్న ఆమెనుమాత్రం మీయింటివధువుగా స్వీకరించవీలు లేదు" అన్నది.

శివప్రసాద్ సరళస్వభావంతో "ఏవిషయంలోనైనా యెప్పటికప్పుడు నిర్ణయాలను మార్పుచేయవచ్చునుగాని,

యీవిషయంలో మాటిమాటికి మార్పువీలుపడదు. శాశ్వతమైన నిర్ణయం జరిగిపోయింది నిర్మలా!" అన్నాడు.

ఉద్రిక్తతతో పూగిపోతున్నకంఠంతో "ఇది అన్యాయం, పాపం. చూస్తూచూస్తూ నేను సహించలేను బాబుగారు. నన్ను కాపాడి, వుద్ధరించి, నూతనజన్మనిచ్చిన దైవజ్ఞులు మీరు. అలాంటి మీకు జరిగే అపచారాన్ని నేను చూస్తూ సహించలేను. మీరన్నట్లు మంగళనాధ్ నిష్కపటి, నిస్వార్థి, త్యాగే. కాని ఆయన్ను తనప్రేరణతో చంచలునిచేసినట్లు నా విశ్వాసం. స్త్రీ అమూల్యరత్నము వంటిది. కాని స్థానం తప్పినపుడు గుడ్డిరాయికన్న హీనాతిహీనమైంది. ఆమె ఊబిలో జారిపోయింది. ఆ ఊబిలోనే అదృష్టంకొద్దీ కమలము సంప్రాప్తంకావచ్చు కాని, చూస్తూ చూస్తూ బురదనుపులుముకోవటం వివేకంగలపనిగాదు. నేను బ్రతికుండగా యిలాంటిపని జరుగ వీలులేదు బాబుగారు" అన్నది.

నివ్వెరపోతూ "నీవు చెప్పేది యెవరినిగురించి నిర్మలా?" అని ప్రశ్నించాడు.

ఆమె మరింత స్పష్టమైనధ్వనితో "మీరు యెవరిని స్వీకరించ సంసిద్ధులయినారో, ఆమెనుగురించే!" అన్నది.

"నేను యెవరిని స్వీకరింపదలచానో, ఆమె నాపాలిట రత్నంలాంటిది. రత్నానికి సానతగిలినకొద్దీ దానిలోనివన్నె అధికమవుతుంది. దానివిలువ ఎన్నడూ తరుగదు" అన్నాడు.

"గాజుముక్కను రత్నమని భ్రమించి, మెడలోధరించినవారు ఆతరువాత యెంతైనా పశ్చాత్తాపపడవలసివస్తుంది." అన్నది

"రత్నాన్ని గాజుముక్కగా భావించి, విసర్జించేవారుకూడా ఆ తరువాత ఎంతైనా పశ్చాత్తాపపడవలసివస్తుంది నిర్మలా!" అన్నాడు. "అవును బాబుగారు, రత్నాన్ని గాజుముక్కను పరిశీలించి పరమసత్యాన్ని తెలుసుకుని, తగినదాన్ని ధరించి నప్పుడే జీవితం సఫలమవుతుంది" అన్నది.

"బంగారాన్ని పరీక్షించునపుడు బంగారుపులోకే గాదు, వరపిడిరాయిలోటువలనకూడా మోసంజరుగవచ్చు" అన్నాడు.

ఆమె ప్రహసితవదనముతో 'సాహసిస్తున్నందుకుక్షమించండి; ఆమె స్త్రీరూపరాక్షసి. ఆమె పతితురాలు. మంగళనాథ్‌లాంటి పవిత్రహృదయునికూడా పతితమార్గానికి పడద్రోస్తున్నది. ఆమెవిషయం యింకా విపులంగా వినాలని వున్నదా?' అన్నది.

"అది నీ భ్రమ. నేను స్వీకరించనున్న ఆమె పరమపవిత్రమైంది; అంతకుమించి నేను వినదలచలేదు. లోకపు మీమాంసద్వారా లభ్యమైన అమూల్యసంపదను విడనాడి, తనువాత విలపించుట అవివేకము. ఒకరు కాలదన్ని నదానిని మరొకరు శిరస్సునధరించి గర్వించవచ్చు" అన్నాడు.

ఆమె శిరస్సుమీద చేయివేసుకుని వేడినిట్టూర్పు విడుస్తూ "బాబుగారు, యెవరినిగురించీ విమర్శించేస్వభావం నాకులేదు. అయినా, ఆదుర్దాకొద్దీ అధికంగానే చెప్పాను. విధి వక్రించినపుడు తాపత్రయంవలన ప్రయోజనముండదు. ఎవరిరాకతో నేను నిశ్చింతురాలనై మీాయిరువురను పార్వతీపరమేశ్వరులవలె భావించి, మీా ఆశీర్వాదాలు

పొంది, ఆ బలంతో ఆనందంతో అమ్మను తీసుకెళ్ళి పుణ్య తీర్థాలన్నిటినిదర్శింపచేదామనుకున్నానో వారితలంపుతో నేడు నేను భీతావహురాలనై పోయాను. నా కంత అదృష్టం లభించ లేదు" అన్నది.

"నీ విపుడు అదృష్టవంతురాలవుకాదని యెలా నిర్ణ యించగలవు నిర్మలా? అమ్మ వృద్ధురాలుగనుక, పరలోక చింతన ఆమెకు అవుసరంగనుక, యాత్రలుసేవించవచ్చు కాని, నీవు సన్యసించాలని యెందుకనుకుంటున్నావు?" అని ప్రశ్నించాడు.

"మనోదౌర్బల్యాల ప్రతిబింబరూపనిస్పృహాలో ఆనం దాన్ని, ఆత్మసంతృప్తిని సృష్టించుకొనుటకు సన్యసిస్తారు. కాని, అప్పటి నా యాత్రాసంబంధవూహాలు ఉదాసీనత లోనినిగాక, ఆనందోత్సాలలోనివి. కాని నేడు ఉదాసీనతనే ఆశ్రయించవలసివస్తున్నది" అన్నది.

"ఆడవారికి అపోహలు, పొరపాటువూహాలు యెక్కువ. విపులంగా తెలుసుకోవాలనికూడా అంతగావుండదు. ఈ యింటివధువుగా నీవు యెవరినిగురించి వూహిస్తున్నావో ఆమె కానేకాదు. అలాంటి స్వయంవరంలో వనితలు నరు సగా పొరపాట్లనే చేస్తుంటారుగాని, పురుషుడు వరపిడిలో నిగ్గుదేల్చిగాని, నిర్ణయించుకోడు" అని కోరగా ఆమెవైపు పరికించాడు.

ఆమె అజ్ఞానివలె అమాయకురాలివలె శీతలశ్వాసను విడుస్తూ "అయితే యెవరంటావు?" అని ప్రశ్నించింది.

"ఆమెపేరు చెబితే, నీవు పూర్తిగా సమ్మతిస్తావు;

నీకు నచ్చుతుంది. అన్నివిధాలా యోగ్యురాలు. నీవన్నట్లు యీ ఆభరణాలను ధరించగలయోగ్యత ఆమెకే వున్నది. విన్నపుడు యెన్నికలో నా దక్షతకు విస్తుపోతావు" అన్నాడు.

ఆదుర్దాతో ఆత్రపడుతూ, కూర్చున్నపాటును సర్దుకుని అనునయంగా ఆర్ద్రకంఠంతో "నన్ను వేధించక చెప్పండి బాబుగారు, ఆ అమ్మాయి యెవరు?" అన్నది.

ఆమెమెడలోని కెంపులహారాన్ని బట్టి దరహాసంచేస్తూ "నా మనస్సులోని ఆ మహిళామణి యెవరో ఆమెకే నేడు నా స్వహస్తాలతో యీ ఆభరణాలను ధరింపజేశాను" అన్నాడు.

తాడుగాభావించి నిర్లక్ష్యంగా పాదంవేసినపు డది బుస్సుమని పడగవిప్పిన నాగసర్పముగా తెలిసినపుడు మతిబోయి, ఖంగారుతో ఎగిరి ఆవలపడినట్లు నిర్మల నిర్జీవిశాలె శయ్యనుంచి చైతన్యహీనురాలై క్రిందికిజారి పడిపోయింది.

శివప్రసాద్ కిది అర్థంగాని అగమ్యసమస్య. అపరాధివలె తత్తరపడుతూ ఆమెను లేవనెత్తి శయ్యమీద పరుండబెట్టి, వీవనతో విసురుతూ ఆమెముఖమండలంలోకి తదేకంగా చూస్తున్నాడు. లలాటంమీద జిలుగుజిలుగు స్వేదబిందువులు స్ఫటికఫలకంమీద ఆరబోసిన ముత్యాలవలె మెరుస్తున్నవి. ఇంతలో ఆమె నేత్రఫలకాలువదులుచేసి చూసి, విచలితురాలై క్రిందకుదిగి నిరాసక్తతతో నిలిచి తనశరీరంమీది ఆభరణాలను ఒక్కటొక్కటిగా వలిచి ప్రక్కమీద పెడుతున్నది. బంకించంద్ నవలాపాఠకునివలె దిగ్భ్రాంతితో అనభిజ్ఞునివలె చూస్తున్నాడు శివం.

ఆమె ఆభరణాలన్నిటినీ పక్కమీదవుంచి, శిరస్సు పైకెత్తకుండానే శివప్రసాద్ వైపు తిరిగి, ఆయనపాదాలమీద వరిగి "బాబుగారు, నన్ను క్షమించండి" అని తిరిగి మాట పెగలక రోదనమారంభించింది.

ఆయన విసిగినవానివలె "అబ్బ! ఏమిటి నిర్మలా, నీ తరహా యేమిటో ఒక్కటీ అర్థంగాదు. ప్రతిది నీతో ప్రమాదమనిపిస్తుంటుంది కొన్నిసమయాల్లో. ఏమిటో చెప్పు?" అంటూ ఆమెభుజస్కంధాలనుబట్టి లేవనెత్తాడు.

ప్రభాతసమయంలో ప్రథమదర్శనమిచ్చు రక్తముద్రికలతో రంగరించుకున్న అరుణోదయునివలె ఆమెముఖం కెంపు రంగులో అశ్రుముద్రికలతో అలరారుతున్నది. అదురుతున్నఅధరాలతో పెల్లుబుకుతున్న కృతజ్ఞతతో "నన్ను క్షమించండి బాబుగారు. నేను అనాథను; అభాగ్యురాలను; కులగోత్రాలు తెలియనిదాన్ని. మతము మర్యాదలు లేనిదాన్ని; హీనాతిహీనురాలను; అసభ్యురాలను; దొంగతనమే వృత్తిగాగలదాన్ని; అందరి ఈసడింపులకుపాత్రురాలను; నాకంటె యీలోకంలో హీనులెవరుంటారు బాబుగారు? అలాంటి అంధకారంలోని నా జీవితాన్ని తను అపార త్యాగశక్తితో మార్చి, వెలుగు చూపారు. అలాంటి త్యాగమూర్తులు సచ్చరిత్రులు అయిన మీ జీవితానికి కళంకం పులుముట, మీ జీవితాన్ని న్యూనతపరచుట నేను చేయరానిది చేయలేనిదీని" అన్నది.

ఆయన కొంచెం ఉచ్ఛస్వరంలో "నీవు వట్టి వెర్రిదానివి నిర్మలా. ఆఖరినిర్ణయాలు నీ యిష్టప్రకారనే జరు

గవు. అర్థంగాని ఆటలను మనము యెన్నివిధాల ఆడినా, ఆఖరినిర్ణయం ఆ సర్వాంతర్యామియిచ్ఛద్వారానే జరుగుతుంటుంది. అందుకుభిన్నంగా నడచుట మానవులెవరికీ సాధ్యంగాదు. కనుక, అనవసరమైన ఆలోచనలతో నీవు తికమకపడకు" అన్నాడు.

"అది అవివేకులను సంతృప్తిపరచే మాటమాత్రమే. దేవుని పేరుతో రక్షిస్తుంటారు, త్యాగంచేస్తుంటారు కొందరు. ఆ దేవుని పేరుతోనే భక్షిస్తుంటారు, అఘాయిత్యాలుచేస్తుంటారు మరికొందరు. కాని, వాటన్నిటికీ దేవుడు పర్యవేక్షకుడుగామాత్రమే వుంటాడు. దేవుని పేరుతో అన్నివేళలా అందరినోళ్లూమూయుట సాధ్యంగాదు బాబుగారు. స్వార్థం కొరకు మేలుచేసినవారికి కీడుచేయుట ధర్మంగాదు; దేవుని సాన్నిధ్యంలో అందుకు తావుండదు. మీరు నాకు దైవ సమానులు. మీకు కళంకమాపాదించుటగాని, స్వార్థం కొరకు అనర్హస్థానాన్ని పొందుటగాని నేను చేయజాలనిపని" అని నిష్కర్షగా అన్నది.

"ఊబిలోజనించిన కమలానికి లక్ష్మీదేవిశిరస్సున విరాజిల్లుస్థానం లభించుట అయోగ్యంకాలేదు. క్వైనైన్ అతి చేదుఅయినంతమాత్రాన అది విషంకాదు, మలేరియాకు అమృతంలాంటిది. మట్టిలోదే మలినం, హేయమయింది కాని, ఆ మట్టే సకలజీవరాసులకు ఆధారభూతం. కనుక దానిస్థానంలో దానివిలువ తగ్గదు. నిన్ను నీవు యెప్పుడూ హీనురాలుగా చిత్రించుకొనుట, పసితనంలో తెలియక తినిన మట్టిని పెద్దయ్యాక తినాలని ప్రయత్నించి

నట్లుంటుంది. పసితనంలో తెలిసీతెలియక చేసేవి యెన్నో వుంటవి. పెద్దయ్యాక వాటిని చర్వితచర్వణంచేసుకుని తనను తాను హీనంగా చిత్రించుకొనుట హాస్యాస్పదము. ఇక ముందు యెన్నడూ న్యూనతపర్చుకునే విషయాలను నాముందు తీసుకరావద్దు. నీవు మహా యోగ్యురాలవు, సుశీలవు, సుగుణవతివి, ప్రతిభావంతురాలివి అయిన నిర్మలవు; మాయింటి లక్ష్మివి. అవే, ఆ యోగ్యతలే నీకు యీయింటిలో ఆధిక్యతను చేకూర్చినవి, వధువుగా నిర్ణయించినవి. ఇందు నేను కనికరించినదీలేదు. నీవు కోరిందీలేదు. పరిస్థితులు నీ కా స్థానాన్నికల్పించినవి. కాదని నీవు పారిపోజూచుట నిష్ప్రయోజనము. దీన్ని విధికృత మన్నా దైవనిర్ణయమన్నా నా కభ్యంతరంలేదు. నాకు నేను ఇది మహా అదృష్టంగానే భావిస్తున్నాను నిర్మలా'' అంటూ ఆమెను మృదువుగా తనబాహువులలోకి తీసుకుని, బుజ్జగించుతూ "నా హృదయంలో శాశ్వతమైన స్థానాన్ని పొందావు. హృదయఫలకంమీద చెరగని ప్రతిమ అంకితమై పోయింది పవిత్రమైనహృదయంలో గీసినబొమ్మను చెరిపి, మరోబొమ్మను, దాన్ని చెరిపి యింకోబొమ్మను వేయుటకు వీలగు కాన్వాస్‌లాంటిదిగాదు నిర్మలా. ఆలయంలో దేవ విగ్రహాన్ని ప్రతిష్టింపజేసినట్లు పవిత్రహృదయంలో ప్రయత్నంతో ప్రతిమ అంకితంకాదు. కొన్నినిరిషస్థానాలలో భగవంతునిమూర్తి ప్రత్యక్షమైనట్లు అప్రయత్నంగా అనభిజ్ఞంగా ఆరాధ్యమూర్తి హృదయంలో ప్రతిష్టితమవుతుంది నిర్మలా. కాగితంమీదవేసిన రంగులబొమ్మ కాగితంచిరిగినపుడు

మాత్రమే యెలా కాగితంతోపాటునశిస్తుందో, పవిత్రహృదయంలో ప్రతిష్ఠితమూర్తికూడా ఆహృదయంతోపాటేనాశన వికాసాలను పొందుతుంటుంది. కనుక, నీవు అనవసరమైన ఆలోచనలతో వినాశహేతువును తలపెట్టకు నిక్కీలా." అంటూ ఆమెకురులను నిమిరి, తరువాత పక్క-మీది హారాన్ని చేతబట్టి ఆమెకంఠంలో వేయప్రయత్నించాడు. కాని ఆమె హస్తాలతో నిరోధిస్తూ, హస్తద్వయం జోడించి, "బాబుగారూ, ఆ అమూల్యమైనవాటికి అవమానం ఆపాదించకండి. వాటిని ధరించగలశక్తి నాలో లేదని నాహృదయం ఘోషిస్తున్నది. వాటిద్వారా నా కళ్ళముందు మీ గౌరవమర్యాదలు, ప్రతిష్ట, హోదా, సంపత్తులు, అంతస్తులు అన్నీచేరి జిలిబిలినృత్యంసలుపుతూ నన్ను కలవరపరుస్తున్నవి. నా కెందుకో భయంగావుంది. మీపాలిట నే నేదో అపరాధంచేస్తున్నట్లు భీతిగలుగుతున్నది. నన్ను క్షమించండి బాబుగారు. నా జీవితమంతా మీకు దాసిగావుండి కృతార్థురాలనవుతాను. మీ సేవయే పరమలక్ష్యంగా కలిగివుంటాను. కాని, నన్నిలానే వుండనివ్వండి. రత్నకిరీటం రాజసమున్నవారిశిరస్సునే శోభించునట్లు, రచనాసామగ్రి రచయితచేతిలోనే రాణించునట్లు, ఆహారపువిలువ ఆకలిగొన్నచోటే అర్థమవునట్లు, తమస్థానానికితగిన యోగ్యురాలు వచ్చినపుడే రాణిస్తుంది. ఆ స్థానాన్ని నేనుపొందుట హాస్యాస్పదం బాబుగారు" అన్నది.

ఆయన నిరుత్తరుడై మ్లానముఖంతో ఆ పాన్పుమీది ఆభరణాలను తీక్షణమైన ఒక్కవిసురుతో నెట్టివేచి, రెండో

వైపుకుముఖంపెట్టి పరున్నాడు. ఆ నగలు ఘల్లుమంటూ భూమిమీదపడి దొర్లుకుంటూ గోడకు కొన్ని ఢీకొని, తిరుగుముఖమై చెల్లాచెదరుగా పడిపోయినవి. కెంపులు, పచ్చలు, రవ్వలు హారాలనుంచి రాలిపోయినవి; కొన్ని ముక్కబోయినవి. కెంపులహారం పూర్తిగా తెగిపోయింది. అందెలు వంపుతిరిగిపోయినవి. భూకంపంతో సర్వసంపత్తి చెల్లాచెదరయినట్లు ఆమె క్షణంపాటు స్తబ్ధురాలయింది. తల్లి పగులగొట్టుకున్న గాజుముక్కలను బిడ్డ యేరినట్లు, నిర్మల ఆ చెదిరిన విచ్ఛిన్నఆభరణాలను తనకొంగులోకి ఒక్కటొక్కటిగా యేరి, ఆయనముఖంవైపుకెళ్ళి మోకరిల్లి కూర్చుని, అరచేతితో ముఖంకప్పుకునివున్న ఆయనకు చూపుయత్నంతో అనునయంగా ఆర్ద్రమైనకంఠంతో "చూడండి బాబుగారు, ఎలా విచ్ఛిన్నమయిపోయినవో. తమలో ఇంత కోపం నే నెన్నడూ చూడలేదు"అంటుండగా ఆయన ఆవేశంతో ఆమెచెంగుఅడుగుభాగాన్ని చేతితో పెద్దపెట్టున విసురుగా నెట్టాడు. ఆ ఆభరణాలు పైకెగసి తిరిగి, కనకవర్షమువలె ఆమెపై బడినవి. ఆమె మరింత కంగారుతో విస్తుపోతూ, ఆయనముఖం పరిశీలిస్తున్నది. భయంకరమైన మేఘాలతో కావుర్లుగమ్మిన నభమువలె, ఆయనముఖం నేడు అత్యంత భయభీతిని గలిగించుచున్నది. ఆమె కిదే ప్రథమము ఆయనలోని వ్యథితఅవధులను గాంచుట. ఆయనకనుకొలకులగుండా అశ్రుస్రవంతి వడలుగ్రక్కుతూ జారుతున్నది. ఆయనలో యింత బాష్పజలాన్నికూడా యిదివరకెన్నడూ ఆమె చూసియెరుగదు.

ఆయన్ను పలుకరించనుగాని, నోదార్చనుగాని యిక ధైర్యంచాలలేదు. ఆ నగలను తిరిగి యేరుటకుకూడా సాహసంలేదు. తనసర్వస్వము అగ్నిహోత్రునిపాలపుతుంటే యెదుటనిలిచి చూస్తున్నదానివలె విమూఢురాలై గడగడ వణికిపోతూ, తప్పటడుగులతో తూలునాపుకుంటూ వెళ్ళి, ఆయనపాదాలమీద శిరస్సువుంచి "బాబుగారు, నన్ను మీ రింత వున్నతస్థాయిలో భావిస్తున్నారనుకోలేదు. మీ కన్నీ గు కార్పించిన తుచ్ఛురాలను నేను. మీ పాదాలసాక్షిగా చెబు తున్నాను. ఇక యెన్నటికీ మీమాటకుయెదురుచెప్పను. మీరు నా పాలిటి భగవత్స్వరూపులు. మీ పాదధూళితోనే నా జీవితాన్ని కృతార్థంచేసుకుంటాను. నా పొరపాటును మన్నించండి బాబుగారూ" అంటూ పెద్దగా విలపించ సాగింది.

కాలుతున్నకట్టెను నీటిలోనుంచినపుడు చల్లబడి పోయినట్లు ఆయనవ్యథ ఒక్కమాటుగా ఆగిపోయి, కరుణ రూపంపొంది, కారుతున్నకన్నీరు ఆనందబాష్పాలుగా మారి, కారుమబ్బులమధ్యగా ఎండపొడప్రసరించినట్లు నవ్వుతూ లేచి కూర్చుని, తనపాదాలకడనున్న ఆమెశిరస్సును తనకవుగిటి లోకి లాక్కుని బలంకొద్దీ హత్తుకుంటూ, ఆమెకురులమీద వీపుమీద చేయివేసి నిమురుతూ, ఆమెముఖమండలాన్ని పైకిత్రిప్పి అశ్రుముద్రికలను ఆమెచెంగుతోనే అద్దుతూ "ఈలోకంలో నీకంటె యోగ్యురాలెవరు నిర్మలా? అందాల నిధివి, సుగుణరాశివి, ప్రేమమూర్తివి, వ్యవహారదక్షురాలివి, కర్తవ్యపరాయణివి. నీ పూజాఫలంవలనగాదు, నా జన్మ

జన్మాల పుణ్యాఫలితంగా నీవు నాకు లభించావు. ఈలోకం లోని సర్వసంపత్తికి మించిన విలువ నీలో నిబిడీకృతమై వున్నది." అన్నాడు. ఆమె తనచేతులతో ఆయనపాదాలను స్పృశిస్తూ, నడిలోని పసిపాప తల్లిముఖంవంక చూస్తున్నట్లు నేత్రాలు విశాలంచేసి తదేకంగా చూస్తున్నది.

# లోకోద్ధారక కాంట్రాక్టరు

ఆదర్శాలు ఆశయాలు లక్ష్యాలు అంటూ దేశోద్ధరణకు కాంట్రాక్టుపొందినవానివలె, నిర్దిష్టమార్గానలంబిస్తూ స్త్రీని నైమనస్యంగాను, నిర్లక్ష్యంగాను, దుష్టగ్రహంగాను చూస్తూ, ప్రకృతిధర్మాలవైపు చిరునవ్వును ప్రదర్శించి, స్త్రీపరిచయంకలిగినపుడు పరధ్యాసగా తలగోక్కుంటారు. సన్నిహిత సాంపర్క్యావకాశంకలిగినపుడు తననుతాను మర్చిపోయి, సామాన్యులకంటె ఊబిలో కూరుకుపోయి, ఉక్కిరిబిక్కిరై యెటూగాని అయోమయంలో పడిపోతారు. పాపం! మంగళనాథ్ యిప్పుడా స్థితిలోనేవున్నాడు. ఏ శుభముహూర్తాన కృష్ణకుమారి తనరింగును ఆయనకు బహూకరించిందో ఆ రింగే అతనిపాలిటి పెనుభూతంగా తయారయింది. విద్యార్థిసంఘాలలోను, హాస్టలుయూనియన్‌లోను, టోర్నమెంట్సులోను, నాటకమండలిలోను వుత్పన్నమయిన యెన్నో తగాదాలను సమస్యలను చిటికలో తేల్చివేయగలిగాడు, నూతనసమస్యలను విధానాలను తన బుద్ధినేర్పుతో సృష్టించగలిగాడు గాని, నేడు జేబులో దాచివుంచిన రింగు

అర్థంగాని జటిలసమస్యగా పరిణమించింది. ఏరోజుకారోజు దానివ్యూహాలతో బుర్రవేడెక్కి విసిగిపోతున్నాడు. కాని సమస్య వున్నచోటనే వుంటున్నది. ఇదివరకు తాను సంఘ జీవిగా ప్రతీతి. వంటరిగావుండే అవసరమూ లేదు, అవకాశమూ లేదు. కాని నేడు మనస్సు ఏకాంతానికి తపిస్తున్నది. నదివడ్డుకువెళ్ళి వంటరిగా గంటలతరబడి గడుపుతుంటాడు. నదివడ్డున కూర్చుని, రింగును బయటకుతీసి దానితో సంప్రతింపులు చేస్తుంటాడు, విసుక్కుంటాడు; మరుక్షణంలో చుంబించి శృంగారరసమొలికిస్తూ పులకితుడవుతుంటాడు. దుష్యంతుడు శకుంతలకిచ్చిన ఉంగర మింత మంచిదిగాదని, అందులో యింత మర్మరహితప్రేమ లేదనీ అనుకుంటాడు. ఆ ఉంగరంలోని గోమేధికంలో సుస్పష్టమైన ముఖమండలం ద్యోతకమవుతుంటుంది. బాగా పరికించినపుడు ఆ ముఖం తనకు చిరపరిచితమైందిగాను, అత్యధిక ఆకర్షణీయంగాను, తనను లాలిస్తున్నట్లుగాను అనుభవమవుతుంటుంది. ఆ కని పిస్తున్నది సాక్షాత్ దేవతగాను, అందని మహోన్నతశిఖరాలమీదున్నట్లుగాను తోచినపుడు, ఆమెతనను పరిహసిస్తున్నట్లుతోచి ఖిన్నవదనుడై చూస్తాడు. అపుడు అస్పష్టమైన కృష్ణకుమారిముఖమండలం ద్యోతకమవుతుంది. తనకోర్కె నెరవేరినట్లు తన అభిమతం ఫలించినట్లు ప్రసన్నవదనుడై కేరింతలుగొడుతూ, ఆ ఉంగరమును భద్రపరచి, లంగోటా బిగించి నదిలో ఒక్కదూకు దూకి, రైలుయింజనువలె నది మధ్యకు యీది, వెల్లకిలా పీనుగవలె తేలి వాలుకు అరమైలువరకు కొట్టుకుపోతాడు. అక్కడినుంచి యెదురీతతోను,

మునిగి యీదుటలోను దిగినచోటికి జేరి,తీయనికలలలో కలవరం చెందుతూ వడ్డెక్కి వెళ్ళిపోతుంటాడు.

లోకోద్ధరణకు కంకణంకట్టుకున్న యీ యువకునికి స్త్రీసంపర్కంలోతుపాతులు తెలియవు. అందుకే చెరువు లోనినీరు పోవటానికి మార్గంవెదుకుకుంటున్నట్లు అతనిహృదయం తడువుకుంటున్నది. విద్యార్థిసంఘకార్యకలాపాలకంటె, స్పోర్ట్సకమిటీలనిర్మాణంకంటె, స్పోర్ట్సుకంటె, స్నేహితులతో వినోదయాత్రసలుపుటకంటె, నాటికలో అభినయించుట కంటె, ప్రజలనుంచి ప్రశంసలుపొందుటకంటె యీ రింగుతో జరుగుతున్న దాగుడుమూతలాటలో మహదానందం లభిస్తున్నది. ఈ ఆలోచనలలో విసుగు లేనేలేదు. ఈ ఉంగరంతో జరుగు ఏకపాత్రాభినయంలో మంగళనాథ్ ఆరితేరాడు. అం దతనికి యెప్పటికప్పుడు నూతనోత్సాహం కలుగు తున్నది. ఆ రింగుతో అతనికి యావజ్జీవకారాగారశిక్ష విధించినా హాయిగా ఆనందంగా గడుపగల్గునేమో! ఆ రింగు ఆతని కో మంత్రదండమువంటిదైనది.

దేని నెక్కువ జాగ్రత్తపరుస్తుంటామో, మితిమించి కాంక్షిస్తుంటామో అదే జారిపోవుటో దూరమవుటో జరుగు తుంటుంది. మంగళనాథ్‌కు రింగుద్వారా యేదో అజ్ఞాతమైన మాజిక్ బలం లభ్యమవుతున్నది. ఆ రింగుస్పర్శలో పులకితు డవుతున్నాడు. నదివద్దన యీతఅనంతరం దుస్తులుధరించు నపుడు ఆ రింగు జేబునుంచి క్రిందకుజారి నదిలో పడిపో యింది. ఈలోకంలోని సర్వశ్రేష్టసంపత్తిని పొంది పోగొట్టు కున్నవానివలె అనంతదుఃఖాన్ని పొందాడు. ఆయనదుఃఖ

హేతువెవరికీ అంతు తెలియలేదు గాని, ఆ దుఃఖంమాత్రం అందరియెదుటా ప్రతిబింబితమైంది.

పోస్టుద్వారా మంగళనాథ్ కేదో ఉత్తరంవచ్చింది. అది యెవరిదోగాదు, కృష్ణకుమారిది.

"మంగళనాథ్ మహాశయా,

తమతో మాటాడుసదవకాశంకొరకు నేనుచేసిన విశ్వ ప్రయత్నాలు విఫలమైనవి; ఈమధ్య రెండురోజులనుంచి మీరు అమితవ్యథతో చీకాకుపడుతున్నట్లు తోస్తున్నది. అంతదుఃఖానికి హేతువేమిటో యెంతయోచించినా అర్థ మవుటలేదు. మీరు నామనస్సులోచేరి కలవరపరుస్తున్నారు. దయతో పౌర్ణమినాటిసంధ్యాసమయాన నీలకంఠస్వామి ఆలయసోపానములకడ నాకొరకు వేచివుండగోరతాను.

అనుక్షణము మీ మధురసంభాషణకొరకు తపిస్తున్న

కృష్ణ"

వుత్తరాన్ని తిరిగితిరిగి యెన్నోమారులు చదివాడు. చదివినకొద్దీ అంతరార్థాలు మరింత ఆకర్షిస్తున్నవి. పౌర్ణమి కొరకు యెదురుచూస్తున్నాడు. రింగుపోయినందున కలిగిన దుఃఖం దూరమై, నూతనోత్సాహం ప్రారంభమైంది.

అది పౌర్ణమిరోజు సంధ్యాసమయం. మంగళనాథ్ నీల కంఠస్వామిఆలయంప్రక్కన కృష్ణానదీతీరాన పచార్లుచేస్తు న్నాడు. అతనిపాదాలు సవ్వడిలేని అడుగులువేస్తున్నవి. నేత్రాలు తీక్షణదృక్కులతో నలువైపుల పరికిస్తున్నవి. దిన కరుడు అస్తమించాడు. శశిధరుడు విజేతగా ప్రస్తరించాడు. శశిరుతువులోని ఆ చంద్రబింబం ఈ లోకాలన్నిటికి మధు

ప్రదానదాతవలె ఆ అనంతాకాశంలో ఏకచ్ఛత్రాధిపతివలె ప్రేమమూర్తులకు సాక్షీభూతునివలె పౌరోహితునివలె అద్వితీయమై శోభిస్తున్నది. ఆ చంద్రుని శీతల శ్వేతకాంతులు మంగళనాథ్‌లో తాపాన్ని జనింపజేస్తున్నవి. అతనిహృదయ వేగం సున్నితమై శ్వాస నిలిచిపోవునట్లున్నది. గగనంలోని శశిధరుడే ఆకాశపయనంతో విసిగిగాబోలు, పృధ్వీమీద సరసవిహారయాత్రికునివలె తెల్లనిదుస్తులలో మిరుమిట్లుగొలుపుతూ పశ్చిమదిశనుంచి నదిఒడ్డున వస్తుండుట గమనించి మంగళనాథ్ ఆగి నివ్వెరపాటుతో చూస్తున్నాడు. శశిధరుని రూపంలో పయనమైవచ్చిన కృష్ణ నిస్సంకోచంగా మంగళనాథ్‌చేయిపట్టి లాగి కూర్చుండబెట్టి ప్రక్కన తనూ ఆసీనురాలైంది. ఆమెనుంచి సుగంధపరిమళాలు వెదలుతున్నవి. మంగళనాథ్‌హృదయం దడదడలాడుతున్నది. తన కిదివర కెన్నడూ లేని అనుభూతి బాధో సుఖమో తెలియనిరీతిలో నాడులలో పరువులెడుతున్నది. అతనిలో మిగిలివున్న పట్టుదలలు, నిర్ణయాలు, ఆశయాలు, లక్ష్యాలు నేడు పరాకాష్ట నందుకొంటున్నవి.

ఆమె చేయిబట్టివూపుతూ "మాట్లాడ రేమిటి?" అని మృదువుగా కసిరింది. "నాకు మాట్లాడటాని కేముంది? నీవు యేదో చెప్పాలంటే విందామని వచ్చాను" అన్నాడు,

కృష్ణ :- ఈమధ్య వుదాసీనంగా వుంటున్నారెందుకు చెప్పండి?

మంగళ :- పోగూడనిది పోయిందిగనుక.

కృష్ణ :- ఏమి పోగొట్టుకున్నారు?

మంగళ :- నీవిచ్చినరింగు.

కృష్ణ:- అదేనా? అందు కింత బాధపడుటెందుకు చెప్పండి? మీారు పోతుందని ఆనాడే చెప్పారు. పోయినా పరవాలేదని నేనే యిచ్చాను గనుక, అది పోయినా మీారు బాధ్యులుగారు.

మంగళ:- కాదు, అది పోయినందువలన నా ఆత్మకే బాధగావున్నది.

కృష్ణ:- మీాదృష్టిలో ఆ బంగారము, రాయి అంత విలువైనవిగాదు, వాటికి అంత కించపడవలసినపనేమిటి చెప్పండి?

చెంపదెబ్బతిన్నవానివలె నివ్వెరపోతూ, తనహృదయాన్ని తానే తడువుకుంటూ, ప్రహసితవదనుడై "అది లేకపోతే యేమీాలేనట్లు నాకు తోచుటలేదు" అన్నాడు.

కృష్ణ:- ఆనాడు మీారు డాన్ని స్వీకరించడానికే యిచ్ఛగించలేదుగదా!

మంగళ:- అవును స్వీకరించానుగనుకనే, పోగొట్టుకుని చింతిస్తున్నాను.

కృష్ణ:- దేనివిలువైనా అంతే మంగళనాథ్‌గారు. అది పోయినపుడే దానివిలువ అర్థమవుతుంది. మానవుడు పొందినపుడు నిర్లక్ష్యంచేస్తాడు, అదిపోయినపుడు విలపిస్తూకూర్చోటానికి అలవాటుపడిపోతాడు. నాకంటే ఆ రింగు విలువైనదా చెప్పండి?

మంగళ:- లేదు.

కృష్ణ:- (గలగలనవ్వుతూ)లేదంటే యేమిటో వివరంగా చెప్పండి!

మంగళ:—ఏమిచెప్పమంటారు?

ఆమె మరింత పగులబడి నవ్వుతూ, ఆయనహస్తాన్ని తనచేతులలోకి తీసుకుని "నామీద మీకు ఆ రింగుమీదున్నంతప్రేమ లేదా చెప్పండి?" అన్నది.

"లేదని చెప్పలేను. కాని నా మనస్సెందుకో భీతి చెందుతున్నది కృష్ణా! ప్రేమలో మానవుడు కర్తవ్యాన్ని విస్మరిస్తాడు; స్వార్థిగా సుఖసౌఖ్యాలకు లోనవుతాడు, అందుకే నేను స్త్రీప్రేమకు దూరంగావుండాలని నిర్ణయించుకున్నాను." అన్నాడు. "అనేకపుస్తకాలలో యీమాటలే చదువుతుంటాము. ఆపుస్తకాలలోనే ఆ కఠోరనిర్ణయదాతలే వారినిర్ణయాలను విస్మరించి, ప్రాకృతికధర్మాలలో వరిగిపోయినట్లుకూడా చివరిభాగాలలో చదువుతుంటాము. ప్రభాకరునియెండ జీవకోటిలోనిశక్తిని నశింపజేస్తుంటుంది కాని, ఆ సూర్యరశ్మిలేనిదే జీవమే వుండదుగదా! వరదలభయంతో వర్షాలే వద్దనుట వివేకమా చెప్పండి! మీ నిర్ణయాలు, మీ కఠోరదీక్ష సమాజవికాసాని కుపకరించేవయితే, అవి స్త్రీప్రేమకు నిరోధాలు కాజాలవు. మీ దీక్షలోను, నిర్ణయాలలోను స్త్రీప్రేమకు అవకాశంలేకపోతే, వాటిలో యెక్కడో తప్పక లోటువుండివుంటుంది. అందుకనుకూలంగా దిద్దుకొనుటే వివేకము. స్త్రీప్రేమతో విఫలంజెందేకార్యాలు అభ్యుదయనిరోధకాలు మంగళ్‌నాధ్‌గారు. నీరు యెప్పుడూ పల్లానికే ప్రవహించునట్లు, స్త్రీప్రేమ ప్రకృతిసిద్ధమైనది.

స్వాభావికమైనదాన్ని ఆహ్వానించుట స్వీకరించుటే అభ్యుదయమార్గం" అన్నది.

"నా మనస్సెందుకో భీతిలుతున్నది" అన్నాడు.

"అది కేవలం పిరికితనాన్ని సూచిస్తుంది. పిరికితనం మత్తుగాను, మరొకప్పుడు విషంగాను పనిజేస్తుంది, అంతే." అంటూ అతనిహస్తంపట్టి తనవైపుకు లాక్కున్నది. ఆయన విమూఢునివలె ఆమెవడిలో వాలిపోయాడు. ఆమె ఆయన శిరోజాలలో వ్రేళ్ళునుదూర్చి దువ్వుతూ, "సృష్టికిమూలం ప్రేమేగదా, మంగళ్‌నాథ్‌గారు! భయంవలనవుద్భవించే భక్తి, లోలత్వంద్వారా జనించే ప్రేమ తుచ్ఛములు. కాని నిస్వార్థరూపంలోని పవిత్రప్రేమ, భక్తి విశిష్టమైనవి. స్త్రీప్రేమ పొందకుండా, మానవజీవితం పూర్ణత్వంపొందదు. సుగంధంతో మిళితమైన శృంగారంలేని పుష్పం రాణించనట్లే స్త్రీప్రేమలేని పురుషజీవితం రాణించదు." అంటూ ఆయన కపోలాలను ఫాలభాగాన్ని చుబుకాన్ని స్పృశిస్తూ తన కోమలఅంగుళీయములతో నొక్కింది.

ఆమె మృదుమధుర స్పర్శతో మంగళ్‌నాథ్‌రక్తం తాపంతో మరిగి పొంగి పొర్సులుగ్రక్కుతూ నరాలను కొంగర్లెత్తిస్తున్నది. ఆయన అప్రయత్నంగా మదభరితనేత్రాలతో మత్తునువెదజల్లుతూ బాహువులతో ఆమెకంఠాన్ని బంధించి, క్రిందికివంచి బలంగా అదిమాడు. ఆమెఅధరాలు ఆయనఅధరాలమీద గాఢముద్రవేసి, దూరమయినవి. ఫిల్ము తెగిపోయిన సినిమాహాలులో మెయిన్‌స్విచ్ వేసినట్లు, ఆ అధరాలనుంచి సర్వాంగములందు ఏదో ప్రస

రింపసాగింది. ఆయన నేత్రాలుమూసి, వేడినిట్టూర్పువిడుస్తూ "అబ్బ! కృష్ణా! నన్నిలా వెర్రివానినిచేశావేమిటి? మన స్సంతా చీకాకుచెందుతుంటుంది. నిన్ను యెంత మర్చి పోదామనుకున్నా శక్యంగాకున్నది. నా మనస్సంతా నిన్ను స్మరిస్తూ కలవరపడుతుంటుంది. అస్పష్టమైన యీ వ్యధను భరించుట కష్టంగావుంది కృష్ణా!" అంటూ ఆమెమెడను చుట్టివున్న తన బాహువులను ఇంకా బిగించి, ఆ ఆధా రంగా తనముఖాన్ని పైకెత్తప్రయత్నిస్తున్నాడు. వయసు లోని వలపులనొలికిస్తూ సౌష్టవాన్ని శోభితరూపంలో ప్రద ర్శిస్తూ మిసమిసలాడు ఆమెవక్షోజాగ్రాలు ఆయనకపోలాలకు వెచ్చగాతగిలి మరింత వుత్తేజితుడై తననుతాను మర్చి పోతున్నాడు.

## 24 జీవితలక్ష్యం - ఆత్మ, పరమాత్మ

నిర్మలానూర్జహాఁ నిపుడు ఇంగ్లీషుపుస్తకం విడనాడ కుండా చదువుతున్నది. ఇంగ్లీషుపాఠాలలోని కాఠిన్యమిపుడు కనిపించుటలేదు. సాఫీగా చురుకుగా చదువగలుగుతున్నది. పాఠాలలో తెలియని చిన్నిచిన్ని సంశయాలను శివప్రసాద్ నడిగి తెలుసుకొనుట కిపుడామె కంత చనువుగా తోచుట లేదు. ఆయనయెడల తనకున్న భక్తిశ్రద్ధ లిపుడు బిడియ పడుస్తున్నవి. అంతచనువుగా సంభాషించలేకపోతున్నది. ఆయనమీదున్న గురుభావం ద్విగుణీకృతమైనందున, ఆయన ముందు భయంభయంగా సంచరిస్తున్నది. శ్రమపడి, చదివి,

చకితునిచేసి మెప్పుపొందాలని ఆమె ప్రయత్నం. పాఠాలు రత్నాకరునివద్దనే చెప్పించుకుంటున్నది.

చదువులో రత్నాకరునిదీక్ష అందరను ఆశ్చర్యాన్వితులను జేస్తున్నది. కాళిదాసు చదువు పేరుతో జరిపిన అల్పవ్యవహారాలతోను, పెట్టిన అనవసరఖర్చులతోను, తెచ్చిన అపకీర్తితోను విసిగిపోయి, చదువుమాన్పించిన బద్రీనారాయణకు రత్నాకరునిలో గలిగిన మార్పు, దీక్ష సంతృప్తిని కలిగించినవి. కనకలలలో రత్నాకరునివిషయ మొక్కటే మనస్సులో వికసితరూపమొందుతున్నది. మిగిలినవారియెడ కలుగుతున్న ఉదాసీనత భారరూపందాలుస్తున్నది. రత్నాకరునికి ఇంటిలోకంటె బయటకూడా ఆదరము, ఆధిక్యత ఇనుమడించినవి. పుస్తకాలపురుగని యే విద్యార్థిబృందం పరిహసించిందో ఏ నాటకమండలివారు చిన్నచూపు చూచారో వారంతా నేడు సిగ్గుతో పశ్చాత్తాపపడుతున్నారు. అతను మద్రాసులో సంపాదించుకున్న కళంకం మాసిపోయింది.

నిర్మలానూర్జహాన్ అనుక్షణమూ ఆయనతోనే మెలగుతూ, ఆయనతోడ్పాటుతో చదువుతున్నందున, సన్నిహితసంబంధమేర్పడి, ఘనిష్టరూపందాల్చింది. రత్నాకరునికి ఫలహారాలుకూడా నిర్మలద్వారా బలవంతంగా అందుతున్నవి. మానవహృదయం మలుపుపొందునపుడు అది అజ్ఞాతరూపంలో వుంటుంది. ఆ మలుపు సంభవించినతరువాత, కొంతపయనానంతరంగాని తన పయనంలోనిమార్పులు పరిశీలనలోకిరావు. నిర్మలకు పాఠాలేగాదు, రత్నాకరునిద్వారా

వినే ప్రతివిషయంలోనూ ఆనందమూ,ఆకర్షణా కలుగు తున్నవి. నిర్మలసన్నిహితసంపర్కంలో చదువులకంటె మధురసంభాషణలలో ప్రీతి హెచ్చుతున్నది. ఇరువురిముందు పుస్తకాలు తెరచివుంటవిగాని, మనస్సులు వాటిమీదగాదు, వారు యెక్కడెక్కడో ఆలోచనలలో విహరిస్తుంటారు. పోనుపోను వారిసంభాషణలు అంతంలేనివిగా రూపొందినవి. వారిసంభాషణలు, పాతాలు రచయితలు, చరిత్ర, లోకాభిరామాయణంనుంచి జీవితలక్ష్యం, ఆనందానుభవము, మధురమయ ప్రేమ, జీవితమే ప్రేమ, ప్రేమే జీవితము, ప్రేమే భగవత్స్వరూపము అనునంతవరకు పోయినవి.

"ఈ ప్రపంచంలోని సర్వసమస్యలు సంఘర్షణలు కేవలం ప్రతిజీవి తనసుఖంకొరకు చేస్తున్న కృషియొక్క ప్రతిబింబాలుమాత్రమే. నిర్మలా. తనకుగల అవకాశాలనన్నిటిని వినియోగించుకుని, సుఖమయజీవితాన్ని పొందుటే మానవుని పరమలక్ష్యం" అన్నాడు రత్నాకర్.

ఆమె హాస్యాన్నొలికించు చిరునవ్వుతో "జీవి సుఖాన్ని కోరుట, అందుకుయత్నించుట సహజమేకాని, అదే జీవిత లక్ష్యం కాజాలదేమో రత్నంగారు. పొందిన సుఖాలకంటె చేసిన త్యాగాలవిలువ విశిష్టరూపంలో కనిపిస్తుంటుంది. సుఖస్వార్థ సంఘర్షణలో ఆత్మశాంతి లభించదు, సత్ఫలితమూ లభించదు. అందుకే బుద్ధభగవానుడు సుఖ స్వార్థ సంఘర్షణను త్యజించి, త్యాగాన్ని అంకితంచేయమన్నాడు. అందులో మానవవున్నతి గలదని రుజువుపర్చాడు. సంఘర్షణ సంఘర్షణద్వారా ముగియదు; త్యాగముద్వారా

మాత్రమే ముగియగలదని, శాంతి, హృదయోన్నతి లభించ గలదని ప్రకటించాడు. కనుక మానవునిలక్ష్యం సుఖం మాత్రమే కాజాలదు." అన్నది నిర్మలానూర్జహాన్.

"నీ వన్న బుద్ధభగవానునివాక్కులు యదార్థ సత్యాలు. కాని అందున్న అంతరార్థం మానవసుఖమే మానవకళ్యాణము. అయితే, ఆ సుఖంకొరకు అందుకవుసర మైన వస్తుసంగ్రహమార్గాలు తీవ్ర పోటీలుగా పరిణమించి నందున సామూహికసుఖంకొరకు నియమబద్ధులనుగమ్మని ఉద్బోధించాడు. జాతికి సామూహికసుఖానికి విఘాతంకలుగ కుండు సదుపాయాలను వారు ప్రకటించారు. ప్రకృతిసిద్ధ మైన సర్వస్వాన్ని మానవునిసుఖంకొరకు వినియోగించుటే ఆయనఆశయం నిర్మలా" అన్నాడు.

"మీ మాటలు కాదననుకాని, అందు చిన్న పొర పాటున్నది. సుఖసంపదలన్నీ లభ్యమైనంతమాత్రానకూడా సుఖం సంప్రాప్తమవుతుందనుటకు వీలులేదు. మానసిక తృప్తి ఆనందము వున్నచోట సుఖమయ శృంగారప్రభ ద్యోతకమవుతుంది. త్యాగము, తృప్తి సుఖానికి జీవం లాంటివి. అదే బుద్ధభగవానుని తలంపనుకుంటాను" అన్నది నిర్మల.

విస్తుపోతున్నవానివలె "అబ్బ! నిర్మలా, నీవు పెద్దపెద్ద గ్రంథాలను చదువలేదు. విశేషమీమాంసలను వినికూడా వుండవు. అయినా, యిలాంటి వున్నతమైన విశిష్టమైన నిర్దిష్ట నిర్ణయాలను యెలా చెప్పగలుగుతున్నావు? నీ బుద్ధి మహా తీక్షణమైంది. పూర్వజన్మలో నీవు గొప్పవిజ్ఞానివైవుంటావు;

ఆ సుకృతవిశేషప్రభావంతోనే యిలా చెప్పగలుగుతున్నావు. నీవు విజ్ఞాననిధివని ఒప్పుకొనుటకు సిగ్గుపడను. మా కృష్ణ చెప్పినట్లు తర్కంలో నిన్ను నోడించుట దుస్తరము" అన్నాడు.

స్తుతిలో స్త్రీ పరవశురాలై పోవుట సహజము. నిర్మల స్మితాన్నిపొంది "మీరు మళ్ళీ పొరపాటులో నూలిక విషయాలమీదనే గీటుపెడుతున్నారు. మానవునికి సుఖసంగ్రహమే ప్రధానమన్నారు. ఆ అభిప్రాయానికి పునర్జన్మ విరోధిగదా రత్నంగారూ!" అన్నది గలగల నవ్వుతూ.

"నీవు పునర్జన్మను నమ్మవా?" అని ప్రశ్నించాడు.

"నావిషయంగాదు, మీ భావనలవిషయం నేను గుర్తుజేస్తున్నాను"

"పునర్జన్మ దేవునిఅస్తిత్వంతో ముడిబడివుంటుంది నిర్మలా. 'దేవుడు' అని యెవరిని అంటున్నామో, ఆ అనంత అద్భుత అతీతశక్తి శాశ్వతమైన నిగూఢశక్తి. అది యెప్పటికీ మానవునికి అర్థంగానిదిగానే వుంటుంది. ఆ అర్థంగాని దాన్ని నిర్ణయించుకుని నిర్మించుకుని సృష్టించుకుని ప్రతిష్ఠించుకుని నియమాలతో పూజించుకుని, ఆత్మతృప్తినిపొందుటలో మానవుడు అలవాటుపడిపోయాడు. ఆ దేవుని సృష్టించినరీతినే పునర్జన్మనూ సృష్టించాడు. పొందలేనివాటిని, తీరని కోర్కెలను తరువాతజన్మలోనైనా పొందగలననేతృప్తిని కల్పించుకుంటాడు. జీవితపోరాటంలో ఓడినవాడు పునర్జన్మ కొరకు యెదురుచూచుటలో శాంతి లభిస్తుంది.

"పేరు యేమైనా కానీండి, రూపం యెలాంటిదైనా

కానీండి. విషయవిజ్ఞానం యెలాంటిదైనా కానీండి. భగవంతుడనే పేరుతో యెవరిని సంబోధిస్తున్నామో, యే భావ సంగ్రహంతో సంబోధిస్తున్నామో ఆ భగవంతుడనబడే వాడిని మానవాతీతశక్తిగాను, సర్వజగత్తుకుమూలంగాను ఆ భగవంతునిఅస్తిత్వమున్నట్లు మీరు స్వీకరిస్తున్నారుగదా. ఆ వరుసక్రమానుగుణాలైన పాపము, పుణ్యము, నరకము, స్వర్గము, పునర్జన్మ మొదలగువాటిని . యేమంటారు చెప్పండి?" అన్నది.

"వాటినిగురించిన ధార్మికప్రచారాలన్నీ మానవ విజ్ఞాన వికాస ప్రభావాలు మాత్రమే. ఆత్మ అవినాశనమైనపుడు పునర్జన్మ తథ్యమవుతుంది. అవి రెండూ తథ్యమైనపుడు మిగిలినవాటన్నిటిని యథాతథంగా విశ్వసించక తప్పదు. కాని, యథాతథంగాకుండా వక్రకోణాన్ని ఒకింత తప్పించిచూస్తే, అవన్నీ ప్రత్యక్షసత్యాలుగా ప్రామాణిక మవుతవి. నీ ఆత్మవిజ్ఞానానుభవముద్వారా పొందిన వికాసోన్నతిలోని అధికాంశాన్ని నీ సంతానం పొందుతుంది. వారిద్వారా వారిసంతానం పొందుతుంటుంది. ఈవిధంగా వరుసగా ఆత్మోన్నతి అభివృద్ధి జరుగుతూనేవుంటుంది. ఈ రూపంలోమాత్రమే ఆత్మ శాశ్వతమైంది. నీ భావిజన్మ నీ సంతానం, వారిభావిజన్మ వారిసంతానం, ఆరూపంలోనే పునర్జన్మ యథార్థమైంది. పాపముయొక్క ప్రతిఫలం బాధ, పుణ్యప్రతిఫలం సుఖం. చెడువ్యాధులు, అనారోగ్యము చెడుకార్యాలనంటివుంటవి. వాటిఫలితాలను తాను, తన ద్వారా జబ్బులరూపంలో తనసంతానం అనుభవించుట

చూస్తున్నదే. దొంగకు ఆత్మాంధకారమే శిక్షగా తీరిపో వచ్చు. అయితే యీ నియమాలన్నీ భగవంతుడనబడే వానిద్వారా శాసింపబడుతున్నవి. ఆయన ప్రతిజీవికి కాతాబెట్టి లెక్కలువ్రాసి అంత్యకాలమున నిర్ణయాలు జరుపుతుంటాడు; తగినశిక్షలను పురస్కారాలను కల్పిస్తుం టాడు. అందరిఆర్తనాదాలను వింటూ, పెద్దగా స్తోత్రంజేసే వాడికి పెద్దపెద్ద పురస్కారాలను ప్రసాదిస్తుంటాడనుకోవ టం అమాయకత్వం. సర్వాంతర్యాముడని యెవరినంటు న్నామో అది మానవునివలెగాని జంతువువలెగాని పక్షి వలెగాని రూపురేఖలుగలిగిన నిర్దిష్టనియమరూపం గాదు. అది అతీతమైన అనంతశక్తిమాత్రమే. ఆ శక్తిలోని ప్రకృతి సిద్ధమైన ప్రభావాలు యెక్కడికక్కడ ప్రతిబింబితరూపంలో క్రియ ప్రతిక్రియలుగా ప్రకటితమవుతుంటవి. ఆ అనంతశక్తి సంపూర్ణంగా యెన్నటికీ అర్థంగానిది. అది మానవునికి యెప్పుడూ నిగూఢంగానే వుంటుంది. మానవుని పరిశోధనా జ్ఞానం పెరిగి పరికరాలతో పరిశీలించినకొద్దీ ఆ శక్తి మరింత అనంతమైందిగా గోచరిస్తుంది. ఆ శక్తికే వివిధనామాలుపెట్టి భగవంతుడని స్తోత్రంచేస్తుంటాడు మానవుడు," అన్నాడు రత్నం.

"అయితే భక్తితోచేసే యీ పూజలన్నీ నిరర్థకమే నంటారా రత్నంగారు?" అన్నది నిర్మల.

ఆయన మందహాసంతో "ఆత్మతృప్తిద్వారా పొందే ఆనందాన్ని నిరర్థకమని యెవరనగలరు? నీతి నీయమము భక్తి విశ్వాసాలు సమష్టిక్షేమానికి రక్షకకవచాల్లాంటివి. నావరు

చుకొక్కనివలెనే సంఘాన్ని యివి నిశ్చితస్థాయిలో నడుప గలుగుతవి." అన్నాడు.

"మీ నిర్వచన సమంజసమైనదికాదనిగాని, ఆధార రహితమనిగాని అనలేను. అయినా, తాలింపులేని కూరవలె శిఖరంలేని శివాలయంవలె, సోపానాలులేని కొలనువలె, గడులులేని గృహంవలె, నా మనస్సు కేదో ఆందోళన కలుగుతున్నది. మీ నిర్వచన యదార్థసత్యంవలె గోచరిస్తున్నది కాని, విశ్వసించలేకపోతున్నాను. నేను ప్రత్యక్షంగా మంత్ర ప్రభావాలను చూసి విస్తుపోయాను. అది బీజాక్షరప్రభావ మన్నారు; కాని ఆ బీజాక్షరాలలోని శబ్దార్థం భగవంతుని స్తోత్రమని నేను తెలుసుకున్నపుడు విస్తుపోయాను. పాము మంత్రం నే నెరుగుదును. ఆమంత్రంలోనిబీజాక్షరాలశబ్దార్థం స్తోత్రమే. ఆ శబ్దాలతో యెవరిని స్తోత్రంచేస్తున్నామో వారిద్వారా జరుగవలసిన సత్ఫలితమే సంప్రాప్తమవుతున్నపుడు అది అబద్ధమని ఎలాఅనగలం. తెలుగుతెలియని హిందీ ఆఫీసరుముందు తెలుగులో ప్రార్థించినా, ఇంగ్లీషుతెలియని ఫ్రెంచివానిముందు ఇంగ్లీషులో ప్రార్థించినా నిష్ప్రయోజన మైనట్లు, ఆ బీజాక్షరాలభావాన్ని మరేశబ్దాలలోనైనాపెట్టి వుచ్చరిస్తే నిష్ఫలమవుతుంది. ఆ రక్షకునికి అర్థమయేశబ్దాలలో సంబోధించినపుడు ఆయన తప్పక ఆలకించుతాడు. ఆ శబ్దాలు తెలియక, తెలిసినా నిష్టతో నిగాతో స్తోత్రంచేయుట కుదురక, ఏకాగ్రత లేక భగవంతునిముందు మానవుడు విఫలుడవుతున్నాడని నా తలంపు," అని నిర్మల అంటూ ఉండగా "నిర్మలా, ఓ నిర్మలా!" అన్న భవానీకేక వినిపించి,

ఆమె నిద్రనుంచి మేల్కొన్నదానివలె, "చాలా సేపయి పోయింది; మాటలలో తెలియలేదు. అమ్మ పిలుస్తున్నది, వెళతాను" అంటూ వెళ్ళిపోయింది. తనముందు తెరచి వున్న పుస్తకంమీద చేతులువేసి, అటూయిటూ త్రిప్పి నలుపుతూ, ఆమెవెళ్ళినమార్గంవైపే చూస్తున్నాడు రత్నం.

## 25 మానవపూర్ణత్వం

శివప్రసాద్ ప్రజ్ఞావిశేషము కాలేజీప్రిన్సిపాల్‌కు విదితమే. శివప్రసాద్‌ను ప్రిన్సిపాల్‌గా నియమించాలని యూనివర్సిటీవారే యెన్నోమారులు అభిలషించారుగాని, ఆ బాధ్యతకు దూరంగావుండాలని శివప్రసాద్‌నిర్ణయం. పదవుల కొరకు ప్రాకులాటలు కృత్రిమాలు జరుగుచున్న యీ రోజుల్లో శివప్రసాద్ అందుకతీతుడై, సామాన్యునివలె వుంటూ చేయగలసహకారం చేస్తుండుట ప్రిన్సిపాల్‌నేగాదు, యూనివర్సిటీవారినే ముగ్ధులనుజేసింది. అందుకే ఆయనకు సెనేట్‌సమావేశములకు తరచు ఆహ్వానాలు వస్తుండేవి. ప్రిన్సిపాల్ తనఅనురోధంతో తనకుఅండగా తనప్రక్క సెనేట్‌లోవుండుటకని శివప్రసాద్‌ను పట్టభద్రుల నియోజకవర్గానికి నిలిపి సెనేట్‌మెంబరుగా గెలిపించుకున్నాడు.

సెనేట్‌సమావేశాలకు పిలుపువచ్చింది శివప్రసాద్‌కు. మానవుడు తనప్రభావాన్ని ప్రఖ్యాతిని తనసన్నిహితులకు తెలుపుకొనుటకు వుబలాటపడతాడు. మనస్సులోని వుత్సాహాన్ని వూహలను ప్రక్కవారికి ప్రదర్శించినపుడే ఆత్మానందం కలుగుతుంది. నిర్మలనుకూడా తనతోపాటు వైజాగ్

సెనేట్‌సమావేశాలకు తీసుకెళ్ళాలని, వేడుకగా అక్కడి దృశ్యాలన్నీ చూపాలనీ ఆయనతలంపు.

పరిహాసరూపంగా "నాతో రావటానికి నీకు భయ మెందుకు? అక్కడిపోలీసులు నిన్ను పట్టుకోరులే!" అన్నాడు శివం.

"అలాంటిమాటలకు చిన్నబుచ్చుకోను; నన్ను నిజంగా పోలీసులు పట్టుకొని వెనుకటినేరాలకు శిక్షనిప్పిం చినా చింతించను బాబుగారు! మీవెంట వచ్చి మిమ్మ చిన్నబుచ్చలేను" అన్నది నిర్మల.

"నేను ఆహ్వానిస్తున్నపుడు నీ కా అనవసర అను మానా లెందుకు?"

ఆమె వుదాసీనవదనంతో "కర్తవ్యపరాయణతతో పురుషుడు నిర్దిష్టమైన నిశ్చితమైన విజ్ఞుడు. కాని కొన్ని వేళ లందు స్త్రీసమక్షంలో అన్నిటినీ విస్మరించి, అవహేళనకు పాత్రుడుగావచ్చు బాబుగారు. అక్కడ పురుషుని కాపాడి కర్తవ్యోన్ముఖునిచేయగలిగింది స్త్రీయొక్క అదృశ్యమే"

శివప్రసాద్ చిన్నగా నవ్వుతూ కోరగాచూస్తూ "నీవు యెప్పుడూ వితండవాదాన్ని లేవదీస్తుంటావు; జన్మతః వితండ వాదివి గాబోలు! ఏ మదభరిత మత్తులో మైకంలో పురు షుడు కర్తవ్యాన్ని విస్మరిస్తాడో అక్కడ ఆ స్త్రీ అదృశ్య మైతే, మతిబోయి వెర్రివాడై జీవితాన్నే కోల్పోవచ్చు" అన్నాడు శివం.

"స్త్రీపురుషప్రేమలు ఆ స్థాయికి పోవుట క్షేమంగ గాదేమో బాబుగారు"

"పవిత్రమైన ప్రేమకు హద్దులు అవధులు నియమాలు వుండవు. అందు అంకితమై తనను తాను మరచి, తనవ్యక్తిత్వాన్ని కోల్పోయినపుడే హృదయము మనస్సు యేకమై పాలకడలిరూపంలో ద్యోతకమవుతూ తరంగాలలో ఆనంద డోలికలూగుతుంది. అక్కడే మానవపరిపూర్ణత్వం ప్రభాసిస్తుంది. ఈర్ష్యాద్వేషాలులేని ప్రేమ వికసిస్తుంది. స్త్రీ ద్వారానే పురుషుడు పూర్ణత్వాన్ని పొందుతాడు"

"మీరన్నది యదార్థంగావచ్చు కాని, ప్రక్కనుండ గల యోగ్యత వుండాలిగదా! పుష్పం విలువైందేగాని, అన్నిపుష్పాలతో వేణినలంకరించరు. పొరపాటుగా యే స్త్రీ అయినా గోగుపువ్వును శిరస్సునధరిస్తే నవ్వుతారు" అన్నది.

"తెలియక విలువైనవాటినికూడా విడనాడుటకద్దు. పొన్నపూవు కమనీయమైన సుగంధాన్ని వెదజల్లుతుంది; అందంగానూ వుంటుంది. అయినా వాటిని కొనేవారూ లేరు, ధరించేవారూ లేరు. దానివిలువ తెలిసినవారు తప్పక ధరిస్తారు" అంటూండగా 'పోస్టు' అన్న కేక వినిపించింది.

ప్రిన్సిపాల్‌తో కలిసి శివప్రసాద్ సెనేట్‌సమావేశాలకు వెళ్ళిపోయాడు.

## 26 ప్రకృతిపరుగు

రసవత్తరమైన సినిమా చూసివచ్చిన విద్యార్థికి పాఠ్య గ్రంథపఠనం పేలవంగా తోచినట్లు, రత్నాకరునికి పుస్తకాల మీాద మనస్సుపోవుటలేదు. పుస్తకంలోని యేపేజీ తిరుగ

వేసినా అలికినట్లుండి అక్షరాలు కనిపించవు; బాగా పరికిస్తే సుందర సుకుమార చంద్రబింబంలాంటి ముఖమండలం ద్యోతకమవుతుంది. ఆ ప్రతిమను చూస్తూ మనోవిహారం చేస్తుంటే మంచి సినిమాచూస్తున్నట్లు పరవశమైపోతుంటాడు. భావిజీవితకలలతో, ఏనాటో పొందు అదృష్టభ్రమలతో కలుగబోవు కల్పనలతో ప్రభుత్వమువారు నిర్ణయించిన పాడు పాఠాలు చదువుట, మలేరియాభయంతో కటికిచేదుక్వైనయిన్ను కళ్ళుమూసి మ్రింగినట్లు వెగటుతోచి, వికారం కలుగుతున్నది. చదువుమీద మొహం మొత్తుతున్నది. పుస్తకాన్ని తెరచి ముందుంచుకుని చేస్తున్న వ్యూహావిహారంలో మహదానందం లభిస్తున్నది. పొందుతూన్న ఆనందాన్ని పోగొట్టుకునే వ్యర్థులకుడు.

శశిధునికొరకు చకోరాలు నిరీక్షించినట్లు, నిర్మల దర్శనంకొరకు రత్నాకరుడు అనుక్షణము నిరీక్షిస్తున్నాడు. ఆమె కిపుడు పాఠాలుచెప్పుట సాధ్యమవుటలేదు. పాఠ్య పుస్తకాన్ని చేతబట్టి శృంగారఘట్టాలు యెక్కడెక్కడివో తెచ్చి అనర్గళంగా వర్ణిస్తూ కదాచిత్ గా ఆమెను వుపమానం చేస్తుంటాడు. చెప్పేకబుర్లు యెక్కడివైనా అటూయిటూ త్రిప్పి ఆమెమీదుగా తెచ్చి ఆమెను వేయివిధాల పొగడుతుంటాడు. ఆమెఅందాన్నిచూచి తనకు కలుగుతున్న ముగ్ధతను చిత్రవిచిత్రంగా చిత్రిస్తుంటాడు. ఆమెలోని అసామాన్య అందచందాలను అద్వితీయమని, ఆమె నిరాడంబరత వినయము మరింత మెరుగులుదిద్దుతున్నవని, విజ్ఞత ప్రజ్ఞ శోభిస్తున్నవని, సృష్టికర్త బ్రహ్మఅయితే ఆ బ్రహ్మ

వలన ఆమె చిత్రింపబడివుండదని, సాధారణప్రతిమలను సృష్టించుటలో అలవాటుపడిన ఆయనశక్తి కిది అసాధ్యమని, పోటీసృష్టికర్తయైన విశ్వామిత్రుడు బ్రహ్మయందుగల యీర్షాద్వేషాలతో అతనుచూసి, సిగ్గిలుటకుగాను తన సర్వ నేర్పును క్రోడీకరించి అత్యధికశ్రమతో ఆమెను చిత్రించి వుంటాడని, విష్ణుమూర్తి తనఆనందంకొరకు బ్రహ్మను పరిహాసంచేయను ఆమెలో సర్వసుగుణాలతో మెరుగులు కల్పించివుంటాడని, ఆమెసమక్షంలో పొగడుతుంటే ఆమె యే సువర్ణసుందరికథో వింటున్నట్లు వెలవెలపోతుంటుంది. తననుగురించినపొగడ్త వింటున్నపుడు ఆమెశరీర మిపుడు పులకితమవుతున్నది. శివప్రసాద్ యెడల తనకున్న భక్తి భయము రత్నాకరునిసమక్షంలో లేవు. శివప్రసాద్ వున్నత కుటుంబంలోనివాడని గొప్పవాడని దైవసమానుడని ఆమె అభిప్రాయం. అందుకే ఆయనయెడల భక్తి భయమువున్నవి. రత్నాకరుడు సామాన్యుడని, వినయము విశ్వాసముగల విద్యార్థియని ఆమెతలంపు. అందుకే ఆయనయెడల ఆమెకు నిర్భయము నిస్సంకోచము. ఆయనతో యెంత చనువుగానైనా మాటాడగలుగుతుంది. అవుసరమైనపుడు దబాయించగలుగుతుంది. ఆయన యెక్కడిగాథలనో చిత్ర విచిత్రంగా వర్ణించి చెపుతుంటే, ఆమె కూర్చున్నచోటనే నిర్లక్ష్యంగా పృథ్విమీద వరిగి మోచేతినానించి, చేతిలో శిరస్సునుంచి, పాదాలను చిన్నగా వూపుతూ వింటూ, మధ్య మధ్య వ్యంగ్యప్రశ్నలువేస్తూ, మందహాసాలొలికిస్తూ తీక్ష్ణ దృక్కులనుబరపుతూ ఆకస్మికంగా కిలకిలనవ్వి "అరెరే,

యెంతపొరపాటో చూడండి; మీరు అంత కాకిగోలగా చెబుతూనేవున్నారు, కాని ఒక్కటీ నా బుర్రకెక్కలేదు. నా మనస్సు మరే ఆలోచనలలోనో నిమగ్నమైవుంది. అందు వలన దయతో యింతవరకు చెప్పినవిషయాలను తిరిగి చెప్పండి వింటాను" అన్నది నిర్మల.

రత్నం చిన్నబుచ్చుకున్న ముఖంతో తెచ్చిపెట్టుకున్న నవ్వుతో నంగిగా "నామాటలు మీకు వినబుద్ధిలేదుగా బోలు. కాకిగోలవలె నా కంఠశోష మీకు బాధాకరంగా వుంది గాబోలు. నామాటలతో విసుగుపుడుతున్నది గాబోలు, నన్ను క్షమించు నిర్మలా, నిన్ను అనవసరంగా డిస్టర్బ్‌చేస్తున్నందుకు" అన్నాడు.

ఆమె నిర్లక్ష్యంగా చిరునగవునుచిలికిస్తూ, కొంటె చూపులను విసరుతూ, పాదాలను మరింతగా వూపుతూ "రత్నంగారు, మీలో స్త్రీస్వభావాలు కొన్ని వున్నట్లు తోస్తున్నది" అన్నది నిర్మల.

ఆయన తన క్రిందిఅధరాన్ని దంతాలమధ్యబెట్టి నొక్కుతూ, కుడిహస్తంతో వూగుతున్న ఆమెపాదంమీద చిన్నగా మోది, ఆమె మరింత పరిహాసంగా నవ్వుతున్నం దున ప్రోత్సాహంగా భావించి, ధైర్యంవహించి, ఆమెకాలి బొటనవ్రేలినిపట్టి కసిదీర వంచుతున్నాడు. ఆమె నొప్పిని భరించలేక పాదం వెనక్కులాక్కొన ప్రయత్నించి విఫలు రాలై నేత్రాలుమూసి నవ్వుతూ "అబ్బ! వదులు రత్నం" అంటూ, వ్రేలినవంచిపట్టి, భరించరాని నొప్పికలిగి నందున తనకాలును వెనక్కు నుంచుకూ విసురుగా గుం

జింది. వంగివున్న రత్నాకరునిముఖమండలానికి బలంగా తగిలి, అప్రమత్తతలో అతను వెనక్కు పడిపోయాడు. నిర్మలపాదం ఆయననాసికకు తగిలింది గాబోలు, నాసికా రంధ్రనాళాలు బెదరి రక్తంస్రవిస్తున్నది.

ఆమె వెలవెలబోతూ, ఆయన శిరస్సును పైకెత్తి తనకొంగుతో రక్తమునుఅద్ది, కూజానీటితో చెంగునుతడిపి, ఆయనశిరస్సుమీద పిండి, సవరిస్తూ ఆ తడిగుడ్డనే నాసిక మీదపెట్టి మృదువుగా స్పృశిస్తున్నది.

శీతలతరళస్పర్శతో రక్తస్రావము ఆగిపోయింది. నిర్మల తన తడికొంగుతోఆయననాశికవద్దనున్న రక్తపుమరకలను శుభ్రపరచి,క్షోభిస్తున్న ఖిన్నవదనంతో "గొప్ప పొరపాటు జరిగింది రత్నంగారు! క్షమించండి. అయినా మీరదేమిటి, స్త్రీలపాదాలంటుకోవచ్చా చెప్పండి?" అన్నది. ఆయన మందస్మితవదనంతో "నాకు దెబ్బతగిలిందని బాధపడుతున్నారేమో, అలాంటిదేమీలేదు. నాసికానాళాలు బెదరి రక్తస్రావమయింది. అంతే! నొప్పి యేమాత్రం లేదు. స్త్రీలపాదాలంటరాదేమోగాని, మీపాదాలంటితే తప్పు కాజాలదు. ఒకవేళ యిదికూడా అపరాధమయితే, నేను రోజుకు వేయిమారులు యీపాదపద్మాలంటి అపరాధాలు చేస్తుంటాను" అంటూ తిరిగి రెండుహస్తాలతో రెండుపాదాలను స్పర్శించాడు. ఆమె వెంటనే ఆయనచెవిపట్టి "ఇలాంటి కోతిపనులు చేయరాదు" అన్నది.

"నేను చెప్తున్నపుడు వినినట్లు నటించి, ఆఖరుకు యేమీవినలేదని, తిరిగి చెప్పమనట మెందుకు చెప్పండి"

అన్నాడు. "మీలో చాలా చిక్కవచ్చిపడింది. డ్రామాలో పాట బాగా పాడినపుడు ప్రేక్షకులు ఆనందాన్నిపట్టజాలక, వన్స్‌మోరులుకొడతారు. ఆ పాడినవారు పరవశులై తిరిగి యింకా బాగాపాడాలని ప్రయత్నిస్తారు. మీరు చెప్పినమాటలను తిరిగి చెప్పగానే, అంత కోపమెందుకు చెప్పండి?" అన్నది మందహాసంతో.

"నామాటలు మీకు బాగా నచ్చి, తిరిగి చెప్పనున్నట్లయితే, దయతో నేను చెప్పినవిషయాలలో ఒకటి చెప్పండి నిదర్శనగా" అన్నాడు.

ఆమె మరింతగా నవ్వుతూ "డ్రామాలో వన్స్‌మోర్ కొట్టినవారిని నారువిన్నపద్యభావ మడిగినా చెప్పలేక పోవచ్చు, వారికి నచ్చింది ఆ రాగాలాపనే గావచ్చు."

విసుగుప్రదర్శిస్తూ, హస్తద్వయం జోడించి "మీకు వేయినమస్కారాలు. సాక్షాత్ ఆ శంకరాచార్యులవారు వచ్చినా, మీముందు తర్కవాదంలో నిలువజాలక, ఓటమి సంగీకరిస్తాడు" అన్నాడు. "నీవు కోతిగా మారిపోతున్నావు రత్నం. నాముందు చేతులుజోడించవచ్చా, చెప్పు?" అన్నది నిర్మల. ఆయన పౌరుషప్రేరితవదనుడై "నిర్మలా దేవిగారు నావిషయంలో యీ ఒక్కమాటమాత్రం శాశ్వతంగా గుర్తుంచుకోమని ప్రార్థిస్తున్నాను. భగవంతుడనబడేవానికి నేను యెన్నడూ శిరస్సువంచను. యీలోకంలోని యెవరి ముందూ చేతులుజోడించను. నీముందుమాత్రం చేతులు జోడిస్తున్నందుకు గర్విస్తాను. మోకరిల్లుటలో పరమానందాన్ని పొందుతాను. నీముందు యేమిచేయటానికైనా నేను

వను.” అంటూ, ప్రతినబట్టినవానివలె ఆమెయెట్టయెదుట నిలచి, బాలకునివలె చేతులుజోడించి శిరస్సువంచాడు.

ఆమె వేడుకగా పరిహాసరూపంలో తనకుడిహస్తాన్ని చాచి, అతనిశిరస్సుపైనుంచి “భక్తా! నీ వినమ్రతకు మెచ్చితిని, నీ యిచ్ఛవచ్చినవరమొకటి కోరుకొమ్ము” అని నవ్వుకుంటూ గంభీరకంఠంతో అన్నది. ఆయన శిరస్సును అలాగే నిశ్చలంగావుంచి, “దేవిస్వరూపిణీ, యీ అర్భకుడైన మీ భక్తుడు తమ అపారకరుణను ప్రసాదించమని ప్రార్థించుకుంటున్నాడు.” అంటూ, తనశిరస్సును ఆమెపాదాలమీద మోపబోతున్నాడు. ఆమె వెంటనే ఆయనచెవిబట్టి కసిదీర మెలిపేస్తూ పైకిలేపి “నీకీ జబ్బేమిటి?” అని ప్రశ్నించింది.

“అవును, నిజంగా యిది జబ్బే! ముప్పదిమూడుకోట్ల దేవతలు యేకమై యేకకంఠంతో శపిస్తేగాని యిలాంటిజబ్బు సంభవించదు” అన్నాడు.

“దేవుని, దేవసృష్టిని యెవర్తు నిరసిస్తారో పరిహసిస్తారో వారికే ఒకరోజు పశ్చాత్తాపపడతారు. ఆసమయంలో ముప్పదిమూడుకోట్లదేవతలు వచ్చి, వారి నెత్తినెక్కి సవారీ చేస్తారు” అన్నది. “ఇపుడు శిరస్సుమీదెక్కి సవారీచేస్తున్న ఒకదేవతతోనే వుక్కిరిబిక్కిరవుతున్నాను. అంతమంది దేవతలను భరించగలశక్తి ఆ భగవంతుడు నాకివ్వలేదుగా” అన్నాడు. ఆమె కొంచెం క్రోధాన్ని అభినయిస్తూ “అస్తిత్వములేని ఆ దేవునిగురించి నాముందు చర్చించకండి రత్నంగారు. ఆత్మలో భీతిచెందుతూ, యెవరికంటాపడకుండా దొంగపూజలుచేస్తూ, చేతులెత్తకుండా రాతిదేవునికి మనసా

ప్రణామాలుఅర్పించుకుంటూ, నలుగురిలో బహిరంగంగా బడాయిగా ఆర్భాటంగా ఆధిక్యతకోసం దేవుడులేడని గప్పాలు గొట్టుట మీా మొగవారికి నేడు ఫ్యాషనై పోయింది. అంద రికి శాంతినివ్వగలిగింది, వుద్ధరించగలిగింది ఆ దేవుడేనన్నది తెలియదు పాపం మీాకు. దేవుడులేడని రుజువుపరిచే బుద్ధి బలాన్ని వివేకులెపుడూ మెచ్చరు. కేవలం బుద్ధిబలమే ప్రామాణికం కాజాలదు రత్నంగారు" అన్నది నిర్మలానిసార్జ హాన్. కనిపించిన ప్రోత్సాహము వుత్సాహము ఒక్క మాటుగా అదృశ్యమై, అఘాతంలోపడిపోయినవానివలె వెలవెలబోతూ నిరుత్తరుడై నిరాశతో వెనకడుగువేసి యథా తథంగా ఆసీనుడై పుస్తకాన్ని చేతబట్టి, పుస్తకంలో దృష్టి నిలిపి మనస్సును వూహావిహారంలోకి వదిలాడు రత్నం.

# 27 ప్రేమబైరాగి

పసివానికుండే ఆనందమూ వృద్ధునికుండే స్థిమిత మూ పరవశ్యతలో కుక్కుతూన్నవాని కుండదు. ప్రేమసమస్యలలో చిక్కుకోనివానికుండే కార్యదీక్ష, నియమపద్ధతి, లక్ష్య సాధన, సహకారసంపత్తి, ఆశయాలు ప్రేమవలలో చిక్కిన వాని కుండవు. ప్రేమప్రయత్నంలో ఆదుర్దా తాపత్ర యాలు, సఫలతలో మత్తుగప్పిన మధ్యస్వప్నాలు, విఫ లతలో అయోమయ శాశ్వత అంధకారస్తోత్రం వరసగా వస్తుంటవి. ప్రయత్నంలోను విఫలతలోను క్షణాలు యుగా లుగా కనిపిస్తవి. సఫలతలో యుగాలు క్షణాలుగా గని

పిస్తవి. మన నాటకచక్రవర్తి మంగళనాథ్ యిపుడు ప్రథమ దశలోనివాడు. కృష్ణకుమారిద్వారా పొందిన రింగును పోగొట్టుకున్నా, అంతకుమించి తనతో సంభాషించే వృత్తాన్ని పొందాడు. ఆ వృత్తాన్ని ఆయన యెన్నిమారులు చదివాడో ఆయనకూ గుర్తులేదు, మనమూ చెప్పజాలము. చేతి చెమటతో నానిపోయింది. అందలి అక్షరాలు చెరిగి రంగుపూసుకున్న వేషధారిముఖంవలె అయినవి. మడతల నద్ద చిరిగి చీలికలయినందున వెనుకప్రక్క అతుకువేయుట జరిగింది.

ఇప్పుడు నాటకాలమీద వుత్సాహంలేదు. స్పోర్ట్సు అంటే ఇచ్ఛలేదు. స్నేహితులతో యిష్టాగోష్ఠి అసలేలేదు. ఆకాశంలోని చంద్రబింబాన్ని కౌగలించుకోబోతున్నట్లు, ఖగోళంలోని నక్షత్రాలమీద అంగలువేస్తూ పయనించబోతున్నట్లు, సప్తసాగరాలగుండా పాతాళలోకానికి నాగకన్య అతిథిగా పోతున్నట్లు, అంతూపొంతూలేని వూహావిహారంలో పుక్కిరిబిక్కిరైపోతున్నాడు మంగళనాథ్.

కృష్ణ వరుసగా పరీక్షలలో తప్పినందున, ఇక ప్రయివేటుకూడా అనవసరమని చదువుకుస్వస్తి చెప్పించాడు బద్రీనారాయణ. ఒక్క రత్నాకరుడుదప్ప ఇంకెవ్వరూ తనను వుద్ధరించలేరని, కీర్తితేలేరని, నిరర్థకులని, నిష్ప్రయోజకులని కఠినవాగ్బాణాలతో శిక్షిస్తూ, తన నిరాశాహృదయానికి వూరటకల్గించుకుంటున్నాడు బద్రీనారాయణ. తన బిడ్డలలో ఒకొక్కరినిగురించి ఒకొక్కవిధంగా స్వప్నాలు సృష్టించుకున్నాడు. అన్నీ అడుగంటి, నేడు వాపోతూ,

ఆఖరిఆశగా రత్నాకరునివైపు చూస్తూ అతనిజాతకచక్రాన్నే చర్విత చర్వణంచేసుకుంటున్నాడు.

అడవిపావురాయిని పంజరంలో బంధించినట్లు కృష్ణ యింటినుంచి బయటికిపోవుపాయం లేక గదిలో పవళించి, గతఘట్టాలను స్మరించుకుంటున్నది. మంగళనాథ్‌తో జరిగిన తన ఆఖరిఘట్టం గుర్తుకొచ్చినపుడు, ఆమె చిప్పున లేచి కిటికీ గుండా పెరటివైపు చూస్తున్నది. ఆ మధురస్మృతులు ఆమెను మత్తులో ముంచెత్తుతున్నవి. మంగళనాథ్ నిత్యమూ సంధ్యాసమయంలో ఆలయప్రాంతమందే తిరుగుతుంటాడని తెలుసు. కాని తాను యెంతస్వేచ్ఛగా తిరిగిందో నేడంత అస్వతంత్రురాలై కూర్చున్నది. దేనికైనా వెదికేవారికి మార్గాలు లభించకపోవు. నీలకంఠస్వామిదర్శనార్థం రోహిణిని ప్రోత్సహించి సఫలీకృతురాలైంది.

ఆమరునాటిసంధ్యాసమయాన రోహిణితో కృష్ణ దైవ దర్శనార్థం బయలుదేరింది. ప్రేమతో వూహించేవి కొన్ని కొన్ని యథార్థసత్యాలైకూర్చుంటవి. ఆమె తలచినట్లే మంగళనాథ్ నదిఒడ్డున యేకాంత ఆనందవిహారంలో వున్నాడు. ఆమె పూజనుంచి తిరిగివస్తూ రోహిణి వెనుక నడుస్తూ, పెద్దగా తాను తుమ్మినపుడు ఆ ప్రేమబైరాగి తనను చూడలేదు. విస్మితుడై విభ్రాంతితో చూస్తున్న అతనికి చేసైగచేస్తూ తనచేతిలోనివుత్తరాన్ని క్రిందపడవైచి వెళ్ళిపోయింది.

పాపం! మంగళనాథ్ మరోవుత్తరం లభ్యమైనందుకు పరవశుడవుతూ తీసి చదువుకున్నాడు.

"ప్రియమంగళ్,

నామనస్సు అనుక్షణము నీకోరకు విలపిస్తున్నది. దురదృష్టవశాత్తు నేను యింటిలో నిర్బంధితురాలనై పోయాను. స్వేచ్ఛగా బయటిముఖంచూసేఅదృష్టం అదృశ్యమైంది. మా నాన్నగారిక్రోధం అర్థరహితంగా దినదినాభివృద్ధినొందుతున్నది. ఆయనగారియెదుటపడుటకే నేడు హృదయం కంపిస్తున్నది. ముక్కోపిగాను అసందర్భయాష్టిగాను తయారైనాడు. నా మనోభీష్టానికి ఆయనఆశీర్వాదాల నిచ్చి ఆనందిస్తాడని నే ననుకున్నదంతా కలగామారినది. మా స్వగ్రామంలోనే నాకు యేదో సంబంధం నిశ్చయించారట. వారంలో అన్నినిశ్చయాలు జరిగిపోతవని తెలుస్తున్నది. వారియత్నాలకు నిరోధాలుకల్పించి, రభసజేయుట నాకు యిష్టంలేదు. కనుక మీరు అన్నివిధాలా తయారై వుండండి. రేపు యీసమయానికే యిటువస్తాను. ఇక నన్ను యెన్నటికీ వీరెవరికీ కనిపించకుండా, మీయిష్టంవచ్చిన చోటికి తీసుకెళ్ళండి. నా రింగును మీకు సమర్పించుకున్నాను. మీ హృదయాన్ని నా కంకితంచేశానన్నారు. అంతకంటె వివాహానికి యేంకావాలి చెప్పండి? మనయిరువురకు వివాహంజరిగినట్లు భావిస్తున్నాను. మీరు యెక్కడికి తీసుకెళ్ళినా నాకు సంతోషమే.

ఇట్లు
మీ కృష్ణ."

మంగళనాథ్‌కు చెమటపట్టింది. మతిపోయినట్లయింది. చదివినకొద్దీ మనస్సు వికలమవుతున్నది. ఏ సమస్యతో

S Moulviy. 18.1.



ఆయన మతిపోగొట్టుకుని తిరుగుతున్నాడో, నేడా సమస్యా పరిష్కారఫలితం తనచేతిలోకి చేరితే, దానిద్వారా తనకు తెలియని వూహించని భీకరసమస్యలు ముందు నిలిచినవి. రాత్రంతా ఆ వుత్తరం చదువుతూ, అంతంలేని ఆలోచనలు చేస్తూనేవున్నాడు. ఆఖరుకు తానూ ఒకవుత్తరంవ్రాశాడు.

"ప్రియ కృష్ణా,

నీవుత్తరం యెన్నోమాఋలు చదివాను. కాని అర్థం గాలేదు. అర్థంగాని అంతంలేని యీసమస్యలలోకి నే నెలా వచ్చిపడ్డానో జ్ఞప్తికివచ్చుటలేదు. ఇది నిష్కల్మషమైన ప్రేమో మరేమో నాకు తెలియదు. నీవులేకపోతే నేను జీవించలేనని నామనస్సు వాపోతున్నది. నిన్ను కోల్పోయిన నాడు నేను వెర్రివాడనై వీధులవెంట పిచ్చివేషంతో బికారి రూపంతో తిరుగుతుంటానని చెప్పగలను. నీవూ నన్ను కావాలంటున్నావు, ప్రేమిస్తున్నావు. అవిచ్ఛిన్నమైన ఒకరి దృఢనిశ్చయాన్ని కష్టాలు, కట్టుబాట్లు మార్చజాలవు. అందు కవుసరమైన త్యాగబలికి సంసిద్ధమవుటే పరమోత్తమమైన మార్గము. నిన్ను దొంగలనంగా తీసుకెళ్ళి, నీకు నీ కుటుంబానికి శాశ్వతకళంకాన్ని వులిమి, నిన్నుపొందుట నా అభిమతముగాదు, ఆశయమూగాదు. నీవు ప్రాణత్యాగానికైనా తయారైతే మీ నాన్నగారు వినకపోరు. చేయగలప్రయత్నం మాని, దొంగదారిని యెన్నుకుని శాశ్వత అపకీర్తినిపొందుట వుచితంగాదు. కనుక, నీవు నిశ్చలమైనమనస్సుతో స్థిరమైన అభిప్రాయంతో తిరుగుబాటుచేసి, వారిని నప్పించప్రయత్నించమని నా కోర్కె. అన్నివిధాలా విఫలమయినపుడు నీ

పీనాడు చూపినమార్గాన్నే అవలంబించుటకు నేను సర్వదా సంసిద్ధుడను.

ఇట్లు,
నీ మంగళ్"

తను వ్రాసిన వుత్తరాన్ని తానే యెన్నోమారులు చదివి ఆత్మతృప్తినిపొంది, నిర్ణయాన్ని స్థిరీకరించుకుని తెన్నులుచూస్తున్నాడు. పగటి మూడవఝాముసమయమది. నూతనపూజారిణి యెవరో ఆలయంలో పూలబుట్టతో ప్రవేశించింది. నదివడ్డున నిరీక్షణలోనున్న మంగళనాథ్ ఆలయం వైపు కనులార్పకుండా పరికిస్తున్నాడు. అయిదునిమిషాల అనంతరం ఆ పూజారిణి తనవైపుకే వస్తున్నది. ఆమె ఎవరో గాదు, తన కృష్ణే. ఆమె బిత్తరిదృక్కులతో భయభీతావహ హృదయంతో కంపిస్తున్న కాలియడుగులను చరచర వేసుకుంటూ వచ్చి, మంగళనాథ్‌హస్తాన్ని గుంజుతూ, శుష్కించినకంఠంతో ఆవేశము, ఆదుర్దాలతో "పదండి వెళ్ళిపోదాము. ఆలస్యంచేస్తే అడ్డంకులురావచ్చు" అన్నది. అతను అయోమయ అంధకారంలో తడుపుకుంటున్నవానివలె "యెక్కడికి?" అని ప్రశ్నించాడు. ఆమె అతన్ని లాగుతూ "ఎక్కడికైనా కానీండి. మీాయిష్టమొచ్చిన చోటికి, ముందు వూరుబయటకు పదండి. పూర్వదిశగా బోయి అడివిలో ప్రవేశిద్దాం" అన్నది. ఆయన వెంటనే కృష్ణహస్తంపట్టుకుని "కృష్ణా! నిష్కల్మషమైనమనస్సుతో నిజం చెప్పు? నీవు నన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నావా? నాకొరకు యెన్ని త్యాగాలనైనా చేయగలవా?" అని ప్రశ్నించాడు. "మీా

కా సంశయమెందుకు? మీరు కోరితే ప్రాణాలనైనా అర్పి స్తాను. ఏమిచేయమంటారో చెప్పండి!" అన్నది కృష్ణ.

"అయితే పారిపోవుట ప్రేమనిజస్వరూపం కాజాలదు. పారిపోయి నీకూ నీకుటుంబానికీ, నాకు శాశ్వత కళంక మాపాదించుట ధర్మంకాదు. నీవు యెన్నికష్టాలనైనా యెదు రొడ్డి, మీయింటిలో ఒప్పించి వివాహంచేసుకొనుట వుత్తమము. అందుకవుసరమైన సర్వత్యాగాలకు సంసిద్ధు రాలవుకమ్మని నా కోర్కె" అన్నాడు.

"అందువలన రభస పెరుగుతుంది, రద్ది ప్రచారమవు తుంది. అది నేను చేయజాలను. ప్రశాంతంగా పారిపోయి, భగవంతునిసన్నిధిలో వివాహంచేసుకుందాము. మీరు రారా చెప్పండి?" అన్నది. ఆయన క్రోధవదనంతో "దొంగ తనంగా నేను రాలేను. పవిత్రమైన ప్రేమను అవరోధాలు అడ్డగింపజాలవని నేను చదివాను. త్యాగంలోనే ప్రేమ పవిత్రరూపంపొంది ఫలప్రదమవుతుందట. నీసాంపర్క్యంతో నా జీవితం మారిపోయింది. ధర్మకార్యమని తలచిన ప్రతి కార్యంలోను నేను ధైర్యసాహసాలతో పోరాడాను; అన్నిటి లోను సఫలంబొందాను. పవిత్రప్రేమ మహోన్నతమైందని తెలుసుకున్నాను. నేడు దాన్ని అపవిత్రమార్గంలో చేపట్ట జాలను" అన్నాడు.

"ప్రేమ పవిత్రమనిమాత్రమే మీరు తెలుసుకోగలి గారు. అలాంటి పవిత్రప్రేమ సాఫల్యత ప్రధానంగాని, దాని సాధనమార్గాలు ప్రధానంగావు మంగళనాథ్‌గారు." అన్నది. "లేదు లేదు, అది నేను యేపుస్తకంలోను చదువ

లేదు. పరమపవిత్రమైనదానిని అపవిత్రమార్గంలో పొందిన పుడు, దానిపవిత్రత మృగ్యమవుతుంది. పవిత్రమైనదానినిధర్మ మార్గంలో పొందినపుడే దానిపవిత్రత వుంటుంది." అన్నాడు రత్నం. "పుస్తకాలన్నీ మానవులచే రచింపబడినవి. పుస్త కాలలో వున్నంతమాత్రాన అది శిరోధార్యంకాజాలదు. మహాభారతంలో లేపుకెళ్ళినఘట్టాలు యెన్నిలేవు?" అన్నది.

"కనకరూపంలోనున్నవన్నీ కనకం కాజాలదు. వరి పిడిరాయిమీద తేలినవే కనకము. పుస్తకాలలోనివి మన బుద్ధికినచ్చినపుడు విశ్వసనీయాలు. నీ ప్రేమకొరకు నిన్ను నీకుటుంబాన్ని శాశ్వతకళంకంలో ముంచుట ధర్మమవు తుందా, నీ బుద్ధితో ఆలోచించు!" అన్నాడు.

ఆమె కఠినకంఠంతో "పిరికితనాన్ని కప్పిపుచ్చుకునే శబ్దాలివి. అసామాన్యకార్యాన్ని సాధించువారు సానుభూతికి బదులు తిరస్కారాలను, నిరసనలను అవహేళనలను పొందు తారు. అతనా కార్యం సాధించినతదుపరి దానిప్రభావం గ్రహించినపుడు పురస్కారాలనిస్తారు, పొగడ్తలతో ముంచు తారు. అసామాన్యకార్యాలను అందరూ సాధించలేరు. విశేషప్రజ్ఞ ధైర్యసాహసాలు వున్నపుడే అవి సాధ్యమవు తవి." అన్నది.

"నీవుచెప్పేది నీవే బాగా యోచిస్తే, అంతరార్థం అవగతమవుతుంది. ధైర్యసాహసాలు వున్నవి గనుకనే, మన యిరువురిప్రేమ పవిత్రమైనదిగనుకనే లోకానికి యెదురు నిలిచియైనా పోరాడి, ఫలితాన్నందుకో సాహసిస్తున్నాను.

ఆ శక్తిలేనపుడే, పిరికితనము పారిపోవటానికి దారితీస్తుంది.” అన్నాడు.

“పోరాటములో పొందేది సఫలమో విఫలమో ఎవరికి తెలుసు? కోరినదాన్ని పొందికూడా విడనాడి, దాని కొరకు పోరాటంసలుపుట వివేకంకాజాలదు” అన్నది.

“వివేకము విజ్ఞానములో అన్నివేళలా ధర్మము నీతి వుండకపోవచ్చు. ధర్మములో ధర్మమే వుంటుంది. నేను కోరునది ఆ ధర్మయుక్తమైన నీతి. ఆ నీతిని కోల్పోయే ముందు జీవితాన్నే కోల్పోవుట వుత్తమము” అన్నాడు.

“మీ రింత అసమర్థులని నే ననుకోలేదు.” అన్నది.

“అవును నీతిదప్పని అసమర్థుడననిపించుకున్నా కించపడను” అన్నాడు.

ఆమె మతిబోయినదానివలె చరచర ఆలయంవైపు వెళ్ళిపోయింది. ఆలయప్రహారీలోపల ప్రవేశించి బొలబొల విలపించింది. కార్చినకన్నీటితో నలువచెంగు తడిసిపోయింది. ఆలోచించినకొద్దీ ఆమె భయకంపితురాలవుతున్నది. ఇంట్లో వుత్తరంవ్రాసి టేబులుమీద పెట్టివచ్చింది. అదిచూసి పరువులెత్తుకొస్తారేమో, తను పట్టుబడి శృంగభంగంపొందవలసివస్తుందేమోనని కంపించిపోతున్నది. ఆ వుత్తరం ఇప్పటికప్పుడే చూసివుంటారని, యింటికి తిరిగిపోవుటకు అనుగుపడుటలేదు. దిక్కుదోచని దైన్యతతో మంగళనాథ్ భీభత్సాన్ని దూరుకుంటూ నదిసోపానాలమీద నిలిచి, నదివంకచూసింది. తపతపలాడుతున్న తరంగాలతో ప్రవాహాము కోలాహలముగా పరువులెడుతున్నది. తను చూస్తూచూస్తూ

వుండగానే చెట్టుమీదనుంచి గాబోలు పట్టుదప్పి ఒక గండు చీమ అందు పడి గిరగిర సుడిలోతిరుగుతూవాలుకు కొట్టుకు పోతున్నది. ఆ ప్రవాహ ప్రయాణ మెక్కడికో ఆ చీమ కేమి తెలుసు పాపం! అనంతాకాశంలో దూదిపింజనుబోలిన దొంతరులలావున్న మేఘగుచ్ఛాలు తూర్పుదిశగా పయన మైపోతున్నవి. వాటిగమ్యస్థాన మెక్కడో! యుగయుగాలు యిదేరీతిని పయనిస్తుండే వీటిని కవ్విస్తూ సాక్షీభూతివలె జిలిబిలినృత్యంసలుపుతున్నవి శీతల పవన తెమ్మెరలు.

వెనుకనుంచి 'కృష్ణా'అన్న పిలుపువిని వులికిపాటుతో ముందుకు తూలి, పడబోయి సంబాళించుకుని, వెనుదిరిగి చూసింది. అతను కమలాకరుడు. ఆశ్చర్యపోతూ "ఇక్క డున్నావేమిటి కృష్ణా! అలావున్నావెందుకు?" అని మమ కారాలొలికిస్తూ ప్రశ్నించాడు కమల్. ఆమెనుంచి సమా ధానంలేదు. అధరాలు అదురుతున్నవి; అశ్రువులు బొలబొల వలుకుతున్నవి. ఆమె యేదో గొప్పఆపదలోవుండి నదిలో దూకుటకు నచ్చివుంటుందని వూహించి, కరుణార్ద్రకంఠంతో "ఏమిటో చెప్పు కృష్ణా, నీకోరకు నేను యేమైనా చేస్తాను. బాధయేమిటో చెప్పు?" అంటూ ఆమెహస్తాలు పట్టుకుని అతిమృదువుగా నవరిస్తూ, యివతలకు తీసుకొచ్చాడు. ఆమె దుఃఖం మరింత పొర్లుతున్నది. అతను ఆమెభుజస్కంధాలను పట్టి "దుఃఖించినందువలన దుర్బలత్వం మరింత అధికమయి దుఃఖాన్ని యింకా పెంచుతుంది. ధైర్యం ధీమాను కల్పి స్తుంది. తరుణోపాయమార్గాన్ని సూచిస్తుంది. దుఃఖించకు" అన్నాడు. ఆమె నేత్రాలుతుడుచుకుని, కంఠంలోనిరుద్ధతను

తగ్గించుకుని "నీవు యిక్కడికి కెలావచ్చావు?" అని ప్రశ్నించింది. అతను "ఏమీతోచక యెవరయినావున్నారేమోనని మాష్టరుగారియింటికి వచ్చాను. మీ అన్నగారుమాత్రమే వున్నాడు. సరే, యీ సోపానాలదగ్గర కాసేపు కాలక్షేపం చేసి వెళదామని వచ్చాను. తీరా ఇక్కడికొస్తే నీవున్నావు. అంతే, అంతకుమించి నా కేమీ తెలియదు కృష్ణా!" అన్నాడు. అతనిపలుకులు ఆమెకు వూరటకలిగించినవి. ఆమె ధైర్యాన్నిపూరించుకుని, అశ్రువులను కొంగుతో అద్దుకుంటూ కంఠం సాఫీచేసుకుంటూ "కమలాకర్, నీ కో విషయం చెప్పాలి. యెవరైనా వస్తారేమో, అటు ఎవరూ రానిచోటుకు పద" అంటూ ఆమె పూర్వాదిశనున్న అడవి వైపుకు దారితీసింది.

ఘోరతపస్సులో నిమగ్నమైయున్న మహామునికి భగవంతుడు సాక్షాత్కరించి, తనసహాయార్థం ఆ మునిని భగవంతుడే తనవెంట యెక్కడికో రమ్మనికోరితే, ఆ ముని పుంగవుడు పరవశుడై ఆ భగవంతునిపాదధూళివెంట నడచినట్లు కృష్ణవెంట కమలాకర్ నడుస్తున్నాడు. ఆమె అతి వేగంగా దీక్షాప్రతిమవలె చరచర నడిచిపోతున్నది. ప్రతినలోను, పట్టుదలలోను, యేకాగ్రదీక్షలోను మానవునిశక్తి ద్విగుణము త్రిగుణము అవుతుంది. చేయలేనిది చేయగలుగుతాడు. మరుగుదారినిబడి రెండుమైళ్ళు నడిచాక, ఒకపొద మాటున చేరగిలబడి నిట్టూర్చుతూ "ఇలా వచ్చి కూర్చో కమలం" అన్నది. అతను మంత్రించబడినవానివలె అమాయికంగా ఆమెచూపిన నిర్దిష్టస్థానంలో కూర్చున్నాడు.

ఆమె చిన్నగా శుష్కమైనసవ్వును ప్రదర్శిస్తూ "నీకు చాలా శ్రమయిచ్చానుకదూ?" అన్నది. "లేదు లేదు. ఇందులో శ్రమేమున్నది? నడచుటకూడా శ్రమేనా?" అన్నాడు. "అయితే కమలం, నాతోపాటు యెంతదూరం నడవగలవు చెప్పు?" అని ప్రశ్నించింది. "జీవితాంతం నడువ గలను." అన్నాడు. ఆమె తిరిగి అశ్రుపులనొలికిస్తూ "ఇపుడు నేను చాలా ఆపదలోనున్నాను కమలం. నన్ను రక్షించ గలవా?" అని ప్రశ్నించింది. "కృష్ణా, నీవు యేమిచేయ మన్నా చేయగలను. నీమాటను ఆజ్ఞగా శిరసావహిస్తాను," అన్నాడు. "నన్ను యిక్కడివారెవరికంటాపడకుండా కల కత్తా తీసుకెళ్ళు కమలం" అన్నది. ఉత్సాహితుడై "ఇంకా ముందుకు రెండుమైళ్ళు నడిస్తే, పడవలరేవు వస్తుంది. అక్కడనుంచి నావలో బెజవాడవెళ్ళవచ్చు. ఆతరువాత రైలు వుండనేవున్నది." అన్నాడు. "నీవు నాతో కలకత్తా రాగలవా?" అన్నది. "కలకత్తాయేగాదు, నరకలోకాని కైనా నీతో నిరభ్యంతరంగా రాగలను" అంటూచీకటిపడక ముందే పడవలరేవుచేరుట మంచిదని ఆమెను వుత్తేజపరచి ప్రయాణంసాగించాడు.

మూలిగేవానిమీద తాటిపండు పడినట్లు, బద్రీనారా యణను టేబిలుమీద దొరికినవుత్తరం విషాదసాగరంలో ముంచివైచింది. ఆయన మతిచలించినట్లు కెవ్వున కేకబెట్టి, నెత్తిబాదుకుంటూ కూలబడిపోయాడు. రోహిణి వుత్తర మంతా చదివి "ఎంతపనిచేశావు అక్కా" అంటూ బయట కొచ్చి, కాళిదాసుకొరకు వెదికింది. కాని ఆయన అసలే

అంతులేదు. నౌకరును కేకలుపెట్టి పిలిచి; రత్నాకరుని పిలుచుకరమ్మని పంపింది.

రత్నాకరుడు వుత్తరం చదివాడు, "నాకూ మీకూ ఋణంతీరిపోయింది. ఈ నిర్బంధంలో విసిగిపోయాను. స్వేచ్ఛగా పెరిగాను; స్వేచ్ఛగా జీవితంగడుపుతాను; నేను మంగళనాథ్‌ను మనసార ప్రేమిస్తున్నాను గనుక, ఆయనతో గలిసి శాశ్వతంగా వెళ్ళిపోతున్నాను. నన్ను మర్చిపొండి." అని ఆ వుత్తరంలో వున్నది. అది రత్నానికి ఆశ్చర్యాన్ని కలిగించలేదు, చెడుగాసూ తోచలేదు. అందువలన ఆదుర్దా లేకుండానే, తండ్రిని శాంతింపజేయ ప్రయత్నించాడు. కాని, యీ ఘోరవిపత్తునుంచి తండ్రి కోలుకోవటం కష్ట మనిపించింది. బద్రీనారాయణ మాటపడిపోయినట్లయింది. కన్నీరుమాత్రం విరామంలేకుండా కారుతుంటుంది. ఎవరు ఏమిచెబుతున్నా నేత్రాలుపెద్దవిచేసి చూస్తుంటాడు.

మరునాడు మంగళనాథ్ స్వయంగా బద్రీనారాయణ యెదుట ప్రత్యక్షమై పెగిలీపెగలని రుద్ధకంఠంతో కన్నీరు కంటికీమింటికీ యేకధారగా కారుస్తూ, జరిగినయథార్థమంతా యేకరువుపెట్టి చెప్పి, ఆమె ఆ నదిలో దూకివుంటుందనే వూహను ప్రకటించి పెద్దపెట్టున విలపించినపుడు, అందరూ విస్తుపోయారు. ఆమె శవంకోరకు నదిలోను బావులలోను గాలించి విఫలురయ్యారు. వారంరోజులవరకు కృష్ణకుమారి శవంకోరకు వెదకుతూనేవున్నారు. ఆమె ఆత్మశాంతికి అంత్యక్రియలతంతుకూడా జరిపారు.

దుఃఖం యెంత భరింపరానిదైనా, మానవుడు భరిం

చకతప్పదు. కాని దుఃఖాన్ని సమయమొక్కటే మైదుచేయ గలిగింది. ప్రేమికునిముందు ఆ సమయంకూడా విఫలమవు తుంది. బిడ్డను తలిదండ్రులు మరువగలరు, తలిదండ్రులను బిడ్డ మరువగల్గును. కాని, వియోగంపొందిన ప్రేమికుడు యెన్నటికీ మరువజాలడు. కాలంగడిచినకొద్దీ ప్రేమికునిహృద యంలోని వ్యథ పెరిగి పెద్దదై కరుడుగడుతుంది. హృదయ ప్రతిష్ఠిత ప్రేమమూర్తి వికసిస్తుంది.

కృష్ణకుమారిమాట వినక, ఆమెను కోల్పోయినందుకు నేడు పిచ్చివానివలె వాపోతూ చపలచిత్తునివలె జుట్టు పీక్కుంటూ అన్నపానీయాదులు మాని, యింటి గదిలో ప్రుగ్గుతూ "సీతిసీమాలు యెక్కడున్నవి? యెవరిని వుద్ధరించి నవి? వాటిపేరుతో నాశనమయినవారే యెక్కువ. వాటిని విస్మరించి, ఆనందంపొందినవారే యీలోకంలో అధికం" అనుకుంటూ శాలువాకప్పుకుని "కృష్ణా, నీకు గొప్ప అన్యా యంచేశాను. నీవు పవిత్రమూర్తివి. నీప్రేమను ఆదరించి, నిన్నుపొందజాలని దౌర్భాగ్యుణ్ణి నేను. నీవు దేవతవుగా ఆలోకంలో విలసిస్తావు" అనుకుంటూ దీర్ఘ వేడినిట్టూర్పులు విడుస్తున్నాడు.

## 28 రక్తసింధూరము

సెనేట్‌సమావేశాల కాలపరిమితి ఆకస్మికంగా పొడి గించినందున, ప్రిన్సిపాల్ అనురోధంవల్ల శివప్రసాద్ యెక్కువరోజులు తలవనితలంపుగా వైజాగ్‌లోనే వుండి

పోవలసివచ్చింది. ఇక్కడ నాటకమండలి విచ్ఛిన్నమైపోయిన ఫలితంగాను, అన్నింటికి ప్రోత్సాహకారకుడైన మంగళనాథ్ ప్రేమవిహ్వాలుడగుటతో ప్రయివేటువిద్యార్థులంతా అదృశ్య మయ్యారు. నాటికలోని పోర్షన్సు- పాపం! మర్చిపోయి కూడావుండవచ్చు. ఒక్క రత్నాకరుడుమాత్రం ప్రయి వేటు పేరుతో రేయింబవలు అక్కడే వుంటున్నాడు గాని, పుస్తకాలలోని పాఠాలు బుర్రకెక్కుటలేదు. విద్యాశాఖంత వికృతశాఖ లేదేమోననిపిస్తున్నది రత్నానికి. స్వభావసిద్ధ మైన వికసితబుద్ధికి, బుద్ధిసూక్ష్మతకు తగిన ప్రాధాన్యత యివ్వకుండా కేవలం కంఠస్థంచేసి, వల్లెవేసినవిషయాలనే పరీక్షలలో వ్రాయగల మందమతులకుమాత్రమే యీ శాఖావిధానం వుపయోగపడుతున్నదని ప్రభుత్వాన్ని విమ ర్శించుకుంటూ, పాఠ్యపుస్తకాలను నిర్లక్ష్యంగా కిటికీపైపుకు విసరివేశాడు. అందులోని వో పుస్తకం కిటికీవూచలమధ్యగా దూరి, గోడప్రక్కగా లోపలకు రాబోతున్న నిర్మలమీాద పోయిపడింది.

ఆమె వులికిపడి, ఆ పుస్తకాన్ని చేతబట్టి లోపల ప్రవేశించి, తీక్షణమైనకోపాన్ని ప్రదర్శిస్తూ "రత్నాకర్, నీ కేమైనా మతిబోతే యిక్కడకు రాబోకు. సభ్యత చదువు కంటె ముఖ్యమయింది. పాఠాలువల్లెవేస్తే విజ్ఞానమూ రాదు, సభ్యతారాదు. పుస్తకాలను మనుషులమీాదకు విసరు టేమిటి?" అంటూాండగా, కూర్చునివున్న రత్నాకరుడు బారెడుదూరంలోనున్న ఆమెవద్దకు బందాడువిధంలో మోకాళ్ళతో రెండడుగులువేసి, ఆమెపాదాలుచుట్ట వేసి

శిరస్సును పాదాలమీదవుంచాడు. ఆమెలోనిగంభీరత సడలి పోయి, కోపాన్ని అభినయంగా మార్చి, విసుగునటిస్తూ "అబ్బ! నీఅంత వెర్రివెంగళాయను నేనెక్కడా చూడ లేదు. ఏది చేయరాదంటానో అదే చేయాలనుకుంటావు. ప్రపంచంలో అన్నిటికంటె హీనమైనపని పాదాలుపట్టు కోవటమే." అంటుండగా, మధ్యలో రత్నం కల్పించుకుని "మీ పాదాలుపట్టుకుంటే హీనుణ్ణయితే, నేను హీనాతి హీనుణ్ణిగా మీపాదాలుపట్టుకునే జీవితంగడుపగలను." అంటూ పాదాలుస్పృశిస్తున్నాడు. గిలిగింతలుకలిగి ఆమె శరీరం వక్రాలుతిరిగిపోతూండగా నవ్వునాపుకోలేక గుప్పిట నిండా అతనిశిరోజాలనుపట్టి, పిల్లిపిల్లను పైకిలేవనెత్తినట్లు బలంగా పైకిలాగింది. కొంటెగా అతనిదృష్టిలో దృష్టినిబర పుతూ "నట్టి మొద్దు, జుట్టుబట్టి లాగినా నొప్పిలేదు!" అన్నది.

"మీచేతులతో కత్తిబట్టి, నాకంఠాన్ని కరకర కోసినా నేను ఏవంత బాధాకరశబ్దాన్ని బయల్పరచను. స్వర్గసుఖాన్నే అనుభవిస్తాను." అంటూ తననెత్తినున్న ఆమెసుకోమలకరాన్ని గట్టిగాపట్టి, నేత్రాలుమూసి అధ రాలద్వారా ఆనందాన్ని జుర్రుకుంటున్నవానివలె, మంద స్మితరేఖలను వెదజల్లుతున్నాడు. అతని ఆ ముఖమండలం లోని విచిత్రకవళికలను వింతగా చూస్తున్నది. నేత్రాలు మూసి నిద్రలోని పసిబాలకునివలె ఆనందాన్ని, తరువాత దుఃఖాన్ని, ఆతరువాత ఆ రెంటిసమ్మేళనాన్ని చిత్రవిచిత్రంగా ప్రదర్శిస్తూ, తనచేతిలోని ఆమెకరాన్ని దప్పికతో అలమ

టించిన శునకమువలె కరవుదీర చుంబించి, తనకుడిచెక్కిలి మీదపెట్టి అదుముతూ, మురళివాయించు మురళీధరునివలె మందగమనంతో శరీరాన్ని వూపుతూ తీగెద్వారా కరెంటును లైటు లాగినట్లు, ఆమెహస్తముద్వారా పరమానందాన్ని గ్రోలుతున్నవానివలె నటిస్తూ, రెండవచేత్తో ఆమె హస్తాన్నిస్పృశిస్తూ, దంతాలు కరకరమనిపిస్తుండగా, ఆమె నిద్రనుంచి మేల్కొన్నదానివలె, దంతాలుబిగబట్టి "ఏమిటీ పిచ్చివేషాలు!" అంటూ తన రెండోహస్తంతో ఆయన రెండోచెవినిబట్టి, బాగా మెలివేసింది. అతని బండతనమెంతో అంతు తెలుసుకోవాలని చెవిమెలి వేసి కీయిస్తున్నది. చేతివ్రేళ్ళకు తరళంతగిలి తీసి చూసుకుని విచలితురాలయింది. వ్రేళ్ళను రక్తం జిడ్డువలె బంకలుసాగుతున్నది. ఆయనచెవిపై భాగంనుంచి రక్తం స్రవిస్తున్నది. అది బాగా పరికించినపుడు, తన గోరు గుచ్చుకున్నందున కలిగిన గాయమని అర్థమయినపుడు వెలవెలబోయింది. వెంటనే చెంగు తడిపి చెవితుడిచి ఆ గాయంమీద వుంచి, ఆశ్చర్యాన్వితురాలివలె "నా గోరుగుచ్చుకుని అంత రక్తం స్రవిస్తున్నా, మీకు చీమకుట్టినట్లులేదు. మీ శరీర మెలాంటిదో అర్థమవుటలేదు. మీ మనస్తత్వ మంతకంటె విచిత్రమైంది" అన్నది.

"మీకు నామనస్సులోని ధైర్యాన్ని పూర్తిగా చెప్పివేశానుగదా! మీ చేతులలో ఆ చెవి తెగిపోతున్నా నేను నోరుమెదపను. మీయడల నా శరీరములోని ప్రతి రక్తాణువు విశ్వాసాన్ని ప్రకటించుకుంటున్నది. మీచేతిలో నేను

యేమైపోయినా స్వర్గతుల్యంగా భావిస్తాను" అన్నాడు. ఆమె ప్రహసితవదనంతో "గోటిదగ్గరిపాటనలె పురుషులందరికీ చిలకపలుకులవలె వరుసగా అనాదినుంచి వస్తున్న అలవాటయిన పాతపాటే యిది. స్త్రీముందు ప్రగల్భాలుకొడితేగాని, పురుషునికి ఆత్మశాంతి లభించదు. పురుషునిలో యెంత మెరమెప్పులు, త్యాగప్రదర్శనలు, వినయవిధేయతలు కనిపిస్తవో, అవి సమయమొచ్చినపుడు మృగ్యమై కఠిన కర్కశత్వం, అంధత్వం ప్రకటితమవుతుంటుంది. కథలలో పురాణాలలో విషయాలలా వుంచండి. పాపం! కృష్ణకుమారి విషయంలో జరిగిన అన్యాయం చూడండి! వారిరువురిమధ్యనున్న ప్రేమఫలితంగా ఆమె ఆహుతిఅయింది. ఆయన నేడు విచారం వెలిబుచ్చుతున్నాడుట. నాలుగురోజులతరువాత నాటకాలలో తిరిగి అభినయిస్తూ ఆనందిస్తాడు. కాడినున్న రెండుయెద్దులు ఒకేవూపుతో ఒకేజోరుతో క్రమబద్ధంగా అడుగులువేస్తూవుంటే, బండి బ్రహ్మరథమునలె శోభిస్తూ నడుచునట్లు ప్రేమికులిరువురుసనుభావుకులు, సమహృదయులు సమోద్రేకులు, అంతరరహితులు అయినపుడు, ఆనందం అమృతరూపంలో ప్రభాసిస్తుంది. అలాకానపుడు, బలహీనులపై దురదృష్టం పరవళ్ళుతొక్కి సర్వనాశనంచేస్తుంది. అందుకే ప్రేమ కొందరికి అమృతంగా అందుతుంది; మరికొందరికి కాలకూటవిషంగా అనుభవమవుతుంది. ప్రేమసాఫల్యతలో అమృతం, విఫలతలో విషం. ప్రేమయొక్క పూర్ణరూపం అన్నిహృదయాలలోను జనించదు. అందుకనువైన సునిశితతత్వాలతో కొన్నిహృదయాలనేసృష్టిస్తాడు భగ

వంతుడు. కొన్నిహృదయాలు మాత్రమే అందుకనువైనం దున మిగత సాధారణహృదయాలతో సరితూగజాలక ప్రేమలో విఫలం జరుగుతుంటుంది. కృష్ణకుమారిహృదయం ఇంత సున్నితమైనది, వున్నతమైనది అని యిదివరకు నే నను కోలేదు. ఆమెను ఆ మార్గంలో ప్రోత్సహించిన మంగళ నాథ్ ఆమెను నీటముంచాడు. పురుషుని ప్రేమ, త్యాగము యీరూపంలోనే వుంటవి. పురుషుడు స్త్రీముందు ప్రత్యే కించి, తనఆధిక్యతను నిజాయితీని నీతిని ప్రేమను త్యాగ దీక్షలను స్తుతించుకొనుటలో పరవశుడవుతాడు. స్త్రీ తన గొప్పతనాన్ని చాటుకోలేదు. తన నీతిని నియమాన్ని త్యాగాన్ని దీక్షను వల్లించుకోలేదు. అవి ఆమెకు సామాన్య మైనవి. స్త్రీలో నీతి నియమము విశ్వాసము త్యాగము లేక పోతే, లోకగతి స్థంభించిపోతుంది రత్నంగారు. సాలెపురుగు వలె పురుషుడు మాయాజాలంపన్ని, యోగివలె అందు తిష్ట వేసి, వలలోచిక్కిన స్త్రీని ఆహుతిచేసి వెనుతిరిగి విస్మ రిస్తుంటాడు.'' అంటుండగా మధ్యలోనే రత్నం మాడుమీద చేయివేసుకుని ప్రహసితవదనంతో "అబ్బ! నిర్మలాదేవి గారు! మీలాంటి విశాలహృదయంలో పురుషునియెడల యింత ద్వేషమున్నదని నేడే మొదటిసారిగా తెలుసు కుంటున్నాను. ఈవిషయంలో కులమతప్రమేయా లెలా అప్రస్తుతమో, స్త్రీపురుషవివక్షతకూడా అంతే. చెడు యెవ రిలోనైనా వుండవచ్చు. పక్షపాతం పనికిరాదండి. అయినా, నేను పురుషజాతికంతటికి వకాల్తాతీసుకోవటంలేదు. నావిష యంలో మాత్రమే నేను చెప్పుకుంటున్నాను.'' అన్నాడు.

ఆమె దరహాసంచేస్తూ "మీరు పురుషులనిపించు కున్నారు. స్త్రీలలో ఆ యుక్తి వుండదు. అందుకే వారిలో అప్రస్తుతకయ్యాలు కలుగుతుంటవి. పురుషుడు కార్య దక్షుడు; కార్యసాధకుడు. నీరు అడ్డగించినా వాటితో పోరాడుతూ కూర్చోదు. ఆ అడ్డగించిన రాళ్ళురప్పలసందుగా క్రిందుగా పైగా ప్రక్కగా వక్రాలుగా వీలయినన్ని మార్గాలను అనువుజేసుకుని, తనలక్ష్యసాధనలో పరువులెడుతూనే వుంటుంది. పట్టుదలతో తిష్టవేసి మోడీచేయకుండా వంగి వంగి వక్రాలుతిరిగి తనమార్గంలో ప్రవహించినపుడు, మొదటున్న అడ్డంకులు అవరోధాలు నిస్పృహచెంది సడలిపోతవి. జలదేవత జయిస్తుంది. పురుషు డలానే స్త్రీవిషయంలో యాచకునివలె ప్రవర్తించి సాధించుకుని, ఆతరువాత ఆమె నెత్తిమీద కాలుమోపి అధోలోకానికి అణగద్రొక్కుతాడు. కాకపోతే, మంగళనాథ్ విషయం నాకు చెప్పండి. ప్రోత్సాహమిచ్చినవాడు కృష్ణతో యెందుకు వెళ్ళలేక పోయాడు? ఆమెనిండుప్రాణాన్ని అతను బలిగొన్నాడు. అంతకంటె పురుషునిఅపరాధం యింకేమికావాలి!" అన్నది నిర్మల.

రత్నాకరుడు తలవంచుకుని, నిరుత్తరుడైనాడు. రెండు నిమిషాలఅనంతరం నిర్మల ఆశ్చర్యాన్వితురాలై "నా మాటలు మీకు బాధకలిగించినవా రత్నంగారు? పోనీ, యిక అనను లెండి. మీయెడలగల చనువుతో అన్నాను, అంతే" అంటూ ఆయసచుబుకాన్ని పట్టి పైకెత్తింది. నీటితో నింపిన కుండపగుళ్ళకు అడ్డుగాపెట్టిన మైనము యెండకు కరిగి

పోయినప్పుడు, నీరు కుండనుండి కారునట్లు ఆయన అశ్రువులు వలుకుతున్నవి. ఆమె మరింత వెలవెలబోతూ, తనకొంగుతో అశ్రువులనద్దుతూ "పాపిష్టిదాన్ని, అనవసరంగా వాగి, మీ మనస్సుకు నొప్పికలిగించాను" అంటూ ఆయనచుబుకాన్ని పుణుకుతూ, తనలోతాను నొచ్చుకుంటూ "నీవు చాలా మంచివాడివి. నామాటలకు అలా కన్నీరుకార్చవచ్చా చెప్పు? ఆడవాళ్ళు అభిమానము విశ్వాసము చనవు వున్న చోటే, అంత అభిలాషతో మాటాడతారు. ఆమాటలతో చింతించే పురుషుడు అవివేకి. నీవు అవివేకివిగావు, నాకు తెలుసు" అంటూ అతనికపోలాలను వేళ్ళతో నొక్కింది.

రత్నాకరుడు పెగిలీపెగలని రుద్ధకంఠంతో "నిర్మలా దేవిగారు, నాహృదయం వ్యధచెందుచున్నది; కన్నీరుకారుస్తున్నది; మీరన్నవి నిరాధారము, నిందారూపము అని గాదు, సహేతుకాలే. మీరన్నట్లు మా కృష్ణసింధు ప్రాణాన్ని కల్లబొల్లి ప్రేమవలపులుచూపి, బలిగొన్నాడు మంగళనాథ్. ఆవిధంగా యుగయుగాలనుంచి పురుషులు ఎన్నికోట్ల అమాయకస్త్రీలను ఆహుతిచేసుకున్నారో! అందుకే చింతిస్తున్నాను. మీవల్ల యదార్థసత్యాన్ని తెలుసుకున్నాను. ఈసమస్యలలో నేను స్త్రీలతరఫున నిలిచి నా జీవితాంతం పోరాడుటకు నిశ్చయించుకున్నాను. మీరు నాకు గురుతుల్యులు. మీ పరోక్షంలోకూడా ఏకలవ్యుని వలె మీ ప్రతిమను దృష్టిలోవుంచుకుని, మీఆజ్ఞలతో మీ కనుసన్నలలో విశ్వాసపాత్రుణ్ణిగా నడుచుకుంటాను. మీరుచూపిన యీ వెలుగే యేకైకజీవితమార్గం. మీరే

నా గురువులు, దైవజ్ఞులు. మీ పాదధూళిలోనే నా జీవితాన్ని ధన్యంచేసుకుంటాను. నా దీక్షలో కృతార్థుడనవునట్లు నన్ను దీవించండి.” అంటూ ఆమెపాదాలమీద శిరస్సుమోపాడు.

ఆమె విభ్రాంతిలో కలవరపడుతూ, ఆయన్ను పైకి లేవనెత్తుతూ “నీ తత్వమేమిటో నా కర్థమవుటలేదు. అజ్ఞానివీ కాదు. విజ్ఞానివీగాదు; అమాయకుడివిగా కనిపిస్తావు. నీ చర్యలకు ఓప్రక్క క్రోధమూ, మరోప్రక్క జాలీ కలుగుతుంటవి. దేవుని నిరసిస్తావు కాని, ఆఖరివరకు నిలబడగల శక్తిని, కఠోరదీక్షను కనపర్చవు. స్త్రీహృదయం చంచలమైనదంటారు; అది పురుషులు యీర్ష్యతో సృష్టించిన అపవాదుక అని నా అభిప్రాయం. పురుషునిహృదయము జలనుకంటె చంచలమైనది. అయితే, యిది స్త్రీపురుష సంబంధంలోనే;మిగతసమస్యలలో పురుషహృదయం చంచలమైంది కాదు. కాని, నీ హృదయస్వభావం చంచలమైందిగా తోస్తున్నది. పురుషపక్షపాతివిగా కనిపిస్తూవచ్చిన నీవు నేడు స్త్రీపక్షపాతివై కూర్చున్నావేమిటి?” అంటూ బుజ్జగించింది నిర్మల.

రత్నాకరుడు ఆమెనుకోమలహస్తాన్ని నలుపుతూ, అనునయంతో “మీరు నన్ను యేమనుకున్నా నాకు చింతలేదు. మీముందు నాసర్వశక్తి వీగిపోతున్నది. నేను నాశక్తి నెంత పూరించుకున్నా నాకు తెలియకుండానే అజ్ఞాతరూపంలో మీకు ఆత్మార్పణజరిగిపోతున్నది. నాదిగామిగిలినదేమీ కనిపించుటలేదు. ఊహలు, నిర్ణయాలు శాశ్వతంగా స్థిరీకరించుకుని

వుండజాలవు. శశిధరునిగర్భంలోనినుచ్చను ఒకనాడు యేనే మోగా వూహించారు. నేను ఆనుచ్చ జ్వాలాముఖపర్వతా లని స్పష్టపరచినపుడు కాదనుట వివేకంకాజాలదు. బిడ్డను జూచినపుడు తల్లిహృదయం వాత్సల్యంలో పొంగి స్తనము లందు క్షీరముస్రవించినట్లు, మీ సాంపర్క్యంలో నాహృద యం నన్ను మరచి, మీభావనలకు ఆత్మార్పణ అజ్ఞాత రూపంలో జరుగుతున్నపుడు, నే నేమిచేయగలను చెప్పండి. వాస్తవికాన్ని కాదని, దర్పమువహించుట ఆత్మవంచనగాదా! ఈక్షణములో నా కనుభూతమవుతున్నది స్త్రీపురుషవిచక్షత లేదని. స్త్రీపురుషులు కలిస్తేనే మానవుడని, వ్యక్తని నా భావం. పురుషుని స్త్రీని వేర్వేరుజాతులుగా భావించుట అవి వేకము. హృదయవికాసము విజ్ఞానము పరిజ్ఞానఅనుభూతిలేని చోటే వేరనేభావనలుఉత్పన్నమవుతవి. వృక్షము,పుష్పము, పండు—మూడూ ప్రధానాలే. యేఒక్కటిలేకపోయినా, మిగతవీ అదృశ్యమవుతవి. ఆ మూంటిలోనూ పోటీలురానటం లాంటిదే స్త్రీ పురుషులవిషయంలోనూ. అవినాభావసామ రస్యంలో రెండూ లీనమై యేకమై ప్రకాశ్యమై ఒకేధ్యేనిని కల్పిస్తవి. అక్కడ విభిన్నభావనలకు తావుండదు. అందుకే పురుషునిలోనిఅర్ధభాగం స్త్రీదని స్త్రీలోని అర్ధభాగం పురుషు నిదని నిర్వచించారు. ఆ ఇద్దరిని వేరుచేయుట దుస్సాధ్యమని వారిపరిభాష. నాహృదయంలో యిలాంటి వినూత్నవిషయ సంపత్తిని కల్పించిన మిమ్మ్ముగురువుగా భావిస్తే తప్పా చెప్పండి” అంటూ ఆమెశిరోజాలమీద మృదువుగా తన హస్తాన్ని వేసి, నిమురుతూ అతిమెలకువగా ఆమెశిరస్సు తన

వైపుకు మొగ్గునట్లు అస్పష్టరీతిలో నిముురుతూ నెట్టుతున్నాడు.

స్త్రీ విశేషభాగద్దలలోపడిపోయినపుడు పులకితురాలై తనను తాను మరచి, ఉషఃవిహారంలో ఆనందడోలిక లూగుతుంటుంది. ఒక్కమాటుగా తాను గురువుగాను పూజనీయురాలిగాను అయిపోయిన ఆనందంలో అప్రమత్తతతో తనశిరస్సును అతనిహృదయంమీద వాల్చింది. చేతగానివానిచేతిలోని తాపానురపానలె విరుద్ధధ్వనులతో అతని హృదయం దడదడలాడిపోతున్నది. అతను తనహస్తంతో మెల్లగా భుజస్కందాలమీదుగా ఆమెచేతిని సవరిస్తూ, ఆమె శరీరాన్ని యింకా తనకు సన్నిహితంచేసుకుంటున్నాడు. అతనిలోనిమతు పూర్ణరూపందాల్చింది. వివశుడై తనబాహుద్వయంతో ఆమెను పెనవైచి, హత్తుకున్నాడు. వృద్ధికుడై ఏమిచేస్తే ఆమె కోపానికిగురికావటం జరుగుతుందో తోచక, కవుగిటిలోని ఆమెను నలిపివేస్తున్నాడు. కెంపురంగులో చమకులను వెదజల్లుతున్న, సునిశితమై శోభిస్తున్న ఆమెఅధరాలమీద చుంబించి, కపోలంమీద మృదువుగా దంతాలతో నొక్కాడు.

ఆమె తపస్సునుంచి భగ్నంపొందినదానివలె కళవళపడి ఆవేశభరితకంఠంతో "ఇదేమిటి రత్నం? సభ్యసంస్కారాలున్నవా నీకు? రాక్షసలక్షణాలున్నవనుకుంటాను. అతివినయం ధూర్తలక్షణం అన్నది నీవిషయంలో నిజము. యింత ధూర్తత క్షమించరానిది" అని అతికఠినంగా హుంకరిస్తూ,

తనకుచుట్టివున్న అతనిబాహువులను విడదీస్తూ, అతనిరొమ్ముల్పై చేయివేసి విసురుగా నెట్టింది.

మానవునికి హృదయవిఘాతంజరిగినపుడు మనస్సు హృదయం కళవళంచెంది నరములు నిస్త్రాణచే సడలిపోతవి. ప్రతిహతునివలె ఆయనముఖం మ్లానతచెంది, వెలవెలబోతున్నది. ఆమె నెట్టుతో నిర్జీవివలెనున్న రత్నాకరుడు విరిగిపోయిన ధ్వజస్తంభమువలె పడిపోయాడు. శిరస్సు గోడమీదపడి 'ఫట్' మని ప్రతిధ్వనించింది. ఆమె నిర్ఘాంతపోయి చూస్తున్నది. శిరస్సు దిమ్మెరపోయింది గాబోలు, మాట పలుకు లేదు. రక్తం ధారగా కారుతున్నది.

నిర్మల భయభీతానహురాలై, ఖంగారుగా అటూ యిటూ తచ్చట్లాడుతున్నది. ఆమె తనజీవితంలో యెన్నో దుస్సంఘటనలు చూచినా యింత ఖంగారు యెన్నడూ పడివుండదు. ఇంత మనోవేదన చెందివుండదు. ఆ గచ్చునేలమీద ధారాళంగా ప్రవహిస్తున్న రక్తంచూసి, ఆమెనేత్రాలు చెమరుతున్నవి. హతాశురాలివలె విమూఢతతో కంపించిపోతున్నది.

పదినిమిషాలు పదిరోజులవలె గడిచిపోయినవి. రత్నాకరుడు దీర్ఘనిట్టూర్పు విడచి, నేత్రఫలకాలు సగం తెరచి, అదురుతున్న హస్తాలు జోడించి, గద్గదకంఠంతో హీనస్వరంతో "నిర్మలాదేవిగారు, నన్ను క్షమించండి. నేను యేమిచేశానో నాకే తెలియుటలేదు. మనిషికి అలాంటి అంధత్వం ఆవేశించేసమయాలుంటవని తెలుసుకున్నాను. అనుకుని చేసిందిగాదు." అన్నాడు.

ఆమెహృదయం రవంత కుదుటపడింది. మనస్సు అధీనంలోకివచ్చింది. కర్తవ్యోన్ముఖురాలై వెంటనే కూజా లోని నీటితో తనచెంగు తడుపుకువచ్చి, ఆయనశిరస్సు పై పిండుతూ, చిన్నగా అరచేతితో అద్దుతున్నది. ఆ నీరు రక్తమూ కలిసి వసంతమువలె గచ్చుమీద పరువులెడు తున్నవి. ఆ రక్తాన్ని ఆమె చూడజాలక, ఆయన శిరస్సుపై దృష్టినిలిపి, తడిచెంగుతో అద్దుతూ కూర్చున్నది. రక్త స్రావము ఆగిపోయింది. జోడించివున్న ఆయనచేతులు అలానే వున్నవి. ఆమె కరుణాభరితదృక్కులు ఆయనదృక్కు లను ఢీకొన్నవి. వెంటనే రత్నం చిన్నగా వినిపించీవినిపించ కుండా "నన్ను క్షమించలేరా?" అన్నాడు. ఆమెముఖంలో మరింత ఆనందం విరిసింది. కలిసివున్న ఆయనహస్తాలను పట్టి, బలవంతంగా విడదీస్తూ లోనినవ్వును గాబోలు ఆపు కుంటున్నది. "క్షమించాననండి" అన్నాడు. ఆమె ఆయన కపోలాన్ని పుణుకుతూ "క్షమించటానికేముందిగాని, ముందు లెండి, మీ షర్టంతా రక్తంతో తడిసిపోయింది; నాకు భయంగావుంది" అన్నది. ఆయన తనకుడిహస్తాన్ని శిరస్సుమీదవేసి సవరించుకుని, తీసి చూసుకున్నాడు. అర చేయిఅంతా రక్తంఅయింది. కొంచెం స్థిమితాన్నిపొంది "అయితే నేను అపరాధంచేయలేగా?" అని ప్రశ్నించాడు. ఆమె చిరునవ్వు ప్రదర్శిస్తూ "కొంటెప్రశ్నలువేయక, ముందు లెండి" అని ఆయనచేయిబట్టి లేవదీసింది. హోలీ పండుగలో వసంతమాడినవానివలె ఒకప్రక్క దుస్తులంతా రక్తంతోతడిసి ముద్దఅయినవి ఆమె విచారంగా "ఇపుడే

గుడ్డలతో యెలా..." అన్నది. నా కిపుడు వాటిచింత లేదు. ముందు నేను అపగాధంచేశానంటూరా లేదంటూరా?" అన్నాడు. "నీవు వట్టి పెంకివాడివనుకుంటాను. అనవసరమైన మాటపట్టుకు గింజుకుంటూ వెందుకు చెప్పు" అన్నది. ఆయన చేతులతో పరుకయినరక్తాన్ని పిండుతూ "నా కది జీవన్మరణసమస్యలాంటిది. సమాధానం నా కవుసరం. చెప్పండి నిర్మలాదేవిగారు." అన్నాడు. ఆమె కరుణాభరితకంఠంతో "నేను అనవసరంగా రెండుమూడుమాపులు మీ రక్తాన్ని వ్యర్థపరిచాను. కనుక నేనే అపరాధిని. మీరు అపరాధం చేయలేదు...సంతోషమేనా?" అన్నది.

ఆయన వెంటనే తనకుడిహస్తంచూపుడు వ్రేలుతో తనరక్తాన్ని ఆమెనొసట ముద్రవేశాడు. ఆమె వెలవెల బోతూ, గంభీరకంఠంతో "ఏమిటీపని?" అన్నది. "భగవంతునినిర్ణయమేమిటో అదే చేసివేశాను" అన్నాడు. "లేని భగవంతుడు యీవిషయాలకొచ్చిపడ్డాడా?" అని ప్రశ్నించింది. ఆయన దీనవదనంతో "ఇదివరకు లేడనే అనుకున్నాను. కాని, ఆయన లేకపోతే నా కీ ఆదేశం యెక్కడినుంచి వచ్చేది? వున్నాడని మీద్వారా యీరూపంలో అనుభూతినిపొందాను గనుక విశ్వసిస్తున్నాను" అన్నాడు.

## 29 ఆత్మార్పణ

మంగళనాథ్ ఆ దుర్ఘటనకు మూడురోజులతదుపరి యింటినుంచి అదృశ్యమైనాడు. అతన్ని వెదుకుటకు ప్రయాస

పడినవారెవరూ లేరు. వ్యథాభరితహృదయంతో నదిలో దూకి ప్రాణత్యాగంచేసి కృష్ణకృమారి ననుసరించివుంటాడను కున్నారు అందరూ.

బద్రీనారాయణ ఇపుడు బయటముఖంచూచుటలేదు. రోగగ్రస్తునివలె తీరని మనోవ్యథతో శయ్యాగ్రస్తుడై పోయాడు. కడుపుకాలిన కళ్యాణి ఇపుడు కుములుతూ కసిరి కసిరి బద్రీనారాయణను నిందిస్తున్నది. "ఈ సర్వనాశనానికి మీరే కారకులు. జాతకచక్రాలు, జోతిష్యాలు అంటూ వెర్రిలోబడి పగటికలలుగని, పిల్లలను యెందుకూగాకుండా చేశారు. నియమంతో నీతితో అనుశాసనభయంతో వినయ విధేయతలతో పిల్లలను చదివించినపుడే బాగుపడతారుగాని, వాళ్ళజాతకాలను వాళ్ళకువినిపించి, లేని ఆశలను కల్పించి, తెలియని అధికారాలను, ఆధిక్యతలను వారిమనస్సులలో నింపి, పూర్తిస్వేచ్ఛనిచ్చి చదవమంటే యెంతమంచివాళ్ళ యినా చెడిపోతారు. బిడ్డలమీద మితిమించిన గారాము చూపినా, వూహాలలో రాజ్యాలుఏలినా, నోసటివ్రాత గాడి దలకాపునే సూచిస్తుంది. ఇపుడు దిగులుపడి మంచానపడి మిగతవారిని బాధించటమెందుకు చెప్పండి?" అన్నది. ఆయన నెత్తిమోదుకుంటూ కన్నీరుకారుస్తూ, "నేను చచ్చినవారిలో జమ. ఇంకా నన్ను బాధించుటెందుకు చెప్పు?" అన్నాడు బద్రీనారాయణ.

రత్నాకరుడు యింటిదగ్గరుండుట అరుదు. భోజనానికి వచ్చినపుడైనా యింటిలోని విషాదచ్ఛాయలతో నిండి యున్న వాతావరణం ఆయన్ను చీకాకుపరుస్తున్నది. ఎవరితో

మాట్లాడను యిచ్ఛవుండదు. శీతాకాలంలో స్నానానికని నదిలోమునిగినవాడు ప్రాణాన్ని బిగబట్టి క్షణంలో వస్త్రాది దుస్తులలో దూరువానివలె రత్నాకరుడు భోజనానంతరం క్షణంకూడా నిలువకుండా వెళ్ళిపోతున్నాడు. శివప్రసాద్ యిల్లే ఆయనకు స్వర్గధామంగా తోస్తున్నది.

సెనేట్‌సమావేశాలలోనున్న శివప్రసాద్ రాకవిషయమాలోచించేటంతఅవకాశ మిప్పుడు నిర్మలకు లేదు. తీరని కార్యక్రమంలో మునిగిపోయింది. రత్నాకరునితో పరిహాసక్రీడలు సలుపుటతో కలుగుతున్న మహదానందానుభూతిలో మునిగిపోతున్నది. అపారమైన చనువుతో ఆయన్ను విచిత్రరూపంలో ఆటలుపట్టించి, ఆడించగలుగుతున్నది. వెనుకగా పిల్లి అడుగులతో వెళ్ళి, హస్తద్వయంతో అతని నేత్రాలు మూస్తుంది. అతను హాయినిగ్రోలుతూ నెమ్మదిగా తనహస్తాలను పైకిచాచి, ఆమెశిరస్సునుపట్టి, మృదువుగా తనముందుకు వోరగా లాక్కుని చుంబిస్తుంటాడు. ఆమె కిలకిల నవ్వుతూ, అతనిచెక్కిలిమీద చిన్నగా మోది, పారిపోతుంది. అతను పుస్తకం తెరచి "ఇదిగో, యీ వాక్యం చదువుతాను విను" అంటాడు. ఆమె యేదో వుత్సాహకరమైనవిషయాన్ని కోల్పోతున్నదానివలె ఆత్రతతో "ఎక్కడా, యేమిటావాక్యం, చూడనివ్వు" అంటూ దగ్గరకువచ్చి పుస్తకంలోకి చూస్తుంది. అతను వడుపుగా ఆమెజడపట్టుకుని పుస్తకాన్ని ఆవలవేసి "ఇక పారిపో చూద్దాం" అంటాడు. ఆమె అధరాలలో మందహాసంచిందింపి, నేత్రాలు తేజోమయంచేసి, వోరగాచూస్తూ వలపుమత్తును వెదజల్లుతూ, కొంటెగా

"పురుషులందరూ వట్టి స్వార్థులు. స్త్రీలను తమనడుముకు బిగించివుంచుకోవాలని చూస్తారు" అంటుంది. ఆయన ఆమె భుజస్కంధాలనుపట్టి లాగి, ప్రక్కన కూర్చుండబెట్టి, ఆమె చుబుకాన్ని పుణుకుతూ "స్త్రీలకు పురుషులమీద దోషారోపణచేయుట అలవాటు అనగూడదా?" అని అంటాడు. "పురుషుడు సమర్థుడు గనుక పక్షపాతంతో స్త్రీని న్యూనత పరుస్తుంటాడు" అంటుంది నిర్మల. వెంటనే ఆమెను తన బాహువులలో బంధించి, అటూయిటూ వూపుతూ, మనసు దీర బిగిస్తూ "అదంతా రహస్యమయ ప్రకృతిమహిమ. ఈ యూనత్తుకు ప్రధానకర్త ఆ ప్రకృతే. ఆ ప్రకృతికనుసన్నలలో దాని యిచ్ఛానుగుణంగా నటించే నటకులము మాత్రమే మనం. దానికతీతులము కాలేము, కాగూడదు." అంటూ ఆయన ఆమెపెదవులపై గాఢంగా చుంబిస్తుంటాడు.

శీతలపవనాలకు మేఘాలు స్థిమితాన్ని కోల్పోయి, యెక్కడికో పరువులెత్తునట్లు, ఉష్ణమెక్కువైనపుడు నీరు ఆవిరిగా మారి ఎక్కడికో పారిపోవునట్లు వలపుప్రేమలో మునిగివున్న రత్నాకరునికి వూహావిహారాలు వుత్తేజాన్ని కలిగిస్తున్నవి. ఈలోకంలోని యీర్ష్యాద్వేషాలకు దూరమై, అదుపులు ఆజ్ఞలు ఆంక్షలులేని మన్మథరాజ్యానికి పోయి, నిర్మలతో నిరంతరం జిలిబిలి శృంగారనృత్యంతో ఆనందడోలికలలో హాయినిగ్రోలుతూ జీవితాంతంగడుపనున్నట్లు వివిధ రూపాలలో చిత్రించి ప్రస్ఫుటపరచి విశ్వసింపజేశాడు నిర్మలను.

ధనదాపరికంలో స్త్రీకి ప్రత్యేకనైపుణ్యం వుంటుంది.

వడ్డీలకు యెవరికివ్వాలో, బదులుగా యెవరికివ్వాలో స్త్రీకి బాగా తెలుసు. స్త్రీ ధనాన్ని ఆర్జించలేకపోవచ్చుగాని, వున్న ధనాన్ని పోకుండా ముడివేయగలదు. కాని ప్రేమవిషయంలో స్త్రీ అనభిజ్ఞురాలు. సామాన్యంగా ప్రేమించగూడదనిచోటే ప్రేమించి, ఆత్మార్పణచేస్తుంది. ప్రేమలో ద్రోహంచేయ రానిచోటే చేసికూర్చుంటుంది. నిర్మల పూర్తిగా రత్నాధీన మయిపోయింది. ఇపుడామెకు నియమాలు నిర్ణయాలు అంటూ లేకుండాపోయినవి. రత్నంమాటను శిరసావ హించుటే ఆత్మానందంగా తోస్తున్నది.

ప్రాతఃకాలసమయ మది. దినకరుని తేజస్సు తీక్ష్ణత వహించింది. మేఘాలు సమ్మె జేసినవో యేమో, అనంత నీలిమాకాశము నగ్నరూపంలో సూర్యకాంతితీక్ష్ణతకు అద్వి తీయశోభతో ప్రకాశిస్తున్నది ఆకాశములో తేలియాడు తున్న పందెపు పావురాళ్ళ గాబోలు, చిత్రవిచిత్రరంగులలో ద్యోతకమవుచున్నవి. పెరట్లోని పోకచెట్ల గెలలకెంపురంగులో మిరుమిట్లుగొలుపు నున్నటి వక్కపళ్ళమీద సూర్యకిరణాలు జిలిబిలినృత్యంసలుపుతూ వినూత్న దృశ్యాన్ని సృష్టిస్తున్నవి. ప్రాంగణంలో ప్రాకిన దాక్షిణీగదళాలు పవన తెమ్మెరలకు కరతాళనృత్యంసలుపుతున్నవి. తనకుజరిగిన యే అన్యా యాన్ని చెప్పుటకో గోశాలలోని గోవు "అంబా" అని ఆర్తనాదంచేస్తున్నది.

భవానీ పూజాదికాలను ముగించుకుని, వంటగది నుంచి వచ్చిన పాలను త్రాగి, పూజాగదిలోనే రామకోటి వ్రాయుట కుపక్రమించింది. చాలాకాలంక్రిందటే యింటి

వ్యవహారాలన్నిటిని ఒక్కటొక్కటిగా విసర్జించి, నిర్మల కప్పగించి, బాధ్యతారహితురాలై తనయిష్టదైవపూజలోను, రామకోటివ్రాయుటలోనే కాలక్షేపంచేసుకుంటున్నది. రోజు కొక్కమాటు తనపాదాలంటుటకొచ్చినపుడు నిర్మలను ఆశీర్వదించుట, కదాచిత్‌గా ఆమెఅడిగిన సంశయాలకు సలహాలిచ్చుటమాత్రమే ఆమెకార్యక్రమము. ఇంటివ్యవహార మంతా నిర్మలమీదుగానే విశేషదక్షతతో, అందరినీ ఆక ర్షించుకీతిని జరిగిపోతున్నది.

# 30 విషాదఘట్టం

నిర్మల నిత్యమూ భవానీకంటెముందుగానే లేచి, తెల్లవారకముందే స్నానపూజాదికాలు ముగించుకుని, వంట గదికెళ్ళు అలవాటుంది. కాని, నేడు యింతప్రొద్దెక్కినా, ఆమె రానందుకు విచారపడుతూ, వంటమనిషి నిర్మలగది ముందు నిలిచి "చిన్నమ్మగారూ, ఓ చిన్నమ్మగారూ,..." అంటూ పిలిచి, జవాబులేక వివశురాలై గదితలుపులునెట్టి లోపలికి చూసింది. శయ్యమీద నిర్మలలేదు. స్నానాలగదికి వెళ్ళి చూసింది, అక్కడ ఆమె స్నానంచేసినట్లులేదు. ఆశ్చర్యపోతూ గోశాలవైపువెళ్ళి పాలేరును ప్రశ్నించింది. కాని నిష్ప్రయోజనమై, వెలవెలబోతూ పూజాగదిముందు కొచ్చి "పెద్దమ్మగారు, పెద్దమ్మగారూ" అంటూ పిలిచింది.

వ్రాస్తున్న రామకోటి పుస్తకాన్ని ఆవలపెట్టి, నిర్మల ...చ ప్రశాంతవాతావరణంలోని తేజోమూర్తివలె భవానీ

బయటికొచ్చి "ఏమిటమ్మా" అని ప్రశ్నించింది. "చిన్నమ్మగారు కనిపించుటలేదమ్మా" అన్నది వంటమనిషి. భవానీ మందహాసంచేస్తూ "అది యెక్కడో యేదోపనిలో వుంటుంది." అని తానూ యిల్లంతా వెదకింది. ఆలయం వైపు వెళ్ళి చూసిరమ్మని మనుషులను పంపింది. అంతటా వెదికారు. గాలించారు కాని, నిష్ప్రయోజనమైంది. ఇప్పుడు భవానీ చకితురాలై నిర్మలగదిలో ప్రవేశించి పరిశీలించింది. తలగడవైపున తాళంచెవులగుత్తి కనిపించి, మరింత విచలితురాలై, వాటినితీసి అటూయిటూ తచ్చట్లాడుతూ నగల పెట్టె తెరచిచూసింది. అందులో అన్నీ అలానేవున్నవి. అందున్నడబ్బూ వున్నది. ఆమె ఏమీపాలుపోక అక్కడే కూలబడి దీర్ఘనిట్టూర్పు విడిచింది.

విషాదఘట్టాలకు చెడువార్తలకు బలమెక్కువ. అవి పత్రికలలో ప్రకటితంకాకుండానే, ప్రచారంచేయకుండానే ప్రబలరూపంలో ప్రచలితమైపోతవి. అపరాహ్ణసమయానికి ముందే యీ దుర్ఘటన పట్టణమంతటా ప్రచారమైపోయింది. రత్నకుమార్‌తో నిర్మల లేచిపోతుండగా, రాత్రి స్వయంగా చూచినట్లు కొందరు ప్రచారంచేశారు. ఫలానా నెంబరు టాక్సీలో యెక్కుతుండగా చూశామని మరికొందరన్నారు. ఇరువురూ కలసి శివప్రసాద్ యింట్లో నగలూ డబ్బూకూడా దోచుకుపోయారనికూడా ప్రచారమయిపోయింది.

భవానీ సడలిపోయినశక్తిని పూరించుకుని, లేచి తప్పటడుగులతో పూజాగదికి చేరి, నిట్టూర్చుతూ, గదితలుపు బార్లాతోసి "భగవాన్, నీ పూజాఫలితమిదేనా? దానికి

యేమిలోటుచేశామని? శివానికి. నే నేమి చెప్పగలను?"
అంటూ దైవంముందు సాష్టాంగపడింది.

పాలేళ్ళంతా పనులువదలి పరువులెత్తుకుంటూ వచ్చి ముక్కుమీద వేలేసుకుని "ఎంతఘోరం! జరుగరాని పని జరిగింది. ఈ పని నిర్మలాదేవి స్వబుద్ధితో యెన్నడూ జరుగదు. ఆ పాపిష్టి బద్రీనారాయణకొడుకు చేసివుంటాడు. ఆ కూతురలాచేసింది, యీ పుత్రరత్నం యిలాచేశాడు!" అనుకుంటూ కొందరు వుద్రేకంలో బద్రీనారాయణయింటి వైపు పరుగెత్తారు.

బద్రీనారాయణ కీ వార్త పిడుగుపాటైంది. బయట జేరిన గుంపునుంచి వస్తున్న నిందలు పరుషవాక్యాలు తన హృదయంలో బాకులవలె పొడుచుకుంటున్నవి. ఎవరు తన కుటుంబానికి వెలుగుచూపాడనుకున్నాడో, ఎవరు నిష్ప్రయోజకుడయికూర్చున్న తన రత్నాన్ని ప్యాస్ చేయించి, మార్గాన పెట్టి ప్రయోజకునిగా నిరూపించి, తనహృదయానికి పూరటకలిగించాడనుకున్నాడో, యెవరు తనకుటుంబంపాలిటి పెన్నిధియనుకున్నాడో, ఆ దైవసమానుడైన శివప్రసాద్ యింట్లో తనబిడ్డే యింత అఘాత్యంచేయుట యీ లోకంలో భరించరానిది, చూడరానిది, వినరానిది అని వాపోతూ "శివశివ! పేటిని నే నెలా వినేది? యెలా భరించేది!" అనుకుంటూ రోగగ్రస్తుడైన బద్రీనారాయణ చివ్వున లేచి "కల్యాణీ, నేను యీ దుర్వార్తలు వినలేను. నన్ను కాస్త పైఅంతస్తుగదిలోకి తీసుకెళ్ళు" అని అనురోధించాడు. కంటికీమింటికీ ఏకధారగా విలపిస్తున్న ఆమె వియూఘరాలి

వలె ఆయన రెక్కబట్టి ఒక్కొక్కమెట్టే యెక్కిస్తూ పైకి చేర్చింది. కుర్చీ రెక్కపట్టుకుని దీనవదనుడై కన్నీరు కారుస్తూ గాద్గదికకంఠంతో "కళ్యాణీ, నీమాట వినక, జాతక చక్రాలుపట్టుకునితిరిగి, పాడుకలలుకన్నాను. నన్ను క్షమించు ......(కంఠం సవరించుకుంటూ) గ్లాసుమంచినీళ్ళు తీసుకురా" అన్నాడు. ఆమె కొంగుతో తనకన్నీరద్దుకుంటూ క్రిందికి వెళ్ళింది.

ఒక్కమాటుగా బయట పెద్ద గల్లంతు బయలుదేరింది. చేతిలోమంచినీళ్ళగ్లాసు అలానేవుంచి, కళ్యాణి ఆత్రతతో బయటకువెళ్ళి తొంగిచూసింది. కాని, గోడ ప్రక్కజేరిన గుంపుమధ్య యేమిజరిగిందో ఆమెకు కనిపించలేదు. తచ్చట్లాడుతూ నిలిచింది. గుంపులోనుంచి యెవరో "బద్రీనారాయణగారు చనిపోయాడు" అన్నారు.

కళ్యాణిచేతిలోనిగ్లాసు జారిపోయింది "భగవంతుడా" అంటూ పెద్దపెట్టున విలపిస్తూ, హృదయంమీద మోదుకుంటూ పాదాలుయిాడ్చుకుంటూ పోయి, బద్రీనారాయణ పాదాలమీద పడి, శిరస్సును పృథ్విమీద మోదుకుంటున్నది. జనం ఆమెనువారిస్తూ, ఓదార్చుతున్నారు. ఆమె స్మృతిదప్పి పడిపోయింది.

డాబామీదనుంచి దూకిన బద్రీనారాయణశిరస్సునుంచి నోటినుంచి ఏకధారగా రక్తం స్రవించింది. క్షణంలో శరీరం చల్లబడిపోయింది. మనస్సులోని వూహాలన్నిటిని మలినంచేసుకుని పరలోకానికి వెళ్ళిపోయాడు.

# 31 మధురస్మృతులు

శివప్రసాద్ సెనేట్ వ్యవహారాలలో వుంటున్నా; గ్రంథపరిశోధన చేస్తున్నా, ఉపన్యాసాలు తయారుచేస్తున్నా, ఆయన యెట్టయెదుట నిర్మల నిలిచివున్నట్లే వుంటున్నది. ఆమె ఆలోచనలతోనే ఆయన యెప్పటికప్పుడు వినూత్నోత్సాహాన్ని పొందుతూ, విశేషప్రజ్ఞను ప్రదర్శించగలుగుతున్నాడు. ఆమె మధురస్మృతుల అనుభూతితో పొందే ప్రోత్సాహంతో విశిష్టశైలిలో మధురమైన భాషలో అనర్గళంగా వుపన్యసించి, సెనేట్‌లో సభ్యులందరి హృదయాలను పురూతలూపి, శాశ్వతమైన ముద్రను వేయగలిగాడు. తను వుపన్యసించునపుడు తనముందు నిర్మల నిలచినట్లే మరింత వుల్లాసప్రేరితుడయ్యేవాడు. ఆమెను తనతో తీసుకురానందుకే ఆయన అపుడపుడు చింతిస్తున్నాడు. తనప్రజ్ఞను ప్రతిభను వైభవాన్ని యిక్కడి విశేషాలు, ఆమె స్వయంగా చూసివుంటే, యెంత బాగుండునన్నది ఆయనవ్యథ. ప్రశాంతంగా పవళించి కనులుమూసి "నిర్మల యిపుడేమిచేస్తుంటుంది?" అని తనలో తానే చిత్రవిచిత్రంగా వూహించుకుని, ఆత్మానందాన్ని పొందుతున్నాడు. యుద్ధరంగంలోని సైనికునివలె ఆయన సుఖస్వప్నాలతో సమయాన్ని దొర్లిస్తున్నాడు.

నేడు సెనేట్ సమావేశాలు పూర్తయినవి. విదేశయాత్ర చేసి వచ్చేవాడు విమానంలోనుంచి ఆదుర్దాపట్టజాలక, తనయింటిని గుర్తించుటకు తొంగిచూచునట్లు శివప్రసాద్ పట్టరానిఆనందంతో పులకితుడవుతున్నాడు. ఒకటి

చేయబోయి మరొకటిచేస్తున్నాడు. నిర్మలకు వెళ్ళగానే యేమిప్రజంటుచేస్తే బావుంటుందా, ఆమెకు యేమియిష్టమో అని, యెంతో ఆలోచించాడు. ఆమెకు బాగా యిష్టమైన దేదో ఆయనకే తెలియక, అదే ఆమెగొప్పతనం అనుకున్నాడు. ఆమెలాంటి నిశ్చలమైన విశిష్టహృదయులకు తుచ్ఛవస్తువులమీద కోర్కెవుండదు" అని సంతృప్తిపడ్డాడు. అయినా, ఆయనమనస్సుకు పూరటకలుగక బజారుకెళ్ళి, కెంపులుపొదిగిన సన్నటి దంతపుగాజులు, వినీల ముఖమల్ బ్లౌజర్, కాశ్మీరీ పగడరంగు సిల్కుచీర కొన్నాడు.

శనిబట్టి ఏడుసంవత్సరాలు దేశాలుతిరిగి, ఇంటిముంగు కొచ్చి నా యిల్లు యేమయిందోనని వగచినట్లు ప్రయాణ మైన శివప్రసాద్‌హృదయం, నిర్మల నెపుడు చూస్తానాఅన్న ఆదుర్దాతో దడదడ కొట్టుకుంటున్నది.

ఇంటిముందు బండివచ్చి ఆగింది. ఎవరిరాకకోరకో ఇంటిసింహద్వారంవైపు చూస్తూ, పరధ్యానలో దిగి, ఆరాటంగా అటూయిటూ పరికించాడు శివం. పాలేరులంతా పసుగులెత్తుకొనివచ్చి నిలిచారు. వారిముఖాలలో యెక్కడా ప్రసన్నరేఖలు లేవు. విషాదరేఖలు కారుమేఘాలవలె క్రమ్మి వున్నవి. విసగటతో వారివైపునుంచి దృష్టిమరల్చి సింహద్వారంవైపు నడిచాడు. తను కాలేజీనుంచివచ్చువేళకు మెట్లమీద కూర్చుని నిరీక్షిస్తూవుండి, తనరాకతో కిలకిలారావంచేస్తూ యెదురొచ్చి తనచేతిలోని పుస్తకాలనందుకుని, మత్తునువెదజల్లే మదుకారాన్నిప్రదర్శించి లోనికిపోసుకెళ్ళ ఆ యువతి నేడింతవరకు బయట కనిపించకపోవుట ఆయ

నకు బాధగావుంది. తన దీర్ఘ యెడబాటుకు ఆమె కృద్ధురాలైందిగాబోలు, అనుకుంటూ చరచర అతి నిశ్శబ్దంగా నిర్మలగదికివెళ్ళి తలుపులు తెరిచాడు. కాని అది శూన్యంగా వుంది. భవానీకి తెలియకుండా చూడకుండా ముందు నిర్మలనుకలిసి, మనసారమాటాడి, అపుడు భవానీవద్దకెళ్ళి ప్రణామాలర్పించాలని ఆయనకోర్కె. అందుకే ఆయన పూజాగదిని, భవానీగదిని తప్పించి గాలిస్తున్నాడు. విసగట చెంది పూజాగదివైపు వెళ్ళాడు. తలుపులు మూసివున్నవి. భవానీగదివైపు వెళ్ళాడు. ఎవరో దీర్ఘరోగివలె శయ్యామీద పరుండి, శాలువాకప్పుకునివున్నారు. అటూయిటూ పరికించి, దగ్గరకువెళ్ళి మమకారాలొలుకుతున్న కంఠంతో "అమ్మా, అమ్మా" అంటూ ఆమెనొసటిమీద చేయివేసి చూడబోయాడు. ఆమె నేత్రాలుతెరచి తనచేతులతో ముఖాన్ని కప్పుకుని, బొలబొల విలపిస్తూ "నాయనా!" అనిమాత్రం అనగలిగింది. ఆమె దుఃఖావేశంతో వక్రాలుతిరిగిపోతున్నది.

శివప్రసాద్ అర్థంగానిఅయోమయంలో విభ్రాంతుడై ప్రక్కగా మంచంమీద కూర్చుని, ఆమె శిరస్సును పైకెత్త ప్రయత్నిస్తూనోదార్పుకంఠంతో "ఏమిటమ్మా?" అన్నాడు. ఆమె యేకధారగా కన్నీరుకారుస్తూ, భరించరానిబాధతో అరగంట విలపించినతదుపరిగాని ఆమెమనస్సుకు ఊరట కలుగలేదు. చెప్పగలస్థిమితం ఏర్పడలేదు. హీనస్వరంతో "శివం, నిర్మల రత్నాకరునితో వెళ్ళిపోయిందిరా" అని పెగిలీపెగలనికంఠంతో అన్నది.

ఒక్కమాటుగా ఆయనహృదయంలో జ్వాలాముఖి

పర్వతాలెన్నో బ్రద్దలై, ప్రచండపొంగులు బయలుదేరి నట్లు హృదయం దడదడలాడుతూ భీషణరూపంలో కొట్టు కుంటున్నది. జ్వాలాముఖి పొంగి, గంధకము, లోహము మొదలగుద్రవాలు మిరిమిట్లుగొలుపుతూ కణకణమంటూ రెపరెప లోకంమీద పడుతున్నపుడు, సర్వమూ శూన్యమై పోవునట్లు ఆయనమనస్సు దృష్టి ఆలోచనలు అన్నీ నట్టి పోయి, జడపదార్థంవలె ఆమెమీద పడిపోయాడు. ఆమె శివంశిరస్సును తనవక్షస్థలంమీద పైకెత్తిప్పి సవరిస్తూ "దానికి నీ వేమిలోటుచేశావు నాయనా? వున్నసర్వమూ దానిచేతి కిచ్చావు. అది విశ్వాసఘాతకురాలు. దానిపాపాన అదే పోతుంది" అన్నది. కాని మారుపలుకులేదు. ఆయననాసికా రంధ్రాలు దీర్ఘరూపంలో బుసలుగొడుతున్నవి. గుండెలు తపతపకొట్టుకుంటున్నవి. ఆమె ఆదుర్దాతో ఆయనశిరస్సును ప్రక్కకుదింపి, ఆయనస్థితిగాంచి నిర్ఘాంతపోతూ, గాద్గదిక కంఠంతో "నాయనా శివం!" అంటూ కుదిపి మాట్లాడించ ప్రయత్నించి విఫలురాలైంది. దిక్కుతోచనిదానివలె శోకా వేశితురాలై పీవనతో విసురుతున్నది.

నిద్రనుంచి మేల్కొన్నవానివలె శివప్రసాద్ నేత్రాలు నులుముకుంటూ, దీర్ఘశ్వాసవిడుస్తూ లేచాడు. ఆయన కార్చిన బాష్పజలముతో తలగడ తడిసిపోయింది. వ్యథ సిగ్గులతో మిళితమైనవదనంతో "అమ్మా, నిర్మల నీతో యేమయినా చెప్పి వెళ్ళిందా?" అన్నాడు. ఆమె ఆవేశ పూరితురాలై "ఆ పాపిష్టిదానిపేరు యెత్తకు నాయనా! దొంగతనంగా పారిపోయిన దరిద్రురాలు యెవరితో యేమి

చెబుతుంది?" అంటుండగా మధ్యలో క్రోధభరితకంఠంతో "అమ్మా! అనవసరంగా ఆమెనేమీ అనకు" అని గద్దింపుగా అన్నాడు. ఆమె అయోమయంతో అనభిజ్ఞురాలివలె వెలవెలబోతూ, ఆయనముఖంవంక చూస్తున్నది. శివప్రసాద్ పాదాలుయీడ్చుకుంటూ తనగదికి వెళ్ళి, జీవితంలో యెన్నడూ యెరుగని అలసటపొందినవానివలె శయ్యమీద వాలిపోయాడు. ఆయన నిదురిస్తున్నాడో వూహావిహారంలో గడించినసుఖంలోని మాధుర్యాన్ని నెమరువేసుకుంటున్నాడో యెవరికీ తెలియదు. ప్రయాణబడలిక ఒకప్రక్క, హృదయాన్నినలిపివేస్తున్న విషాదఘట్టం మరోప్రక్క నున్నందున గాఢనిద్రలోనున్నాడని యెప్పటికప్పుడు చూచిపోతూ, యెవరూ ఆయన్ను పలుకరించె సాహసింపజాలకపోయారు. మరునాడుకూడా ఆయన అలాగే గాఢనిద్రలోనున్నట్లు తోచినపుడు పనివారలకు భవానీకి ఆదుర్దాకలిగింది. భవానీకికూడా ఆయనముందు యెన్నడూలేనిభీతికలిగి నిద్రలేపలేకపోయెన్నది. తనఆవేదనను ఆపుకోజాలక, లేపాలని చిన్నగా పిలుస్తూ, యెన్నోప్రయత్నాలు సలిపి విఫలమయింది. మూండవరోజుకూడా స్థితిలో భేదం కనిపించనపుడు, భవానీ వివశురాలై ఆయనకప్పుకున్న శాలువాను బలవంతంగా తొలగించిచూసింది. ఆయనముఖం శుష్కించి యోగనిద్రలోనున్నట్లున్నది. ఆమె లలాటంమీద చేయివేసి చూసింది. భగభగ మంటలుమండుతూన్న జ్వరతాపం ఆమెచేతిని కాల్చివేయునట్లున్నది.

భవానీ ఖంగారుపడుతూ "అయ్యో శివం! ఇదేమి

టిరా నాయనా!" అంటూ, బయటకు వచ్చి గంగులును కేక వేసి, డాక్టరుకొరకు పరువులెత్తించింది.

ఒకడాక్టరుమీద విశ్వాసంలేక, నలుగురుడాక్టర్లను నియమించి, సలహాలుతీసుకుని మందులువాడుతున్నారు. వారంరోజులు గడిచిపోయినవి. కాని, జ్వరం వెనుకాడలేదు. శివప్రసాద్‌కంటె భవానీ మరింత శుష్కించిపోయింది. ఒకరు జబ్బుతో లంకణాలయితే, మరొకరు ఆదుర్దాతో గూడినసేవతో లంకణాలుచేస్తున్నారు. ఆయ నిపుడు నేత్రాలుపెద్దవిచేసి దీనంగా తనసేవజేస్తున్న మాతృసమానురాలైన భవానీని తదేకంగా చూస్తుంటాడు. ఆమె తన కన్నీటిని ఆయనకుచూపలేక, ప్రక్కకుతిరిగి కొంగుకద్దుకుంటున్నది. ఆయనలలాటంమీద ఉడుకులాంపట్టీ వేస్తూ పొరలివస్తున్న దుఃఖాన్ని ఆపుకోజాలక, చేతులతో కొంగును ముఖానికిఅడ్డుపెట్టుకుని కుమిలికుమిలి విలపిస్తూ సునిషి వ్రూగిపోతున్నది. శివంకనుకోలకులగుండా అశ్రుస్రవంతి సెలయేరువలె బొలబొల ప్రవహిస్తున్నది. ఆయన నెమ్మదిగా తనహస్తాలతో తనప్రక్కనున్న ఆమెపాదాన్ని స్పృశిస్తూ "అమ్మా!" అన్నాడు. అగాధసాగరంలో మునిగినవానికేదో గడ్డిపరక దొరికి, భ్రమించినట్లు ఆమె తనదుఃఖాన్ని బిగబట్టి "ఏమిటి బాబూ?" అన్నది.

ఆయన అస్పష్టమైన గాద్గదికస్వరంతో "అమ్మా, నిర్మల అపరాధంచేయలేదమ్మా. ఆమెమీద దోషారోపణ చేయుట ధర్మంగాదు. విధిలిఖితాన్ని యెవరు దాటగలరు? నాలో నాకు తెలియనిదోష మెక్కడో వుండివుంటుంది. జరి

గినదానికి కారణాలను యెవరెవరిమీదో పెట్టి, తనను నిర్దోషిగా నిరూపించుకొనుట సామాన్యమే. అది వివేకం కాదు. ఆమెనుఆకర్షించి, బంధించగలశక్తిగాని, నాఆలోచనలతోనే నిలిపివుంచగలశక్తిగాని నాకు లేకపోయింది. అందు కామెను నిందించుట నిష్ప్రయోజనం. మానవస్వభావం ఎంత వున్నతమైనదయినా, కొన్ని వేళలందు వక్రిస్తుంది. అది సృష్టిలోని శాపంగావచ్చు." అని అశ్రువులనద్దుకుంటూ దీర్ఘ శ్వాసను విడిచాడు.

ఆమెలోని అధీరత అదృశ్యమై, శుష్కహాసంతో "అవును నాయనా, విధిలిఖితాన్ని యెవరు తప్పించగలరు? జరిగినదంతా మనమేలు కేనని మర్చిపోవుట మంచిది. విచారంతో వ్యధ చెందినందునవలన ప్రయోజనం లేదు" అన్నది.

భవానీ యేభయంతో కళవళపడుతూందో, నే డా భయం తీరినట్లున్నది. నిర్మలఅంతర్ధానంవలన శివం యేమయిపోతాడోనని చింతించింది. ఆమెను యెంత యిష్టంతో చూస్తున్నదీ తనకు తెలుసు. కాని, నేడు శివప్రసాద్‌నుంచే సంతృప్తికరమైనవాక్యాలు వచ్చినందున గొప్ప వూరటకలిగింది.

వారంరోజులు గడిచినవి. జ్వరతీవ్రత తగ్గింది. శివప్రసా దిపుడు భవానీతోను, గంగులుతోను మాట్లాడుతున్నాడు. ఒకనాడు భవానీకి తెలియకుండా, గంగులు ద్వారా తనస్నేహితుడైన ప్లీడరుని పిలిపించాడు. ప్లీడరుకు మందులు తెలియకపోయినా—మానసిక బాధను పోగొట్టగల వుపాయాలుంటవి గనుక — శివబాబుకు తగినధైర్యాన్నిచ్చు

టకు వుపకరిస్తాడుగాబోలనుకున్నాడు గంగులు. ఆమరునాడు యెవరో ఒక ఆఫీసరుకూడా శివప్రసాద్‌గదిలోకి వచ్చి పోవటం జరిగింది.

శివప్రసాద్ యిపుడు కొంత దిలాసాగా కనిపిస్తు న్నాడు. జరిగినదాన్నిగురించి దుఃఖించకుండా యేదో నిశ్చితాభిప్రాయాన్ని సృష్టించుకున్నట్లు కనిపిస్తున్నాడు. కాని, శరీరంలో శక్తి హెచ్చుటలేదు. "నాయనా, యీ కాసిని బార్లీనీళ్లు త్రాగుదువుగాని లే" అని ప్రక్కనుంచి అంటున్న భవానీనిచూస్తూ, "అమ్మా, మనపెట్టెలోనినగలు; డబ్బు నిర్మల యెత్తుకెళ్ళిందేమో చూశావా?" అని ప్రశ్నించాడు. "లేదుగా నాయనా, అది కట్టుకున్న గుడ్డతోనే వెళ్ళి పోయింది" అన్నది. ఉదాసీనుడై "పోనీ, కొంత డబ్బ యినా యివ్వకపోయావా అమ్మా!" అన్నాడు.

ఆమె "పారిపోయినదానిచేతికి నే నెల్లా యివ్వగలను చెప్పు?" అన్నది.

రవంత క్రోధంవెలిబుచ్చుతూ "అవునులే అమ్మా, అసలు దానికి మనడబ్బెందు కివ్వాలి? ఇక మనడబ్బును అలాంటివాళ్ళకొరకు దుర్వినియోగంచేయగూడదు. ఆ తాళంచెవు లిలా యివ్వు అమ్మా, నేను జాగ్రత్తగా దాస్తాను" అని చేయిచాచాడు. దుర్యోగంలోపడి పోగొ ట్టున్నబిడ్డ ఆకస్మికంగా కఠినహృదయుడై పిసినిగొట్టువాడై బిగబట్టి సంపాదనకుపక్రమించినపుడు చూసి తన్మయుడవు తండ్రివలె, భవానీ శివంమాటలకు పులకితురాలవుతూ, తన కనుకొలకులలోనిండిన నీటిని ఆయనకంటపడకుండా ముఖం

ప్రక్కకుత్రిప్పి శ్రద్ధాభరితకంఠంతో "ఆవిధంగా నీహృదయం మారిపోయి, యీ ఆపత్తినుంచి బయటపడితే అంతే చాలు బాబూ" అంటూ తనకొంగుకుకట్టివున్న తాళంచెవులను శివానికిచ్చింది. ఆయన వాటిని తలగడక్రిందవుంచి, ఆమె తెచ్చిన జావత్రాగి పడుకున్నాడు.

# 32 ధర్మదానము

అపరాహ్నసమయమది. అంతా నిశ్శబ్దంగావుంది. వంటమనిషి వసారాలో చాపమీద గురకలుపెడుతూ నిద్రిస్తున్నది. శివప్రసాద్ తిరిగి మామూలుమనిషికాగలడని ధైర్యాన్నిపొందిన భవానీ నిశ్చింతగా పూజాగదిలో జపంలో నిమగ్నురాలైంది. శివప్రసాద్ యెక్కడలేనిశక్తివచ్చినట్లు లేచి అటూయిటూ పరికించి, నెమ్మదిగా తాళంచెవులతో ఇనుపపెట్టెకడకు చేరి దోపిడీగానివలె, అతిమెలకువగా శబ్దంకాకుండా అటూయిటూ బిత్తరిచూపులుచూస్తూ పెట్టెతెరచాడు. నగలు, కరెన్సీకట్టలను బయటకుతీసి, తిరిగి యథాతథంగా పెట్టెమూసి, తను తీసినవస్తువులను శయ్యమీద పెట్టుకున్నాడు. తను వైజాగ్‌నుంచి తెచ్చిన చీరె, గాజులను కూడా అందుచేర్చి, నిర్మల తన దుస్తులుపెట్టుకున్న ట్రంకును తెచ్చి తెరచాడు. అందు ఆమె ధరించిన చీరెలన్నీ వున్నవి. వాటిలో ఆమె దాగివున్నట్లు ఆయనహృదయం ద్రవించి నీరుగారిపోయింది. ఆమె తనయెట్టయెదుటనిలిచి "నన్ను క్షమించండి, నేను అయోగ్యురాలిని" అని వేడుకుంటున్నట్లు తోచి, కళవళపడి కంగారుగా ప్రక్కకుజరిగిపోయాడు.

ఆయననేత్రాలనుంచి అయాచితంగా అశ్రువులు నలుకు తున్నవి. ఆ అశ్రువులలో జిలిబిలిగా చెదరిన ఆయనఅస్పష్ట దృష్టిలో నిర్మల దేవతాప్రతిమవలె, అనునయంగా తనను లాలిస్తున్న ఆత్మీయురాలివలె ప్రభవిస్తున్నది. ఆయన ద్రవి స్తున్న చంచలహృదయంలో విచలితప్రవృత్తితో అశ్రువులను హస్తంతో అద్దుకుంటూ, దీనతఉట్టిపడుతున్నకంఠంతో "ఇంత కఠినశిక్షవిధించిపోయావు; నేను నీ కేమి అపకారం చేశాను నిర్మలా?" అనిమాత్రం అనగలిగాడు.

ఆ నిర్మలట్రంకులోనే నగలపెట్టెను, కరెన్సీకట్టలు మొదలగువాటిని, తలగడక్రిందనుంచి ఒక రిజిష్టరయినదస్తా వేజును తీసి పెట్టాడు. కలము కాగితము తీసి, ఒకవుత్తరం వ్రాసి, ఆ పెట్టెపైభాగంలో పెట్టాడు. తనువ్రాసిపెట్టిన ఆ వుత్తరాన్నే తీసి మరోమాటు చదివి, నిట్టూర్పువిడచి, తనివి తీరక పదిమాటులు చదివి తిరిగి ఆ పెట్టెలో సర్ది వేశాడు.

•

"నిర్మలా నూర్జహాన్.

నీయడల నాకు యేమాత్రంక్రోధంగాని, ద్వేషం గాని యీర్ష్యగాని లేవు. నేను నిన్ను జాలితో దయతో ఆదరించాను. కాని, రానురాను నాకు తెలియకుండానే నా మనస్సు నీవైపు మొగ్గింది. నిన్ను పవిత్రప్రేమతో మన స్సులో నింపుకున్నాను. నిన్నుపొంది యీ జగత్తులోని సర్వసంపన్నునిగా మదిలో పొంగిపోయాను. నేడు సర్వమూ కోల్పోయిన విరాగిని. ఈ అంతటికీ నీవే అపరాధినని యెన్నడూ అనను. నీవు నా వత్తిడివలన గాబోలు, నా ముం దొకమాట—నన్నుయెన్నటికి వీడనని అభయమిచ్చావు. ఆ

అభయాన్ని విస్మరించినదోషాన్ని నీమీద అంటగట్టను. విధివిలాసంవల్లనే నాజీవితం కుంటుపడిపోయిందనుకుంటాను. ఇక నాజీవితంలో కోరదగ్గ ఆశలులేవు. నీవు విడిచిపోయిన మధురస్మృతులలో యెంతవరకు పయనించగలనో నాకు తెలియదు. ఈ దురదృష్టజాతకుని విస్మరించి, నీవు ఉజ్వలమైన భవిష్యత్తుతో సుఖప్రదజీవితాన్ని గడపాలని ఆశీర్వదిస్తున్నాను. ఇక్కడి యీ నగలు, సంపత్తి నీవిగా నేను యెన్నోమారులు అన్నాను; నీహస్తగతంచేశాను. ఇవి నా అంతరాత్మ ప్రేరణతో నీకు ప్రసాదించబడినవి. నాతోపాటు వీటినికూడా నిరాదరిస్తే నా ఆత్మ అన్నివైపులా ఘోషిస్తుంది. ఆస్తినంతటిని నీకు యిష్టానుసారం వ్రాసి, రిజిష్టరుచేసినదస్తావేజునుకూడా నీకు పంపుతున్నాను. వీటిని స్వీకరించమని నా ఆఖరికోరిక. నీవు యెన్నటికీ చెరగని మధురస్మృతులను ప్రదానంచేసి వెళ్ళావు. ఆ ఒక్క సంపత్తే నాకు యేకైక తరుణోపాయం. నాకేగాదు, వ్యధితజీవులందరికి తరుణోపాయనిధి యిదే. నీకు యీ ఉత్తరం చేరులోగా నేను యెటువెళతానో నాకే తెలియదు అమ్మవిషయంలో నీకు ప్రత్యేకంగా చెప్పవలసినపనిలేదు. నీవూ ఆమెను అధికంగా ప్రేమిస్తావు. ఆమెభారంకూడా నీకే వదలి వెళుతున్నాను. రత్నాకరుడు గొప్ప అదృష్టవంతుడు. అతనిని కూడా ఆశీర్వదిస్తున్నాను. మీ యిద్దరూ యిక్కడికే వచ్చి వుండండి. భగవంతుడు మిమ్ము రక్షించుగాక!

ఇట్లు,

శివప్రసాద్"

ఈ పుత్తరాన్ని పెట్టెపైభాగంలోపెట్టి, తాళంవేసి యథాస్థానంలో పెట్టెనుంచి, పవళించి, ఆలోచించినవిషయా లనే ఆలోచిస్తూ కన్నీరుకారుస్తూ యెంతసేపున్నాడో ఆయ నకే తెలియదు.

రెండురోజులు గడచిపోయినవి. భవానీ యెంతనిరో ధిస్తున్నా ఆ పెట్టెను నిర్మలకు పంప కృతనిశ్చయుడైనాడు. ఆపెట్టెలో యేమేమివున్నవో భవానీకిగాని, మరొకరికిగాని తెలియదు. అందు కేవలం నిర్మలచీరెలున్నసంగతే అందరికీ తెలుసు. శివప్రసాద్‌పట్టుదల భవానీకి బాగా తెలుసు కాని, పారిపోయిన ఆవిడ యెక్కడున్నదని వెదకి ఆ పెట్టె నివ్వగల మని ఆమెవాదన. అవును, ఆవిషయమే యిపు డాయన్ను చీకాకుపరుస్తున్నది. ఆయన యెంత బుర్రబద్దలుగొట్టుకున్నా వుపాయం తోచుటలేదు.

తనవిశ్వాసపాత్రుడయిన గంగులుద్వారా, రత్నా కరుడు యిదివరకు మద్రాసులో యెక్కడెక్కడున్నది, ఆచూకీతీయించాడు. చంద్రనాథ్ అనే రత్నాకరునియిష్ట మిత్రునిఅడ్రసు దొరికింది. ఆ అడ్రసుకే వెళ్ళి, యెంత ప్రయాసఅయినా యెన్నిరోజులు తిరుగవలసివచ్చినా వెను దీయక నిర్మలను స్వయంగా కలుసుకొని ఆ పెట్టెను ఆమె చేతులలో వుంచి రావలసిందిగా బోధించి, గంగులును ఆపెట్టెతో మద్రాసు పంపివేశాడు.

మరునాడు జ్వరంతో శుష్కవదనంతో లంకణాలతో నున్న శివప్రసాద్ యింటిలోనుంచి అదృశ్యమైనాడు. హృద యానికి భరింపరానిఆఘాతము సంభవించినందున తన శివం

కొరకు యింటిలో వెదకనుకూడా శక్తిహీనురాలై భవానీ పూజాగదిలో సాష్టాంగపడి, పృథ్వీమీద శిరస్సుమోదు కుంటున్నది. ఆమెను సురక్షితంగా పట్టుకొను వంటమనిషికి శక్తిచాలుటలేదు. చాలాకాలంగా ఆ యింటినుంచి అంతగా ఆర్తనాదాలు వెలువడలేదు.

రెండురోజులు గడిచిపోయినవి. పాలేళ్లేగాదు, నందల విద్యార్థులుకూడా శోకాతురులై వూహకుతోచినచోటల్లా వెదకి విఫలులైనారు. కృష్ణకుమారివలెనే శివప్రసాద్‌కూడా నదిలోదూకి ప్రాణత్యాగంచేసివుంటాడని వూహాగానాలు బయలుదేరినవి. పూజాగదిలో సాష్టాంగపడిన భవానీ లేవనే లేదు. ఎవరు ఎంతప్రయత్నించినా, ఆమె అక్కడే వుండి పోయింది. ఎప్పటికప్పుడు వంటమనిషి ఆమెను లేవదీయ ప్రయత్నిస్తూనేవున్నది. మూడోరోజు అనుమానంతో ఆమె ముఖాన్ని త్రిప్పిచూసి వంటమనిషి భీతిలి కంగారుతో పరు గెత్తుకుంటూ బయటపడి కేకలుపెట్టింది. పాలేళ్లు యితర్లూ యెందరో గుమిగూడారు. ఈలోకంలోని పాపాలకు అఘా యిత్యాలకు సాక్షీభూతునివలె నిలిచి సమీక్షచేస్తున్న ఆదేవ విగ్రహాలముందే భవానీ శాశ్వతంగా కనులుమూసింది.

మద్రాసువెళ్ళిన గంగులు పెట్టె నెత్తినపెట్టుకుని, వీధులవెంట వెదకుతూ 'ఒన్‌పేరీ' పేట అడుగుతూ తిరుగు తున్నాడు. కాళ్ళీడ్చుకుంటూ పోతున్న గంగులును వేగంగా వస్తున్న కారుమడ్గార్డు నెట్టివేసింది. అతను ప్రక్కనున్న కార్పొరేషనువారి సిమెంటుతొట్టికి ఢీకొన్నాడు. నెత్తిమీది పెట్టె దూరంగా పోయి పడింది. సిమెంటుతొట్టిమీద పడిన

గంగులు చెవి సగంవరకు కత్తిరించుకుపోయింది. కణతమీద తగిలినదెబ్బతో శిరస్సు చర్మవిహీనమై కండలు రక్తంతో ఓడుతున్నవి. ఆ కామువానికీ దుర్భాగ్యునిదశ చూచే అవకాశమేలేకుండా తుర్రున వెళ్ళిపోయింది.

గంగులుచుట్టూ వందలజనాభా గుమిగూడి, తిలకిస్తున్నారు. జనంలో కొందరు వానిపెట్టెను అతనిదగ్గరకు జేర్చి, అతనిప్రాణం యెంతసేపుంటుందో అని తిలకిస్తున్నారు. ప్రక్కయింటివారు ఆ వినోదంతో విసిగి, అంబులెన్సువారికి ఫోన్‌చేశారు.

మద్రాసు జనరల్‌హాస్పిటల్ అనాథరోగులలిస్టులో చేర్చబడ్డాడు గంగులు. అతనిపెట్టె అతనిపేర జమప్రాయబడి భద్రపరచబడింది. రక్తనష్టము అధికంగా జరిగినందున బ్రతుకుట కష్టమని, బ్రతికినా మతిరావటం అసాధ్యమని వైద్యనిపుణులు రిపోర్టువ్రాసిపెట్టారు.

# 33 యోగసిద్ధి

సంవత్సరంతరువాతవిషయం. మాఘమాసపు చలితో శరీరం కొంగర్లు త్తిపోతున్న రోజులవి. నీలకంఠస్వామి ఆలయఘాటునద్దకు స్త్రీలు ఫలపుష్పాలతో పట్టణంనలుమూలల నుంచి బారులుదీరి పోతున్నారు. ఘాటుప్రక్కన వృక్షంక్రింద ఒక నాగాబాబాగారు వుపస్థితులై వున్నారు. శిరస్సంతా వక్రాలుతిరిగినజడలతో చిన్ని పర్వతంవలె వున్నది. దర్భతాడు మొలకుచుట్టి, అరటిదోను లంగోటా ధరించి

వున్నాడు. శరీరమంతా నగ్నంగావున్నది. చలిబాధ ఆయన ముందు ఓటమినంగీకరించి పారిపోయింది. రోజుకొకమాటు గ్లాసుడుపాలు, రెండు అరటిపండ్లు మాత్రమే ఆయనకాహారమట. కూర్చునివున్న నిష్టలోనే ఆయన నిద్రకూడా మిళితమైవుంటుందేమో! అస్సాము నాగాపర్వతాలనుంచి వచ్చిన ఋషిపుంగవుడు గనుక, ఆయనను 'నాగాబాబా' అంటున్నారు. ఆ బాబా ఆకస్మికంగా మూడురోజులక్రితమే యిక్కడికి చేరుట జరిగింది. వుదయం 9గంటలకు సాయంత్రం 6గంటలకు మాత్రమే ఆయన నేత్రాలు తెరచి వచ్చిన భక్తులను పరికించి ఆశీర్వదించి పంపుతుంటాడు. ఎవరు తెచ్చుకున్న ఫలపుష్పాలను వారికే తన హస్తస్పర్శతో తిరిగి సమర్పిస్తుంటాడు. తనకు నచ్చిన ఒక్కరినుంచిమాత్రం ఆహారంతీసుకుంటాడు. ఆయనఆశీర్వాదాలకుకూడా స్త్రీలు సినిమాహాలువద్దలాగా క్యూలోనిలబడివుంటున్నారు. ఆయన పెదవులు కదులుతాయేగాని, ఆయనమాట పలుకు విన్నవారులేరు. కాని అనేకమందికి ప్రత్యక్షనిదర్శనలుగా సత్ఫలితాలు కనిపించినవని ప్రచారమైపోయింది.

నాగాబాబాగారిప్రభావం పట్టణంలోని ప్రతిఒక్కరిని ఆకర్షించింది. ఇపుడు స్త్రీపురుషవివక్షతలేకుండా వేలజనాభా ఆయనదర్శనార్థం వచ్చిపోతున్నారు. ఆ నాగాబాబా తననియమాన్ని విడచి పేరినెవరినీ పరికించేస్థితిలో లేదు. ఆయనకు శిష్యులెవరూలేరు. ఆయన యేకైక సాధుపుంగవుడు. జపమే తనఆశయంగా వున్నవాడు. కాని పట్టణంలోవున్న భక్తకోటికి అది నచ్చలేదు. అందు కాయన్ను

యెట్టయెదుటే యెన్నెన్నో పరిహాసవాక్యాలన్నారు. కాని అవి రాతివిగ్రహంవలె యోగనిద్రలోనున్న ఆయనకర్ణ రంధ్రాలలో దూరలేదు.

నాగాబాబాస్వాములవారు వేంచేసి, సంవత్సరం గడిచిపోయింది. ఆయనపైభక్తివిశ్వాసాలతో అనేకజబ్బులు నయమయినవి. కొందరికి మొండివ్యాధులు మాయమైనవి. దృష్టిలోనిమసక దూరమయింది. సంతానహీనులకు సంతానంకలిగింది. పట్టణంలోని వేలమంది ప్రత్యక్షనిదర్శనలు పొందారు. తమఅదృష్టంకొద్దీ భగవంతుడే ఆరూపంలోవచ్చి అలావున్నాడని అనేకులభావన. బాబాయిష్టాయిష్టాలకు సంబంధంలేకుండా ఆయనసమక్షంలో సంతర్పణలు జరుగుతున్నవి; సనాయివాయిద్యాలు మ్రోగుతున్నవి. శంఖారావాలు ప్రతిధ్వనిస్తున్నవి. బ్రాహ్మణభోక్తలకు విందులు జరుగుచున్నవి. ఆయనముందు ఒక దిబ్బెం పెట్టబడింది. అందులో కానుకలు విరివిగా పడుతున్నవి. స్త్రీలనుంచి పసివారలనుంచి నగలు మొక్కుబడిగా వలిచి, అందు వేయబడుచున్నవి. రోజుకు వేలటెంకాయలు పగులుతున్నవి. మణుగులకర్పూరం కాలిపోతున్నది. నలుగురు పూజారులుగా తయారై, పెత్తనంవహిస్తున్నారు. మణుగుల విభూతి అవుసరమవుతున్నది. ఇపుడు నాగాబాబా జనానికి కనిపించకుండా దిబ్బెంతోను, విభూతి డబ్బాలతోను చుట్టబడ్డాడు. ఇపు డా సాధువుపనిలేకుండానే స్వయంకృషితో పెత్తనం వహించిన పూజారులు ప్రజలకు విభూతిని ప్రసాదిస్తున్నారు, వారికానుకలను స్వీకరిస్తున్నారు. బాబాకు తెలియకుండానే,

ఆయనముందు పెద్ద మఠం నిర్మించబడింది. కాని, పూజారులుగావున్న నలుగురిలోను విభేదాలు ప్రబలినవి. అందుకు కారణం దిబ్బెంలోనినగలు నేరుగా వారియిళ్ళకు జేరినవి. వాటివిభజనలోనే వారితగాదాలు. మఠప్రారంభోత్సవానంతరం యెవరికివారే మిగతావారిబ్రతుకులు బజారులో వేయాలని పంతంబట్టారు.

మఠప్రారంభోత్సవానికి పట్టణంలోని ప్రసిద్ధుల సహితంగా వేనకువేలు వచ్చారు. బ్రహ్మాండమైన విందుల యేర్పాటుజరిగింది. కొందరిహృదయాలలో పాతస్మృతులు మెదిలినవి. నీలకంఠస్వామి ఆలయంలో ఒకప్పుడు యిలాంటివే జరిగినవి. 'నాగాబాబామఠం' అని పెద్దఅక్షరాలలో వ్రాశారు. పాపం, తపోనిమగ్నులైవున్న ఆ నాగాబాబా కివి అర్థమవుతున్నవో లేదో! ఆయన కసలు తెలుగు వచ్చునో రాదో! ఇపుడు ప్రజ లాయనఆశీర్వాదాలు పొందాల్సిన అవుసరంకూడా లేకుండా, నలుగురుప్రతినిధులు యేర్పడ్డారు. వారే సర్వమూ నిర్వహిస్తున్నారు.

ఉత్సవం కోలాహలంగా జరుగుతున్నది. వేదపఠన జరుగుతున్నది. గొప్పగొప్పవారి కానుకలుగా కావిళ్ళతోను బళ్ళతోను ఫలాలు,మిఠాయిలు వస్తున్నవి. భోజనాలు తయారుచేస్తున్నారు. ఒకప్రక్క వృద్ధులు స్త్రీలు చేరగిలబడి బాబాజీప్రభావాలను చిత్రవిచిత్రంగా వర్ణించుకుంటున్నారు. కొందరు తమకులభ్యమైన ప్రత్యక్షనిదర్శనలను వల్లిస్తున్నారు. మరోప్రక్క సాధుసంతతే దేశ సత్యసంపద అని చెప్పుకుంటున్నారు. మరోప్రక్క భగవంతునిసన్నిధిలో తమకు ముక్తి

లభించనున్నట్లు పరవశులై వాద్యగాళ్ళు మార్మోగునట్లు వాద్యాలుచేస్తున్నారు.

అది వుదయం పదిగంటలసమయం. నాగాబాబా నేత్రాలుతెరచి చూచి, శిరఃకంపనంతో వేగంగా లేచి విప్రవరులుతయారుచేసిన హోమగుండంప్రక్కనుంచి బొగ్గుతీసి, 'నాగాబాబామఠం' అన్న అక్షరాలను చెరిపి, ఆ బొగ్గుతో "కృష్ణాశ్రమము" అని వ్రాసి, అక్కడనుంచి చరచర ఓ మైలుదూరం వెళ్ళిపోయి, నూతనస్థానంలో కూర్చున్నాడు.

జనసమూహంలో పెద్ద కలవరం బయలుదేరింది. అయినా జరుగుతూన్న యీ వైభవాన్నివిడిచి, ఆ ముళ్ళ పొదలవైపు వెళ్ళిన ఆ సాధువుననుసరించువారులేరు. తిరిగి సంచలనం నిర్మలరూపంపొందింది. పూజారులు నలుగురూ నిరుత్సాహపడకుండా తమపనులలో నిమగ్నులైనారు. అన్నీ యథావిధిగానే జరిగిపోతున్నవి. వారివిభూతివిలువ రవంతైనా తగ్గినట్లులేదు. నియమలాంఛనలనన్నిటినీ నడుపగల, తమ నిర్మితమఠము, తామూ వుండగా, ఆ గుడ్డిసాధువు పోయినా లోటేమిటని ఆత్మలోనే అనుకున్నారు.

ఎవరిఆనందంలోనూ పాలుపంచుకోగల తాహతుగాని, యోగ్యతగాని లేకపోయినా, యింటిలోవుండజాలక తల్లి అనుజ్ఞతో వచ్చి అనభిజ్ఞురాలివలె అన్నిటినీ తిలకిస్తూ, అందరికీదూరంగా కూర్చున్న రోహిణిని సాధుపుంగవునిచర్యలు చకితురాలినిచేసినవి. వీరు యీ ఆర్భాటమంతా యెవరి దృష్ట్యాచేస్తున్నారో, ఆయన వీటితో విసిగి, దూరంగా వెళ్ళి పోయాడు. అంతేగాదు, తన పేరును తుడిచివేశాడు. ఆ స్థానే

కృష్ణాశ్రమమని తనహస్తంతో వ్రాశాడు. ఒక్కమాటుగా తన అక్కపేరు మనస్సులో మెదిలింది. పాపం! మంగళనాథ్ యేమైపోయాడో ననుకున్నది. ఆమె మనస్సు ఆ సాధువువైపు పరువులెడుతున్నది. ఆయన్ను బాగా చూడాలనిపిస్తున్నది. ఆయన మంగళనాథ్‌గారేమోనని మనస్సు భ్రమిస్తున్నది. ఎత్తు అంతేగాని, ఆమె బాగా ఆయనముఖాన్ని చూడనందుకు విచారిస్తున్నది.

ఇపుడు ప్రజలమొక్కుబడులన్నీ మఠంలోపల జరుగుతున్నవి. పూజారులు నలుగురు మఠంలోపల తీరుబడిలేకుండా విభూతిని ప్రసాదిస్తున్నారు. టెంకాయలు పగులగొడుతున్నారు, కర్పూరం వెలిగిస్తున్నారు. దిబ్బెం తాళంతో లోపలే అమర్చబడింది. యథావిధిగా పూజలు ప్రసాదాలు సాగుతూనేవున్నవి.

కాని, దూరంగా పొదలదగ్గర జేరి, జపంలోనున్న సాధుపుంగవు నిపుడు దర్శించువారులేరు. రోహిణిమాత్రం గ్లాసుడుపాలు, అరటిపళ్ళతో నిత్యమూ నియమంగా సమయానికి వెళ్ళి ఆయనయెదుట తిష్టవేసి వుంటున్నది. ఆయన తనప్రసాదం స్వీకరించి, ఆశీర్వదించినా, తాను అక్కడే ఆయన్ను తదేకంగా చూస్తూ వుంటున్నది. ఆ సాధువు మంగళనాథ్‌గారని తాను గుర్తించింది. అక్కడ కూర్చుని, ఆయనవెనుకటిచర్యలన్నిటిని ఆమె సినీరీలువలె మనస్సులో త్రిప్పుకుంటున్నది. చిన్నప్పటినుంచి ఆయన నిస్వార్థి, పరోపకారి, త్యాగశీలుడు. తన అక్కద్వారా ఆయనకీ స్థితి సంభవించిందని యెంతో వగచింది. దుఃఖాన్ని ఆపజాలక

ఆయనముందు మోకరిల్లి "స్వామీ తమకీ దీక్ష యెందుకు?" అన్నది,

ఆయన తన మౌనాన్ని భగ్నంకానీకుండానే, తనకుడి హస్తంతో ఆమెశిరస్సు నెత్తి, నోటిమీద వ్రేలువేసుకుని "ఈ ప్రశ్న అడుగరాదు. నీదారిని నీవు పొమ్మ" న్నట్లు సైగతో తెలియజేశాడు. ఆమె సజలనేత్రాలతో చేతులు జోడించి, గాద్గదికకంఠంతో "మంగళనాథ్‌గారూ, మిమ్ము యీ లోకం గుర్తించలేకపోవచ్చు; నాహృదయానికంతా తెలుసు. పాపపుణ్యాలు తెలియనిదాన్ని అయినా, మా అక్కద్వారా మీ కిలాంటిస్థితి రావటం, నేను భరించలేకున్నాను. ఆమెను క్షమించమని ప్రార్థిస్తున్నాను." అన్నది. తననుగుర్తించినందుకు విస్మితుడై, తన మౌనవ్రతాన్ని వదలి లోతుకంఠంతో "రోహిణీ! నీవు యోగ్యురాలవు. నిన్ను ఆశీర్వదిస్తున్నాను. మీ అక్క నాయెడల అపరాధంచేయలేదు. నాకు మానవత్వాన్నికల్పించి వెలుగు చూపించిపోయింది. ఆ ప్రేమవైఫల్యంతో నేను పూర్ణత్వాన్ని పొందాను. ఆమెకొరకు విలపిస్తూ, ఆధ్యాత్మికప్రేమలో దీక్షపొందాను. నాలోని చంచలత్వం పోయింది. నిష్కల్మషము, నిష్కామముతోగూడిన దీక్షలో పరమానందమున్నదని తెలుసుకున్నాను. సుఖసంచయంలోపడి లోలుడు కాకుండా, కష్టసుఖాలను యేకంచేసుకుని, నిస్వార్థము, నిష్కామము, నిష్కల్మషములతో నిష్ఠతో ప్రేమస్తోత్రం చేస్తున్నపుడు భగవంతుడే ఆమెరూపంలోనచ్చి నా ముందు నిలుస్తున్నాడు. నా కింకేమికావాలి చెప్పు?" అన్నాడు.

స్తిమితంపొందిన కంఠంతో "ప్రేమవిఫలమో, కార్య విఫలమో పొందినవారు, తమఅసమర్థతను కప్పిపుచ్చుకోను ఆత్మసంతృప్తికొరకు అనేమాటలు అవి. మీరు యువకులు, సన్యసించగలవయస్సు రాలేదు. అంతేగాదు, మీలాంటి ప్రజాసేవజేయగలయోధులు సాధువులై ముక్కుమూసు కోవటం భావ్యంగాదు మంగళనాథ్‌గారు" అన్నది.

ఆయన దరహాసంచేస్తూ, "అవును, పరిపూర్ణత్వం లోనిఆనందం అర్థమయేట్లు చెప్పగలశక్తి యెవరికీలేదు. నే నిపుడు దుఃఖితుడినిగాదు రోహిణీ!" అన్నాడు.

"మీరు దానిపేరు పూర్ణత్వమన్నా మరేమన్నా, మీ రూపురేఖలలోను, వేషధారణలోను, కార్యాచరణ లోను ప్రత్యక్షమైన దుఃఖముద్రలే ప్రస్ఫుటమవుతున్నవి. మీలాంటియోగ్యులకు యింత దుఃఖాన్ని ప్రసాదించిన మా అక్కకు సద్గతులుండవు. ఆమెకుప్రతిగా నన్ను స్వీకరించి, ఆమెను క్షమించండి మంగళనాథ్‌గారూ." అంటూ ఆమె రోదిస్తూ ఆయనపాదాలమీద శిరస్సునుంచింది. ఆమెను లేపనెత్తి మందహాసంచేస్తూ "నీవు పిచ్చిదానివి; నాలోని ఆనందదీప్తిని గుర్తించగలశక్తి నీకు రాలేదు. నా హృదయ పీఠాన్ని శాశ్వతంగా ఆమె కంకితంచేశాను. ఆమెను నా రక్తంలో రంగరించుకున్నాను. నాలో నాకు యెక్కడ చూసినా ఆమెయే కనిపిస్తుంది. ఆమెద్వారా నిర్దిష్టమైన ఆశ యాలను పొందాను. నన్నుగురించినచింత నా కిపుడు లేదు. ఆమెధ్యానంలో నాకు పరమానందం కలుగుతుంటుంది. ఆమెస్తోత్రంచేయుటకు నాకు కవనంరాదు, గానంచేయుటకు

కంఠంలో కమనీయతలేదు. అందుకే కూర్చుని నేత్రాలు మూసుకుని, అంతరాత్మలో ఆమెను ధ్యానిస్తూ మనోనేత్రం ద్వారా ఆమెనుచూస్తూ అవిచ్ఛిన్నమైన ఆనందా న్ననుభవిస్తున్నాను" అన్నాడు.

ఆమె స్పష్టమైనకంఠధ్వనితో "నిస్వార్థస్తోత్రమన్నారు కాని, ఆ స్తోత్రంద్వారా పొందే ఆనందాన్ని స్వార్థంగాదని యెలా అనగలరు చెప్పండి? ఏ స్మరణలో, ఏ నిమగ్నతలో, ఏ గానంలో మీకు ఆత్మానందం కలుగుతుందో, దాన్ని విడనాడలేరు. మరొకరికి తరణోపాయాన్ని కల్పించలేరు. ఇంతకంటె స్వార్థం యింకేమికావాలి మంగళనాథ్‌గారు?" అని ప్రశ్నించింది. ఆయన కంగారుపడుతూ వెలవెలబోతూ "లేదు లేదు. నేను యెవరిని ధ్యానిస్తున్నానో వారిని స్వయంగా పొందాలనిగాని, వారిలో లీనంకావాలనిగాని కోరుటలేదు. అది నిష్కామమైందిగాదా రోహిణీ" అన్నాడు

"భగవంతుని స్మరించేవారుకూడా అదే అంటారు ఆయనలో లీనంకావాలనేకాంక్షకూడా లేకుండా నిష్కామంతో భజిస్తే భగవంతుడు ప్రసన్నుడవుతాడని. అయినా కాకపోయినా, ఆ భజనలో అలవాటయినపుడు అందులోనే ఆనందం జనిస్తుంది. మీరూ అంతే. మీరు యే ప్రేమదేవతను స్మరిస్తున్నారో ఆ ప్రేమదేవతను ప్రత్యక్షంగా కోరకపోయినా, ఆ స్తోత్రంలో స్మరణలో ఆనందాన్ని పొందుతున్నారుగదా. ఆ ఆత్మానందంకొరకే ఆ స్తోత్రంచేస్తు

న్నారు. ఆత్మానందాన్ని కోరుట స్వార్థం కాదంటారా చెప్పండి?" అన్నది రోహిణి.

విస్మితుడై పరాజితునివలె ముఖంపెట్టి, స్మృతిపథంలోని గతించిన కృష్ణమాటలను గుర్తుకుతెచ్చుకుని, అశ్రుభరితనేత్రాలతో ఆమెనుచూస్తూ, దుఃఖకంఠంతో "ఒకరోజు కృష్ణ నన్నిలానే మాటలలో ఓడించింది. నేనామె మాటలను వెంటనే అంగీకరించకపోయినా, క్రమేణా ఆమెననుసరించాను. నీవు ఆమెకంటె చతురతగలదానివి. కాని, నీముందు నాహృదయంలోనిమాట చెబుతున్నాను. ఆమెను నేను మనసార ప్రేమించాను. కనుక, ఆ స్థానాన్ని మరొకరికిచ్చుటకు నా వశంలోలేనిది. నన్నుక్షమించు" అన్నాడు.

ఆమె అశ్రువులువలికిస్తూ "మంగళనాథ్‌గారు, నా జీవితంలో యెన్నడూయెరుగని ఆనందాన్ని నేడు పొందుతున్నాను. ఆనందబాష్పాలను నేడే స్వయంగా చూసుకుంటున్నాను. మా అక్క ధన్యురాలు. కాని, ఆమె మిమ్మల్ని గుర్తించలేకపోయింది. నా దుఃఖం దూరమయింది. వీరోచితమైన నియమ నిష్ఠలు ఆశయలక్ష్యాలు అంటూ, దేశోద్ధారణకు కాంట్రాక్టరులని పేరుపొందిన మీ హృదయంలో ఒక సామాన్యస్త్రీ దేవతైకూర్చున్నది. అలాంటి మిమ్మల్ని దరిద్రదామోదరునిచేసి, జూదారునిచేసింది, సన్యాసినిచేసింది. తనపేరుకు అంటగట్టివేసుకున్నది. స్త్రీహక్కులు స్త్రీసమానత్వం అని గొంతుచించుకునే వెర్రివారికి స్త్రీయేమిటో పురుషుడేమిటో తెలియదు మంగళనాథ్‌గారు; మీద్వారా ఏ పరమరహస్యాన్ని తెలుసుకున్నానో దాన్ని

సంస్కరించే పోరాటంలోనే స్త్రీహక్కులు, స్త్రీసమస్యలు అని వేరుచేసే వెర్రివుద్యమాన్ని అణచి, నిజస్వరూపాన్ని ప్రకటించుటకు నేను అవివాహితనై మీ శిష్యురాలిగా జీవితాంతం పోరాటంసలుప నిశ్చయించుకున్నాను. మీరూ నాకు గురువుగా సలహాదారుగా వుండమని ప్రార్థిస్తున్నాను. అన్నది రోహిణి.

ఆయన వెలవెలబోతూ "అప్పుడు మనలను అభ్యుదయనిరోధకులంటారు, రాజకీయ సాంఘికసంస్కర్తలు." అన్నాడు. "అమాయకప్రజలను శృంగారశబ్దజాలంలో ముంచి, మెరమెప్పులనుపొందుతూ విర్రవీగే అభ్యుదయ కాముకులకు వెరచుట వివేకంకాజాలదు. సత్యసాధనకు నిలబడి, అభ్యుదయనిరోధకులమనిపించుకున్నా చింతించాల్సిన పనిలేదు గురువుగారు" అన్నది.

ఆయన మందస్మితవదనుడై "సరే, నీ యిష్టం" అన్నాడు.

# 34 ఆత్మోన్నతి

జనరల్ హాస్పిటల్ లో గంగులుకు శిరస్సుపైతగిలిన గాయం నాలుగునెలలకు నయమైంది. కాని, మెదడుకు దెబ్బతగిలినందువలన, ప్రత్యేకట్రీట్ మెంట్ లో వుంచవలసి వచ్చింది. సంవత్సరంన్నర జరిగిపోయింది. శిరస్సుఅర్ధ భాగం వెంట్రుకలేలేకుండాపోయినదిగాని, తెలివి మామూలుస్థితికి వచ్చింది. తెలివివచ్చుట, జబ్బునయమవుట

నేరమయినట్లు హాస్పిటల్‌వారు అతని పెట్టె, దుస్తులు అతనికిచ్చి, బయటకు పంపారు.

ఆ పెట్టెదప్ప అతనిచేత కానీలేదు. ఆ పెట్టెలో యేమున్నదో అతనికే తెలియదు. పాపం! ఏమీతోచక అయోమయంగా రోడ్డునబడి వెళుతున్నాడు. ఎవరినైనా దారిఅడగాలనికూడా అనిపించుటలేదు. అనాలోచితంగా యెక్కడికో విసురుగా వెళ్ళిపోతున్నాడు. రెండుమైళ్ళు నడిచివుంటానని ఊహించుకొంటూ, వెనుదిరిగిచూస్తూ పెట్టె దించుకున్నాడు. ప్రక్కగాచూచినపుడు, యెవరో ఒక బిచ్చగత్తె ధూళిధూసరితమై చిరిగి చీలికలై యున్నవస్త్రంతో జిబ్బువలె రేగిన శిరోజాలతో శుష్కించినశరీరంతో పాదాలు యీడ్చుకుంటూ నడుస్తున్నది. గంగులు ఎందుకో ఆమె దాపుకెళ్ళి పరిశీలిస్తున్నాడు. ఆమెరూపు రేఖల్లోని అంతర్గత ముద్రలేవో అత న్నాకర్షిస్తున్నవి. నిస్పృహ నిరాశలతో వడలిపోయిన ఆమెనేత్రములందు తరళంలేక యెవరినీ గుర్తించగలస్థితిలోలేదు. కైలాసప్రయాణానికి సన్నద్ధుడైన యోగి పుంగవునికి పర్వతంక్రిందనే శంకరుడు ప్రత్యక్షమైనట్లు, గంగులు "నిర్మలమ్మగారూ" అని పెద్దపెట్టున కేకవేశాడు. ఆ యాచకురాలు వెలవెలబోతూ శిరస్సుపైకెత్తి చూసింది. "ఇట్లాఅయిపోయారేమిటి నిర్మలమ్మగారూ? నేను గంగుల్ని" అని తిరిగి రుద్ధకంఠంతో అన్నాడు.

ఆమె దీర్ఘ నిట్టూర్పువిడుస్తూ "గంగులుతాతా" అంటూ అతనిపాదాలను చుట్టవేసుకుని బొలబొల విలపిస్తున్నది. గంగులు యెంతప్రయత్నించినా ఆమెపాదాలు విడువ

కుండా తనమనస్సులోని ఆవేదన వుపశమించేవరకు విలపిం చింది.

తనను రత్నాకరుడు తీసుకెళ్ళి పాడుబడ్డయింట్లో వుంచాడనీ, మొదట తనదగ్గరే వుండేవాడనీ, తరువాత రోజూ వస్తూపోతూవుండేవాడనీ, కొన్నిరోజులతరువాత రాలేదనీ, అతను యేమయిందీకూడా తెలియదనీ, తరువాత తను పశ్చాత్తాపంతో మనోవ్యధతో యిలా అయిపోయా నని విలపిస్తూ తన కరుణగాధ వినిపించింది.

గంగులు శివప్రసాద్ విషయము, తనద్వారా యీ పెట్టె పంపినవిషయము, తనకుజరిగిన ప్రమాదము జెప్పి, ఆ పెట్టెను ఆమెకిచ్చాడు. "ఈ పాపిష్టిదానికి వారింకా యీ పెట్టె యెందుకుపంపారు తాతా?" అన్నది. "నీ చీరెలు నీకే పంపారు." అన్నాడు. ఆమె దుఃఖాన్ని ఆపు కుంటూ "లేదు తాతా, నా చీరెలేఅయితే యింతశ్రద్ధగా పంపవుండరు" అంటూ ఆమె తాళంతీసింది. అందులో పైభాగానవున్న వుత్తరం చదివి, ఆమె వలవలయేడ్చింది.

రత్నాకరుడు తనను మోసగించాడని నిర్ణయించు కున్నరోజున ఆమెకు దుఃఖమేరాలేదు. కాని, నేడు శివ ప్రసాద్ వుత్తరం ఆమెను తెరలుతెరలుగా విలపింపజేస్తు న్నది. ధైర్యాన్నిచిక్కబట్టుకుని "గంగులుతాతా! నేను యెప్పుడో చనిపోయేదాన్ని. వారిని ఒక్కమాటు చూడా లని నా మనస్సెందుకో వాపోతున్నందున చావలేక పోయాను. నన్ను వెంటనే అక్కడికి చేర్చు తాతా." అన్నది.

బోయి, విధివశాన ఆ నరకబాధ ననుభవించి, ఆతరువాత యథావిధిగా ఇంద్రునిసభలో హాజరైనట్లున్నది ఆమెకు. కాని అడుగుఅడుగున ఆమె ఆత్మ రంపాలతో కోస్తున్నట్లు వ్యథచెందుతున్నది. ఇంద్రుడులేని. ఇంద్రసభలోనున్నట్లు, తన ఆత్మకు అంటిన మలినం పోనట్లు, లోలోన తపిస్తున్నది. ఆమె రేయింబవలు పూజాగదిలోనే దేవునియెదుట మోకరిల్లి "భగవంతుడా, నేనుచేసిన అపరాధానికి యీలోకంలో శిక్షలేదు. నన్ను యింకా బ్రతికించి చిత్రవధచేయుటెందుకు తండ్రీ" అని వాపోతుంటుంది.

కర్తవ్యం పురుషుని వెంటాడుతుంటుంది. గంగులు నౌకరైనా యీయింటిలో అతనికి తెలియనివిషయాలు లేవు "అమ్మా! ఆత్మతపనవలన శుష్కించుటదప్ప మరేమీ వుండదు. ఈయింటి భారమంతా బాబుగారు మీకే అప్పగించారు. మీరు కాస్త మంచిసెబ్బరలు చూడకపోతే యెలా? వారు తప్పక ఏదోఒకరోజున వచ్చితీరుతారు." అన్నాడు.

ఆమె బొలబొలవిలపిస్తూ నెత్తిమోదుకుంటూ "ఈ పాపిష్టిదానికి వారినిచూసే అదృష్టంకూడానా తాతా. నేను మహాపాపిని, ఆత్మతపన లేకుండా యీ పాపం హరించేదెలా?" అంటూ క్రిందపడి దొర్లిగింతలుపెడుతుంది.

ఆకస్మికంగా అంతంలేని దుఃఖంలో ఆమెమనస్సు మారిపోయింది. పూజాగదిని శాశ్వతంగా మూసివేసింది. తనగదిలోనే శివప్రసాద్‌ఫోటో ప్రతిష్ఠించుకున్నది. దాని కెదురుగా శిరస్సును పృథ్విమీద మోపి, కన్నీరుకారుస్తూ

రుద్ధకంఠంతో "బాబూజీ" నామీద మీకు ఇంత దయ యెందుకు? నేను దొంగని, పతితురాలిని, విశ్వాసఘాతకురాలిని. మీరు పరమపవిత్రులు, అపార కరుణామూర్తులు, త్యాగనిధులు, విజ్ఞానసంపన్నులు. మనయిద్దరికీ పొంతన యెక్కడ? నేను అంధకారములాంటిదాన్ని, మీరు వెలుగులాంటివారు. నాబోటిహీనురాలిమీద మీరుచూపిన కరుణ యీ ప్రపంచంలో యెందరు చూపగలరు? బాబూజీ, నా హృదయం భగభగ మండిపోతున్నది. నా తపన నన్ను దహించేస్తున్నది" అని ఆఖరివాక్యాలను బిగ్గరగా అంటూ రోజుకుంటున్నది.

గంగులుతాత యెంతప్రయత్నించినా ఆమె బయట ముఖంచూడ నిచ్ఛగించలేదు. శివప్రసాద్ చిత్రపటంముందే రాత్రులుపగళ్ళు విలపిస్తూ పూజిస్తూ తపిస్తూగడుపుతున్నది.

రోజులుగడిచినమీదట దుఃఖంలోనివుధృతం సడలుతుంది. కర్తవ్యం పొడచూపుతుంది. నిర్మల నిరంతరతపనతో కార్చినకన్నీటితో ఆత్మకుఅంటినమలినం అదృశ్యమైంది. ఆమెముందు శివబాబురూపంలో ప్రజ్వలమైన వెలుగు ప్రభాసిస్తున్నది. ఆ వెలుగులో నిర్దిష్టమైన సుస్పష్టమైన కార్యరంగం కనిపిస్తున్నది. ఆమె యెవరిద్వారా స్నిగ్ధరూపంలోని వెలుగును పొందిందో, ఏ వెలుగులో మానవీయశ్రేష్టతవున్నదో, సంఘశ్రేయస్సున్నదో, మానసిక ఆనందంవున్నదో, మానవపూర్ణత్వమున్నదో, ఆత్మోన్నతివున్నదో ఆ వెలుగును, తను యెవ్వరిద్వారా గాఢాంధకారాన్ని పొందిందో, మోసగింపబడిందో, ఏ అంధత్వంలో

రాక్షసత్వం వున్నదో, నరకమున్నదో, మానవవినాశమున్నదో ఆ అంధకారాన్ని తన శక్తినంతటిని వినియోగించి లోకానికి చూపాలి, చాటాలి, విరివిగా ప్రచారంచేయాలి. ఏ యువతీ పొరపాటుగా తుచ్ఛమైన మోహానికిలోను కాకుండా పవిత్రమైనప్రేమను గుర్తించగలశక్తిని పొందునట్లు ప్రచారంచేయాలని కర్తవ్యోన్ముఖురాలైంది.



సమాప్తం.

డాక్టరు పి. రామమూర్తిగారి

# నవలలు

| | |
|---|---|
| గడచిన ఘడియలు | 3-50 |
| స్మృతిమందిర్ | 3-00 |
| విజేజత (అచ్చులో) | |



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA122B143 |
| పుస్తకం పేరు | రక్తసింధూరము |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | No |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 535 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 531 |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |